ఓమ్

శ్రీ సద్గురు మలయాళస్వాములవారి

# ధర్మోపన్యాసములు

## నాల్గవ భాగము

[దీనికి సంబంధించిన విషయములన్నియు మొదటిభాగపీఠికయందు వ్రాయబడియున్నవి. అది చదివిన అంతయు గోచరపడును. అప్పుడు వ్రాసినందువల్ల మరల యిచ్చోట తెలుపలేదు.]



జానకిరాం ప్రెస్, తెనాలి.

మొదటి కూర్పు 1000 ప్రతులు

 1961. [వెల రు. 3—00

వలయువారు - మేనేజరు శ్రీ వ్యాసాశ్రమము, శ్రీ వ్యాసాశ్రమము పోస్టు (వయా) ఏర్పేడు, (చిత్తూరుజిల్లా) అని వ్రాసి పొందగలరు.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

వ్యాహరన్మామనుస్మరన్



యః ప్రయాతి త్యజన్దేహం

స యాతి పరమాం గతిమ్ ॥

ఓమ్

# విషయానుక్రమణిక.



శ్రీ సద్గురు మలయాళస్వాములవారి

# ధర్మోపన్యాసములు

## నాలుగవ భాగము.

1956 ఆగష్టు నుండి — 1960 అక్టోబరు వరకు

## సర్వాత్మకత్వము.

సర్వాత్మకత్వసిద్ధి గలుగువరకు జీవులకు శాశ్వతశాంతిగాని, శాశ్వతసుఖముగాని గలుగదు. ఈ సర్వాత్మకత్వసిద్ధి సామాన్యబుద్ధికి అవగాహన మగునదికాదు. సమస్తములోగల ఆత్మయు, తన ఆత్మయు ఒకటేయను అనుభవముగల మహనీయాత్ములకు మాత్రమే సిద్ధించును. దీనినే భూమవిద్యయనియు, బ్రహ్మప్రాప్తియనియు ఉపనిషత్తులలో వర్ణించియున్నారు. శ్రీ భగవద్గీత అ. 6. శ్లో. 29, 30, 31, 32 లలో శ్రీకృష్ణభగవాను డర్జునునకు దీనినే బోధించెను. దీనికి పై శ్లోకములో యోగసాధనల గురించి చెప్పుచు రాగారాగా అఖండమైన జ్ఞానకార స్థితిలోనికి ప్రవేశించడమైనది. ఇందువల్ల యోగసాధనచేగాని, అనన్య భక్తిచేగాని, నిష్కామకర్మయోగముచేగాని అన్తఃకరణము శుద్ధమగు నప్పుడూ, లేక బుద్ధిని దాటనప్పుడూ అఖండాకారమగు బ్రహ్మప్రాప్తి, లేక దైవప్రాప్తి గలుగునని శాస్త్రము నిర్ణయించుటకు కారణము. అర్జునునివంటి మేధాసమ్పత్తిగలవానికే సర్వాత్మకత్వబోధ అందనప్పుడు ఇక సామాన్యుల గురించి చెప్పవలయునా! సర్వాత్మకత్వభావమును గురించి శ్రీకృష్ణభగవానుడు పై చెప్పిన నాలుగు శ్లోకముల నిరూపించుటకు ముందుగా అట్టిబోధ తనకు అవగాహనము కాలేదని అర్జునుడు చెప్పిన భాగమును ముందుగా నిరూపించిన పిమ్మట శ్రీకృష్ణభగవానుడు బోధించిన దానిని నిరూపించెద.

శ్లో॥ యోఽయం యోగ స్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన! ।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! సర్వజీవుల సర్వాత్మకత్వమగు నేయాత్మ యోగము మీచే చెప్పబడినదో, దానిని నేను తెలిసికొనజాలక యున్నాను. యెందుకనగా — నా మనస్సు చంచలమయిన దగుటవలన యెఱుంగజాలనని స్పష్టముగా అర్జునుండు దెలిపెను. ఇందువల్ల మనో నిశ్చలత్వమున్ను, నిర్మలత్వమున్ను గలుగనివారికి సర్వాత్మకత్వసిద్ధి గలుగజాలదని తెలిసికొనందగినది. ఇప్పుడు శ్రీకృష్ణభగవాను డుపదేశించిన సర్వాత్మకత్వసిద్ధి యెట్టిదో క్రింద వ్రాయబడుచున్నది.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాఽత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29

తా॥ యోగముతోఁ గూడుకొనిన మనస్సుగలవాఁడు సమస్త జంతువులయందు సమభావముగలవాఁడై, తన్ను సమస్త భూతముల యందున్నవానినిగాను, సమస్తభూతములు తనయందున్న వానినిగాను చూచుచున్నాడు.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ 30

తా॥ ఏ పురుషుడు సకల భూతములయందును, నన్ను జూచుచున్నాడో, సకల భూతసముదాయమును నాయందు చూచుచున్నాడో అట్టివానికిని నాకును భేదము లేదు. కనుక వానికి నేను కనపడకపోను, నాకు వాడు కనపడకపోడు. ఈ శ్లోకమువల్ల ఎందుకు భగవద్దర్శనము గాలేదో, బ్రహ్మప్రాప్తి సిద్ధించలేదో అని యెవరిని అడుగకనే స్వయముగానే వారికి వారే తెలిసికొనవచ్చును. అన్నిటిలోను భగవంతుని వీరు చూడలేరు. అందువల్ల భగవద్దర్శనము కాలేదని గ్రహించుకొనవచ్చును.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31

తా॥ సర్వభూతాన్తరాత్ముడనగు నన్నెవడు ఏకాత్మజ్ఞానముగల వాడై సేవించుచున్నాడో (ధ్యానించుచున్నాడో) అట్టి ధ్యానయోగి యెల్లప్పుడున్ను, ఎట్లుండినను నాయందుండువాడే అగుచున్నాడు. ఈ శ్లోకమునకు కొందఱు విధినిషేధముల పాటింపక యుండినను అతడు భగవన్మయుడై, అనగా ముక్తాత్ముడై యుండునని చెప్పుదురు. దానికి అదికాదు అర్థము. (సర్వథా వర్తమానోఽపి) అని వచించుటచే అట్టి మహాత్ముడు బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమములలో యుండినను, లేక ఏకాన్తమునగాని, గ్రామమునగాని ఉండినను విరోధము లేదు. లేక నిష్కామకర్మయోగమందు ప్రవర్తించినను, యేకర్మము చేయకపోయినను విరోధము లేదనియే గ్రహించుకొనవలయును.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ 32

తా॥ ఓ అర్జునా! యెవడు సమస్తజీవులయందలి సుఖమునుగాని, దుఃఖమునుగాని తన సుఖదుఃఖములనువలె చూచుచున్నాడో, అట్టి యోగి యోగులందఱిలోను శ్రేష్ఠుడని నామతము. ఇచ్చటనే ఆత్మజ్ఞానముగల యోగియొక్క కీలక ముంటున్నది. కావున దీనిని గీతయొక్క హృదయమనియే చెప్పవచ్చును. ఇట్టి అవస్థగల పుణ్యమూర్తులు ఇప్పుడు లోకములో ఎంతమందియున్నారో విజ్ఞులుచూచుకొనవచ్చును.

అర్జునుడు చెప్పినదానిని కృష్ణపరమాత్మ అంగీకరించెను. ఐనను అభ్యాస వైరాగ్యములచే మనోనిర్మలత్వమున్ను, నిశ్చలత్వమున్ను సంపాదించి సర్వాత్మకత్వసిద్ధిని పొందవచ్చునని యుపదేశించెను.

శ్లో॥ అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలం।
అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥ 35

తా॥ ఓ అర్జునా! నీవు చెప్పినట్లు మనస్సు నిగ్రహింప ప్రయాసమైనదనియు, చంచలమైనదనియు అనువిషయము నిజమే. దీనియందు సందేహమేమియు లేదు. అయితే ఓ అర్జునా! ఆ మనస్సును అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను నిగ్రహింపవచ్చును. ఈ యుపదేశము సాధకులకు యెంతయో ఉత్సాహాకరముగా యుంటున్నది. ఏలననగా —

అభ్యాస వైరాగ్యములలో కొరతగలిగినందుచేతనే మనోనిశ్చలత్వము గలుగకపోయినదని తెలిసికొని అభ్యాస వైరాగ్యములలో పూర్వాధికముగా సాధనజేసి మనోనిశ్చలత్వమును గలుగజేసికొనవచ్చునని ధైర్యము గలుగుచున్నది. ప్రతిసాధకుడున్ను యిట్టి భగవదుపదేశమును ఆధారముజేసికొని సాధనజేసిన తప్పక మనోజయము నొందునని దృఢబుద్ధి నొందును. తనవంటి మానవుడు సాధించిన కార్యము తానీలాగున సాధించకపోవునని ధైర్యోత్సాహము లుప్పొంగుచునుండును. అప్పుడు తనలోగల సోమరితనము, అశ్రద్ధ తనకు గోచరమగును. ఈ విషయమై మరియొక శ్లోకమునుగూడ భగవానుడు నిరూపించియున్నాడు.

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః॥ 36

తా॥ ఆత్మయోగము మనోనిగ్రహము లేనివానిచేత పొందశక్యమైనదిగాదు. సాధనోపాయములచే యత్నించుచున్నవానిచేత పొందుటకు సాధ్యమయినదే. ఇదియే నాయొక్కమతము.

ఈ వాక్యమున్ను సాధకుల కెంతయో యుత్సాహమును, ధైర్యమునున్ను గలుగజేయునదిగా యుంటున్నది. అందువల్లనే ఇది నామతమని భగవాను డుద్ఘోషించుటకు కారణము. కావుననే "అసంయతాత్మనా యోగో దుష్ప్రాప" అని ప్రయోగించుటకు కారణము. అట్లుగానిచో 'అప్రాపః' అని తెలిపియుండును. అప్రాప్యమయిన దానిని ప్రాప్తించుట కెవ్వరును ప్రయత్నించరు. దుష్ప్రాపయని చెప్పుటవల్ల ప్రయాసముతో ప్రాప్తమని చెప్పుటలో నెంతో సారము గలదు. అంతియేగాదు "శక్యోఽవాప్తుముపాయతః" అని ప్రయోగించుటచే సాధనోపాయములచేత సాధ్యమనిగూడ తెలుపుటవల్ల మన శ్రద్ధలేకనే, పట్టుదలలేకనే పొందబడునది కాదని అర్థమగుచున్నదిగదా! దీనికన్న ధీరులకు ఉత్సాహకరమగు నుపదేశము మరియేమిగలదు. కావున మన పూర్వీకఋషులు, యోగీశ్వరులు, లోకోద్ధారకులు యెట్టి పట్టుదలగలిగి సాధించిరో మనమున్ను అట్టి వంశములో, అట్టివారి సంతతిలో, అట్టి గురువుల శిష్యులై యుండియు మన మేలాగున సాధించవలయునో అట్టి ప్రయత్నముగలిగి యుందుముగాక! జ్ఞానమునుగురించి చెప్పునప్పుడు

శ్రీకృష్ణభగవానుడు 18-వ అధ్యాయములో ఇట్టి సర్వాత్మకత్వమే సాత్త్వికజ్ఞానమని నిరూపించిరి.

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ 20

తా॥ ఏజ్ఞానముచేత వేరువేరుగా విభజింపబడి యుండునట్టి సమస్తభూతములందున్నట్టి యాత్మవస్తువు విభజింపబడినది, నాశరహితమైనది, ఒక్కటేయయినది అని చూచుచున్నాడో అట్టి జ్ఞానమును సాత్త్వికజ్ఞానమని యెరుంగుము. అనగా—అనేకత్వములో నేకమగు నాత్మను గాంచుటయే సాత్త్వికజ్ఞానమని గ్రహింపవలయును. ఈశ్లోకము క్రిందటనే రాజసతామస జ్ఞానముల గురించి వివరించడమైనది. దానిని గాంచిన మనకుగల జ్ఞానము సాత్త్వికమా? రాజసమా? తామసమా? అని గ్రహింపవచ్చును. ఈవిషయమై అమృతబిందూపనిషత్తు తెలిపినది చూడుడు.

శ్లో॥ ఏక ఏవ హి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః।
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్॥

తా॥ అనేకభూతములలో ఆత్మ ఏకరూపమై యుంటున్నది. అది యొకటియే యయినను అనేక పాత్రలలో ప్రతిబింబించిన ఒకటేయగు చంద్రునివలె యుంటున్నది. యెట్లనగా—పాత్రములు విభిన్నములై, జలములుగూడ భిన్నభిన్నములై యుండినను అన్నిటిలోగల చంద్రప్రతిబింబము ఏకముగా యుంటున్నదని గ్రహించెడు భావమే సర్వాత్మకత్వమని తెలియవలెను. అనగా—దేహోపాధులు అనేకములుగాయున్నను అధిష్ఠానమగు, సాక్షియగు ఆత్మ యొకేవిధముగాయుండునని గ్రహించుటయే సర్వాత్మకత్వజ్ఞానము గలిగినదానికి గుర్తు. ఈసత్యమును ఆత్మలో చింతనజేసిన అట్టి జ్ఞానమునకన్న మన మికను ఎంతో దూరముగా నుంటున్నామో స్వయముగా తెలియనగును. కఠోపనిషత్తున్ను యీసత్యమునే తెలుపుచున్నది.

మూ॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః
కరోతి। తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాంసుఖం శాశ్వతీ
నేతరేషామ్॥

తా॥ తనకంటె మరొక్కడు లేనివాడును, సర్వజగత్తును స్వాధీనములో నుంచుకొన్నవాడును, సర్వభూతముల యన్తరాత్మయయినవాడును అయిన యేఆత్మ తన యొకేరూపమును అనేకవిధములనుగా చేయుచున్నాడో, ఏ విద్వాంసులు అట్టిఆత్మను తనలో నున్నవానినిగా చూచుచున్నారో అట్టివారికే శాశ్వతసుఖము. ఇతరుల కట్టి శాశ్వతసుఖము లేదు.

మూ॥ నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానామేకో బహూనాం యో విదధాతి కామాన్ । తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం శాన్తిశ్శాశ్వతీ నేతరేషామ్॥

తా॥ ఒక్కడగు నేపరమేశ్వరుడు అనేకులకు ఆయాకోరికలను కర్మలకు తగినట్టుగా నిచ్చుచున్నాడో ఆ పరమేశ్వరుడు నిత్యులలో నిత్యుడు. చేతనులలో చేతనుడు. అట్టి పరమాత్మను ఏ విద్వాంసులు తనలో నున్న వానినిగా చూచుచున్నారో అట్టివారికే నిత్యమయిన శాంతి, సుఖము. తదితరులకు శాశ్వతశాంతిగాని, శాశ్వతసుఖముగాని లేదు. ఇప్పుడు గీతలో బ్రాహ్మీస్థితిని పొందినవానిని గురించి, సర్వాత్మకత్వసిద్ధి గలవానిని గురించి చెప్పినదానిని చూడుడు.

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥

తా॥ బ్రాహ్మీస్థితిని పొందినవాడు ప్రసన్నాత్ముడు. దేనివల్లను దుఃఖింపడు. దేనిని కోరడు. సమస్త ప్రాణులందును సమానభావముగలవాడై సర్వోత్కృష్టమయిన భగవద్భావమును పొందుచున్నాడు.

---

# ఛాన్దోగ్యోపనిషత్

## షష్ఠప్రపాఠకే — త్రయోదశః ఖండః

ఆరుణియను ఋషి తన పుత్రుడయిన శ్వేతకేతుని గురించి యుపదేశించినది. ఈ ఆరుణిఋషికి వంశపారమ్పర్యముగా ఉద్దాలకుడనియు, గౌతముడనియుకూడ పేర్లు గలవు.

ఉ॥ లవణమేతదుదకేఽవధాయాథ మా ప్రాతరుపసీదథా ఇతి సః తథా చకార తగ్ హోవాచ యద్దోషా లవణముదకేఽవాధా అంగ తదాహరేతి తద్ధావమృశ్య న వివేద యథా విలీనమేవాంగ॥

తా॥ అత్యంత సూక్ష్మమైన వస్తువు సర్వవ్యాపకమై యుండినను చూచి తెలిసికొనుటకు శక్యము గాకుండుటకును, సాధనాంతరముచే గ్రహింప నర్హమై యుండుటకును దృష్టాంతమును జూపించి పుత్రుని బోధింపవలయునని తండ్రియైన యుద్దాలకుడు చెప్పుచున్నాడు. ఓ శ్వేతకేతుడా! ఘనీభవించి రాయివలె గనపడుచుండెడి యీ యుప్పును తీసికొని (సైంధవలవణమును) ఘటములోని యుదకములో వేసి, రాత్రికాలమంతయును గడపి రేపటి ప్రాతఃకాలమున నీ ఘటోదకమును తీసికొని నా సమీపమునకు రావలసినదని తండ్రియైన యుద్దాలకు డాజ్ఞాపించెను. ఆ శ్వేతకేతుడును తండ్రి యాజ్ఞాప్రకారమే ఆ రాత్రియం దుప్పురాతిని ఘటోదకములో వేసిపెట్టి ప్రాతఃకాలమున తండ్రి సమీపమునకుపోయి విజ్ఞాపన జేసెను. ఆయుద్దాలకుడు ఈ పుత్రుని జూచి, ఓ శ్వేతకేతుడా! ఈ ఘటోదకములో రాత్రియం దే యుప్పురాతిని ఉంచి యున్నావో, దానిని తిరిగి యెత్తవలసినదని యాజ్ఞాపించెను. శ్వేతకేతుడు ఆ వాక్యమును విని ఘటములోని యుదకము నంతయును జూచి హస్తముతో అవలోడనము జేసినను ఆ లవణము దొరకకపోయెను. ఈప్రకార ముదకములో జేరియుండెడి లవణము చూచుటకును, స్పృశించుటకును శక్యముకానివిషయములో సంశయమును బొందుచుండెడి శ్వేతకేతుని జూచి తండ్రియైన యుద్దాలకుడు చెప్పుచున్నాడు. ఓ శ్వేతకేతుడా! ఈఘటోదకములో నీచే నుంచబడిన లవణపిండము విలీనమై వ్యాపించియున్నది. కనుక దర్శన స్పర్శనములకు విషయము గాకపోయినను, మరియొక సాధనముచే తెలిసికొనుటకు శక్యమయియుండునని చెప్పినవాడాయెను.

ఉ॥ అస్యాంతాదాచామేతి కథమితి లవణమితి మధ్యాదాచామేతి లవణమిత్యన్తాదాచామేతి కథమిత్యభిప్రాస్యైతదథ మోపసీదథా ఇతి తద్ధ తథా చకార తచ్ఛశ్వత్సంవర్తతే తగ్ హోవాచాత్ర వావకిల సతోఽసౌమ్య న నిభాలయసేఽత్రైవ కిలేతి॥

తా॥ ఘటోదకమునందు లీనమై దర్శన స్పర్శనములచేత దెలియబడకుండెడి లవణమును తెలిసికొనుటకు సాధనాంతరము నిరూపింపబడుచున్నది. ఓ శ్వేతకేతుడా! ఈ యుదకములో పై భాగమునందలి ఉదకమును దీసికొని పానము చేయవలసినదని తండ్రి యాజ్ఞాపించినవాడై ఆ ప్రకారముగా పానముజేసిన పుత్రునిగూర్చి యుదక మేవిధముగా నున్నదని ప్రశ్నము చేసెను. శ్వేతకేతుడు లవణముతో గూడియున్నదని యుత్తరము జెప్పెను. ఆ ప్రకారమే మధ్యభాగములోని యుదకమును పానము చేయుమని మరల నాజ్ఞాపించినవాడై, యీ యుదక మేవిధముగా నున్నదని ప్రశ్నము చేసెను. ఇదియును ఉప్పుతోనే కూడియున్నదని శ్వేతకేతు డుత్తరము జెప్పెను. అనంతరము క్రింది భాగములోని యుదకము పానము చేయుమని యాజ్ఞాపించి యీ యుదక మేవిధముగా నున్నదని ప్రశ్నము జేసెను. ఇదియును ఉప్పుతోనే కూడియున్నదని శ్వేతకేతు డుత్తరము జెప్పెను. ఈ ప్రకార ముదకములో విలీనమై వ్యాపించియుండి దర్శన స్పర్శనములచే తెలియబడని యుప్పుయొక్క స్వరూపమును జిహ్వచే గ్రహించి తెలిసికొనియుండెడి పుత్రునిగూర్చి తండ్రియైన యుద్దాలకుడు ఈ యుదకమును పరిత్యజించివచ్చి నీ యనుభవమును జెప్పవలసినదని యాజ్ఞాపించెను. శ్వేతకేతుడును తండ్రియొక్క ఆజ్ఞాప్రకారము ఆ యుదకమును పరిత్యజించి శుద్ధాచమనముజేసి వినీతుడై వచ్చి తండ్రినిగూర్చి, ఓ స్వామీ! ఈ యుదకములో నాచేత నుంచబడిన లవణపిండము విలీనమై యీ యుదకములో వ్యాపించియున్నదని తన యనుభవ విషయమును విజ్ఞాపన చేసెను. ఈ వాక్యమును తండ్రియైన యుద్దాలకుడు విని ఓ శ్వేతకేతుడా! ఈ యుదకములో వ్యాపించి చక్షురింద్రియమునకును, త్వగింద్రియమునకును అగోచరమై యుండు లవణము దెలిసికొనలేనట్లు, సర్వజగత్కారణభూతమైన యధిష్ఠాన సత్తామాత్రమువలన నుత్పన్నమయియుండెడి తేజోభిన్నములనే మహాభూతములయొక్క వికారమయిన ఈ దేహేన్ద్రియ సంఘాతమునందు సూక్ష్మరూపముగా వ్యాపించియుండెడి సత్తాస్వరూపమును బాహ్యేన్ద్రియములచేతను, అవిశుద్ధమయిన మనస్సుచేతను తెలిసికొనుటకు శక్యముగాదు. కనుక ఈ యుదకమునందు లీనమై యుండెడి లవణమును రసనేంద్రియ

ముచే గ్రహించినప్రకారము, వివేక వైరాగ్యములతోఁగూడి శమాది సమ్పన్నుడై శాస్త్రాచార్యోపదేశరూప సాధనాన్తరముచేతనే తెలియ వలసినదని తండ్రియైన యుద్దాలకుడు శ్వేతకేతునికి జెప్పినవాడాయెను.

ఉ॥ స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ సర్వం తత్సత్యగ్ స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాప యత్వితి తథా సోమ్యేతి హోవాచ ॥

తా॥ వటబీజమునందుండెడి యంకురాది జననశక్తివలె అత్యంత సూక్ష్మమై సర్వప్రపంచమును వ్యాపించి వాఙ్మనస్సులకగోచరమై యుదకమునందు లీనమై వ్యాపించియుండెడి లవణమను దర్శనస్పర్శనములకు వేద్యముగాక రసనేంద్రియముచే తెలియబడిన ప్రకారము ఉపాయాంతరముచేతనే తెలియదగియుండెడి వస్తుస్వరూప మేదియో యదియే సర్వ జగద్బీజభూతమై యధిష్ఠాన సత్తామాత్ర సూక్ష్మాంశమైయున్నది. కనుక ప్రత్యక్షాది విషయమై యుండెడి యీ ప్రపంచమంతయును ఈ సత్తా మాత్ర సూక్ష్మాంశమే స్వరూపముగా గలిగియున్నది. అదియే నిత్యమై నిర్వికారమై యుండెడి అబాధిత సత్యస్వరూపము; అదియే సర్వభూతములయొక్క అహమాది సర్వవృత్తులకును సాక్షియైన కూటస్థానంగ చిన్మాత్ర ప్రత్యగాత్మ స్వరూపము నయినది. కనుక ఓ శ్వేతకేతుడా! నీవును ఈ ప్రకారము అద్వితీయ బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మ స్వరూపమే యయితివని యుద్దాలకుడు పుత్రునిగూర్చి యద్వితీయ బ్రహ్మాత్మ తత్త్వ మును దెలియ జేసినవాడాయెను. ఈ వాక్యమును శ్వేతకేతుడు విని యీ విషయమును విమర్శించుకొని యీ చెప్పబడిన ప్రకార మింద్రియములకు వేద్యము గాకుండ ఉపాయాంతరముచేతనే తెలియదగియుండెడి బ్రహ్మ స్వరూప విజ్ఞానమే పరమపురుషార్థసాధకమై యున్నదిగాని మఱియొక విధముగా ఆత్మయందు దారోపింపబడిన కర్తృత్వాది బంధమునకు నివృత్తి గలిగి ముక్తుడగుట కవకాశము లేదని నిశ్చయించుకొని, అద్వితీయ బ్రహ్మ స్వరూప విజ్ఞానమునకు ముఖ్యసాధనమును దెలియగోరినవాడై తిరిగి ప్రశ్నము జేయుచున్నాడు. ఓ స్వామీ! నిరతిశయ జ్ఞానైశ్వర్య సమ్పన్నులై యుండెడి మీరు ఈ యర్థమును నాకు విస్పష్టముగా దెలియుటకు దగిన సాధనమును దృష్టాంత పూర్వకముగా వివరణచేసి మరల సనుగ్ర

హింపవలయునని ప్రార్థించినవాడాయెను. తండ్రియైన యుద్దాలకుడు ప్రియ పూర్వకముగా సంబోధించి పుత్రుని ప్రశ్న నంగీకరించి యాలాగుననే విస్పష్టముగా బోధించెదనని యుత్తరమంత్రములో జెప్పబడెడి యుదాహరణపూర్వకముగా బ్రహ్మవిజ్ఞానసాధనమును జెప్పుచున్నాడని తాత్పర్యము. నీటిలో కరగిన లవణరసము నేత్రేంద్రియముచేతగాని, కర్ణేంద్రియముచేత గాని, ఘ్రాణేంద్రియముచేతగాని తెలిసికొనుటకు సాధ్యముగాక జిహ్వేంద్రియ మొకదానిచేతనే తెలిసికొనుటకు సాధ్యపడునట్లు, తక్కిన కర్మేంద్రియములచేతగాని, జ్ఞానేంద్రియములచేతగాని తెలిసికొన సాధ్యముగాక శమదమాది గుణముగల్గిన విశుద్ధాంతఃకరణ మొకదానివల్ల మాత్రమే పరబ్రహ్మ సాక్షాత్కారము జేయుటకు యోగ్యత గలుగునని ఈ ఆరుణి ముని ఉపదేశమువల్ల గోచరమగుచున్నది. అందువల్లనే మానవులందఱి లోను ఈశ్వరుం డొకే విధముగా వ్యాపించియుండినను అందఱికిని యనుభవము గలుగకుండుటకు కారణము. ఈ విషయమై శ్రీ మద్భాగవత మున యొక శ్లోకము గలదు.

శ్లో॥ సృష్ట్వా పురాణి వివిధాన్యజయాఽఽత్మశక్త్యా
వృక్షాన్ సరీసృపపశూన్ ఖగదంశమత్స్యాన్ ।
తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥

తా॥ బ్రహ్మదేవుడు ఆదికాలమున వృక్షములు సర్పములు, మృగములు, పక్షులు, దోమలు, చేపలు మొదలగు సమస్త ప్రాణి కోట్లను సృజించి అన్నిటినిపరిశోధించగా వానిలో దేనికిని ఆత్మ స్వరూప జ్ఞానమును తెలిసికొనెడు శక్తిలేకపోవుటవల్ల తన సృష్టియంతయు వ్యర్థ మాయెనని తలంచి చింతాపరవశుడై దీర్ఘముగా నాలోచించి తన తప శ్శక్తినంతయు కేంద్రీకరించి బ్రహ్మసాక్షాత్కారమును కలుగజేసికొనుటకు తగిన శుద్ధాంతఃకరణముగల మానవుని సృష్టించి పరిశీలించగా తన సృష్టి సార్థకమయినదని తలంచి మహానందమును పొందెను. కావుననే మానవ జన్మము శ్రేష్ఠమనియు, ఈ మనుష్యజన్మలోనే మోక్షమును సంపాదించుకొనవలయుననియు తెలిపెడు రహస్యము. ఈ విషయమునే కఠోపనిషత్తున్ను ప్రతిపాదించుచున్నది:

మూ॥ యథాఽఽదర్శే తథాఽఽత్మని యథా స్వప్నే తథా పితృలోకే।
యథాఽప్సు పరీవ దదృశే తథా గన్ధర్వలోకే ఛాయాతపయోరివ
బ్రహ్మలోకే॥

తా॥ ఏలాగున మానవునికి నిలువుటద్దమున తన శరీరము సంపూర్ణముగా స్పష్టముగా గనుపించునో, ఆలాగున ఈ మానవజన్మమునకు బ్రహ్మమును సాక్షాత్కరించుటకు తగిన హృదయసృష్టి ఏర్పడియున్నది. పితృలోకములో గల సృష్టి యెటువంటిదనగా, కలలో కనినట్లు అస్పష్టముగా నేయుండును. స్వప్నములో వికారరూపముగా కానుపించునట్లేయుండునని తాత్పర్యము. స్వర్గలోకములోగల సృష్టి ఎట్టిదనగా, ఏలాగు నీటిలో ప్రతిఫలించిన తన శరీరము అస్పష్టముగా, నల్లగా గోచరించునో, ఆలాగు దేవలోకములోగల దేవతలసృష్టియునుండును. కట్టకడకు సత్యలోకమను బ్రహ్మలోకములో గల సృష్టియు నిరూపింపబడుచున్నది. ఏలాగు అచ్చట నున్నవారికి ఎండలో గనపడిన నీడ నల్లగా అస్పష్టముగా గోచరించునో, ఆలాగు ఆ లోకవాసుల సృష్టియు నుండును. కావుననే మానవజన్మమున కింతయాధిక్యతగలుగుటకు కారణము. నిలువుటద్దముదగ్గరనిలిచిన, తాను ధరించిన వస్త్ర ఆభరణాది చిహ్నములన్నియు స్పష్టముగా గోచరమగు నట్లు పరమాత్మను సంపూర్ణముగా సాక్షాత్కరించుట కీమానవజన్మ హృదయసృష్టి యొకటిమాత్రమే తగినదిగా యున్నది. తక్కిన వారు లందరును మరల భూలోకమున జనన మొందియే భగవత్సాక్షాత్కార జ్ఞానమును పొందవలసియుందురు. అయిన అట్టిమహత్తరమగు పుణ్యముచే గలిగిన మానవజన్మయొక్క విలువను తెలిసికొనక పోవుచున్నారు.

శ్లో॥ సోపానభూతం మోక్షస్య మానుష్యం ప్రాప్య దుర్లభం।
యస్తారయతి నాత్మానం తస్మాత్పాపతరోఽత్ర కః॥

తా॥ సౌధము నెక్కుటకు సోపాన మెట్టిదో ముక్తిధామమును ప్రవేశించుటకు ఈ మనుష్య జన్మము నిచ్చెనవంటిది. ఈ జన్మను లభించుట చాల దుర్లభము. అట్టి మనుష్య జన్మ లభించియు ఎవడైతే సంసారసాగరమును తరించి మోక్షమునకై యత్నంపడో, వానికన్న దురదృష్టవంతుడు మఱి యెవడు గలడు?

శ్లో॥ సదా సర్వగతోఽప్యాత్మా న సర్వత్రావభాసతే।
బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్ ॥

తా॥ సూర్యుండు భూలోకమంతటను సమానముగా ప్రతిబింబించి యుండినను మట్టి, రాయి, గోడ మొదలయినవాటిలో ప్రతిఫలించక నిర్మలమయిన అద్దమం దేలాగు స్పష్టముగా ప్రతిబింబించునో, ఆలాగున అందఱిలోను అంతటను సర్వేశ్వరుండు వ్యాపించియుండినను శుద్ధాన్తఃకరణమున్ను ఏకాగ్రతయు గల హృదయములోమాత్రమే పరమాత్మసాక్షాత్కారము గలుగుటకు తగియున్నది అని బోధము.

శ్లో॥ శిష్యో బహిర్ముఖో న స్యాదధ్యాత్మం యోగమాచరన్ ।
దుర్దిశ్యత్వాది సంయుక్తమప్యాత్మానం ప్రపశ్యతి ॥

తా॥ ఆత్మ విషయమయిన యోగము నభ్యసించు శిష్యుడు బహిర్ముఖుడు గారాదు. అట్లైననే సామాన్యజనులకు చూడ శక్యముగాక పోవుట మొదలయిన ధర్మములు గలదైనను, ఆత్మను దర్శింపగలడు. ఈ యర్థమునే శ్రీకృష్ణభగవానుడు గీతయందును ఉపదేశించెను.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥

తా॥ సమస్త చరాచర ప్రాణికోట్లలో నంతర్యామియై సమానముగా వెలుగుచుండు పరమాత్మ నెవండు చూచుచున్నాడో వాడే నేత్రము గలవాడు. అట్టి పరమాత్మను చూడనివాడు నేత్రముగలవాడైనను అంధప్రాయుడు. అనగా తక్కినవారు నశించు వస్తువులనే చూచి రేగాని నాశములేని పరమాత్మను చూడనివారగుటవల్ల అట్టివారు గ్రుడ్డివార్లకు సమానులుగా నిరూపింపబడిరి.

శ్లో॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరం ।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్॥

తా॥ సకల ప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగా తెలిసికొని తనచేత తనను చంపుకొనని వాడగుచున్నాడు. అట్లు పరమాత్మను సమముగా సర్వములో తెలిసికొనని వాడు తన యాత్మను తాను చంపుకొనినవానితో సమానుడు. అట్టి

తనలో వెలుగుచుండు పరమాత్మను దర్శించినవాడు మోక్షమును పొందుచున్నాడు.

ఇచ్చట తనలోగల దైవమును సాక్షాత్కరించుటకు యత్నించని వాడు ఆత్మహత్య చేసుకొనినవానితో సదృశుడుగా నిర్ణయించఁబడినది.

---

## అ హిం సా ధ ర్మ ము

ప్రశ్న:- బ్రహ్మనిష్ఠయందు, భగవద్భక్తియందు ప్రీతిగలిగి అనుష్ఠానము చేయువారికి అహింసాధర్మము సంపూర్ణముగా గలిగియుండవలయునని కొందరి మతము. ఆలోచించిచూచిన అది నిజముగానే యుంటున్నది. అయితే కొందఱు చిరకాలమునుండి మాంసభక్షకులై యుండినందుచే అట్టి ఆహారము మానిన జబ్బుగలుగునని సామాన్య మనుష్యులేగాక డాక్టర్లున్ను చెప్పుచున్నారు. ఆలాగున మాంసాహారము మానినందుచేత రోగగ్రస్తులై మరల మాంసభక్షణము ప్రారంభించిన తరువాత ఆరోగ్యవంతులై యుండినవారున్ను కొందరు గలరు. కాన్రు బ్రహ్మనిష్ఠను వదలుటకున్ను మనస్సు యొప్పుడను లేదు; అహింసావ్రతమును శీలించుటకున్ను శక్తి లేదు. ఇట్టి ధర్మసందిగ్ధావస్థలో నున్నున్న వారికి ఏదైన గత్యంతరము గలదా ?

ఉత్తరము:- ఒక ధర్మమును పాలించునప్పుడు మొట్టమొదట కష్టము సహించవలసియుండును. అట్లైనతర్వాత కొంత సుఖము గలుగును. ఏలాటి పరిశ్రమ జేయనివా డేకాలమందైనను పవిత్రుడు గాఁజాలడు. ఇది జ్ఞానవిషయమునం దొకదానియందు మాత్రము గాదు; విద్యావిషయమందుగాని, ధనార్జన విషయమందుగాని, వ్యవసాయాది విషయములందుగాని అందఱికిన్ని అనుభవముగల విషయమే. కనుకనే గీతాచార్యుండు ఈలాగున ఉపదేశించెను :

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమం।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥

తా॥ ఏ సుఖము ఆరంభమునందు విషమువలె నుండునో, పర్యవసానమందు అమృతమువలె మారుచుండునో, అట్టి పరమాత్మ విషయక

మైన బుద్ధియొక్క నైర్మల్యమువలన గలిగిన సుఖము సాత్త్వికసుఖమని యోగులచే చెప్పబడినది.

శ్లో॥ విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమం।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥

తా॥ ఏ సుఖము ఇంద్రియములకు విషయసంయోగము వలన మొదట అమృతతుల్యమైనదియు, పర్యవసానమందు విషమువంటిదియు నై యుండునో, అట్టిసుఖము రాజససుఖమని బ్రహ్మవేత్తలచేతలంచబడినది.

మఱియు తన ఆత్మవలెనె ఇతరజీవుల ఆత్మయని జ్ఞానము గలుగుటయే నిజమయిన ఆత్మజ్ఞానము, దైవజ్ఞానము అనియు, ఈశ్వర సాక్షాత్కారమనియు శాస్త్రము తెల్పుచున్నది. అట్టి అనుభవము జ్ఞానము గలుగని వేదాంతజ్ఞానము శుష్కవేదాంతమే యగును.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥

తా॥ ఓ అర్జునా! ఎవడు సమస్త జీవులయందలి సుఖముగాని, దుఃఖముగాని తనకువలె నిజముగా చూచుచున్నాడో, అట్టి ధ్యానయోగి యోగులలో శ్రేష్ఠుడని నా మతము.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

తా॥ యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు సమస్త జంతువులయందును సమభావము గలవాడై తన్ను సమస్త భూతములయందున్నవానినిగాను, సమస్త భూతములు తనయందున్నవానినిగాను చూచుచున్నాడు.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥

తా॥ ఏ పురుషుడు సకల భూతములయందును నన్ను జూచుచున్నాడో, సకలభూతసముదాయమును నాయందు జూచుచున్నాడో అట్టివానికిని, నాకును భేదములేదు. కనుక వానికి నేను కనపడకపోను; నాకు వాడు కనపడకపోడు.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥

తా॥ బ్రహ్మాది స్తంబపర్యన్తములగు సమస్త వస్తువులయందును సమముగా యుండునట్టి పరమేశ్వరుని ఎవండు సర్వము నశించినను నశింపనివానిగా చూచుచున్నాడో, వాడే చూచువాడు.

ప్రశ్న:- ఈ అహింసా వ్రతములో ఏదైన కొంత సడలించుట కవకాశముండునా? ఏలననగా, సామాన్యముగా అందరికిని అంత తీవ్ర వైరాగ్యముగాని, దేహాదులందు అనిత్యబుద్ధిగాని ఉండదు. కావున ఇట్టివారుగూడ తరించు ఉపాయము గలదా?

ఉత్తరము:- గలదు. మొట్టమొదట జీవకారుణ్యము గలిగిన స్వయముగా మాంసభక్షణబుద్ధి తొలగిపోవును. ఒకడు సంతోషముగా భుజించు పదార్థమైనను దానియందు విషము కలిసియుండెనని తెలిసిన స్వయంగా ఎటులమాని వేయునో, ఆలాగున హింసాహారములో పాపము గలదను బుద్ధి ఉదయించినచో అది స్వయముగానే తన్ను వదలిపోవును. ఆలాగున విషయభ్రాంతి గలవాడు ఇతర స్త్రీలతో రమించువాడైనను, ఆ స్త్రీయందు అంటుజాడ్యము గలదని తెలిసిన తనకున్ను అది సంప్రాప్తించునని భయముగలిగి మఱియొకరు చెప్పకనే అట్టివ్యాధిని ఏలాగున మానుకొనునో, ఆలాగున ప్రాణి హింసాహారమునందు పాపముగలదని నిర్మలబుద్ధి ఉదయించిన స్వయముగానే అది వదలిపోవును. మానవులకు ఆరోగ్యప్రదములగు శాకాహారములు, ధాన్యములు అనేకములుండగా మరల ఎందుకు ఈ పాపాహారమును తినవలయును? మఱియు ప్రాణులను వధించు స్థలమునకు పోయిచూచిన వానియొక్క దుఃఖరోదనము, రక్తప్రవాహము, కాలుచేతులు తన్నుకొనుట మొదలగు భయంకర అవస్థలనుచూచిన ఎట్టి కఠినాత్ముని మనస్సుగూడ కఱిగిపోవును. అయితే రాతిలో, పలకలో ఏదియు ప్రతిఫలించదుగాని, అద్దములో సన్ముఖభాగమున నున్న వస్తువులన్నియు ఎటుల ప్రతిఫలించునో ఆలాగు కఠినాత్ముల హృదయములో ఇతర ప్రాణికోట్ల దుఃఖము ప్రతిఫలించదుగాని పవిత్రాత్ముల హృదయమున తప్పక ఇతర ప్రాణికోట్ల దుఃఖము గోచరించును. కావున వధ్యస్థలములలో వెళ్లిచూచిన రాక్షసకృత్యమగు మాంసాహార

పిశాచము మానవుని వదలిపోవును. అయితే హృదయములో దయా భుత్వము, నిర్మలత్వము, వైరాగ్యము లేనివారుగూడ క్రమముగా మాంసభక్షణమునుండి విముక్తినొందు ఉపాయమొకటి గలదు. తాను ప్రేరణచేసి హింసచేసి భుజించు స్వభావమును మొట్టమొదట మానవలయును. ఎవరైన వండిపెట్టిన దానిని తినులాగున కొంతకాల మభ్యసింపవలయును. ఆలాగున కొంతకాలము పోయినపిమ్మట తనకు తెలియక యితరులు వండిపెట్టినదైనను వారమునకొకసారి భుజించులాగున చూడవలయును. మరల కొన్నిరోజులు పోయిన తరువాత పక్షమునకొకతూరి తినులాగునున్ను, మరల కొంతకాలము గడచినపిమ్మట నెలకొకసారి తినుస్వభావము గలిగియుండిన ఆ దుర్వృత్తి నశించిపోవును. అయితే మనస్సులో మాత్రము హింసచే గలిగెడు పాపమును విచారణ చేయుచునే యుండవలయును. లేనిచో మాంసభక్షణము మానినను గొప్ప ప్రయోజనమేమియు గలుగదు. ముఖ్యముగా హృదయశుద్ధి గలుగునప్పుడే సర్వజీవరాసులలో వెలుగుచుండు ఆత్మను, దైవమును దర్శింపగలుగును. అప్పుడు ఒక ప్రాణికైనను క్లేశము గలిగినది చూచిన తనకే గలిగినట్లు అతని హృదయము తపించుచుండును. శ్రీ బుద్ధభగవానుడు మొదలగువారు ఈలాటివారగుటచేతనే 'అహింసా పరమోధర్మః' అని పవిత్రధర్మమును లోకములో నెలకొల్పగలిగిరి. జీవకోట్లను బ్రహ్మదేవుడు సృష్టించి వారి ఆహారములను నిర్ణయించెను. దేవతలకు అమృతము, ఋషులకుఓషధులు(కందపక్వఫలమూలములు), మానవులకుఅన్నమును, భూత ప్రేత పిశాచములకు మద్యమాంసములను నిర్ణయించడమైనది. మరియొకవిధముగా శాస్త్రములో కనబడుచున్నది. మద్యపానరతుడు అసురుడనియు, మాంసాశి రాక్షసుడనియు, ఇంద్రియ చాపల్యముగలిగి స్వభర్తృ స్వభార్యా భేదములేక విహరించు స్త్రీపురుషులు మృగప్రాయులనియు, ధర్మనిరతుడై ప్రవర్తించువాడు మానవుడనియు తెలుపడమైనది. కావున ఈ ధర్మశాస్త్రము ననుసరించి మానవు డెటుల ప్రవర్తించవలయునో మీరే తెలిసికొని ప్రవర్తించి జన్మసాఫల్యము నొందుడు.

మఱియొక రహస్యము చెప్పెద. శాకాహారముచే గలిగెడు ప్రయోజనమున్ను, హింసాహారాదులచే గలిగెడు దోషములను తెలి

పెడు గ్రంథముల చదువవలయును. మఱియొక పరమరహస్యము తెలి పెద. అదేమనగా, జీవకారుణ్యముగల మహాత్ముల దర్శన మప్పుడప్పుడు చేయుచుండును. ఇది అన్నిటిలోను గొప్పరహస్యము. ఈ విషయమై శ్రీశంకరభగవత్పాదాచార్యులు తెలిపినది చూడుడు:

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥

తా॥ సజ్జనుల సహవాసముచే నిస్సంగత్వము గలుగును. నిస్సంగత్వముచే భ్రాన్తి నశించును. భ్రాన్తి నాశనముచే నిశ్చలతత్త్వము గలుగును. నిశ్చలతత్త్వజ్ఞానముచే జీవన్ముక్తి (మోక్షము) సిద్ధించును.

పాశ్చాత్యులు కొందఱు మానవుడు మాంసాహారజన్తువర్గములో చేరినవాడా లేక శాకాహార జీవవర్గములో చేరినవాడా ? అని అనేకవిధ పరిశోధనల సల్పిరి. వారిలో జర్మనీదేశస్థుడగు లూయెకూనె ముఖ్యుడు. చిన్నకాలములో కోతిపిల్లలకును, పిల్లి కుక్క నక్కపిల్లలకును చేపలు, మాంసములు, కూరగాయలు, పండ్లు వీనిని పెట్టి పరిశోధించెను. కోతి పిల్లలు పండ్లు, కాయలను మాత్రమే భుజించెను. పిల్లి నక్కపిల్లలు పండ్లను, కాయలను తినలేదు. మాంసమును, చేపలను తినెను. అలాగున ఆవు మేక గుఱ్ఱముల పిల్లలకును, పులి తోడేలు పిల్లలకును కసువు, చేపల మాంసమును పెట్టిచూచినారు. ఆవుదూడలు గడ్డినిమాత్రము భుజించెను. పులి తోడేలుపిల్లలు మాంసమును తినెను. ఈలాటిపరిశోధనల వలనను మానవుడు శాకాహార జంతువర్గములో చేరెనని నిశ్చయించెను. ఈలాగున దంతములు జీర్ణాశయములు ప్రేగులు మొదలగువానిని గూడా పరిశోధన సల్పిరి. మఱియొక పదార్థ సహాయము లేకనే స్వాయముగా ఏవస్తువును హృద్యముగా భుజించునో అదియే ఈశ్వరసృష్టి యందుగల నైజాహారము. మానవులెవరును పచ్చిచేపలనుగాని, పచ్చి మాంసమునుగాని తినజాలరు. జంతువులు పచ్చివిగానే భుజించును. మానవుడు సృష్టిలోనేర్పడిన ఉప్పు కారము మొదలగువానిని చేర్చియే మాంసమును చేపలను తినుచుండును. ఇందువల్లన మానవుడు శాకాహార జీవగణములో చేరినవాడు అని నిశ్చయించుకొనిరి.

---

# ఛాన్దోగ్యోపనిషత్

## షష్ఠప్రపాఠకే — చతుర్దశః ఖండః

ఈ ఆరుణిమహర్షి ఉపదేశమువల్ల గురుదేవు డవసరమూ, అనవసరమూ అను సత్యము వ్యక్తము గాగలదు.

ఉ॥ యథా సోమ్యపురుషం గన్ధారేభ్యోఽభినద్ధాక్షమానీయ, తం
తతోఽతిజనే విసృజేత్స యథా తత్ర ప్రాఙ్వోదఙ్వాధరాఙ్వా
ప్రధ్మాయీతాభినద్ధాక్ష ఆనీతోఽభినద్ధాక్షో విసృష్టః॥

ఉ॥ తస్య యథాభినహనం ప్రముచ్య ప్రబ్రూయాదేతాం దిశం
గన్ధారా ఏతాం దిశం వ్రజేతి స గ్రామాద్గ్రామం పృచ్ఛన్
పండితో మేధావి గన్ధారానేవోపసమ్పద్యేతైవ మేవేహా
చార్యవాన్పురుషో వేద తస్య తావదేవ చిరంయావన్న
విమోక్ష్యేఽథ సమ్పత్స్య ఇతి॥

తా॥ ఇంద్రియ విషయమునతిక్రమించియుండెడి వస్తుస్వరూపము దెలియుటకు సాధన ముదాహరణపూర్వకముగా నిరూపింపబడుచున్నది. ఓ శ్వేతకేతుడా! గంధారదేశములందుండెడి ఒక ధనికుడగు పురుషుని దొంగలు పట్టుకొని కనపడకుండా కన్నుల నడ్డకట్టి బంధించి తీసికొనిపోయి గంధారదేశముల కత్యంతదూరమున జనరహితమై, వ్యాఘ్రములు మొదలయిన అత్యంత ఘాతుక మృగములయొక్కయు, తస్కరులు మొదలయినవారియొక్కయు భయముతో సంకులమైయుండెడి అరణ్యప్రదేశములో కన్నులకు కట్టియుండెడి బన్ధనము విడువక హస్తపాదాదులను గూడ బంధించి వదలిపెట్టుటయును, ఆప్రకారమువదలబడినవాడు అరణ్యములో దిక్కు తెలియక మూఢుడై అత్యంత దీనధ్వనితో సమస్తదిక్కులనుగూర్చి నేను గంధారదేశములలోనుండి తస్కరులచే కన్నులు కనపడకుండా నడ్డకట్టి, బంధింపబడి, యట్టి బంధనముతోనే యీ యరణ్యమున వదలిపెట్టబడియున్నాననియు, పరమ కారుణికులయిన మహాపురుషు లెవరైనను నాకీ బంధమును వదలించి దిక్కును తెలియజేసి, నాదేశమునుగూర్చి వెళ్లుటకు మార్గమును జెప్పి అనుగ్రహింపవలయుననియు

సమస్త దిక్కులనుగూర్చి పెద్ద ధ్వనితో నరచుచుండగా వాని పుణ్య విశేషమువల్ల ఒక సత్పురుషుడీ దీనధ్వనిని విని ఆప్రదేశమునకువచ్చి బద్ధుడై పడియుండెడి వానియొక్క బంధమునను విడదీసి దిక్కులను చూపించి, యీ దిక్కునందు గంధారదేశము లున్నవి గనుక ఈ మార్గమున ఆ దేశములకు వెళ్ళవలసినదని చెప్పినందున, ఆ వాక్యమువలన స్వదేశ మార్గములోజేరి యొక గ్రామమునుండి మఱియొక గ్రామము నడిగి తెలిసికొనుచు, చెప్పినమార్గమును బాగుగా తెలిసికొని నిశ్చయించుకొనుటయందు విశేష ప్రజ్ఞగలవాడై క్రమముగా స్వదేశమునందు జేరి, శ్రమను పోగొట్టుకొని సుఖముగా నుండుట ఏప్రకారమో ఆప్రకారముగానే పూర్వాచరితములై యుండెడి సుకృత దుష్కృత కర్మవాసనలనెడి దొంగలచే అవిద్యా మోహపటముచే బంధింపబడిన వస్తుదృష్టిగలిగి యధిష్ఠాన సన్మాత్ర బ్రహ్మస్వరూపస్థితినుండి ప్రచ్యుతుడై ఆకాశాది పంచభూత వికారమయినట్టియు, వాత పిత్త కఫ రుధిర మేదోమాంసాస్థి మజ్జా శుక్ర క్రిమి మూత్ర పురీషములతో దూషితమై శీతోష్ణ సుఖదుఃఖ రాగద్వేషములు మొదలయిన ద్వంద్వములతోగూడియున్న యీ దేహమనెడి అరణ్యమునందు ప్రవేశింపబడి అవిద్యా మోహబద్ధుడై యున్నందున భార్యాపుత్రులు, మిత్రులు, పశువులు, బంధువులు, ధనము, క్షేత్రము మొదలయిన విషయములయందు తృష్ణయనెడి పాశముచే నిరోధింపబడి నేను మనుష్యుడను, ఇతని పుత్రుడను, ఆతనికి పౌత్రుడను, నాకు వీరు బాంధవులు, నేను సుఖమును పొందితిని, దుఃఖము ననుభవించితిని, నేను మూఢుడ నయితిని, పండితుడ నయితిని, ధార్మికుడ నయితిని, పుట్టితిని, బాల యౌవన వార్ధక్యముల పొందితిని, పాపము జేసితిని, పుణ్యము జేసితిని, నా ధనము నష్టమాయెను, గృహ క్షేత్ర పశుపుత్రాదులు నష్టమైపోయెను, అత్యంత దుఃఖము సంభవించెను, నే నేవిధముగా జీవించెదను ? నాకేమి గతియున్నది ? నాకెవ్వరు రక్షకు లవుదు రనునవి మొదలుగాగల అనేక శత సహస్రములయిన అనర్థ పరంపరలతో గూడి దీనుడై మొఱపెట్టుచు కొంత కాలమునకు పూర్వకృత పుణ్యవిశేషమువల్ల అత్యంత దయాపరుడై, బ్రహ్మరూప నిష్ఠచే ముక్తబంధనుడై యుండెడి పరమగురువుయొక్క

అనుగ్రహమునకు పాత్రుడై, శుశ్రూషజేసి వారివలన మహావాక్యోపదేశ పూర్వకముగా కర్తృత్వాది సంసార ధర్మములు నీకు లేవనియు, సర్వ ప్రపంచాధిష్ఠాన సత్తామాత్రమై యుండెడి అద్వితీయ బ్రహ్మస్వరూపమే నీవై యున్నావనియు బోధింపబడి, అవిద్యా మోహపటము వలన విముక్తుడై, మిథ్యా జ్ఞానకల్పితమై యుండెడి ఐహికాముష్మిక భోగ విషయములందు విరక్తినిపొంది, అహమాది సర్వవృత్తులకు సాక్షియైయుండెడి నిర్వికారాసంగ చిద్రూప ప్రత్యగాత్మ స్వరూపమును, కూటస్థాద్వితీయాఖండైకరస పరిపూర్ణ బ్రహ్మమాత్రముగా తెలిసికొని కేవల నిరతిశయానందానుభవ తృప్తుడగు చున్నాడు. ఈ ప్రకార మాచార్యోపదేశమువలన దృఢాపరోక్ష పరబ్రహ్మస్వరూపానుభవముతో తృప్తుడై యుండెడి పురుషునకు పూర్వవాసనారబ్ధమయిన దేహేన్ద్రియ సంఘాతముయొక్క వియోగము గలుగుటతో వాసనాక్షయమై విదేహముక్తి సంభవించును. కనుక యీ యారబ్ధ దేహపాత మాత్రమే బ్రహ్మస్వరూపప్రాప్తికి విలంబమగునని తాత్పర్యము.

ఉ॥ స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ సర్వం తత్సత్యగ్ స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ॥

తా॥ శాస్త్రాచార్యోపదేశము వలన సంభవించెడి యద్వితీయ బ్రహ్మస్వరూపవిజ్ఞానము అప్రతిహతమై అవిద్యా తత్కార్యనివృత్తిద్వారా సత్సంపత్తిహేతువై నందున ముఖ్యసాధకముగా నిరూపింపబడియున్నది. కనుక యీ మంత్రములో అట్టి దృఢాపరోక్ష బ్రహ్మసాక్షాత్కారరూపమై యుండెడు జ్ఞానమునందు నిష్ఠ గలిగియుండెడి వానికి సత్సంపత్తి గలిగి యుండుట అర్చిరాది మార్గ గమనముద్వారా సంభవించుచున్నదా లేక అవిద్యానివృత్తిమాత్రముతో నిక్కడనే సంభవించుచున్నదా అను సంశయ నివృత్తికొరకు తిరిగి ప్రశ్నము చేయబడుచున్నది. ఓ శ్వేతకేతుడా! పూర్వమంత్రమునందు శాస్త్రాచార్యోపదేశమూలముగానే తెలియవలసినదని యే స్వరూపము నిరూపింపబడియున్నదో యదియే సర్వ ప్రపంచకారణమైన సత్తామాత్ర స్వరూపమైనది గనుక సమస్త ప్రపంచమును యీ సత్తామాత్రమే స్వరూపముగా గలిగినది. ఇదియే

సత్యస్వరూపమును, యిదియే అహమాది వృత్త్యధిష్ఠానమైన కేవలాత్మ స్వరూపమును అయినది. కనుక నీవును సర్వప్రపంచాధిష్ఠాన సన్మాత్ర బ్రహ్మస్వరూపమైయున్నావని యుద్దాలకుడు శ్వేతకేతునకు ఆత్మతత్త్వమును బోధించినవాడాయెను. శ్వేతకేతు డీవాక్యమును విని ఆచార్యోపదిష్టమయిన మహావాక్య విచారమువలన సంభవించుచుండెడి అద్వితీయ బ్రహ్మస్వరూప విజ్ఞానముచే సంప్రాప్తమగుచున్న సత్సంపత్తి అర్చిరాది మార్గ గమనముద్వారా గలుగునో లేక అవిద్యా తత్కార్య నివృత్తితో నిక్కడనే సంభవించునో యీయర్థమునందు సంశయము గలిగియున్నది. కనుక తిరిగి యీవిషయమునే వివరణముచేసి నాకు సంశయ నివృత్తి గలిగెడులాగున ఉదాహరణపూర్వకముగా అనుగ్రహింపవలెనని ప్రార్థించెను. ఉద్దాలకుడు 'ఓ శ్వేతకేతుడా! ఆ ప్రకారముగానే వివరణచేసి చెప్పెద'నని అంగీకారవాక్యమును చెప్పినవాడాయెను. ఈ విషయమై గురుగీతయందు పరమశివుండు పార్వతీదేవి కుపదేశించినది చూడుడు:

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥

తా॥ అజ్ఞానమనెడు తిమిరవ్యాధిచే కన్నులు తెలియనివానికి జ్ఞానాంజనమనెడు శలాకచే నేత్రపొరను తీసివైచి కన్ను కనపడులాగున చేసి తత్పదమగు మహావాక్యార్థమును తెలిపిన (చూపిన) శ్రీ గురుదేవుని కొరకు నమస్కారము. ఇది పైజెప్పిన ఉపనిషద్వాక్యమునకు సరిపోవునది. ఈలాటి మఱియొక శ్లోకమునుగూడ క్రింద వ్రాయడమగుచున్నది.

శ్లో॥ భవారణ్యప్రవిష్టస్య దిఙ్మోహభ్రాన్తచేతసః,
యేన సందర్శితః పన్థాస్తస్మై శ్రీగురవే నమః ॥

తా॥ సంసారమను కారడవియందు పడియుండి, దిక్కు తెలియక మోహపరవశుడై, దీనావస్థలో నుండువానికి యే పరమకారుణికుడగు గురుదేవుడు శాశ్వతసుఖ పరమస్థానము జూపెనో, అట్టి శ్రీగురు దేవునికొఱకు నమస్కారము.

శ్లో॥ పాపత్రయాగ్నితప్తానా మశాంతప్రాణినాం ముదే,
గురురేవ పరా గంగా తస్మై శ్రీగురవే నమః ॥

తా॥ ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములైన తాపత్రయాగ్నిచే తపించి, శాంతి గానక దుఃఖించెడు ప్రాణికోట్లకు పరమానందమునకై గురుదేవుడొకడే గంగానదిసదృశుడు గాగల్గును. అట్టి గురుదేవునకు నమస్కారము. శ్రీకృష్ణభగవానుడు గీతలో నుపదేశించినది చూడుడు:

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

తా॥ తత్త్వవేత్తలయిన ఆత్మజ్ఞానులు మీ కొఱకు జ్ఞానము నుపదేశింపగలరు. అట్టి జ్ఞాన మెటుల గలుగుననగా, వినయముతో జేయు నమస్కారముచేతను, సమయమును గనిపెట్టి అడుగుటచేతను, గురువాజ్ఞను పాలించునట్టి సేవచేతను వారు చెప్పగలరు. దీనియందు మూడు లక్షణములు శిష్యునకుండవలయుననియు, తత్త్వజ్ఞానము గలిగినవారే గురువులుగా నుండవలయుననియు లక్షణము నిరూపింపబడినది. కఠోపనిషత్తు తెలిపినది చూడుడు:

మూ॥ ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసశ్చ పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్పరః॥
మహతః పరమవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః ।
పురుషాన్న పరం కించిత్సా కాష్ఠాసా పరా గతిః॥

తా॥ శబ్దాదివిషయములు ఇంద్రియములకంటె సూక్ష్మములు. మనస్సు శబ్దాది విషయములకంటెను సూక్ష్మతరము. ఆ సంకల్ప వికల్ప లక్షణమగుమనస్సుకంటె అధ్యవసాయాత్మకమగు బుద్ధి సూక్ష్మతమము. ఆ బుద్ధికంటె చిదాభాసుడు మిక్కిలి సూక్ష్మమయినవాడు. ఈ జీవోపాధికే అవ్యక్తమనియు, మహత్తత్త్వమనియు పేళ్లు. కావున యీ మహత్తత్త్వమునకు పరమైనవాడు పురుషుడు. అనగా ఆత్మ. వానికన్న పరమైనది మఱియొకటి లేదు. పూర్ణుడగుటచేత పురుషశబ్దమేర్పడినది. అదియే నిష్ఠయొక్క పర్యవసానస్థితి, అదియే సర్వోత్కృష్టమయిన మోక్ష స్థానము. దాని కన్యమైనది మఱియొకటి లేదు.

శ్లో॥ ఏక ఏవాత్మా మన్తవ్యో జాగ్రత్స్వప్నసుషుప్తిషు ।
స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే॥

తా॥ అట్టి సర్వపరిపూర్ణమయిన ఆత్మస్వరూపమును గురించియే శ్రవణ మనన నిదిధ్యాసనములు చేయవలయును. అట్టి జాగ్రత్స్వప్న సుషుప్తులకు సాక్షిగానున్నాడు. అట్టి స్థానత్రయమునకు విలక్షణుడై పరమాత్మను పొందినవానికి పునర్జన్మము లేదు. ఈతత్త్వమునే యుద్దాలకుండు శ్వేతకేతువుకొఱ కుపదేశించెను.

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్తులకు స్థానములయిన స్థూల సూక్ష్మ కారణ దేహములను, ఆ దేహత్రయములోగల సమస్త యింద్రియములను, మఱియుఈప్రపంచమునంతటిని యేదిప్రకాశింపజేయుచున్నదో, అట్టి పరమాత్మనే, పరబ్రహ్మమునే అస ఆత్మగా తెలిసికొన్నవానికి పునర్జన్మ గలుగదు. అనగా సర్వబంధములనుండి విముక్తుడగును.

శ్లో॥ యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

తా॥ ఏ పరమభక్తుడు తన యిష్టదైవమందు గలిగియున్నంత భక్తి తన గురుదేవునియందుగూడ కలిగియుండునో అట్టి మహాత్మునికి మాత్రమే తత్త్వమసి మహావాక్యార్థబోధ గలుగును. అట్లు దైవమునందువలె గురుదేవునియందును భక్తిలేనివానికి ఈ వేదాంతార్థములు ప్రకాశించవు అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

శ్లో॥ వేదాంతానా మనేకత్వా త్సంశయానాం బహుత్వతః।
వేద్యస్యా ప్యతిసూక్ష్మత్వా న్న జానాతి గురుం వినా॥

తా॥ వేదాంతశాస్త్ర మనేక మార్గములుగా జెప్పియుండుట వలనను, శ్రోతకు సంశయము లనేకములు గలుగుచుండుటవలనను, తెలియందగిన బ్రహ్మవస్తువు అతి సూక్ష్మమగుటచేతను శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడగు గురుదేవుడు వినా ఈ సత్యమును తెలిసికొనజాలడు.

---

ఓమ్

# ఛాన్దోగ్యోపనిషత్

## షష్ఠప్రపాఠకే — పంచదశః ఖండః

ఈ ఖండమునందు సత్యాసత్యములయొక్క ధర్మమును గురించి తెలుపబడుచుండును.

ఉ॥ స య ఏషోఽణిమైతదాత్మ్య మిదగ్ సర్వం తత్సత్యగ్ స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మాభగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ॥

తా॥ వాగాది సర్వవృత్తులకును లయాధిష్ఠానముగా నిరూపింపబడి యుండెడి దేవతాస్వరూపమేదియో అదియే సర్వప్రపంచాధిష్ఠాన సత్తామాత్రసూక్ష్మాంశమైయున్నందున నీప్రపంచమంతయు సత్తామాత్ర స్వరూపమే యైయున్నది. ఈ సత్తామాత్ర స్వరూపమే అబాధితమై సర్వదా నిత్యమైయున్నందున సత్యస్వరూపమైయున్నది. అదియే అహమాది సాక్షిస్వరూపమయిన ప్రత్యగాత్మయు నయినది; గనుక ఓ శ్వేతకేతుడా! నీవును అబాధిత సత్యస్వరూపమై యుండెడి ప్రత్యగభిన్న బ్రహ్మసత్తామాత్రస్వరూపుడవై యున్నావని శ్వేతకేతుని తండ్రియైన యుద్దాలకుడు బ్రహ్మాత్మైకత్వము నుపదేశము చేసినవాడాయెను. ఈ ప్రకారముగా బోధింపబడిన శ్వేతకేతుడీ చెప్పబడిన ప్రకారను విజ్ఞానియొక్క సత్సంపత్తియును మరణక్రమముగానే సంభావితమై యున్నందున, జ్ఞానికిని అజ్ఞానికిని సత్సమ్పత్తిసమయములో విశేషవిజ్ఞానము లేక సన్మాత్రమైయుండుట సమానమై యుండగా, జ్ఞాని ముక్తుడగుటకును, అజ్ఞానికి పునరావృత్తిగలిగి దేహాంతరము సంభవించుటకును కారణమును దెలియకోరినవాడై తండ్రినిగూర్చి యీ విషయమునే మరల విస్పష్టముగా జెప్పవలయునని ప్రార్థించినవాడాయెను. తండ్రియైన యుద్దాలకుడును ఆలాగుననే విస్పష్టముగా దెలియుటకు దృష్టాంతపూర్వకముగా జెప్పెదనని యంగీకరించినవాడాయెను.

ఉ॥ పురుషగ్ సోమ్యోత హస్తగృహీత మానయన్త్యపహార్షీత్స్తేయమకార్షీత్పరశుమస్మై తపతేతి స యది తస్యకర్తా భవతి తత

ఏవానృతమాత్మానం కురుతే సోఽనృతాభిసన్ధోఽనృతేనాత్మానం మన్తర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స దహ్యతేఽథహన్యతే॥

తా॥ జ్ఞానికిని అజ్ఞానికిని కరణవియోగ సమయమునందు సత్సం పత్తి సమానమైయున్నను, ఫలభేదము సంభవించుటకు దృష్టాంతము నిరూపింపబడుచున్నది. ఓ శ్వేతకేతుడా! యీ లోకములోని ఒక పురుషుని దొంగతనము చేసియున్నాడను సంశయముతో రాజపురుషులు పట్టుకొని హస్తములను బంధించి దండాధికారి సమీపమునకు తీసికొని పోయి యితను పరుల ధనమును దొంగతనముగా హరించియున్నాడని చెప్పినవారైరి. ఆ పురుషుడు నేను దొంగతనము చేయలేదనియు, నిరపరాధినైన నన్ను బంధించి తెచ్చినారు గనుక నన్ను బంధమునుండి ముక్తుని చేయవలసినదనియు చెప్పకొనెను. ఈ వాక్యమును దండాధికారియైన రాజు విని యీ సంశయమును నిశ్చయించెడి నిమిత్తమై యొక గండ్రగొడ్డలిని అగ్నియందు తప్తముచేసి యితడు చేతితో పట్టుకొనునట్లుగా చేయవలసినది. ఇతడు దొంగతనముచేసి లేదని చెప్పినవాడాయెనేని అనృతమును సంకల్పించినవాడౌను గనుక అట్టి యనృతముచే నానృతమైన స్వరూపముగలవాడై అగ్నితప్తమైన పరశువుచే దహింపబడును. అందువల్ల నితడు అపరాధియైయున్నట్లు నిశ్చయించి శిక్షచేయవలసినట్లు ఆజ్ఞాపించినవాడగును.

ఉ॥ అథ యది తస్యాకర్తా భవతి తత ఏవ సత్యమాత్మానం కురుతే స సత్యాభిసన్ధ సత్యేనాత్మానమన్తర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స న దహ్యతేఽథ ముచ్యతే॥

తా॥ పూర్వమంత్రమున చెప్పబడిన ప్రకారమునకు భిన్నముగా దొంగతనము చేయకయే తాను జేయలేదని చెప్పినవాడాయెనేని యీ పురుషుడు నిజమును చెప్పినవాడు గనుక తనస్వరూపమును సత్యముతో సంబంధించియున్నదానినిగా జేసికొనెను. ఈప్రకారము సత్యమునం దభినివేశము గలిగియుండెడి పురుషుడు సత్యముచే నావరింపబడిన శరీరము గలవాడై యగ్నితప్తమైన గండ్రగొడ్డలిని చేతితో పట్టుకొనినను దాని వలన దహింపబడడు గనుక అతనిని నిరపరాధినిగా నిశ్చయించి విడువవలసినదని ఆజ్ఞాపించుచుండును.

ఉ॥ స యథా తత్రన దాహ్యేత తదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి॥

తా॥ ఈ దృష్టాంతముగా నుదాహరింపబడిన శ్రుతిలో దొంగతనము చేసియున్నాడను సంశయముతో పట్టుపడి తాను దొంగతనము చేయక చేయలేదని నిజముగా చెప్పియుండెడి పురుషుడు సత్యమునే సంకల్పించియున్నవాడు కనుక వానిస్వరూపము సత్యముచే ఆవృతమై యున్నందున రాజపురుషులయాజ్ఞాప్రకారము తప్తమైనలోహపిండమును చేతితో నెత్తినవాడైనను దగ్ధుడు కాకపోయిన నిమిత్తముచే విడువబడుట యును, దొంగతనము లేదని అబద్ధము చెప్పినవాడు అనృతమైనసంకల్పము గలిగి అనృతముచేతనే వ్యాపింపబడియున్నందున తప్తపరశు గ్రహణము చేత దగ్ధుడైన నిమిత్తముతో శిక్షింపబడుటయును యేప్రకారమో, ఆ ప్రకారము సర్వాధిష్ఠాన సత్తామాత్రమై యుండెడి అద్వితీయ బ్రహ్మాత్మ తత్త్వమును తెలిసికొనినవాడు సత్యస్వరూపుడైనందున సన్మాత్రుడుగానే శేషించి తిరిగి జన్మాదివికారమును పొందకుండుటయును, అనృతదేహాదులయం దాత్మబుద్ధిగలవాడు అనృతాభిసంధివలన పూర్వకర్మానురూపముగా వ్యాఘ్రాదిశరీరమునుగాని దేవాదిశరీరమునుగాని పొందుచుండుటయును ప్రపన్నమై, ప్రసిద్ధమైయున్నది. ఈ ప్రకారము ఏ ఆత్మస్వరూపమునందుసత్యాభిసంధిగలిగియుండుటవలనముక్తియు,అనృతాభిసంధి గలిగియుండుటవలన బంధమును సంభవించుచున్నదో, అట్టి బ్రహ్మాభిన్నాత్మస్వరూప సత్తామాత్రమే ఈ ప్రత్యక్షాది విషయమైన యావత్ప్రపంచ స్వరూపముగా స్ఫురించుచున్నది. అదియే అబాధిత సత్యస్వరూపమును, అహమాది సర్వవృత్త్యధిష్ఠాన సాక్షిస్వరూప ప్రత్యగాత్మయును అయినది. కనుక ఓ శ్వేతకేతుడా! నీవును యీ యధిష్ఠాన సత్తామాత్ర బ్రహ్మస్వరూపమే యయియున్నావని శ్వేతకేతునిగూర్చి తండ్రియైన యుద్దాలకుడు అద్వితీయ బ్రహ్మాత్మతత్త్వమును బోధించినవాడాయెను. ఆ శ్వేతకేతుడీప్రకారము 'తత్త్వమసి' యనుమహావాక్యోపదేశముద్వారా తండ్రియైన యుద్దాలకునిచే హేతుదృష్టాంతములతో గూడ బోధింపబడి సర్వాధిష్ఠాన సత్తామాత్రబ్రహ్మస్వరూపమే నేనై యున్నానని అద్వితీయ

బ్రహ్మతత్త్వమును విస్పష్టముగా తెలిసికొనినవాడాయెను. ఈమంత్రాంత మునందు విజజ్ఞావితి పునరుక్తి విద్యాసమాప్తిద్వారా అధ్యాయపరి సమాప్తిని దెలియజేయుచున్నది. పైజెప్పిన విషయమునకు సమ్బన్ధించి నది వేదాంత పంచదశియందు నిరూపింపబడినది చూడుడు:

శ్లో॥ ప్రవృత్తౌవా నివృత్తౌవా దేహేన్ద్రియ మనోధియామ్।
సకిఞ్చిదపి వైషమ్య మస్త్యజ్ఞాని విబుద్ధయోః॥

తా॥ కర్మలజేయుటయందుగాని, కర్మల జేయకుండుట యందు గాని, అజ్ఞాని జ్ఞానులయొక్క దేహేన్ద్రియ మనోబుద్ధులలో భేదము కొంచమైనను లేదు.

శ్లో॥ వ్రాత్యశ్రోత్రియయో ర్వేదపాఠాపాఠకృతా భిదా।
నాహారాదావస్తి భేదస్సోఽయం న్యాయోఽత్ర యోజ్యతామ్॥

తా॥ వేదాధ్యయన సత్యధర్మాదులు లేని బ్రాహ్మణునకును, వేదాధ్యయనాదులు గల బ్రాహ్మణునకును బ్రాహ్మణత్వములో భేదము లేదుగాని వేదజ్ఞానములో ఏలాగున భేదము గలిగియుండునో, ఆహారాది కార్యములందు భేదము కనుపించకపోవునో, ఆప్రకారమే అజ్ఞాని జ్ఞానులకును హృదయగ్రంథిభావాభావములచేత భేదముగలిగియుండును. అనగా ఆత్మజ్ఞానము లేనివాడు దేహాభిమానబుద్ధి గలిగియుండును ఆత్మ జ్ఞానముగలవాడు ఆత్మయందు బ్రహ్మభావము గలిగి యుండును. అనుభూతి ప్రకాశమందు తెలిపినది చూడుడు:

శ్లో॥ మర్త్యోఽహమితి సంధాయ జాయతే మ్రియతే చ సః।
బ్రహ్మాహమితి సంధాయ ముచ్యతే స చ జాయతే॥

తా॥ ఎంతవరకు మానవుడు దేహేన్ద్రియ మనోవృత్తులతో జాతి వర్ణాదులతో గూడి తానుమర్త్యుడని తలంపు గలిగియుండునో, అంతవరకు జననమరణములుతప్పవు. ఆత్మవిచారణముచే దేహేన్ద్రియమనోబుద్ధిజాతి వర్ణములకు తాను సాక్షి యనియు, పరబ్రహ్మమనియు బోధగలిగిన, మరల జననమరణముల పొందడు. ఇదియే పై జెప్పిన ఉపనిషత్తుయొక్క సారము. ఈ జ్ఞాని అజ్ఞానుల భేదమునుగురించి శ్రీకృష్ణపరమాత్మ జెప్పి నది చూడుడు:

శ్లో॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥

తా॥ పై శ్లోకములలో గీతయందు జెప్పిన ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అందఱును ఉత్కృష్టులే. జ్ఞానియో, నాయొక్క స్వరూపుడనియే నాయభిప్రాయము. ఏలయనగా, అజ్ఞానియగువాడు తన ఆత్మను నా స్వరూపముగా అనగా విష్ణుస్వరూపముగా భావించు చిత్తము గలవాడగుటచే నాస్వరూపు డగుచున్నాడు. అందువల్ల సర్వోత్తమ మయిన జనన మరణరహిత బ్రహ్మపదవిని పొందుచున్నాడు.

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

తా॥ ఓ అర్జునా! ఈదేహము క్షేత్రమనియు, ఈ క్షేత్రములో నుండుచు క్షేత్రధర్మములన్నిటిని నెఱుంగువాడు క్షేత్రజ్ఞుడు అనగా భగవత్స్వరూపుడు అని క్షేత్రక్షేత్రజ్ఞుల నెఱుంగువారు చెప్పెదరు. దేవాలయములోగల దేవుడు ఏలాగుననో, ఆలాగున జ్ఞానియగువాడు దేహమును దేవాలయమునుగాను, ఆత్మను దేవునిగాను తలంచుచున్నాడు. కర్మయోగ రహస్యమును ఈలాగుననే యుంటున్నది.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥

తా॥ నిష్కామ కర్మయోగి ఫలాభిలాషను వదలి కర్మలజేయుచు చిత్తశుద్ధిద్వారా ఆత్మనిష్ఠచేత గలిగిన జ్ఞానమువలన మోక్షము పొందుచున్నాడు: ఫలాభిలాషతో గర్మలజేయువాడు కోర్కెచేత ఫలాసక్తుడై కర్మచే బద్ధుడగుచున్నాడు. గీతాసారమంతయు ఈ యొక శ్లోకములోనే నిగూఢమైయున్నది.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥

తా॥ సర్వభూతాన్తరాత్ముడగు నన్ను ఎవడు ఏకాత్మజ్ఞానము గలవాడై, తన ఆత్మస్వరూపముగా భావనగలిగియుండునో, అట్టి జ్ఞాన యోగి ఎల్లప్పుడును పనులు జేయుచుండినను, చేయకపోయినను నాయం

దుంటున్నవాడే యగును. సామాన్య మనుష్యులకును, విశేషస్థితిలో నుండు ఆత్మజ్ఞానులకును ఇచ్చటనే భేదము గలుగుచున్నది. సామాన్య మనుష్యులను సామాన్యులనుగాను, విశేషస్థితిగల ఆత్మజ్ఞానులను భగవత్స్వరూపులనుగాను మనము చూచుటకు కారణ మిదియే.

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥

తా॥ పరమాత్మజ్ఞానముచేత జీవాత్మపరమాత్మలను భేదము లేక తానే పరమాత్మయనియు, పరమాత్మయే తాననియు, ప్రకృతివికారము లయిన సుఖదుఃఖాది మోహాదులతో గూడినది మాయయనియు ఎవడు తెలిసికొనుచున్నాడో, వాడు బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములలో దేని యందుయుండినగాని, లేక గృహవనాది ప్రదేశములలో యుండినగాని, లేక సర్వకర్మపరిత్యాగియై యుండినగాని, లేక ఫలాపేక్ష లేక విధ్యుక్త సర్వకర్మల జేయువాడుగాయుండినగాని, లేక ఈ దేహముగూడియుండి నను దేహము పోయినపిమ్మటను ముక్తుడే యగుచున్నాడు. "సర్వథా వర్తమానోఽపి" అని యున్నందుచే నిరంతరము ధ్యాననిష్ఠలో యున్న వాడైనను, లేక పరప్రాణులకు ఉపకార కార్యములు చేయువాడైనను, లేక ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలజేయువాడైనను ముక్తుడే అని గ్రహించవలయును.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥

తా॥ కర్మఫలమందలి ఆసక్తిని విడచి ఎప్పుడును తృప్తిజెందిన మనస్సుగలవాడు దేనిని యాశ్రయింపనివాడగుచు కర్మయందు ప్రవర్తించినవాడైనను, కొంచెమైనను ఏ కర్మయు జేయనివాడే యగుచున్నాడు. జీవన్ముక్తుడే. గీతయొక్క గంభీరార్థమంతయు దీనియందు నిమిడి యున్నది. మఱియు దీనియందు నిరూపించిన దగ్ధపరశు స్పర్శనవిషయము ప్రస్తుతజనులకు విశ్వాసము లేకపోయినను పూర్వకాలములో ఈలాటివి అనేకములు జరుగుచుండెను. దానిని తెలిసికొనిన ఎట్టి సందేహమునకు అవకాశము గలుగదు. ఆ విషయమై శ్రీమద్రామాయణమున సీతా

దేవియొక్క అగ్నిప్రవేశమును గురించి క్రింద వ్రాయబడు పద్యములను భగవద్భక్తితో సత్యబుద్ధితో చదువుడు.

ఉ॥ లక్ష్మణ చూచితే యనఘలక్షణలక్షితనైన నన్ను దు
ర్లక్ష్మచరిత్రబోలె వికలస్థితిగా భవదగ్రజుండు దా
సూక్ష్మనిశాతయయిన మతి జూడక ఘోరవచోమహాగరు
త్పత్క్మవతీక్షణాస్త్రముల పాల్పడజేయుచు నున్నవాడొగిన్॥

సీ॥ పరవృత్త చేష్టిత భావేంగితంబులు
సూచి తెలియు దీవు శుద్ధచరిత
యౌదార్య గంభీరతౌన్నత్యధైర్యాది
గుణముల నెంతయు గొమరు మిగిలి
యాగమ లౌకిక వ్యవహారములయందు
నరయ నీవెఱుగని యదియు గలదె
నను నీవు దగజిన్ననాటనుండియు జూచు
చుండుదు విట యెగ్గులున్నవయ్య
తే॥ యొగి మహీపతి యప్పటినుండి పలుకు
ననుచితంబులు మాన్పంగ ననువులేదె
పరుష దుశ్శ్రవ భీషణభాషణములు
నీవు దయమాలి యెటు విననేర్చితయ్య॥

క॥ మీరింత నమ్మకున్నను గారవ మేపార నన్ను గరుణించి మహో
దారంబగు సొదపెట్టుడు ధీరమతిం జొత్తునందు దిరమగుకడకన్॥

చ॥ కలగక జాతవేదసుముఖంబున నెంతయు శుద్ధురాలనై
నలువయు సూలియున్ హరియు నన్ను వెసం గొనియాడునట్లుగా
జొలవక మీకు మెచ్చుగతి జొచ్చెద జిచ్చు మదీయభర్తక
న్నెలవగునంత మీద శుభశీలత ధారుణి నాశ్రయించెదన్॥

మ॥ అనినం దల్లడమంది లక్ష్మణుడు దైన్యాయత్త చేతస్కుడై
తనలోనం దలపోసి ఖేదమొదవం ధాత్రీపతిం జూచి య
జ్జనపాలాగ్రణి సన్నచేసిన నుదంచద్వేగ మేపారనే
చినమంటల్ మొగి మిన్నుముట్టసొదపేర్చెన్ సీత మోదింపగాన్॥

తే॥ పరమపావని యగు సీత పరగ నేడు
చెలగి నాయందు జొచ్చుట జేసి మిగుల
ననఘశీలుండ నయ్యెదనని ముదంబు
బొందుకై వడి మిన్నంది పొదలె నగ్ని॥

వ॥ తదనంతరంబ.

క॥ తలవాంచియున్న భాస్కర కులపతికి బ్రదక్షిణించి గురుతరకీలా
కులమగు సొద జేరంగా సలలిత గతి నేగుదెంచి జానకి యంతన్॥

చ॥ వినయముతోడ మ్రొక్కి యరవిందనిభానన వేడ్క వీతిహో
త్రునకు ప్రదక్షిణంబు సనుదెంచి కృతాంజలియై త్రిలో
క పావన గత సర్వభావన నివారిత కల్మష సర్వనిర్జరా
నన సకల క్రియాధికరణ ప్రవణాభినివేశ పావకా॥

చ॥ స్థిరమతులార, యో సకలదిక్పతులార, సురేంద్రులార, కి
న్నరవరులార, సర్పకులనాయకులార, మునీంద్రులార, ఖే
చరవరులార, యక్షగణచారణ గుహ్యక సాధ్యులార, వి
స్ఫుర దినచంద్రులార, వరభూతములార యెఱింగి యుండుడా!॥

క। మీరందఱు దగు గురిగా గోరుచు నేనున్న దాన గురుహితమతి నా
చారిత్రం బేచందం బేరూపము దాని మీర లెఱుగుదు రఱియన్॥

వ॥ కావున వాఙ్మనఃకాయ కర్మబుద్ధీంద్రియ తదర్థంబులం జేసి,
నిమేష కాష్ఠా కలా క్షణ ముహూర్త యామ సంధ్యాహోరాత్ర పక్షమాస
అయన వత్సర పరిగణితంబులగు కాలంబులు సాక్షిగా స్వప్నాద్యవస్థల
యందును, జ్ఞానాజ్ఞానంబులయందును మద్వల్లభుండగు రఘునాథునకు
దప్పట లేదు.

క॥ చాయగతి నాదుచిత్తముపాయక రఘునాథునంద పరగున యేనిన్
న్యాయము దప్పక దహనుడు ధీయుక్తిన్ నన్ను గాచు ధృతి
యొడగూడన్॥

తే॥ దుష్టకల్మషబుద్ధినై దోషమునను
జనకులాధీశునకు దప్పి సచ్చరిత్ర

మెఱలి సడచుట గలిగిన నీక్షణంబు
చెలఁగి నను నగ్ని భస్మంబు సేయుగాత॥

మ॥ అనుచుఁ నిశ్చలచిత్తయై రఘుకులేంద్రాయత్తచింతావశం
బున తాత్పర్యముగలిగి నిర్మల లసద్బుద్ధిప్రసాదంబు పెం
పున నభ్రంకషకీలుఁడై కనలుచుఁ భూరిప్రభుండయిన య
య్యనలుం డుప్పతిలంగ జొచ్చె నిరపాయస్నేహరాగంబునఁ॥

ఆ॥ అనఘ మంత్రపూతమయిన యాజ్యాహుతి
పగిది ధరణిపుత్రి పడియెనంత,
దేజ మెసగ నగ్ని దేవుండు మిన్నంది
మహితశిఖలు గలిగి మండజొచ్చె॥

ఉ॥ లోలవిలాస ఖేలన విలోచన మీనము లాననాబ్జముఁ
లాలిత బాహువల్లరి మృణాలములుం బృథుకేశభార శై
వాలము నొప్ప సీత యనవద్య పవిత్ర చరిత్ర విస్ఫురచ్ఛేల
కృశానునందు సరసీగతి జూడగ నొప్పె నెంతయుఁ॥

వ॥ అప్పుడు పతివ్రతాశిరోమణి సీత దహనశిఖావృతయై యున్నం గనుంగొని, దానవాంగనలు శోకింప, నిశాచరులు దుఃఖింప, కపులు సమాక్రందనంబులు సేయ, సుగ్రీవుండు బెగ్గిల, విభీషణుండు పారవశ్యంబు నొంద, నంగదుండువిన్నదనంబు నెంద, హనుమంతుండు ఖేదింప, లక్ష్మణుం డొగలుం బొగుల, రాఘవుండవాఙ్ముఖుండై నిర్వేదింప, సురలను చితంబులన, సాధ్యులన్యాయంబన, యక్షులనుపేక్షణీయంబన, గంధర్వులద్భుతంబన, మహోరగంబులు తగదన, చరాచరంబులు దృశ్యాదృశ్యంబులు నగు భూతంబులు దల్లడిల్ల, మహాభూతంబు లాక్రోశింప, నకోలాహలంబు లొక్కపెట్టు నొదవిన.

సీ॥ ప్రమథులు సను దేర బాలేందుధరుఁడైన
మూడుకన్నుల వేల్పు మున్నుగాగ
జగముల సృజియింపజాలి యాద్యుండైన
చతురాస్యుడగు పద్మసంభవుండు

గమనీయ వికసిత కమలపత్రములన
వేయి కన్నులు గల వేల్పుతేడు
వహ్ని కాలాసుర వరుణానిల శ్రీద
శూలహస్తులు గూడి సుకుచిరముగ

ఆ॥ గరుడసిద్ధసాధ్యగంధర్వఖేచర యక్షపక్షినాగ యాతుధాను
లాదిగాగ పుష్పకారూఢులై రాము ధీరుజూడ నేగుదెంచిరెలమి॥

క॥ అత్యాదరమున రాముడు ప్రత్యుత్థానంబుసేసి భక్తి యెసగ స
న్నత్యాదివిధులొనర్చెం బ్రీత్యుత్కర్షాతిరేక బృంహితతనుడై॥

అగ్నిప్రవేశకాలమందు సీతాదేవి చెప్పినట్టి ఆవాక్యము లేవియో, ప్రతిజిజ్ఞాసువు సదా స్మరణలో యుంచవలయును. అగ్నిదేవు నీలాగున ప్రార్థించిరి: ఓ పావకమూర్తీ! మనోవాక్కాయ కర్మలలో శ్రీరామచంద్ర ప్రభువునుతప్ప మఱే యే పరపురుషునినైనను తలంచియుండినచో నన్ను భస్మ మొనర్చుము. అట్లుగానిచో నన్ను రక్షింపుమా! అని చెప్పియే మిన్నంటి వెలుగుచున్న యగ్నియందు దుమికెను. మఱియు పంచభూత ములను సూర్యచంద్రాదులనుగూడ ఆలాగుననే ప్రార్థించెను. పృథివ్య ప్తేజో వాయురాకాశములారా! అష్టదిక్పాలకులారా! నా చరిత్రమును మీరందఱు సదా యెఱింగియే యున్నారు. ఈలాగున మహాజనసభా మధ్యమున ఉద్ఘాటించి ధైర్యముయొక్క మహాబలిమిచే అగ్నిలో ప్రవే శింపవలసియుండిన ఎంత సత్యముండవలయునో మీరే యోచించు కొనుడు. కావున జనులారా! ముముక్షువులారా! మీకేదైనా ఆపత్తు వచ్చినప్పుడు మీరనుష్ఠించిన ధర్మముగాని, అధర్మముగాని అదియే జ్ఞాపకమునకు వచ్చును. ఏదైనా అణుమాత్రము లోపముండిన అది హృదయాంతరాళమును కలవరపెట్టుచు 'మనమేమి చేయగలము? ఈ కష్టమెటుల నివృత్తియగును? మనము పలాని పలాని దుష్కార్యము లొనరించినవారముగాదా! ఇప్పుడీశ్వరుడుమాత్ర మేమిచేయగల్గును? దానిఫలము యిప్పుడనుభవించవలసివచ్చినది. మన ప్రారబ్ధకర్మమీలా గున పరిణమించినది' అని వ్యాకులహృదయము గల్గి దుఃఖబాష్పములచే నేత్రపూరితమై యుండి పరితపింపవలసి వచ్చునేమోగాని, మఱే ఉపాయ

మేమియు తోచదు. కట్టకడకు మరణకాలమందుగూడ ఇట్టిభావమే గలుగును. దేహావసానసమయమున యేయే భావము గలిగియుండునో, అట్టి జీవి దాని కనుగుణఫలమునే పరలోకమున పొందవలసివచ్చును. కావున భావశుద్ధి గలుగనిచో అంత్యకాలమున గలిగెడు అపాయ మిట్టిదని ముందుగానే తెలిసికొని జాగ్రత్తపడుట మంచిది. ఆలాగున శుద్ధాత్ములైయుండిన యేదైనా కష్టములు వచ్చునప్పుడుగాని, లేక మరణకాలమందుగాని శ్రీసీతాదేవికి గలిగినటుల మనోధైర్యమున్ను నిర్మలభావమున్ను, దృఢబుద్ధియున్ను, సత్యధర్మములపై విశ్వాసమున్ను గల్గును. అట్టివారికి ఎంత ఆపత్తువచ్చినను, లేక దేహవియోగ మాసన్నమయినప్పుడుగాని మనకేలాటి సంకటము గలుగదు. మనమేలాటి పాపకార్యముల మనోవాక్కాయ కర్మలచే చేసియుండలేదు. అదంతయు సర్వేశ్వరునికి తెలియును. అతడు చరాచరప్రాణికోట్లలో, మణులలోపల సూత్రము వ్యాపించునటుల యుండువాడు. సత్యమునకును, ధర్మమునకును విజయమే గలుగును. వేదములును, మహర్షులును చెప్పినది నిజమయినచో మనకు మంగళమే గలుగును. మోక్షవిషయములో తనకేలాటి కొఱతయు గలుగదని భావన అంత్యకాలమున గలుగుటకును ఈ ధర్మానుష్ఠానమే కారణమగును. గీతలో శ్రీకృష్ణభగవానుడును ఈలాగుననే చెప్పెను:

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః॥

దీని యర్థము పైజెప్పినదే.

మఱియు మహాభక్తవిజయము నందు శ్రీ మీరాబాయిగారిని గురించిన గాథ యీలాటి దొకటిగలదు. మీరాబాయి పరమాత్మయందు లగ్నముచేసిన చిత్తముగలవారై వివాహ మక్కరలేదని తల్లిదండ్రులతో నెంతచెప్పినను వారంగీకరింపక ఇట్టి స్త్రీ తనకుటుంబములో యుండుటకన్న చచ్చిపోవుట మంచిదని తలంచి ఘోరవిషకరమగు పాషాణమును పాలలోకలిపి యివ్వగా సంతోషమున అమృతప్రాయముగా త్రాగినవెంటనే మీరాబాయి నిత్యము పూజజేసెడు బంగారపు శ్రీకృష్ణవిగ్రహము నల్లగా మారిపోయెను. మీరాబాయి కేలాటి యపాయము గలుగలేదు. ఇది కలియుగములో జరిగిన గాథగాని కృత

త్రేతాది యుగములలో జరిగినదికాదు. ఈలాటికథలు ఈ కలియుగమున గూడ జరుగుచున్నవి. ధర్మరాజు ఉత్సవమందు యిప్పుడుగూడ అనేకులు అగ్నిగుండమున నడచెదరు. వారికి కాళ్లు కాలుటగాని మఱియేలాటి అపాయము గలుగుటగాని లేదు. ఇంతియేగాదు; వ్రతనిష్ఠగల స్త్రీలు శిరస్సుయందు అచ్చటయుండు పూజారిని ప్పాగుండములోని అగ్నికణములను శిరస్సున పోయుదురు. ఏమియు కాలుట లేదు. మఱియు ధగధగాయమానముగా యుండు నిప్పులను పట్టుకోకలో కట్టుదురు; కాలుట లేదు. సత్యముయొక్క ప్రభావము ఈకాలములో గూడ కనపడుచున్నది. మఱియు లంబాడివారిలో (సుగాలివారిలో) యిప్పుడుగూడ ఒకధర్మము గలదు. అదేమనగా వారి స్త్రీలలో యేదైన శీలదోషము గలిగియున్నదని సందేహము గలిగినచో బాగుగా కాలుచున్న నూనెయందు కాల్చబడిన వడలను (గారెలను) చేతినిముంచి ఎత్తించెదరు. ఆ నారీమణులు వారి కులదేవతలను బాగుగా ధ్యానించి నిస్సంశయముగా గారెలను తీయుదురు. సత్యముండిన కాలదు. లేనిచో చెయ్యికాలును. ఆ నారీరత్నములు ఒకరోజు ఉపవాసవ్రతముండి వారి కులదైవమును బాగుగా ధ్యానించి అట్టి కార్యమును చేయుదురు. ఆలాగున ధర్మరాజు ఉత్సవాలలో నిప్పుగుండము త్రొక్కువారిలో మాలిన్యముండిన వారిపాదములు దహించును. లేనివారికి ఏ కీడున్ను మూడదు. కావున సత్యము త్రికాలాబాధ్యము. సత్యాత్ములే ఈ రహస్యము నెఱుంగగలరు. కఠోపనిషత్తున చెప్పినది చూడుడు :

మూ॥ భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః।
భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః॥

తా॥ ఓ నచికేతుడా! ఆ పరమేశ్వరునియొక్క భయమునుండియే అగ్ని ఆయా పదార్థముల దహించుచున్నాడు. సూర్యుడు తపించుచున్నాడు. ఇంద్రుడు దేవలోకమును పరిపాలించుచున్నాడు. వాయువు వీచుచున్నాడు. మృత్యువు శరీరధారులను వారివారి కాల నియత్యనుసారము యమలోకమును పొందించుచున్నాడు. సమస్తమైయున్న లోకపాలకులు తమకు ప్రభువైనవాడొకడు దండహస్తుడై యుండుటచేతనే తమకుతమకు విహితకృత్యములను సేవకులవలె భయపడి నియతముగా

నిర్వహించుచున్నారు. లేనియెడల జగత్ప్రవృత్తి నియతముగా యుండ జాలదని భావము. అనగా భూమి, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు మొదలుగాగల నవగ్రహములు సర్వమున్ను ఈసత్యముపై ఆధారపడి నిలుచుచున్నవి. వానివాని కార్యములు ఒకక్షణకాలమయినను తప్పక జరుగుచున్నవి.

---

ఓమ్

# బృ హ దా ర ణ్య కో ప ని ష త్

## పంచమోఽధ్యాయః — సప్తమం బ్రాహ్మణం

### ఉద్దాలక, యాజ్ఞవల్క్యుల సంవాదము

ఉ॥ అథ హైనముద్దాలక ఆరుణిః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ। మద్రేష్వవసామ పతఞ్జలస్య కాప్యస్య గృహేషు యజ్ఞమధీ యానా స్తస్యాసీద్భార్యా గన్ధర్వగృహీతా తమపృచ్ఛామ కోఽసీతి సోఽబ్రవీత్ । కబన్ధ ఆథర్వణ ఇతి సోఽబ్రవీత్పతఞ్జలం కాప్యం యాజ్ఞికాగ్ శ్చ వేత్థనుత్వం కాప్య! తత్సూత్రం యేనాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సన్దృబ్ధాని భవన్తీతి సోఽబ్రవీత్పతఞ్జలః కాప్యో నాహం తం భగవన్వేదేతి । సోఽబ్రవీత్పతఞ్జలం కాప్యం యాజ్ఞికాగ్ శ్చ వేత్థనుత్వం కాప్య తమన్తర్యామిణం య ఇమం చ లోకం పరం చ లోకగ్ సర్వాణి చ భూతాని యోఽన్తరో యమయతీతి సోఽబ్రవీత్పతఞ్జలః కాప్యో నాహం తం భగవన్వేదేతి । సోఽబ్రవీత్పతఞ్జలం కాప్యం యాజ్ఞికాగ్ శ్చ యో వై తత్కాప్య సూత్రం విద్యాత్తం చాన్తర్యామిణమితి స బ్రహ్మవిత్, స లోకవిత్, స దేవవిత్, స వేదవిత్, స భూతవిత్, స ఆత్మవిత్, స సర్వవిదితి, తేభ్యోఽబ్రవీత్తదహం వేద, తచ్చేత్త్వం యాజ్ఞవల్క్యసూత్రమవిద్వాగ్ స్తం చాన్తర్యామిణం బ్రహ్మగవీరుదజసే మూర్ధా తే విపతిష్యతీతి, వేద వా అహం గౌతమ తత్సూత్రం తం చాన్తర్యామిణమితి, యో వా ఇదం కశ్చిద్బ్రూయాత్, వేదవేదేతి, యథా వేత్థ తథా బ్రూహీతి॥

తా॥ గార్గి యనునది వేరొక ప్రశ్నను చేయకుండ నూరకున్న తర్వాత అరుణపుత్రుడగు ఉద్దాలకు డనువాడు ఈ యాజ్ఞవల్క్యుని, ఓ యాజ్ఞవల్క్యుడా! మేము మద్రదేశములయందు కపిగోత్రోత్పన్ను డయిన పతంజలుడనువాని గృహమునందు యజ్ఞ శాస్త్రాధ్యయనమును చేయుచున్నవారమై నివసించియుంటిమి. అప్పుడా పతంజలునియొక్క భార్య గంధర్వగ్రహావిష్టయై యుండెను. ఆ గన్ధర్వుని మేము నీ వెవరని అడిగితిమి. అంతట గన్ధర్వుడు అధర్వుని పుత్రుడనగు కబన్ధుడనువాడను; అనిచెప్పి కపిగోత్రోత్పన్నుడయిన ఆ పతంజలుని గూర్చియు, యజ్ఞ శాస్త్రాధ్యయనమును చేయుచున్న మమ్మును గూర్చియు పలికెను. ఏ సూత్రముచేత ఈ జన్మమున్ను, పరజన్మమున్ను, బ్రహ్మాది స్తంబ పర్యన్తముండెడి సమస్త భూతములున్ను దారముతో పుష్పమాలికలు వలెనె కూర్చబడియున్నవో ఆ సూత్రములను ఓ పతంజలుడా! నీవు తెలిసికొంటివా యని పలికెను. అనన్తరమా పతంజలుడు, పూజ్యుడవగు ఓ గన్ధర్వుడా! ఆ సూత్రమును నేను తెలిసికొనలేదని పలికెను. తిరిగి ఆ గంధర్వుడు, ఓ పతంజలుడా! నీవు ఈ జన్మ పరజన్మములను, బ్రహ్మాది స్తంబపర్యన్తముండెడి సమస్త భూతములను, అభ్యన్తరుడై నియమించు నట్టి అంతర్యామి స్వరూపమును తెలిసికొంటివా యని అడుగగా, ఓ పూజ్యుడవగు గంధర్వుడా! నేను ఆ అంతర్యామిస్వరూపమును తెలిసి కొనలేదని పతంజలుడు చెప్పెను. తిరిగి ఆ గంధర్వుడు, కామ్యుడవగు ఓ పతంజలుడా! ఏ జనుడైతే ఆ సూత్రస్వరూపమును, అంతర్యామియగు పరమాత్మస్వరూపమును తెలిసికొనుచున్నాడో వాడే పరమాత్మను, భూరాదిలోకములను, అగ్ని మొదలగు దేవతలను, సమస్త ప్రమాణ భూతములయిన వేదములను, బ్రహ్మాది స్తంబపర్యన్తముండెడి సమస్త భూతములను, అన్తర్యామిచే నియమింపబడినదియును, తన్నృత్వ భోక్తృ త్వములతో గూడుకొనినదియునగు ఆత్మస్వరూపమును, సమస్తమును తెలిసికొనినవాడగుచున్నాడని గంధర్వుడు సూత్రాన్తర్యామి విజ్ఞాన మును ఇట్లు స్తుతించగా కామ్యుడగు పతంజలుడును, యజ్ఞశాస్త్రాధ్య యనమును చేయుచున్న మేమును, ఆ సూత్రాన్తర్యామి విజ్ఞానమును కోరువారమై ఆ గంధర్వున కభిముఖులమై ప్రార్థించితిమి. అప్పుడా

గన్ధర్వుడు ఆ సూత్రాన్తర్యామి విజ్ఞానమును మాకొరకు చెప్పెను. కనుక ఆ సూత్రాన్తర్యామి విజ్ఞానమును నేను గుర్తెఱుగుదును. ఓ యాజ్ఞవల్క్యుడా! ఆ సూత్రమునున్ను, ఆ అన్తర్యామినిన్ని తెలియనివాడవై బ్రహ్మవేత్తలయొక్క ధనమైన ఈ గోవులను తోలించుకొని పోయిన యెడల నీ శిరస్సు విస్పష్టముగా పడిపోవునని అరుణపుత్రుడగు ఉద్దాలకుడనగా యాజ్ఞవల్క్యుడు, గౌతమగోత్రోత్పన్నుడవయిన ఓ యుద్దాలకుడా! నాకు సూత్రాన్తర్యామి స్వరూపములు తెలియునని పలుకగా గౌతముడు ఓ యాజ్ఞవల్క్యుడా! ప్రాకృతుడగు యే జనుడయినను ఆ సూత్రాన్తర్యామి స్వరూపములను తెలిసికొనియున్నానని పలుకునా? అట్లు పలికినంతమాత్రముతో నేమియు ప్రయోజనములేదు కనుక యెట్లు తెలిసికొంటివో ఆ ప్రకారమును చెప్పుమా యని అడిగెను.

ఉ॥ స హోవాచ వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ! సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సన్దృబ్ధాని భవన్తి తస్మాద్వై గౌతమ! పురుషః ప్రేతమాహుః వ్యస్రగ్ సిషతాస్యాఙ్గానీతి వాయునా హి గౌతమ! సూత్రేణ సన్దృబ్ధా భవన్తీత్యేవమేవైతత్ యాజ్ఞవల్క్యాన్తర్యామిణం బ్రూహీతి॥

తా॥ యాజ్ఞవల్క్యుడు, గౌతముడా! ఆ సూత్రస్వరూపము వాయువే. ఆ సూత్రస్వరూపమయిన వాయువుచేతనే ఈజన్మమును, పరజన్మమును, బ్రహ్మాదిస్తంబపర్యన్తముండెడి సమస్తభూతములును, దారముతో పుష్పమాలికవలెనే కూర్చబడియున్నవి. కనుక ఈవాయువువిడిచి పోయినప్పుడు ఇవియన్నియు దారము తెగినప్పుడు పుష్పములువలెనే విడి శిథిలమగుచున్నవి. అందువల్లనే వాయువు విడిచిపోయినప్పుడు పురుషుని చనిపోయినాడని చెప్పుచున్నారు. ఈ పురుషుని అవయవములన్నియు శిథిలములై పోవుచున్నవి. కనుకనే ఓ గౌతముడా! సూత్రస్వరూపమయిన వాయువుచేతనే అన్నియు కూర్చబడియున్నవి అని యాజ్ఞవల్క్యుడు చెప్పగా, గౌతముడు, ఓ యాజ్ఞవల్క్యుడా! నీచేత సూత్రస్వరూపము బాగుగా జెప్పబడినది. ఇప్పుడా సూత్రాన్తర్గతమైనవాడును, ఆసూత్రమునకు నియామకుడునగుఅన్తర్యామిస్వరూపమునుచెప్పుమా యనిపలికెను.

ఉ॥ యస్సర్వేషు భూతేషు తిష్ఠన్సర్వేభ్యో భూతేభ్యోఽన్తరో యగ్ం సర్వాణి భూతాని న విదుర్యస్య సర్వాణి భూతాని శరీరం యస్సర్వాణి భూతాన్యన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృత ఇత్యధిభూతమథాధ్యాత్మమ్॥

తా॥ ఓ గౌతముడా! అధిభూతములగు బ్రహ్మ మొదలు గడ్డిపోచ వరకుండెడి సమస్త జీవకోట్లయందుండి వాటినన్నిటిని నియమించుచు వాటిచే దెలిసికొనబడక విలక్షణమై సర్వాన్తరమగు నాశరహితమైన అన్తర్యామిస్వరూపమే నీ యాత్మయని చెప్పి యాజ్ఞవల్క్యుడు అధ్యాత్మమునం దన్తర్యామిస్వరూపమును చెప్పుచున్నాడు.

ఉ॥ యః ప్రాణే తిష్ఠన్ప్రాణాదన్తరో యం ప్రాణో న వేద, యస్య ప్రాణశ్శరీరం యః ప్రాణమన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥

టీ॥ యః = ఏది, ప్రాణే = ప్రాణమునందు, తిష్ఠన్ = ఉన్నదై, ప్రాణాత్ = ప్రాణముకంటె, అన్తరః = లోపల నుండునది, (భవతి = అగుచున్నదో) ప్రాణః = ప్రాణము, యం = దేనిని, న వేద = తెలిసికొన లేదో, ప్రాణః = ప్రాణము, యస్య = దేనికి, శరీరం = దేహముగా, యః = ఏది, ప్రాణం = ప్రాణమును, అన్తరః = లోపల నున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశము లేని, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది.)

తా॥ ప్రాణము దేనిని తెలిసికొనజాలదో, ప్రాణము దేనికి శరీరముగా నుండుచున్నదో, అట్టి ప్రాణమునందే ఉండుచున్నదై ప్రాణమునకును అన్తరమై ప్రాణమును నియమించుచున్నదో ఇదియే నీయొక్క నాశనము లేని అన్తర్యామిస్వరూపమగు ఆత్మ యగుచున్నది.

ఉ॥ యో వాచి తిష్ఠన్వాచోఽన్తరో యం వాఙ్న వేద యస్య వాక్శరీరం, యో వాచమన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥

టీ॥ యః = ఏది, వాచి = వాక్కునందు, తిష్ఠన్ = ఉన్నదై, వాచః = వాక్కుకంటె, అన్తరః = లోపల నుండునది, (భవతి = అగు

చున్నదో) వాక్ = వాక్కు, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, వాక్ = వాక్కు, శరీరం = దేహమో, యః = ఏది, వాచం = వాక్కును, అన్తరః = లోపల నున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశములేని, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది.)

తా॥ వాక్కు దేనిని తెలిసికొనజాలదో, వాక్కు దేనికి శరీరముగా నున్నదో, అట్టి వాక్కునందే ఉంటున్నదై వాక్కునకును అన్తరమై వాక్కును నియమించుచున్నదో ఇదియే నాశములేని అన్తర్యామి స్వరూపమగు నీయాత్మ యగుచున్నది.

ఉ॥ యశ్చక్షుషి తిష్ఠగ్‌శ్చక్షుషోఽన్తరో యం చక్షుర్న వేద యస్య చక్షుశ్శరీరం యశ్చక్షురన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥

టీ॥ యః = ఏది, చక్షుషి = నేత్రమునందు, తిష్ఠన్ = ఉన్నదై, చక్షుషః = నేత్రముకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో) చక్షుః = నేత్రము, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో యస్య = దేనికి, చక్షుః = నేత్రము, శరీరం = దేహమో, యః = ఏది, చక్షుః = నేత్రమును, అన్తరః = లోపల నున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశములేని, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది.)

తా॥ నేత్రము దేనిని తెలిసికొనజాలదో, నేత్రము దేనియొక్క శరీరముగానున్నదో, అట్టి నేత్రమునందుంటున్నదై నేత్రమునకును అన్తరమై నేత్రమును నియమించుచున్నదో ఇదియే నాశములేని అన్తర్యామి స్వరూపమగు నీ యాత్మ యగుచున్నది.

ఉ॥ యశ్శ్రోత్రే తిష్ఠన్ శ్రోత్రాదన్తరో యగ్ శ్రోత్రం న వేద యస్య శ్రోత్రగ్ శరీరం యశ్శ్రోత్రమన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥

టీ॥ యః = ఏది, శ్రోత్రే = చెవియందు, తిష్ఠన్ = ఉన్నదై, శ్రోత్రాత్ = చెవికంటె, అన్తరః = అభ్యన్తరమైనది, (భవతి = అగు చున్నదో,) శ్రోత్రం = చెవి, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, శ్రోత్రం = చెవి, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, శ్రోత్రం = చెవిని, అన్తరః = అభ్యన్తరమైనదై, యమయతి = నియ మించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశము లేని, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ.

తా॥ చెవి దేనిని తెలిసికొనజాలదో, చెవి దేనికి శరీరముగా నున్నదో, అట్టి చెవియందున్నదై చెవికిని అన్తరమై చెవిని నియమించు చున్నదో, ఇదియే నీయొక్క నాశములేని అన్తర్యామి స్వరూపమగు ఆత్మయగుచున్నది.

ఉ॥ యో మనసి తిష్ఠన్మనసోఽన్తరో యం మనో న వేద యస్య మనశ్శరీరం యో మనోఽన్తరో, యమయత్యేష త ఆత్మాఽన్తర్యా మ్యమృతః॥

టీ॥ యః = ఏది, మనసి = మనస్సునందు, తిష్ఠన్ = ఉన్నదై, మనసః = మనస్సుకంటె, అన్తరః = లోపలనున్నదో, మనః = మనస్సు, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, మనః = మనస్సు, యస్య = దేనికి. శరీరం = దేహమో, యః=ఏది, మనః = మనస్సును, అన్తరః = లోపల నున్నదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది; తే = నీయొక్క, అమృతః = నాశములేని, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమయిన, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది.)

తా॥ మనస్సు దేనిని తెలిసికొనజాలదో, మనస్సు దేనికి శరీర మగుచున్నదో, అట్టి మనస్సునందున్నదై మనస్సుకును అన్తరమై మనస్సును నియమించుచున్నదో ఇదియే నాశములేని అన్తర్యామి స్వరూపమగు నీయాత్మ యగుచున్నది.

ఉ॥ యస్త్వచి తిష్ఠన్ స్త్వచోఽన్తరో యం త్వఙ్న వేద యస్య త్వక్శరీరం యస్త్వచమన్తరో, యమయత్యేష త ఆత్మాఽన్తర్యా మ్యమృతః॥

టీ॥ యః = ఏది, త్వచి = చర్మమునందు, తిష్ఠన్ = ఉన్నదై, త్వచః = చర్మమునకంటె, అన్తరః = లోపల నుంటున్నదో, త్వక్ = చర్మము, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, యస్య = దేనికి, త్వక్ = చర్మమును, శరీరం = దేహమో, యః = ఏది, అన్తరః = లోపల నున్నదై, త్వచం = చర్మమును, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశములేని, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ (అగుచున్నది.)

తా॥ చర్మము దేనిని తెలిసికొనజాలదో, చర్మము దేనికి శరీరమో అట్టి చర్మమునందున్నదై చర్మమునకును అన్తరమై చర్మమును నియమించుచున్నదో ఇదియే నీయొక్క నాశరహితమగు అన్తర్యామి యగు ఆత్మ యగుచున్నట.

ఉ॥ యో విజ్ఞానే తిష్ఠన్విజ్ఞానాదన్తరో యం విజ్ఞానం న వేద యస్య విజ్ఞానగ్ శరీరం యో విజ్ఞానమన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥

టీ॥ యః = ఏది, విజ్ఞానే = బుద్ధియందు, తిష్ఠన్ = ఉన్నదై, విజ్ఞానాత్ = బుద్ధికంటె, అన్తరః = లోపల నుండునది, (భవతి = అగుచున్నదో) విజ్ఞానం = బుద్ధి, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, విజ్ఞానం = బుద్ధి, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, విజ్ఞానం = బుద్ధిని, అన్తరః = లోపలనుండునదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశములేని, అన్తర్యామీ = అన్తర్యామిస్వరూపమయిన, ఆత్మా = ఆత్మ.

తా॥ బుద్ధి దేనిని తెలిసికొనజాలదో, బుద్ధి దేనికి శరీరముగా నున్నదో, అట్టి విజ్ఞానాత్మకబుద్ధియందున్నదై బుద్ధికిని అన్తరమై బుద్ధిని నియమించుచున్నదో, ఇదియే నాశములేని అమృతస్వరూపమయిన అన్తర్యామియగు నీయొక్క ఆత్మస్వరూపమని ఓ గౌతముడా! తెలియుమా!

ఉ॥ యో రేతసి తిష్ఠన్రేతసోఽన్తరో యగ్ రేతో న వేద యస్య రేతశ్శరీరం యో రేతోఽన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యా

మ్యమృతోఽదృష్టో ద్రష్టాఽశ్రుతః శ్రోతాఽమతో మన్తాఽవిజ్ఞాతో విజ్ఞాతా నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి శ్రోతా నాన్యోఽతోఽస్తి మన్తా నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా ఏష త ఆత్మాఽన్తర్యామ్యమృతోఽతోఽన్యదార్తం తతో హోద్దాలక ఆరుణిరుపరరామ॥

ఇతి బృహదారణ్యకే పఞ్చమాధ్యాయే సప్తమం బ్రాహ్మణమ్.

టీ॥ యః = ఏది, రేతసి = రేతస్సునందు, (ప్రజననమందు = ఉత్పత్తియందు) తిష్ఠన్ = ఉన్నదై, రేతసః = రేతస్సుకంటె, అన్తరః = లోపలనుండునది, (భవతి = అగుచున్నదో) రేతః = రేతస్సు, యం = దేనిని, న వేద = తెలిసికొనలేదో, రేతః = రేతస్సు, యస్య = దేనికి, శరీరం = దేహమో, యః = ఏది, రేతః = రేతస్సును, అన్తరః = లోపల నుండునదై, యమయతి = నియమించుచున్నదో, ఏషః = ఇది, తే = నీయొక్క, అమృతః = నాశము లేని, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమగు, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది) సః = ఆ అన్తర్యామిస్వరూపమగు ఆత్మ, అదృష్టః = నేత్రముచే చూడబడనిదై, ద్రష్టా = చూచునదియు, అశ్రుతః = చెవిచే వినబడనిదియై, శ్రోతా = వినునదియును, అమతః = మనస్సంకల్పమునకు గోచరముగానిదై, మన్తా = సంకల్పించునదియును. అవిజ్ఞాతః = నిశ్చయమునకు విషయముకానిదై, విజ్ఞాతా = నిశ్చయించునదియును, అతః = యీ అన్తర్యామి స్వరూపముకంటె, అన్యః = వేరైన, ద్రష్టా = చూచునది, నాస్తి = లేదు, అతః = యీ అన్తర్యామి స్వరూపముకంటె, అన్యః = వేరైన, శ్రోతా = వినునది, నాస్తి = లేదు, అతః = ఈ అన్తర్యామికంటె, అన్యః = వేరైన, మన్తా = సంకల్పించునది, నాస్తి = లేదు, అతః = ఈ అన్తర్యామికంటె, అన్యః = వేరైన, విజ్ఞాతా = తెలిసికొనునది, నాస్తి = లేదు, అమృతః = నాశనములేని, ఏషః = ఇది, తే = నీయొక్క, అన్తర్యామీ = అన్తర్యామి స్వరూపమయిన, ఆత్మా = ఆత్మ, (భవతి = అగుచున్నది) అతః = ఈ పరమాత్మయగు అన్తర్యామి స్వరూపముకంటె, అన్యత్ = ఇతరమైనది, ఆర్తం = నశించునది, తతః హ = అందువలన, ఆరుణిః = అరుణపుత్రుడగు, ఉద్దాలకః = ఉద్దాలకుడు, ఉపరరామ = వేఱుప్రశ్నను చేయక యూరకుండెను.

తా॥ ఓ ఉద్దాలకుడా ! అధ్యాత్మస్వరూపములగు ప్రాణవాక్చక్షుస్సులు మొదలయినవాటియందున్నదై వానిచేత తెలిసికొనబడక అవియే దేహముగాగలిగి వాటివాటిని నియమించుచు నాశనరహితమయిన అన్తర్యామిస్వరూపమగు నాత్మ చూపునకును, వినికికిని, తలంపునకును, బుద్ధిజ్ఞానమునకును గోచరముకానిదై ఆ చక్షురాదీన్ద్రియములకు సమీపమయినదగుటవలనచూచునదియును, వినునదియును, తలంచునదియును, తెలిసికొనునదియు నగుచున్నది. ఇట్లు సమస్తమునకు ద్రష్టయై దేనిచేత నున్ను చూడబడక, అటులనే శ్రోతయై వినబడక, మన్తయై సంకల్పింపబడక, విజ్ఞాతయై నిశ్చయింపబడక, సర్వాన్తరమై అన్తర్యామిస్వరూపమునగు పరమాత్మకంటె అన్యమగు ద్రష్టయును, శ్రోతయును, మన్తయును, విజ్ఞాతయును ఏ కారణమువలన లేదో ఆ కారణమువలన నాశరహితమును సమస్తమై సంసారులయొక్క కర్మఫలములను విభజించునట్టిదియును సమస్త సంసారధర్మము లేనిదియునగు ఈ ఆత్మ ఏదియో ఇదేనీయొక్క నాశరహితమగు అన్తర్యామిస్వరూపము. ఇట్టి అన్తర్యామిస్వరూపమగు పరమాత్మకంటె వేరైనదంతయు నశించునదియె అని యాజ్ఞవల్క్యుడు తానుచేసిన ప్రశ్నమును నిరూపించి చెప్పుటవలన అరుణపుత్రుడగు ఉద్దాలకుడు వేఱుప్రశ్నమును చేయకయుండెను.

ఓమ్

## ని రా హా ర ము

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥
(గీ॥ అ. 2 శ్లో॥ 59)

ఈశ్లోకము గొప్పదగు భావముతో గూడినది. విరక్తులయినవారు ఈశ్లోకార్థమును చాలలోతుగా దిగి యాలోచించుకొనవలసియుండును. ఏలయనగా నిరాహారము – భోజనము లేకుండయుండుట చాలా గొప్పదగు స్థితియని చాలామంది తలంతురు. అట్టి సందేహము నీశ్లోకము నివృత్తిచేయుచున్నది. అయితే మితిమీరి తిని శరీరమును బలిష్ఠముగా జేయవలయునని యర్థముగాదు. నిరాహారియై ఆత్మచిన్తనముజేయుటకు

కూడా శక్తిరహితుడై యుండకూడదని గ్రహించుకొనవలయును. దీని యొక్క సామాన్యార్థమిది.

తా॥ ఆహారము లేనటువంటి వానికిని ఇన్ద్రియములు విషయములనుండి నివృత్తిపొందుచున్నవి. అయినను విషయములలోగల యాసక్తిమాత్రము నివర్తించుటలేదు. అట్టి యాసక్తియు బ్రహ్మదర్శనమయినపిమ్మట నివృత్తమగుచున్నది.

విశేషార్థము॥ రోగగ్రస్తునికిని ఇన్ద్రియాదివిషయములు నివృత్తములగుచున్నవి. కాని యిన్ద్రియముల సుఖేచ్ఛమాత్రము నివర్తించుటలేదు. మరల ఆరోగ్యము గలుగునప్పుడు మామూలు మనుష్యునివలె విషయసుఖముల ననుభవించుచున్నాడు. కావున తీవ్రతపస్సుచే నిరాహారత్వము గలుగజేసికొనినచో మోక్షము గలుగదు. ఒకవేళ యావర్తమాన శరీరపతనపర్యన్తము నిరాహారుడై యుండినను పునర్జన్మము వచ్చినప్పుడు మరల విషయములలో ప్రవృత్తిగలుగును. కాబట్టి విషయవాసనలు నశించి అన్తఃకరణము శుద్ధమయినప్పుడు బ్రహ్మజ్ఞానము గలుగును. అట్టి జ్ఞానముగలుగునప్పుడే జన్మరాహిత్యమగు మోక్షము సిద్ధించును. కావుననే "పరం దృష్ట్వా నివర్తతే" అను ప్రయోగమునకు కారణము. సకాలమున వర్షములేక వర్షాభావముచే సస్యములు (పైరు) శుష్కించి మాడి పడిపోయినను వానకురిసినవెంటనే లేచి మామూలు పైరువలె నెటులుండునో, నిరాహారముచే నిన్ద్రియముల శుష్కింపజేసిన వానియొక్క గతియు నట్టిదేయగును. ఆహారశబ్దమునకు నోటితో భుజించుట యనునొక అర్థముమాత్రముగాదు. అది జిహ్వేన్ద్రియ మొక దాని వృత్తిమాత్రమగును. దశేన్ద్రియములలో జిహ్వేంద్రియ మొకటి మాత్రముగాదు. మరల తొమ్మిదిన్ద్రియములుగలవు. జిహ్వేన్ద్రియ రసవర్జమువలె తక్కిన శ్రోత్రాదీన్ద్రియముల విషయములుగూడ నివృత్తములగునప్పుడు మాత్రమే నిరాహారత్వమున్ను, జితేన్ద్రియత్వమున్ను గలుగును. ఆ ఇన్ద్రియములపేర్లు వాక్పాణిపాదపాయూపస్థలు అయిదును కర్మేన్ద్రియములు, శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణములు అయిదును జ్ఞానేన్ద్రియములు. వీనివిషయములుగూడ తొలంగునప్పుడే నిజమయిన నిరాహారుడగును. వీని విషయములు (1) వచన, (2) దానాదాన,

(3) గమన, (4) విసర్జన, (5) ఆనన్దములు. 1. శబ్ద, 2. స్పర్శ, 3. రూప, 4. రస, 5. గంధములు.

ఇవి పై జెప్పబడినట్టి యిన్ద్రియముల భోగములు అనగా ఆహారములో భాష్యకారుల యాశయమును జూడుడు. "ఆహ్రియన్తే విషయా య్యైస్తే ఆహారా ఇన్ద్రియాణి నియమార్థం తేభ్యో నిర్గతః య సనిరాహార ఇంద్రియనిగ్రహవాన్ తాపసః" విషయముల గ్రహించునవేవియో అవి ఆహారములనబడును. వానినుండి నివృత్తిపొందినవాడు నిరాహారుడగును.

అయితే జిహ్వతో భుజించెడు పదార్థములకే ఆహారముయొక్క ముఖ్యార్థమైయున్నది. తక్కిన ఇన్ద్రియముల యిన్ద్రియార్థవిషయములు అర్థ్యాహారములుగా గ్రహింపనగును. మఱియు వ్యావహారిక విషయమున జిహ్వతో భుజించునదియే ఆహార మనంబడును. అవ్యవహార విషయమగు వేదాంతశాస్త్రములో మాత్రము తదితరవిషయములను ఇంద్రియములు గ్రహించుటయు నాహారముగా నిర్ణయించడమైనది. ఏలయన ప్రాపంచిక వ్యవహారములలో నొకరినిగురించి చెప్పునప్పుడు జాతిరూపనామములు మాత్రమే యుండును. అయితే వేదాంతము పైజెప్పినవానిని అనాత్మగాను, ఆత్మయే అతని నిజస్వరూపముగాను చెప్పునట్లు, ఇచ్చటగూడ గ్రహించుకొనవలయును. కాని ఆహారరసము తక్కిన ఇన్ద్రియము లన్నిటికిని బలము గలుగజేయునదిగాను, తత్తద్విషయములలో ప్రవర్తింపజేయునదిగాను నుండుటవలన ఆహారవిషయములో జాగ్రత్తపడినమాత్రమే తక్కిన విషయములు స్వాధీనములై యుండును. బీజముల నెంతకాలము దాచియుంచినను మరల జలసంసర్గము గలుగునప్పు డంకురించునటుల ఇన్ద్రియముల విషయముల లోనికి పోనీయక నిగ్రహించియుంచినను మరల ఇన్ద్రియములకు బలము గలుగునప్పుడు విషయములలో ప్రవర్తించును. అగ్నిదగ్ధములయినట్టి బీజములు మరల నెప్పటికి నంకురించనట్లు జ్ఞానాగ్నిదగ్ధములగు నిన్ద్రియములు పునర్జన్మమనెడు అంకురము గలిగియుండవు. కావుననే 'రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే' అని చెప్పుటకు కారణము.

బ్రహ్మానందరసము, ఆత్మజ్ఞానామృతము, భగవద్భక్తిరసము పానముజేయునప్పుడే విషయరసములో విరక్తి జనించును. అత్తఱి అది

విషముకలిసిన మధురపదార్థమువలె గోచరించును. అదియే విరక్తిగలి గిన దానికి గురుతు. ఆహారవిషయమై వేదాంత పంచదశిలో తెలిపినది చూడుడు.

శ్లో॥ మర్త్యాన్న మేకం దేవాన్నే ద్వే పశ్వన్నం చతుర్థకమ్।
అన్య త్త్రితయమాత్మార్థ మన్నానాం వినియోజనమ్॥

తా॥ ఇచట సప్తాన్నములగురించి నిరూపించడమైనది. ఆ సప్తా న్నములలో నొకటి మనుష్యాన్నమగును. మఱి రెండు దేవాన్నము లగును. నాల్గవదగు మఱియొకటి పశ్వన్నమగును. మిగిలిన మూడన్న ములు ఆత్మాన్నము లగును. ఈ విషయము సప్తాన్నబ్రాహ్మణమం దిటుల నిరూపింపబడినది.

శ్రుతి॥ ఏకమస్య సాధారణం ద్వే దేవా న భాజయత్।
త్రీణ్యాత్మనేఽకురుత పశుభ్య ఏకం ప్రాయచ్ఛత్॥

దీనియర్థము పైన నిరూపించినదే.

శ్లో॥ వ్రీహ్యాదికం దర్శపూర్ణ మాసౌ ఘాస స్తథా మనః।
వాక్ప్రాణా శ్చేతి స ప్త త్వమన్నానామవగమ్యతామ్॥

తా॥ ధాన్యాదికము మనుష్యాన్నమగును. అమావాస్యా పూర్ణి మలు రెండును దేవాన్నములగును. తృణములు పశ్వన్నములగును. మనంబును, ఇన్ద్రియ వర్గంబును, ప్రాణవర్గంబును ఈ మూడును ఆత్మా న్నములగును. ఈ చెప్పబడినట్టి యేడును సప్తాన్నములని తెలియవలెను. ఇచ్చట ముఖ్యముగా గ్రహించవలసినదేమనగా మానవునకు నీశ్వర సృష్టియందు ధాన్యమే అన్నముగా నేర్పడినదనియు, మాంసాదులు కావనియు గ్రహింపనగును. మఱియు చూడుడు.

శ్లో॥ దేవానా! మమృతం స్వాణా మృషీణా మన్నమౌషధిః।
దైత్యరక్షః పిశాచాదే ర్దత్తం మద్యావిషాది చ॥

తా॥ దేవతలకు అమృతము, మనుష్యులకు ధాన్యాదులు, ఋషు లకు కందపక్వ ఫల మూలాదులు భూత ప్రేత పిశాచ రాక్షసాదులకు మాత్రమే మద్యమాంసాదులు నేర్పడినవి. సృష్టిక్రమ మీలాగునుంటు న్నది. కావున మద్యమాంసాదులు మానవుల ఆహారములు గావు.

ఓమ్

బెజవాడ శ్రీ వివేకానందస్వామివారి జయంత్యుత్సవముల సందర్భమున

## శ్రీ మలయాళ స్వాములవారు పంపిన

# సందేశము

దైవాత్మ స్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా! వందనములు.

శ్రీ వివేకానందస్వాములవారి వాక్యములన్నియు, ప్రబోధములన్నియు సజీవములే. ఏలన శాశ్వతమగు ఆత్మలోనుండి వచ్చినవగుటచే వాటికెల్లప్పుడున్ను నిత్యత్వమే. అట్టి దివ్యవాక్యములను పఠించినవారున్ను, వినినవారున్ను అగు మీకు మరియొకరి సందేశము అవసరము లేదని నానమ్మకము. కఠోపనిషత్తులోగల యీ వాక్యమే శ్రీ వివేకానందస్వాములవారి ముద్రావాక్యము. దానిని మీరు పలుసారులు వినిన వారలే. జ్ఞాపకార్థము మరొకసారి ఇచట నిరూపించడమైనది. 'ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత' దీనికన్న నిక ఆత్మప్రబోధవాక్య మేమి గలదు? దీని కెంతైన అర్థము వ్రాయవచ్చును. సంక్షిప్తముగా చెప్పినచో 'లెండు, మేల్కొనుడు, ప్రకృతికి పరమైన ఆత్మను దర్శించిన శ్రేష్ఠులగు మహాత్ములనుపొంది తెలుసుకొనదగిన విషయములను త్వరలో గ్రహించుకొనుడు.' ఈ మంత్రమును మననము చేసికొనిన చాలును. నిద్రలో నుండువాడు తానెవడు, ఎచ్చట ఉంటున్నాడు, దేనికొఱకు యిచ్చటికి రావడమైనది? అని యెట్లు తెలిసికొనజాలడో, జాగ్రదవస్థలోనికి వచ్చినప్పుడు తాను ఫలానివాడనియు, ఫలాన కార్యార్థము ఈ స్థలములోనికి రావడమైనదనియు యేలాగున గ్రహించుకొనగలుగునో, ఆలాగున అజ్ఞానమగు సుషుప్తిలో నిద్రబోవుచుండు జీవుడు తన నిజ స్వరూపమగు జాగ్రదవస్థకు వచ్చినప్పుడు తాను నిత్యుడనియు, అమృతుడనియు, ఆనందస్వరూపుడనియు బోధ గలుగును. అట్టి స్థితియే మోక్షమనియు, ముక్తియనియు గ్రహించుకొనవలయును. మరియు 'యథా స్వప్నప్రబోధవత్' కలలో కనినవస్తువులన్నియు అవస్థలనియు, జాగ్రదవస్థలోనికి వచ్చినప్పుడు మిథ్యయనియు యెట్లు తెలుసుకొనుచున్నారో ఆలాగున అద్వైతాత్మకబోధము గలుగునప్పుడు ఈ ప్రపంచమంతయు మిథ్య,

లేక నశ్వరమనెడి తత్త్వముదయించును. సార్వభౌముడైనను, గవర్నరు జనరలైనను, సర్వసేనాధిపతియైనను సుషుప్త్యవస్థలో తన స్థితిని, తన శక్తిని, తన అధికారమును మరచిపోయినను, జాగ్రదవస్థలోనికి వచ్చిన వెంటనే తనయొక్క మహోన్నత పరాక్రమ అధికారములను తెలిసికొని, నిర్భయుడై, గంభీరుడై, మహా మేరువువంటి ధైర్యశాలియై, సూర్యునివంటి ప్రకాశవంతుడై వెలుగ గలుగును. వేదాంతశాస్త్రము పదేశించెడు తత్త్వమిదే. మహాపరాక్రమముగల మృగరాజు నిద్రలో నున్నప్పుడు దగ్గర దగ్గర ప్రదేశములలో మృగములు విచ్చలవిడిగా సంచరించుచు శబ్దములు చేయుచుండును. అట్టి తరుణమున ఆ మహా కేసరి లేచి గంభీరముగ నొక గర్జనచేసినచో, గజములు మొదలగు జంతువులన్నియు ఎట్లు పారిపోవునో, ఆలాగున సంసారారణ్యములో అనేక వన్యమృగములగు సంకల్పములమధ్య ఆత్మస్వరూప ప్రబోధమగు అర్థముతో సహా ఒక ఓంకారగర్జనము చేసినచో, యింక వృత్తులుగాని, వాసనలుగాని, సంకల్పములుగాని మీహృదయములో నేవియు ఉండవు.

"భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥"

తా॥ పరావరమగు పరమాత్మ సాక్షాత్కారము గలుగునప్పుడు హృదయగ్రంథులు (ముడులు) పటాపంచలై పోవును. సర్వసంశయములున్నూ ఛేదింపబడును. సమస్త కర్మలు క్షయించును. (ఇట్టి బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానియొక్క సర్వకర్మలున్నూ ధ్వంసములై పోవును.)

---

ఓం

## గమ్యం లేక లక్ష్యం

ఒక ఊరిలో ఒక బాటసారివచ్చి ఒక రచ్చపై కూర్చుండెను. ఆఊరిలో ఒక పుణ్యాత్ముడు ఆతనినిచూచి 'ఇతడు యీ ఊరివాడు కాడు. తీర్థయాత్రా పరుడగు సాధువుగా వుండవచ్చు'నని తలంచి దయ గలిగి 'అయ్యా! బాబూ! తా మెవ్వరు?' అని ప్రశాంతముగా అడిగి నప్పుడు 'అది నాకు తెలియ'దని సమాధానముచెప్పెను. మరల 'యెచ్చట

నుండి వచ్చుచున్నారు?' అని అడుగగా 'అదిన్నీ తెలియ'దని ప్రత్యుత్తర మిచ్చెను. 'యెచ్చటికి పోవుచున్నారు?' అని మరల ప్రశ్నించగా 'అదిన్నీ నాకు తెలియ'దని వచించెను 'అయితే ఇచ్చట యెన్ని రోజు లుందును?' అని మరలప్రశ్నింపగా 'అదిన్నీ నాకు తెలియ'దని సమాధానమునిచ్చెను. అట్టి మానవుని గురించి యెంత తెలివిగలవాడని లోకము తలంచునో! ప్రపంచముయొక్క స్థితియు ఆలాగునఉంటున్నది. గొప్ప విద్యావంతులు, మేధాసంపత్తి గలవారు, ప్రజ్ఞాశాలురు, మహా తెలివితేటలు గలవారు కూడ చాలామందిన్నీ పై జెప్పిన తీర్థయాత్రాపరుడగువానిస్థితిలోనే ఉంటున్నారు. ఆలాగున తానెక్కడనుండి, అనగా యేలోకమునుండి ఈ జన్మమునకు వచ్చెను? పూర్వజన్మమున నెచ్చట ఉండెను? మరల నిచట యెంతకాలముండును? తరువాత యేలోకమునకు వెళ్లును? తానెవడు? అనుతత్త్వము జీవించియున్నప్పుడు తెలిసికొనక పోయినచో పై నుదహరించిన పథికునకున్ను, యీ మానవునకున్ను ఏమిభేదము? అయితే ఈవాక్యము వినునప్పుడు భక్తులకు, పుణ్యాత్ములకు సందేహము గలుగుటకు అవకాశము గలదు. ఏలన మనకు ఈ సంగతి తెలియలేదే! అంత్యకాలమున మనగతి యేమగునో అని భయము కలుగవచ్చును. వివేకచూడామణ్యాది గ్రంథములలో యీవిషయము స్పష్టీకరింపబడి యున్నది. బ్రహ్మనిష్ఠాపరులగువారు ఆచార్యముఖతః ఈ సత్యము తెలిసికొనియుందురు. ఇదే ఆత్మవిచారము, వేదాన్తవిచారము చేయుటలోగల ప్రయోజనము. సామాన్యభక్తులగువారు యీతత్త్వమును తెలియకయుండినచో సందేహమును, భయమున్ను గలవారగుదురు. అంతియేగాక ఒక్కరికి ఒక ఉత్తరమువ్రాసి కవరులోపెట్టి పై విలాసము వ్రాయక పోస్టుపెట్టెలో పడవేసిన ఆజాబు తాను నిర్దేశించిన స్థలమునకు మనుష్యునికి చేరక యెట్లుండునో, ఆత్మయొక్క స్థితియు లక్ష్యమున్ను తెలియనివారియొక్క గతియు ఈలాగు నుండునని భక్తులు తలంచి తలంచి భయము నొందగలరు! మరియు చుక్కానిలేని పడవయొక్క గతి ఏలాగునుండునో ఈ సాధకునియొక్కయు, ముముక్షువుయొక్కయు, జిజ్ఞాసువుయొక్కయు, అభ్యాసియొక్కయుస్థితియున్ను ఆలాగునఉండునని తలంచి పుణ్యాత్ములుసహా సంశయగ్రస్తులు గాగలరు. అట్టి సందేహ

నివృత్తికొరకు, భయనివృత్తికొరకు శ్రీ కృష్ణభగవానుడు గీత దశమాధ్యాయములో,

శ్లో॥ తేషా మేవానుకంపార్థ మహామజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

తా॥ వేదాన్తశాస్త్ర విచారణచే ఆత్మయొక్క స్వరూపమును తెలియక యుండువారిని గురించి అనన్యభక్తి గలవారై యుండినచో వారెట్లు గమ్యస్థానము అనగా మోక్షమును పొందగలరో ఆవిషయమై ఈశ్లోకము ప్రవర్తించుచున్నది. పై శ్లోకమును అనుసరించియే ఈక్రిందివ చెప్పబోవు శ్లోకముగూడ ప్రవర్తింపుచున్నది.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే॥

తా॥ ఈ శ్లోకముయొక్క అర్థమును తెలిపినపిమ్మట పై సవ్రాసిన శ్లోకముయొక్క తాత్పర్యమును వచించెద. అనన్యభక్తి గలిగి పరమాత్మని ధ్యానించువారికి, తదేకభక్తి గలవారికి యేజ్ఞానముచేత భగవత్సాక్షాత్కారము గలుగవలసియుండునో, భగవత్ప్రాప్తి గలుగవలసి యుండునో అట్టి జ్ఞానమును నేనే అనగా భగవంతుడే తెలియజేతునని సాక్షాత్ భగవంతుడే ఉపదేశించెను. అదియెట్లు ఉపదేశించెనో ఆ విషయమును ఈశ్లోకములో విశదీకరించడమైనది. అట్టి అనన్యభక్తి గలవారిపై అనుగ్రహము గలవాడై వారి హృదయములో ప్రకాశించెను జ్ఞానజ్యోతిని వెలిగించి అజ్ఞానమగు తమస్సును పారద్రోలి స్వప్రకాశమగు ఆత్మను ప్రకాశింపజేయగలనని సాక్షాద్భగవంతుడే ప్రతిజ్ఞాపూర్వకముగా నిచ్చట వచించెను. కావున భక్తులు సంశయింపనక్కర లేదు. రాత్రియందు గాఢాంధకారము గలిగియున్నప్పుడు, దారి తెలియనప్పుడు ఒక ప్రకాశవంతమగు దీపము నొకడు యిచ్చిన అతడేలాగున ఏలాటి అపాయము లేక గమ్యస్థానమును సురక్షితముగా చేరగలుగునో అలాగున తదేకనిష్ఠ గల పరమభక్తులకు భగవంతుడు జ్ఞానజ్యోతిని గలుగజేసి ఆత్మయొక్క గమ్యస్థానమెద్ది ? అనుదానిని తెలుపును. ఇదంతయు భగవదనుగ్రహము వల్లనే భక్తులకు కలుగును. అట్టి సమ్యక్ము తప్పక గలిగియుండిన చాలును. మరియు ద్వాదశాధ్యాయమున యీలాగున భగవానుడు వచించెను.

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్॥

తా॥ అనన్యచింత గలిగి తదేకనిష్ఠ గలవారిని జననమరణ రూపమగు ఈ సంసారసాగరమునుండి భగవంతుడే దరిచేర్చగలడని యిచట ప్రతిజ్ఞాపూర్వకముగా, అనుగ్రహరూపముగా ఆశీర్వదించడ మైనది. అంతియేగాక ఆలస్యములేకనే వారికి మోక్షపదము గలుగజేయుమనని తెలిపెను. ఇక భక్తులారా! సాధువులారా! ముముక్షువులారా! మీరేల సంశయ పడవలెను? మనము విదేశములకు ఓడపై ప్రయాణము చేయవలసి యుండిన టిక్కటుతీసికొని ఓడలో కూర్చుండిన చాలును. మనము చేరవలసిన దారి, లక్ష్యము మనకు తెలియకపోయినను నావికుడేలాగున యేలాటి అపాయమునున్ను గలుగనీయక మనలను గమ్యస్థానము చేర్చగలుగునో ఆలాగున సంసారసాగర తారకుడగు ఆ భగవానునియందు నిశ్చలమైన భక్తి గలిగియుండినచో గ్రాంథములో చెప్పిన ఆ నాలుగు వాక్యములకు అర్థము మనకు తెలియకపోయినను పరవాలేదు. ఆ భగవానుడే అంత్యకాలమున అట్టిజ్ఞానమును మనకు కలుగజేసి మనలను మోక్షపదము చేర్చగలుగును. అయితే అనన్యభక్తి లేనిచో తర్కన విద్య, యోగము మొదలైనవి యెన్ని కలిగియుండినను గమ్యస్థానము జేరజాలడు.

శ్లో॥ నాఽహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥
భక్త్యా త్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥

తా॥ అట్టిజ్ఞానము వేదములన్నియు కడవరకు చదివినను, కృచ్ఛ్ర చాంద్రాయణాది తపము లొనరించినను, అనేక దానములు చేసినను, యజ్ఞాదిక్రతువు లొనర్చినను కలుగునదికాదు. ఓ అర్జునా! యిప్పుడు నాయొక్క విశ్వరూప దర్శనము యెట్లు సాక్షాత్కారముగా, అపరోక్షముగా చూచుచున్నావో ఆలాగున ఆత్మసాక్షాత్కారము, దైవసాక్షాత్కారము కలుగవలసి యుండిన అనన్యభక్తి యొకటియే చాలును. అట్టి భక్తివల్ల "నేను" అనగా సర్వేశ్వరుడు యెటువంటివాడో అని

తెలిసికొనుటకున్ను, సాక్షాత్కరించుటకున్ను, తత్వబోధము గలిగి భగవంతునిలో నైక్యమగుటకున్ను, అనగా బ్రహ్మతత్వజ్ఞానము గలుగుటకున్ను అనన్యభక్తి యొకటియే శక్తిగలిగియున్నదని శ్రీ భగవానుడుపదేశించెను. జనులారా! పరమభక్తులారా! భగవద్వాక్య మీలాగున యుండగా మీరెందుకు సందేహపడవలెను? మరియు గీతాంత్యమగు అష్టాదశాధ్యాయమున చరమశ్లోకమగు ఈ వాక్యమును శ్రీకృష్ణ భగవానుడు తెలిపెను.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

తా॥ ఓ అర్జునా! నీవు ఇతర ధర్మములన్నిటిని చేయ లేదని తలంచ నక్కరలేదు. నన్నొక్కనినే శరణు పొందుము. నిన్ను సమస్త పాపములనుండి, సర్వబంధములనుండి, సర్వాజ్ఞానమునుండి నేను విముక్తి గలుగజేసి మోక్షమును, లక్ష్యమును, గమ్యమును చేర్చగలను. విచారపడకుము; దుఃఖింపకుము అని శ్రీ భగవాను డభయమిచ్చిన ఈ వాక్యమునకన్న మరల పరమప్రమాణ మేమిగలదు? ఇదే ప్రకారము మను స్మృతియందు మనుమహర్షియు అనేక ధర్మములను చెప్పి కట్టకడపటి యీ వాక్యమే తనయొక్క ఆశయమనిగూడ తెలిపెను.

శ్లో॥ జప్యేనైవతు సంసిధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః।
కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే॥

తా॥ బ్రహ్మనిష్ఠ గలవాడు తన యిష్టదేవతా స్వరూపమగు మంత్రముచేతను లేక ప్రణవాది దివ్యమంత్ర జపముచేతను మాత్రమే బ్రహ్మసిద్ధిని మోక్షమును భగవత్ప్రాప్తిని పొందగలుగును. ఇతరములగు ధర్మములన్నిటిని ఆచరించనీ లేక ఆచరింపకపోనీ సంశయము లేదు. బ్రహ్మనిష్ఠుడు అన్నిటిలో ఉండు ఆత్మను తన ఆత్మను ఒకే విధముగా చూచువాడగుటచేతను, అన్ని ప్రాణులతోను విరోధము లేక మైత్రభావముగలిగియుండుటచేతను మోక్షముగలుగుటలో సందేహము లేదు. ఓ పరమ భక్తులారా! సాధువులారా! పై చెప్పిన నాలుగు ప్రశ్నలకు సమాధానము గలుగు ఉపాయము యిప్పుడు మీకు తెలుపబడనున్నది.

---

ఓమ్

# వైరాగ్య మొక్కటిమాత్రము మోక్షమునకు చాలదు; జ్ఞానముగలిగి ఉండవలెను

వైరాగ్యము ప్రాకృతవృత్తులచే, లేక విషయముచే ఆత్మను సంరక్షించును. అప్పుడు వైరాగ్యమునకు విలక్షణమగు జ్ఞానమొకటి ఉండవలెనని అర్థమగుచున్నది. మహారాజునకు యేలాటి బాధలున్ను కలుగనీయక దృఢమైన కోటయు, భటులున్ను ఉపయోగపడునట్లు వైరాగ్యము ఆత్మసంరక్షణయందు ఉపయోగపడును. రాజు లేనిచో దృఢమైనకోటయు, బలిష్ఠులైన సైనికులు ఉండిన ఏమి ప్రయోజనము? ఆలాగున ధనాగారమునకు దిట్టమైన కట్టడమున్నూ, పారావారములున్నూ ఉపయోగకరము. ధనములేని వట్టి ఖాళీయింటికి ఎంత దిట్టమైన బందోబస్తు ఉండినను గలిగెడు ప్రయోజనమేమి? ఆలాగున ఆత్మజ్ఞానమొకటి లేక తక్కిన దృఢమైన సాధన లెన్నియుండినను మోక్షమెట్లు కలుగును? అయితే సైన్యముచే సంరక్షణలేని రాజు శత్రువులచే యెట్లు బాధింపబడునో, బందోబస్తులేని ధనాగారము శత్రువులచే యెట్లు నష్టమగునో ఆలాగున వైరాగ్యములేని జ్ఞానముగూడ నష్టపడునని మరువకూడదు. ఈ విషయమై గీత 16 అధ్యాయమున శ్రీ కృష్ణభగవానులు తెలిపినది చూడుడు —

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేత త్త్రయం త్యజేత్॥

తా॥ కామము, క్రోధము, లోభము అను యీ మూడున్ను నరకమునకు ద్వారములుగాను, తన ఆత్మవినాశమునకు హేతువులుగాను నిరూపించడమైనది. కావున ఈ మూడింటిని ముముక్షువైనవాడు లేక సన్మార్గప్రవర్తకుడు విడిచిపెట్టవలెను.

శ్లో॥ ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్॥

తా॥ ఓ అర్జునా! నరకమునకు వాకిండ్లైన యీ (కామ క్రోధ లోభములు) మూటిచే విడువబడిన మనుష్యుడు నరకమును పొందడు. అయితే దానిచే తృప్తిపొందక మోక్షద్వారమును తెరచుటకొరకు

ఆత్మశ్రేయస్కరమగు కార్యమును చేసికొనవలయును. అందువల్లనే మోక్షమును (భగవత్ప్రాప్తిని) పొందగలుగును.

వి॥ కామ క్రోధ లోభ మోహాముల నెడు నరకద్వారములను మూసుకొనిన మాత్రము చాలదు. దీనివల్ల నరకప్రాప్తి లేక దుర్గతి మాత్రము గలుగదుగాని ధర్మాత్ములైనవారు పుణ్యకర్మానుష్ఠానముచే స్వర్గద్వారమును, ముముక్షువులైనవారు ఆత్మజ్ఞానానుష్ఠానముచే మోక్షద్వారమును తెరవవలసి యుందురు. ఈ రహస్యమే యిప్పుడు లోకములో కావలసియుంటున్నది. ఏలన కొందరు సంసారబాధవల్ల గృహస్థాశ్రమమును త్యాగముచేసి సాధువులుగాను, త్యాగులుగాను సంచరించుచున్నారు. అయితే గృహత్యాగముచే సంసారసంబంధబాధ లేకుండ ఉండవచ్చునేగాని ఆత్మశ్రేయస్సుకొరకు బ్రహ్మనిష్ఠాద్యనుష్ఠానము చేయకపోయిన ఆత్మశాంతి, జ్ఞానప్రాప్తి యెట్లు కలుగును ? అను తత్త్వమును మరచిపోవుచున్నారు. ఒకడు ఒకరికి ఋణస్థుడై ఋణనివృత్తి కొరకు వారిపనిలో నియోగింపబడినట్లు తలంచుడు. అట్టి జీవితము పరాధీనముగాను, భారముగాను లేక కష్టముగాను ఉండినట్లు తలంచుడు. ఏదోయొకవిధముగా ఋణవిముక్తిగలుగ జేసికొనిన తనకష్టముమాత్రము తొలగినదేగాని సుఖజీవితముకొరకు ధనముసంపాదింపకపోయినచో ఎట్లు సౌఖ్యముకలుగును ? ఈ తత్త్వమునే (శ్రీ) కృష్ణభగవానునిచే గీతలో పై చెప్పిన శ్లోకముల తెలుపడమైనది. ఈ విషయములోనే అనేకులు అజాగ్రతగలిగి ఉంటున్నారు. సన్న్యాసము మూడంతస్థులతో గూడినది. ఒకటి బాహ్యసన్న్యాసము. యిది అందరికిన్నీ తెలిసినదే. రెండవది సంకల్పసన్న్యాసము. ఇది చాలప్రయాసమైనది. విరక్తియు తీవ్ర ముముక్షుత్వము గలవాడే దీనిని నిర్వహింపగలుగును. ఈ సంకల్పసన్న్యాసము లేనిచో సంస్కారములు, వాసనలు, గుణములు, వృత్తులు, అంతఃకరణములో ఉండినచో అవి పునర్జన్మమును గలుగజేయును. అరటి, పసుపు, చామ మొదలగు చెట్లను నరికి చదరము చేసినట్లు ఉండును. వాని దుంపలు భూమిలో ఉండుటచే తప్పక మరల మొలచునట్లు సంకల్ప రాహిత్యము గలుగనిచో హృదయములోగల గుణముల ననుసరించి తప్పక జన్మముగలుగును. మూడవది ఆత్మసన్న్యాసము. ఇది బుద్ధ్యాది

అనాత్మవస్తువులలో ఆత్మబుద్ధిని గలుగజేయును. ఇది ఆత్మానాత్మ విచారణజ్ఞానము మాత్రముచేతనే తొలగును. దీనికి బ్రహ్మవేత్తయగు గురుదేవుని సహాయము ఎంతయో అవసరము. ఇది గలుగనిచో పొట్టులో గూడిన గింజ మొలకవచ్చినట్లు జన్మమును కలుగజేయును. పొట్టు ఊడిపోయిన విత్తనము మొలకెత్తనట్లు మూలావిద్య సమూలముగా నశించిన ముక్తాత్మునికి మరల పునర్జన్మములేదు. అయితే నిజమైన వైరాగ్యము గలిగి సన్న్యసించినవానికి మొదటిదియగు దేహసన్న్యాసము, రెండవదియగు సంకల్పసన్న్యాసమునకున్ను, సంకల్పసన్న్యాసము మూడవదియగు ఆత్మసన్న్యాసమునకున్ను క్రమముగా ఒకదానికొకటి సహాయపడును. అనగా హేతువగును. గీత అ. 4 లో శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించినది చూడుడు. "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" ఓ అర్జునా! కర్మయంతయు కొంతలేక మోక్షసాధనమైన జ్ఞానములో అణగియున్నది; అనగా ఇమిడియున్నది. నదీనదములన్నియు గాక కాలువలు మొదలగునవన్నియుగూడ సముద్రములో నెలాగున యిమిడిపోవుచున్నవో ఆలాగున కర్మలన్నియున్ను, సాధనములన్నియున్ను ఆత్మజ్ఞానములో యిమిడిపోవుచున్నవి. ఏలన పైజెప్పిన జలాశయము లన్నియు సముద్రములో అంతర్భూతములగునేగాని సముద్రము ఏలాగున యే మహానదులలోనైనను ఇముడజాలదో ఆత్మజ్ఞానముయొక్క స్థితియు ఆలాగున యుండును. అనగా ఆత్మజ్ఞానముగలుగని ధర్మానుష్ఠానము లన్నియు అసంపూర్తియగునేగాని సంపూర్ణము కాజాలవు. అనగా ఆత్మజ్ఞానముగలుగని క్రియలు, అనుష్ఠానములన్నియు అసంపూర్ణమేయని గ్రహించుకొనవలయును. అ. 8:

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ దానేషుయత్పుణ్యఫలం ప్రదిష్టం।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీపరం స్థానముపైతి చాద్యమ్॥

తా॥ వేదములన్నిటిలోను, యజ్ఞములన్నిటిలోను, తపస్సులన్నిటిలోను, దానములన్నిటిలోను ఏయేఫలము చెప్పబడియున్నదో అట్టి సకల ఫలమును జ్ఞానయోగియైనవాడు అల్పమని తలంచును. మరియు ఇట్టి తత్త్వము నెఱింగి మూలకారణముగను, ఉత్తమముగనున్న బ్రహ్మస్థానమును పొందును.

వి॥ పై జెప్పినహానివల్ల కలిగెడు పుణ్యలోకప్రాప్తి కాలాంతరమున నశించును. జ్ఞానము శాశ్వతమైనది. యేకాలముననూ నశించనిది. కావున యెన్ని పుణ్యకర్మానుష్ఠానములు చేసినను ఆత్మజ్ఞానము పొందక పోయినచో నిత్యశాంతియు, శాశ్వతసుఖమగు మోక్షమున్ను గలుగదని భావము. అ. 13:

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం ।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥

తా॥ అన్ని భూతములలోను సమముగ నున్న వాడును, నశించెడు దేహేంద్రియాది వస్తువులలో ఉంటున్న నశించనివాడునైన పరమేశ్వరుని యెవ్వడు చూచునో అతడే చూచినవాడు. తక్కినవారు నేత్రము లుండియు అంధప్రాయులు. ఏలన వారు నశ్వరమైన వస్తువులనుచూచి రే గాని శాశ్వతమైన సత్యవస్తువును చూడకపోవుటవల్ల కన్నులుండియు లేనివారితో సదృశులు. అదిన్నీ గాక ఆత్మకుఉపయోగము లేనివస్తువులను చూచుచున్నారేగాని ఉపయోగపడు ఆత్మను, యీశ్వరుని, జ్ఞానమును చూడకపోవుటవల్ల గ్రుడ్డివారలతో సదృశులని చెప్పుటకు కారణమైనది.

శ్లో॥ అ. 13: సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరం ।
న హినస్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాం గతిమ్॥

తా॥ అన్ని ప్రాణులయందును సమానముగా ఉంటున్న ఈశ్వరుని అన్నిటిలోను సమముగ చూచెడివాడు తన్ను తనచే హింసించుకొనుట లేదు. అందువల్ల సర్వోత్కృష్టమైన, శాశ్వతమైయుండు మోక్షమును పొందుచున్నాడు.

వి॥ పై జెప్పిన ఆత్మస్వరూపమును, దైవమును తెలుసుకొనని వాడు తన్ను తాను చంపుకొన్నవానివలె ఉండుననియు, అనగా ఆత్మహత్య చేసుకొన్నవానివలె యేర్పడుననియు దీనియొక్క సారము. ఏలన ఆత్మహత్య చేసినవానికి ఘోరనరకయాతనలు గలవని శాస్త్రము చెప్పుచున్నది. ఇచటనో ఆత్మజ్ఞానము పొందనివానికి జననమరణ యాతనా వేదనమును పొందవలసి యుండుటచేత ఆత్మహంతకుని సదృశముగా చెప్పడమైనది. ఎన్ని ధర్మానుష్ఠానములు చేసినను ఆత్మజ్ఞానముపొందని

వానికి జననమరణములు తప్పవు. పొట్టుతో కూడియుండువరకు యెంత మంచివిత్తనమైనను, చెడ్డవిత్తనమైనను యేలాగున అంకురించి వృక్ష మయ్యేడు స్వభావము గలిగియుండునో, పొట్టును ఊడదీసిన విత్తనము యేలాగున అంకురించజాలదో ఆలాగున మూలావిద్య ఉండువరకు ఎంత పుణ్యాత్మునికైనను జనన మరణములు తప్పవు. కావుననే గీతలో యీలాగున చెప్పుటకు కారణము. 4. అ:

శ్లో॥ 'న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే'

తా॥ ఈ లోకమున జ్ఞానముతో సమానమైన పవిత్రమైనది మరియొకటిలేదు. 4. అ:

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥

తా॥ ఓ అర్జునా! బాగుగా జ్వలించుచున్న అగ్ని కట్టెలను యేవిధముగ భస్మముచేయుచున్నదో ఆ విధముగనే జ్ఞానమను అగ్ని కర్మలన్నిటిని భస్మముగ జేయుచున్నది.

వి॥ ఏలాగున అగ్ని తప్ప మరి యేదియు కట్టెలను కాల్చి భస్మముగా చేయజాలదో ఆలాగున ఆత్మజ్ఞానమగు స్వస్వరూప సాక్షాత్కార జ్ఞానమే కర్మలను దహింపజేయుశక్తి గలిగియుండును. తక్కిన ఏజ్ఞానమున్ను యింత మహత్తయిన పనిని చేయజాలదు. 4. అ:

శ్లో॥ అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

తా॥ పాపములన్నిటిని చేసియున్న పాపులకన్న నీవు మిక్కిలి పాపము చేసినవాడవైనను, ఆ పాపముల నెడి సముద్రమును జ్ఞానమ నెడి నావచేతనే దాటెదవు.

వి॥ సముద్రమును దాటుటకు నావతప్ప మరియొక ఉపాయము లేనట్లు సంసారసాగరమును దాటుటకు ఆత్మజ్ఞాన మొక్కటియే సాధన మగును. అయితే విమానముచేత దాటకూడదా అని ప్రశ్న రావచ్చును! విమానముగూడ ఒక సాధనముగదా? అచ్చోట జ్ఞానమనెడు విమానమునుగా అన్వయపరచిన చాలును. అదిన్నిగాక విమానము నవీన సాధ

నము. ఓడ మొదటినుండి అంతటను వ్యాపించియున్న కారణముచేత నావను దృష్టాంతముగా చెప్పడమైనది. మరియు విమానము అంతట లేదు. ఒకానొక ప్రదేశమునమాత్రమే ఉండును. అదిన్నీ గాక నదులను పడవలచేతనే దాటుచున్నారు. కావున సంసారసాగరమని చెప్పినను, సంసార ప్రవాహమని చెప్పినను, పడవశబ్దము సర్వత్ర అన్వయించును. అందువల్ల పూర్వీకులు నావశబ్దమును ఉపయోగపరచిరి. సముద్రము ఎంత అపారమైనను అనేక జలజంతువులతో కూడినదైనను నిరంతరము కల్లోలములచే శాంతిలేనిదైనను ఓడలో ప్రయాణముచేయువారు పైచెప్పిన కష్టములేవియు పొందకనే తీరముచేరగలరు. సంసారసాగరమును తరించుటకు ఆత్మజ్ఞానమును ఓడగ వర్ణించడమైనది. దీనికన్న గొప్పదగు దృష్టాంతము ఏమిగలదు ? సూతసంహితయందు చెప్పినది చూడుడు —

శ్లో॥ జ్ఞానం వేదాన్తవిజ్ఞానమజ్ఞానమితరన్మనే।
అహో జ్ఞానస్య మాహాత్మ్యం మయా వక్తుం న శక్యతే॥

తా॥ అట్టి ఆత్మజ్ఞానము వేదాంతమనెడు ఉపనిషత్ప్రతిపాదకమగు ఆత్మబోధ యొకటియేగాని మరియే సాధనయు కాజాలదు. తక్కినజ్ఞానము లన్నియు అజ్ఞానముతో కూడినవి. ఇప్పుడు మహేశ్వరుండు జ్ఞానమాహాత్మ్యమును ఉద్ఘోషించుచున్నారు. ఓహో జ్ఞానముయొక్క మహిమను చెప్పుటకు నేను శక్తుడనుకాను. ఈశ్వరుడే జ్ఞానముయొక్క మహిమను చెప్పుటకు అశక్తుడనని చెప్పినప్పుడు మానవులు మరల ఏమిచెప్పగలరు? ఇట్టి జ్ఞానము ఇహలోకమునయున్నప్పుడే, యీ శరీరముతో కూడియున్నప్పుడే పొందవలెనని శ్రీ కృష్ణభగవానుడు అ. 5 లో తెలిపియుండిరి.

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

తా॥ ఎవ్వరి మనస్సు సకలమునందును బ్రహ్మమును (ఆత్మను, ఈశ్వరుని) సమముగ చూచుటలో స్థిరముగనున్నదో అనమదస్సున్న స జ్ఞానులచే యీశరీరముతో యిచ్చటఉండునప్పుడే జననమరణరూపమగు సంసారము జయింపబడినది. ఏలననగా బ్రహ్మము దోషము లేనిదిగను, సమముగను (ఏకముగను) ఉన్నందున బ్రహ్మమునందే వారలు స్థిరపడి యుండువారలు.

వి॥ బ్రహ్మమువలెనే నిర్దోషమౌ యీ ఆత్మ అనగా జీవుడుగూడ ఆలాగున ప్రకృతిరహితమైనస్థితిగలుగునప్పుడే బ్రహ్మప్రాప్తిని అనగా మోక్షమును పొందగలుగును. అదిన్నీ యీ దేహముతో యీ లోకములో నున్నప్పుడే పొందవలయును. లేనిచో అదిపరోక్షజ్ఞానమగునేగాని అపరోక్షజ్ఞానము కానేరదు. ఈవిషయమై కేనోపనిషత్తు చెప్పినది చూడుడు—

శ్లో॥ ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః ॥

తా॥ ఈలోకమునందు పరమాత్మస్వరూపము నెఱింగినవారలకు సత్యస్వరూపమగుమహత్తైనలాభము సిద్ధించుచున్నది. ఈలోకమునందు పరమాత్మస్వరూపము నెఱుంగనివారలకు గొప్పనష్టము కలుగుచున్నది. ఏమన మానవునికిగల అనేకవస్తువులలో ఒక్కొక్కటి నశించినప్పుడే యెంతో దుఃఖపడుచున్నాడు. అట్లుండగా సమస్తమున్నూ, దేహముతో సహా వదలిపెట్టిపోవునప్పుడు గలిగెడు దుఃఖ మెటువంటిదో, వారికివారే ఆలోచించుకొనవచ్చును. శ్రీమద్భాగవతమున పరమభక్తుడగు ఉద్ధవుని కొరకు శ్రీకృష్ణభగవానుడు చెప్పినవాక్యమును చూడుడు—

శ్లో॥ ఏషా బుద్ధిమతాం బుద్ధిః మనీషా చ మనీషిణాం ।
యత్సత్యమనృతేనేహ మర్త్యేనాఽఽప్నోతి మాఽమృతమ్॥

తా॥ నశ్వరమగు యీ దేహముతో గూడియున్నప్పుడే సత్యస్వరూపుడు, శాశ్వతుడును, అమృతస్వరూపుడునగు నన్ను మానవుడు పొందుచున్నాడనునది యేదిగలదో, ఇదియే బుద్ధిమంతుల బుద్ధియు, మనీషావంతుల మనీషయునగును. అప్పుడే బుద్ధిమంతులగువారి బుద్ధియు. చతుర మానవులయొక్క చాతుర్యము సార్థకమగును.

వి॥ ఈవాక్యమువల్ల శాశ్వతమైన ఆత్మను దెలిసికొనుటకొరకే అశాశ్వతమగు యీ దేహమేర్పడినది అని తెలుసుకొనవలెను. దీనిని గ్రహించినవారేబుద్ధిమంతులును, చతురతగలవారునుఅగుదురు. మరియు ఈశావాస్యోపనిషత్తు తెలిపినది చూడుడు —

శ్లో॥ యజ్ఞైశ్చ దేవానాప్నోతి వైరాజం తపసా పదం ।
బ్రహ్మణః కర్మసన్న్యాసాత్ వైరాగ్యాత్ ప్రకృతౌ లయమ్।
జ్ఞానాత్ కైవల్యమాప్నోతి పంచైతా గతయః స్మృతాః॥

తా॥ యజ్ఞములుచేయువారు దేవతలను పొందుదురు. తపస్సు చేయువారు హిరణ్యాగర్భుని స్థానమును పొందుదురు. కర్మసన్న్యాసము వలన బ్రహ్మలోకమును పొందుదురు. వైరాగ్యముమాత్రము గలవారు ప్రకృతిలయులగుదురు. ఆత్మజ్ఞాన ముకల వారిని మాత్రమే మోక్షమును పొందగలరు. యీపై జెప్పిన ఐదింటికి మూలాంటికగాని గలుగును. పతంజలి మహర్షి తెలిపినది చూడుడు—

సూ॥ భవప్రత్యయో విదేహప్రకృతిలయానామ్॥

తా॥ స్థూల సూక్ష్మ దేహములను విడనాడి ఆనందమునందలి సమాధిలో ఉండువారికిని, కారణప్రకృతియందు లీనముగు మనస్సు గల వారికిని, భవప్రత్యయమను అవస్థ గలుగును. అనగా విదేహులకును, ప్రకృతిలయులకును గలుగు వృత్తినిరోధము ఆత్మతత్త్వజ్ఞానజన్యమును జన్మమరణ ప్రవాహకారణమును అగునుగాని ముక్తికి ఉపాయముగాదు. కనుకనే యీ సూత్రములో అట్టివారిని గురించి 'భవప్రత్యయః' అని చెప్పుటకు కారణమైనది. అనగా జననమరణరూపమగు సంసారమునకు మూలకారణమైన సూక్ష్మప్రకృతియందు లీన అవ్యక్తమునందు ఉండుగా దని తెలుపుటకు కారణమైనది. ఏలన యీ మూలప్రకృతినే ప్రధానమని సాంఖ్యులు చెప్పుదురు. జీవుడు దేనిని గురించి భావనచేయునో అంత్య కాలములో అట్టిస్థానమునే పొందును. ప్రకృతినిగురించి చింతనచేయువారు ప్రకృతినే పొందుదురు. అయితే పైచెప్పిన సాధకులు అశుద్ధ ప్రకృతిని నిరోధించి శుద్ధప్రకృతిని చింతించువారగుటచే శుద్ధప్రకృతినేపొందుదురు గాని ప్రకృతికి పరమగు పరమాత్మను గురించి లేక ఈశ్వరుని గురించి లేక ఆత్మనుగురించి చింతన చేయనికారణముచే యిట్టివారికి మోక్షము లేదు. ఏలన బ్రహ్మమునుగురించి ఈశ్వరునిగురించి ఆత్మనుగురించి వీరు చింతనచేయ లేదు. అందువల్ల లక్ష్యమునుగురించి విడువబడిన బాణము ఆ లక్ష్యమునే పొందునట్లు జీవుడు అంత్యకాలమున ఏ దేహ భావన గలిగి ఉండునో ఆ యా స్థానమునే పొందుట నియమితమని కృ- నిర్ణయము.

శ్లో॥ భారోఽవివేకినః శాస్త్రం భారో జ్ఞానం చ రాగిణః।
అశాంతస్య మనో భారో భారోఽనాత్మవిదాం వపుః॥

తా॥ వివేకము లేనివానికి శాస్త్రము భారమే. అలాగున వైరాగ్యము లేనివానికి జ్ఞానమున్ను భారమే. శాన్తిలేనివానికి మనస్సున్ను భారమే, తత్త్వజ్ఞానము లేనివారికి దేహమున్ను భారమేయగును అని యోగవాసిష్ఠమున శ్రీ వసిష్ఠభగవాను లుపదేశించిరి.

---

ఓమ్

# ఆహార సామర్థ్యము

ఈ విషయమై, ఛాందోగ్యోపనిషత్తు నందలి సప్తమ ఖండము షష్ఠప్రపాఠకమున చెప్పినది చూడుడు. ఇది ఆరుణియను ఋషి తన కుమారుడగు శ్వేతకేతువునకు ఉపదేశించిన భాగము. కేవలము నిరాహారము గొప్పతపస్సనే కొందరు తలంతురు. అయితే యోగశక్తిచేత గాని, కల్పసేవనచేతగాని, తన ప్రజ్ఞకు కొరతగలుగక యుండిన అది మంచిదే. అట్లుగాక నిరాహారముగలిగి ప్రజ్ఞక్షీణించే స్థితిలో నుండిన అది యోగమని గ్రహింపక రోగమనియే విజ్ఞులు తెలిసికొనెదరు. ఇందువల్ల మితిమీరి భుజించి శరీరేంద్రియములను వృద్ధినొందించవలెనను అర్థముకాదు. తన అనుష్ఠానమునకు భంగములేని ఆహార నిద్రాదులు ఉండవలయు ననియే శ్రీకృష్ణభగవానుని మతమని గీత ఆరవ అధ్యాయమున చెప్పినవిషయము ఆఖరున తెలిపెద.

## ఛాందోగ్యోపనిషత్తు.

ఉ॥ షోడశకలస్సోమ్యపురుషః పంచదశాహానిమాశీః కామ మపః పిబాపోమయః ప్రాణో న పిబతో విచ్ఛేత్స్యత ఇతి॥

తా॥ అన్నరసముయొక్క సూక్ష్మాంశమే మనస్సునకు వృద్ధి గలుగజేయుచు పదియారు అంశములతో గూడియుండెడి మానసశక్తి రూపముగా పరిణమించినందున ఆ శక్త్యంశములే కళలనిచెప్పబడుచున్న వనియు, ప్రాణవిశిష్టకార్యకరణ సంఘాతరూపమయిన పురుషుడు యీ పదియారు కళలతో సంబంధించియున్నందుననే చూచుటకును, వినుటకును, దెలిసికొనుటకును, క్రియచేయుటకును సమర్థుడగుచున్నాడనియు, యీ యన్నమువల్ల నేర్పడిన మానసశక్తి క్షయించుటవలన నీ శరీర

మును క్రియాజ్ఞాన సామర్థ్యము లేక యుండుననియు దెలియజేయుటకు ఉత్తరగ్రంథము ప్రవర్తించుచున్నది. ఓ శ్వేతకేతుడా! అన్నరసము యొక్క సూక్ష్మాంశమే మనస్సయినది గనుక, ఈ యంతఃకరణము యొక్క శక్తి పదియారువిధములై యున్నందున దీనికి వృద్ధిహేతువగు నన్నరసముయొక్క యంశములును పదియారువిధములై మానసశక్తి యుక్త కళలుగా నిర్దేశింపబడియున్నవి. ఇందువల్ల మానసశక్తి విశిష్టమైయుండెడి పురుషుడు పదియారుకళలతో గూడియున్నాడు. కాబట్టి నీవు పదునైదు దినములన్నమును భక్షణచేయకుండుము. ఉదకమునుమాత్రము యథేష్టముగా పానము చేయవలసినది. ఈ యుదకముయొక్క వికారమే ప్రాణమైయున్నది. కనుక ఉదకమును పానము చేయుచున్నందున ప్రాణమునకు విచ్ఛేదము లేక నిలిచియుండును.. అన్నమును భక్షణము చేయక పోయినందున అన్నవికారమైన మానసశక్తికి లోపము సంభవించి, మనస్సు అన్నవికారమే అని నిశ్చయించుకొనుటకు సాధకమగునని తండ్రియైన యుద్దాలకు డాజ్ఞాపించిన వాడాయెను.

ఉ॥ స హ పంచదశాహాని నాశాథ హైనముపససాద కిం బ్రవీమి భో ఇత్యృచః సోమ్య యజూంషి సామానీతి స హోవాచ న వై మా ప్రతిభాంతి భో ఇతి॥

తా॥ ఆ శ్వేతకేతుడు తండ్రి ఆజ్ఞప్రకారము పదునైదు దినములన్నభక్షణము చేయక యుదకపానముతో ప్రాణాధారము చేసికొని పదియారవదివసమునందు తండ్రి సమీపమునకువచ్చి, 'ఓ స్వామీ! నాకేమి ఆజ్ఞాపించెద'రని వినయపూర్వకముగా ప్రశ్నించెను. తండ్రియగున యుద్దాలకుడావాక్యమునువిని, 'ఓ శ్వేతకేతుడా! యిదివరకు నీచేనభ్యసింపబడి యుండెడి ఋగ్యజుస్సామములను వేదములను సమగ్రముగా ప్రవచన చేయవలసిన'దని యాజ్ఞాపించెను. 'ఓ స్వామీ! నాకు పూర్వాభ్యస్తములైన వేదము లిప్పుడు స్ఫురించుట లేదు. ప్రవచనము చేయుటకు నేనసమర్థుడనై యున్నా'నని యుత్తరము చెప్పినవాడాయెను.

ఉ॥ తగ్ం హోవాచ యథా సోమ్య మహతో'భ్యాహితస్యైకోఽంగారః ఖద్యోతమాత్రః పరిశిష్టస్స్యాత్తేన తతోఽపి న బహుదహేదేవగ్ం సోమ్య తే షోడశానాం కలానామేకా కలాతిశిష్టా స్యాత్తయైతర్హి వేదాన్నానుభవస్యశానాథమే విజ్ఞాస్యసీతి॥

తా॥ పూర్వమంత్రమున శ్వేతకేతుడు తనకు వేదములు స్ఫురింప లేదని చెప్పిన వాక్యమును విని తండ్రియైన యుద్దాలకుడు ఆ ప్రకారము వేదములు స్ఫురింపకపోవుటకు నిమిత్తమును దృష్టాంతపూర్వకముగా నుదాహరించుచు అన్నవికారమే మనస్సుగానున్న విధమును స్పష్టముగా తెలియజేయుచున్నాడు. అనేక విధములయిన యింధనములచే వృద్ధి పొంది విశేషజ్వాలలతో గూడియుండెడి అగ్నిహోత్రము ఇంధనములు లేకపోయినందున క్షయించిపోయి ఒక మిణుగురుమాత్రమైన అంగారముతో శేషించి యున్నప్పుడు ఆ మిణుగురులేశముకంటె అధికమయిన ఏవస్తువును దహించుట కేప్రకారము శక్తిలేకయుండునో, ఆ ప్రకారమే అన్నముచే వృద్ధిబొందుచు విశేష విజ్ఞానముతో గూడియుండెడి నీ మనస్సు అన్నభక్షణము లేకపోయినందువలన క్షీణమై పదియారవ భాగముమాత్రము శేషించియున్నది. కనుక అట్టి స్వల్పమైన మనస్సునకు వేదములు విషయము గానందున స్ఫురించుట లేకపోయినది. కనుక నీవు అన్నమును క్రమముగా భక్షింపవలసినది. అన్నభక్షణము చేసిన వెనుక మనస్సు అన్నముయొక్క వికారరూపమైయున్నదని నాచే నుదాహరింపబడియున్న విషయము నీకు విస్పష్టముగా దెలియబడుచున్నదని యుద్దాలకుడు చెప్పెను.

ఉ॥ స హాశాధహైనముపససాద తగ్ హ యత్కించ ప్రప్రచ్ఛసర్వగ్ హ ప్రతిపేదే తగ్ హోవాచ॥

తా॥ పూర్వమంత్రమున జెప్పినప్రకారము తండ్రిచే నాజ్ఞాపింపబడిన శ్వేతకేతుడు క్రమముగా నన్నభక్షణముచేసి తదనంతరము తండ్రి సమీపమునకువచ్చి విద్యార్థియై శుశ్రూషచేయుచుండెను. ఈప్రకారము పూర్ణుడై వినయముతో వచ్చియుండెడి కుమారునిజూచి తండ్రి ఋగ్వేదము మొదలుగాగల సర్వశాస్త్రములలోను గ్రంథమునుగాని, అర్థమునుగాని ఏయే విషయమును ప్రశ్నించెనో, ఆయా సమస్తవిషయములను తెలిసికొని సమగ్రముగా వివరణచేసి చెప్పినవాడాయెను. ఈప్రకారము శాస్త్రజ్ఞాన సంపన్నుడై యుండెడి కుమారునిగూర్చి తండ్రియైన యుద్దాలకు డిట్లు చెప్పుచున్నాడు.

ఉ॥ యథా సోమ్య మహతో౽భ్యాహితస్యైకమంగారం ఖద్యోత మాత్రం పరిశిష్టం తం తృణైరుపసమాధాయ ప్రజ్వాలయేత్తేన తతో౽పి బహు దహేత్॥ ఏవం సోమ్య తే షోడశానాం కలానామేకాకలాతిశిష్టా భూత్సాన్నేనోపసమాహితా ప్రాజ్వాలీత్తయైతర్హి వేదాననుభవస్యన్నమయగ్ హి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజోమయీ వాగితి తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి॥

తా॥ ఓ శ్వేతకేతుడా! సమిధలచే (కట్టెలు) వృద్ధిపొంది విశేషముగా ప్రకాశించుచుండెడి యగ్నికింధనములు (కట్టెలు) లేకపోవుటచే క్షయమునుబొంది మిణుగురుతో సమానమగు ఒక యంగముమాత్రము శేషించియుండగా ఆ స్వల్పమైన యంగారమును (నిప్పురవ) తృణములచే ప్రజ్వరిల్ల జేసి వృద్ధిజేసినపిదప మహాప్రకాశముకలది యైయున్న ఆ యగ్నిచేతనే పూర్వముకంటె అధికమైన కాష్టాదివిషయములను దహింపజేయుట యేప్రకారమో ఆవిధముగానే అన్నముచే వృద్ధిపొందుచుండెడి నీయొక్క మానసశక్తి సంబంధమైన పదియారు అంశములలోను, పదునైదు దినము లన్నభక్షణము లేకపోయిన హేతువువలన పదునైదు అంశములు క్షయించిపోయినందున కృష్ణపక్షములో చంద్రుని యొక్క కళలు క్షయించి ఒక కలామాత్రమే శేషించియున్నట్లు, నీ మానసశక్తి అంశమును ఒక కలామాత్రమే శేషించి యుండగా, ఆ యంశమును క్రమమయిన అన్నభక్షణముచే వృద్ధి బొందించుటవలన విశేషవిజ్ఞాన శక్తిగలవాడవై యిప్పుడు సమస్తవేదములను, శాస్త్రములను వానియొక్క అర్థమును సమగ్రముగా దెలిసికొంటివి. కనుక ఓ శ్వేతకేతుడా! అన్నవికారమే మనస్సనియు, ఆపోవికారమే ప్రాణమనియు, తేజోవికారమే వాగింద్రియముయొక్క విషయగ్రహణ సామర్థ్యమనియు తెలియవలసినదని తండ్రియైన ఉద్దాలకుడు చెప్పెను.

మరియు యీ విషయమై ఇతరశ్రుతులు తెలిపినది చూడుడు —

శ్రుతి॥ అన్నదోషేణ చిత్తస్య కాలుష్యం సర్వదా భవేత్।
కలుషీకృతచిత్తానాం ధర్మస్సమ్యఙ్న భాసతే॥

తా॥ ఆహారదోషముచే సర్వదా చిత్తమునకు మాలిన్యము గలుగును. కల్మషచిత్తముకలవారికి ధర్మరహస్యమైన జ్ఞానము ప్రకా

శింపదు. పంకిలజలమందు చంద్రబింబముగాని, సూర్యబింబముగాని, కట్టకడకు తన దేహచ్ఛాయగాని యెట్లు కాన్పించదో మలిన హృదయము యొక్క స్థితి యిట్టిది. నిర్మలోదకమున చంద్రబింబము, సూర్యబింబము, తనప్రతిబింబము స్పష్టముగా నెట్లు గనందగునో శుద్ధహృదయముయొక్క స్థితి యిటువంటిది.

శ్రుతి॥ ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధృవా స్మృతిః ।
స్మృతిలాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః॥

తా॥ సాత్త్వికమైన శుద్ధాహారముచే మనశ్శుద్ధియు, మనశ్శుద్ధిచే దృఢమైన ప్రజ్ఞయు, దృఢప్రజ్ఞచే సర్వహృదయ గ్రంథులు నిశ్శేషముగా నాశమునొందును. దీనినిగురించి ఆలోచించిన ఏది తినినా ఏమి? ఏది తాగినా ఏమి? మనస్సుగదా ప్రధానమని చెప్పెడు వేదాంత మెట్టిదో బుద్ధిమంతులు తెలిసికొనవచ్చును. ఇక శ్రీ భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడుపదేశించినది చూడుడు.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥

తా॥ అర్జునా! అధికముగా భోజనము చేయువానికిని, బొత్తిగా భుజింపనివానికిని, అధికముగా నిద్రించువానికిని, సరిగా నిద్రలేనివానికిని యోగము సిద్ధింపదు.

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥

తా॥ ఉచితమైన ఆహారవిహారములు గలవాడును, కాలోచితమగు అనుష్ఠానములను నెరవేర్చువాడును, ఉచితమైన నిద్రాజాగరణములుగల యోగికి సమస్త దుఃఖములు పోగొట్టునటువంటి యోగసిద్ధి కలుగును. అనగా మోక్షము లభించును.

ఓమ్

# భగవంతుని ఏకవింశత్యవతారములు

## భాగవతము — ప్రథమస్కంధము

(1) అది సకలావతారంబులకు మొదలిగనిదైన శ్రీమన్నారాయణదేవుని విరాజమానంబైన దివ్యరూపంబు. దానిం బరమయోగీంద్రులు దర్శింతురు. అప్పరమేశ్వరు నాభికమలంబువలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మయుదయించె. నతని యవయవస్థానంబులయందు లోకవిస్తారంబులు గల్పింపబడియె. మొదల నద్దేవుండు కౌమారాఖ్య సర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె. (2) రెండవమారు జగజ్జననంబుకొఱకు రసాతలగతయైన భూమి నెత్తుచు యజ్ఞేశుండై వరాహదేహంబుదాల్చె. (3) మూడవ తోయంబున నారదుండను దేవర్షియై కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు సెప్పె. (4) నాలవహరి కర్మభార్యాసర్గంబునందు నరనారాయణాభిధానుండై దుశ్చరంబైన తపంబు సేసె. (5) పంచమావతారంబున కపిలుండను సిద్ధేశుండై యాసురియను బ్రాహ్మణునకు తత్త్వగ్రామ నిర్ణయంబుగల సాంఖ్యంబు నుపదేశించె. (6) ఆరవశరీరంబున అనసూయాదేవియందు అత్రిమహామునికి కుమారుండై (దత్తాత్రేయుండై) యలర్కునికి ప్రహ్లాద ముఖ్యులకు ఆత్మవిద్యఁదెలిపె. (7) విగ్రహంబున నాకూతియందురుచికి జన్మించి యజ్ఞుండనఁ బ్రకాశమానుండై యామాది దేవతలతోఁగూడ స్వాయంభువు మన్వంతరంబు రక్షించె. (8) అష్టమమూర్తిని మేరుదేవి యందు నాభికి జన్మించి యురుక్రముండనఁ బ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁ బరమహంసమార్గంబుఁ బ్రకటించె. (9) తొమ్మిదవ జన్మంబున ఋషుల చేత గోరంబడి పృథుచక్రవర్తియై భూమిని ధేనువుంజేసి సమస్త వస్తువులంబిదికె. (10) చాక్షుషమన్వంతర సంప్లవంబున దశమంబైనమీనావతారంబునొంది మహీరూపంబగు నావ నెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె. (11) సముద్ర మథనకాలంబునఁ బదునొకండవ మారు కమఠాకృతిని మంథరాచలంబుఁ దన పృష్ఠకర్పరంబున నేర్పరియై నిల్పె. (12) ధన్వంతరి యనఁ బండ్రెండవ తనువున సురాసురమథ్యమానక్షీర వారాశిమధ్యభాగంబున అమృతకలశహస్తుండై వెడలె. (13) పదు

మూఁడవదియైన మోహినివేషంబున సురాసురుల మోహితులఁజేసి, సురల నమృతాహారులఁగావించె. (14) పదునాలుగవదియైన నరసింహ రూపంబునం గనకకశిపుని సంహరించె. (15) పదునేనవదియైన కపట వామనావతారంబున బలిని పదత్రయంబు యాచించి మూఁడులోకంబుల నాక్రమించె. (16) పదునారవదియైనభార్గవరామాకృతిని కుపితభావంబు దాల్చి బ్రాహ్మణద్రోహులైన రాజుల నిరువదియొక్కమారు వధించి భూమి నిక్షత్రంబు గావించె. (17) పదునేడవదియైన వ్యాసగాత్రంబున అల్పమతులైన పురుషులం గరుణించె. వేదవృక్షంబునకు శాఖల నేర్పరించె. (18) పదునెనిమిదవదైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబునొంది సముద్రనిగ్రహాది పరాక్రంబు లాచరించె. (19-20) ఏకోనవింశతి, వింశతితమంబులైన రామకృష్ణరూపంబులచే యదువంశంబునందు సంభవించి విశ్వంభరాభారంబు నివారించె. (21) కలియుగాద్యవసరంబునం రాక్షసవ్యామోహనంబుకొరకు ఏకవింశతితమంబైన బుద్ధనామధేయంబున గీకటదేశంబుల జినసుతుండై వర్తించు. యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికి గల్కియనుపేర నుద్భవింప గలండు.

వి॥ దీనియందు శ్రీరామకృష్ణావతారములు పూర్ణావతారములుగాను, తక్కినవి అంశావతారములుగాను వర్ణించడమైనది. ఒకొక్క అవతారము లోకోద్ధరణకొరకు అని దీనియందు నిరూపించడమైనది. దీనినిబట్టి చూచిన లోకము చెప్పునట్లు గాంధీగారున్ను ఒక అవతారపురుషుడని చెప్పటలో కొంచెమైనను అతిశయోక్తి కానేరదు ఏలన మహమ్మదీయ హిందూదేశ ఆక్రమణమునుండి ఇంగ్లీషువారు భారతదేశము వదలిపోవునప్పటికి రమారమి 1000 సంవత్సరములు హిందువులు పరాధీనులై, స్వాతంత్ర్యరహితులై అనేక కష్టనష్టములకు లోనై సంకటముల ననుభవించిన విషయము అందరికిన్ని విదితము. హిమాలయ సేతుపర్యంతముగల ఈమహత్తయిన భూఖండము నలుబది కోట్ల జనాభాతో కూడినది. పరాధీనమై ఉండుదానిని ఉద్ధరించి భారతీయులకు యిచ్చినారంటే అది సామాన్యమైన కార్యమా! అనగా పాకిస్తానవిభాగము కలుగునప్పుడు నలభై కోట్ల భారతీయులుండిరి.

సూర్యాస్తమయము లేని రాజ్యమును పాలించుచుండెడు ఇంగ్లీషువారి నుండి దీనిని స్వతంత్రముగా చేయుట ఒక మనుష్యమాత్రునికి చేయందగిన కార్యమా! ఇది ఒకటి ఆలోచించుకొన్నన చాలును. అప్పుడు గాంధీగారు మనుష్యమాత్రుడా, లేక అవతారపురుషుడా అని విజ్ఞులు గ్రహించుకొనగలరు. దీనికన్న యెక్కువగా ఈవిషయమై విస్తరించి చెప్పబనిలేదు. గీతయందు విభూతియోగమున చెప్పినది చూడుడు.

శ్లో॥ యద్యద్విభూతిమత్సత్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥

తా॥ భగవద్గుణముగలది ఏ యే వస్తువులుగాని, లేక భగవద్గుణముగల ఏ యే వ్యక్తులుగాని, ఆలాగున దైవసంపత్తున్ను, ఓజస్సుతో కూడినదియగు ఏ వస్తువులుగాని, వ్యక్తులుగాని గలవో అవి యన్నియు నాయొక్క తేజస్సుయొక్క ఒక అంశమువలన గలిగినవని నీవు తెలుసుకొనుము. అట్టి వస్తువులను, అట్టి మానవులను, నన్నువలెనే నీవు శరణు బొందుము. అనగా నా స్వరూపముగా నమ్ముము. అని భగవంతుడు చెప్పిన యీ వాక్యమే చాలును. "మహర్షీణాం భృగురహం" నేను మహర్షులలో భృగుమహర్షిగను, 'గిరామస్మ్యేకమక్షరం' వేదములలో ఏకాక్షరస్వరూపమగు ఓంకారముగను, 'అశ్వత్థస్సర్వవృక్షాణాం' సర్వవృక్షములలో అశ్వత్థవృక్షముగను, 'దేవర్షీణాం చ నారదః' దేవర్షులలో నారదమహర్షిగను, 'సిద్ధానాం కపిలో మునిః' సిద్ధులలో కపిలమునిగను, 'ధేనూనామస్మి కామధుక్' గోవులలో కామధేనువుగను, 'రామః శస్త్రభృతామహం' ఆయుధము ధరించు శూరులలో శ్రీరాముడుగను, 'అధ్యాత్మవిద్యా విద్యానాం' విద్యలలో ఆత్మవిజ్ఞానమునుగురించిన విద్యగను (బ్రహ్మవిద్యగను), 'గాయత్రీ ఛందసామహం' ఛందస్సులలో గాయత్రిగను. 'తేజస్తేజస్వినామహం' తేజస్సుగలవారలలో అధికతేజస్సుగను, 'వృష్ణీనాం వాసుదేవోఽస్మి. పాండవానాం ధనంజయః' యాదవులలో వాసుదేవుడుగను, పాండవులలో ధనంజయుడుగను, 'మునీనామప్యహం వ్యాసః' మునులలో వేదవ్యాసులుగను, 'జ్ఞానం జ్ఞానవతామహం' జ్ఞానులలోగల విశేషజ్ఞానముగను నేనున్నాను. ఇట్లుండగా భగవదంశసంభూతులే గాంధీగారనుటలో అతిశయోక్తి ఏమి గలదు?

ఇక యీ అధ్యాయములో భగవదంశములుగా ఏమేమి చెప్పబడినదో, దానిని విజ్ఞులు చూచుకొనవచ్చును. దేవాసుర సంపద్విభాగ యోగము 16 అధ్యాయమున — మొట్టమొదట దైవగుణమును గురించి 'అభయం సత్త్వసంశుద్ధిః' మొదలు మూడు శ్లోకములలో చెప్పబడిన దైవగుణములన్నియు గలవో లేవో యని విజ్ఞులు చూచుకొనినచాలును. మరియు బీజాంకురన్యాయమును గురించి పదవయధ్యాయమున చెప్పినది చూడుడు — 'యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున' సకల భూతములున్ను గలుగుటకు బీజమేదో, అది నేను. ఈ సత్యమును తెలుసుకొనిన బీజాంకుర న్యాయము చెప్పువారు నిజము నెరుంగగలరు. ఆ విషయము ప్రస్తుతము ఇచ్చట వ్రాయతలంచలేదు. ఈశ్వరాంశమును గురించి భగవంతుడు నిరూపించినది గ్రహించినచాలును. కరెన్సీనోటు చూచిన యీసత్యము మీకు బోధపడగలదు. ఆ నోటు కాగితము గడ్డి పేపరుతో కూడినది. ఏలాటి శృంగారము దానియందు లేదు. అది ఒక దమ్మిడీకి 6 కాగితములు దొరకవచ్చును. అయితే ప్రభుత్వముద్రడుండుట వల్ల, 1, 10, 100, 1000, 5000, 10000 రూపాయలు విలువ గలుగుచున్నది. అదేప్రకారము మానవుడు ఏ జాతిలో ఆశ్రమములో ఉండినను, స్త్రీలుగాని పురుషులుగాని అయినను విరోధములేదు. దైవజ్ఞాన మొకటియే కారణమని భగవానుడు చెప్పినవాక్యమును గ్రహించిన చాలును. సుగంధవాసనగల సబ్బుబిళ్ళపైగల కాగితము ఎంతసుందరమైనను, ఎన్నిరంగులతో గూడినదైనను ఒక దమ్మిడీకైన ప్రయోజనపడదు. అలాగున బ్రాహ్మణులలో జన్మించినను, సన్యాసులైనను విశేషమేమియు లేదు. ఆత్మజ్ఞాన మొక్కటియే విలువగలదని విజ్ఞులు గ్రహించిన చాలును.

---

ఓమ్

## ఆర్షకాలము

ఈ ఆర్షకాలమునకే వేదకాలము, ఆర్యులకాలము అని మొదలగు పేర్లు కలవు. అట్టి కాలధర్మము మనుస్మృతి మొదలగు గ్రంథములలో వర్ణించడమైనది.

శ్లో॥ వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్ ।
అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావసేత్ ॥

తా॥ మూడు వేదములనుగాని, రెండు వేదములనుగాని, లేదకు తన శాఖా వేదమునుగాని గురునికడ బ్రహ్మచర్యము తప్పక అభ్యసించి యావల గృహస్థాశ్రమమును ప్రవేశింపవలయును.

శ్లో॥ సేవేతే మాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్ ।
సన్నియమ్యేన్ద్రియగ్రామం తపో వృద్ధ్యర్థమాత్మనః ॥

తా॥ బ్రహ్మచారి గురుకులమున వసించుచు, ఇంద్రియములను నిరోధించి, యాముష్మికమునందలి తపోభివృద్ధికై ఈ నియమములననుసరింపవలయును.

శ్లో॥ వేదమేవ సదాఽభ్యస్యేత్తపస్తప్స్యన్ ద్విజోత్తమః ।
వేదాభ్యాసో హి విప్రస్య తపః పరమిహోచ్యతే ॥

తా॥ తపంబు జేయగోరు మానవుడు వేదమునే యెల్లప్పు డభ్యసింపవలయును. విప్రునకు వేదాభ్యాసమే ఈ లోకమున గొప్ప తపస్సని చెప్పబడినది.

ఈఆర్షధర్మ మిప్పుడు వ్రాయుటకు కారణమేమన, విద్యార్థిదశ లోనే కొందరు 'ఈవిద్య మాకెందుకు? ఇది పొట్టకూటికొరకే కదా! ఇది మోక్షమునకైన ఉపయోగపడునా? మేము తపస్సు చేసెదము, ధ్యానముచేసెదము, భగవద్భజన చేసెద'మని చెప్పుచు విద్యావిహీనులై పోవుచున్నారు. ఒకవేళ వారికి అప్పుడుకల్గిన వైరాగ్యము కడవరకునిలిచి తపస్సుగాని, ధ్యానముగాని. భజనముగాని చేయుచుండిన మేలే. అట్లు చేయక కొంతకాలము ఏకాంతమున తపస్సుగాని, ధ్యానముగాని, భజన గాని చేయునపుడు మనస్సు నిలువక మరల బహిర్ముఖులై యాచకుల సహవాసముచేసికొని భిక్షాశాకులై తిరుగుచున్నారు. ఈసంగతి విజ్ఞాన దృష్టితో చూచువారందరు తెలిసికొనియేయున్నారు. ఋషివర్గములో చూచిన పురుషుడుగాని, స్త్రీగాని సంపూర్ణ వేదవిద్య లేనివారు ఒక్క రైనను లేరని శాస్త్రము చదువుకొన్నవారందరికి విదితము. మఱియు ఏ ఋతువులో ఏ విత్తనము పెట్టిన స్వల్పప్రయత్నముచే గొప్ప ఫలితము

కలుగునో, ఋతుకాలము తప్పి వేసిన విత్తనము ఎంతపోషించినను సరిగా ఫలము కలుగదో ఆలాగున బాల్యకాలము విద్యాభ్యాసమునకు తగిన తరుణము. అట్టి పవిత్ర సమయమును వృథాజేసి వయస్సు ముదిరిన తర్వాత విద్యాభ్యాసము చేయుటకు ఎంత ప్రయత్నించినను పూర్ణ ఫలమును పొందజాలరు. అంతేగాక తపస్సనగా నేమి? జ్ఞానమనగా నేమి? జ్ఞేయమనగా నేమి? బంధమనగా నేమి? ముక్తి అనగా నేమి? జీవుడనగా నెట్టివాడు? ఈశ్వరుడనగా యెట్టివాడు? జీవేశ్వరుల సంబంధం యెట్టిది? ఇట్టి ధర్మసారము లన్నియు శాస్త్రములు చదువక ఎట్లు తెలిసికొనగలరు? పూర్వకాలపు సన్న్యాసులు, సాధువులు, ఋషులు సార్వభౌములకు, పండితోత్తములకు సహా బ్రహ్మజ్ఞానమును బోధించుటకు శక్తిగలవారై యుండిరి. అందువల్లనే బ్రహ్మవిద్యకు అంత గౌరవము ఆకాలములో ఉండెను. అందువల్ల బ్రహ్మనిష్ఠులు ఏకాంతమున గురుకులములు స్థాపించి జ్ఞానోపదేశము లోకమునకు చేయుదురు. అట్టి బ్రహ్మనిష్ఠులకున్ను, గురుకులవాసము చేయుచుండు బ్రహ్మచారులకున్ను రాజులు, శ్రీమంతులు సహాయ మొనర్చుచుండిరి. ఇట్టి పుణ్యకార్య మొనర్చుటవల్ల గృహస్థులున్ను పవిత్రులైరి; గురుకులవాసముచేయు ముముక్షువులున్ను ధన్యులైరి. అట్టి లోకప్రవర్తనము ఇప్పుడు తారుమారైనందుచేత గృహస్థులున్ను పావనులు గాకపోవుటయేగాక గురుకులవాస విద్యార్థులకు, ముముక్షువులకు, సాధనాపరులకు సహాయము లేకపోవుటవల్ల వీరున్ను తరించుటకు మార్గము లేకపోయెను. అమృతబిందూపనిషత్తున దెలిసిన ఆర్షధర్మమును జూడుడు —

శ్లో॥ గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।
పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః ॥

తా॥ మేధావియొక్క లక్షణము అనగా బుద్ధిమంతునియొక్క స్వభావము ఈ ఉపనిషత్తులో వర్ణించడమైనది. ధాన్యమును గోరెడు రైతు ధాన్యమును పండించి ధాన్యమును తీసుకొనినపిమ్మట వట్టిగడ్డిని విడుచునట్లు మేధాసంపన్నుడు పరోక్ష అపరోక్ష బ్రహ్మజ్ఞానమునందు ఆసక్తిగలవాడై శాస్త్రములను మొట్టమొదట గురుసన్నిధిలో చదివి, బ్రహ్మసాక్షాత్కారము కలిగినపిమ్మట శాస్త్రములను విడువవలయును.

ఇదే ఆర్ష సాంప్రదాయము. వర్తమానయువకులు మంచి హేతువాదము తెలుసుకొన్నవారలు. వారుచేయుప్రశ్న ఏమన, "అన్నముగదా మానవునకు కావలసినది? ఈ గడ్డిగాదము మనుష్యులు తినుదురా? అలాగున జ్ఞానముకదా మోక్షమిచ్చునది? ఈ శాస్త్రము చదివిన ఏమి ప్రయోజనము ?" అయితే పైరును పోషింపక ధాన్యమెట్లులభించును? ధాన్యము లేనిచో అన్నమెట్లు దొరుకును? అంత లోతుగాదిగి దీర్ఘాలోచనచేయక పోవుటవల్లనే యిట్టి ప్రమాదము కల్గుటకు కారణమగుచున్నది. వాస్తవముగా ముక్తిని కలుగచేయునది జ్ఞానమైనను అట్టిజ్ఞానము శాస్త్రవిచారణచేతనే కలుగుచున్నదని వీరూహించుట లేదు. పైరును సంరక్షించునప్పుడు ధాన్యము కనపడదు. కాని పైరును సంరక్షింపకపోయిన ధాన్యము కలుగదు. అలాగున జ్ఞానము కల్గిన పిమ్మట శాస్త్రము అవసరము లేకపోయినను వేదాన్తశాస్త్రము లేనిచో జ్ఞానోదయము కలుగదు అను తత్త్వము లోకము మరచిపోయెను. ఉపయోగముకనబడని పైరునుసంరక్షించునప్పుడే ఉపయోగపడు ధాన్యము కనపడునట్లు వర్తమానమున విద్యవల్ల జ్ఞానము కనుపించకపోయినను తర్వాత విద్యవల్లనే జ్ఞాన మేర్పడెనని వీరు తెలుసుకొనగలరు. మరియొక్క విధముగా చూడుడు. అరటిపండ్లు మనము భుజించవలసియుండిన అరటిచెట్లునే పోషించుచున్నాము. పోషింపబడిన అరటిమానును మనము తినుటలేదు. వర్తమానదృష్టిలో ఉపయోగపడని అరటిచెట్టు పోషించుటవల్లనే ఉపయోగపడు ఫలము కలుగుచున్నదని బహిర్దృష్టిగల జనులు తెలుసుకొనకపోవుచున్నారు. మానవునికి భూతకాలజ్ఞానము, వర్తమానకాలజ్ఞానము, భావికాలజ్ఞానము అని జ్ఞానత్రయము కలదు. వర్తమానకాలజ్ఞానము మాత్రముగల మానవుడు మృగప్రాయుడు. అలాగున భూతభవిష్యత్ కాలములను చింతనచే తెలుసుకొనజాలని మనుష్యుడు మృగప్రాయుడే. భూతకాల కర్మయే వర్తమానజన్మమును కలుగచేసెననియు వర్తమానకర్మమే భావిజన్మమునకు కారణమని తెలిసికొని ప్రవర్తించు మానవుడే నిజమైన జ్ఞానవంతుడగును. ఇప్పుడు ప్రశ్న ఏమన, "మాకు చదువు ఎందుకు ? మాకు ఉద్యోగము కావలెనా ? ఉద్యోగము కావలసినవారికికదా ఈ చదువుఅవసరము" అని ప్రశ్నింతురు. ఒకవేళ ఉద్యో

గము అవసరం లేనప్పటికిన్ని ముముక్షువులు భక్తులు మొదలగువారికి ధర్మమును బోధించుటకు శాస్త్రము తెలియక యెట్లు బోధింపగలరు ? అంతేగాక ఒకఆశ్రమముగాని, మతముగాని ఏర్పరచి నడుపునపుడు విద్య లేనిచో ఏమి చేయగలరు ? మరియు ముముక్షువులలో, జిజ్ఞాసులలో, భక్తులలో చాలామందిన్ని బీదరికములో ఉండువారు గలరు. ప్రస్తుతము వారి గురువులో, తల్లిదండ్రులో లేక మరియొకరో వీరిని పోషించుచుం దురు. వారి కాలానంతరము వీరెట్లు జీవించగలరు ? శాస్త్రజ్ఞానముకల్గి ఉండిన పదిమందికి శాస్త్రము చెప్పుచూ తనజీవితమును ప్రశాంతముగా గడుపవచ్చునుకదా ? అపుడు స్వతంత్రముగా ఉండి జీవితాంతమువరకు సుఖింపవచ్చును. అట్లుగాకపోయిన జీవితాంతమువరకు పరాధీనులై ఉండవలెనని వీరు యోచించుటలేదు. ఒకవేళ విద్యకల్గియుండిన ధర్మ బద్ధమగు ఉద్యోగము చేయుచుగూడ బ్రహ్మజ్ఞానము సంపాదించుకొన వచ్చునుకదా ! కావున ఈలోకమునకైనను, పరలోకమునకైనను విద్య యెంతో ఉపయోగపడును. ఈ విషయమునే శ్రీకృష్ణభగవానుడు ఉత్తర గీతలో చెప్పెను—

శ్లో॥ శాస్త్రాణ్యధీత్య మేధావీ అభ్యస్య చ పునః పునః ।
పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్ ॥

ఈ శ్లోకములోకూడా మేధావీ అని ప్రయోగించుటవల్ల బుద్ధి మంతునియొక్క లక్షణము యీలాగున నుండునని నిరూపించడమైనది. ప్రజ్ఞావంతుడగువాడు వేదాన్తశాస్త్రమును చక్కగా చదివి ఆ శాస్త్రా ర్థమును మాటిమాటికి నభ్యసించి ప్రత్యగాత్మరూప పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొని పిమ్మట — అన్నము ఉడికినపిమ్మట కొరివికట్టెలను విడుచునట్లు — ఆ శాస్త్రములన్నిటిని విడువవచ్చునని శ్రీకృష్ణభగవా నులు చెప్పుచున్నారు.

కట్టెలు, పాత్రలు లేనిచో నెట్లు అన్నమును వండగలము ? "కట్టెలను తినెదమా ? పాత్రలను తినగలమా ? పొయ్యిని తినెదమా ? నిప్పును తినెదమా ? కావలసినది అన్నమేకదా" అని చెప్పెడివారు ఎంత ప్రజ్ఞావంతులో లోకమే తెలుసుకొనుగాక. అన్నము పక్వము అగువరకు

పైజెప్పిన సాధనము లెట్లుండవలయునో అట్లే జ్ఞానవిజ్ఞాన సంపూర్ణము కల్గువరకు శాస్త్రాధ్యయనము తప్పనిసరిగా నుండవలెను.

శ్లో॥ ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్పవివర్జితం।
జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్॥

తా॥ ఫలమునకు పుష్పమున్ను, పుష్పమునకు వృక్షమున్ను, వృక్షమునకు సంరక్షణమున్ను ఏలాగున ఒకదానికొకటి ఆధారపడియుండునో ఆలాగున జ్ఞానమనెడి ఫలమునకు భక్తియను పుష్పమున్ను, భక్తియను పుష్పమునకు నిష్కామకర్మయోగమను వృక్షమున్ను, నిష్కామ కర్మయోగమను వృక్షమునకు పుణ్యకర్మానుష్ఠానమను సంరక్షణమును కల్గియుండవలెనని శాస్త్రము విధించుచున్నది. ఈలాగున పరంపరగా ఒకదానికొకటి ఆధారపడియుండగా "పండ్లు మాత్రమునకు నా మనుష్యులు తినరు? చెట్లను ఆకులను మనుష్యులు భుజింతురా?" అని అడిగెడు వారి ప్రజ్ఞ యెంత గొప్పదో విజ్ఞులే గ్రహింతురుగాక. వృక్షమును సంరక్షించక ఫలముయొక్క మాధుర్యమును, దానిచే కలిగెడు ఆరోగ్యమును, భుజించిన గలిగెడు సుఖమునుమాత్రము, నోరూరునట్లు ఎంతకాలము వర్ణనచేయుచుండినను ఎట్లు అతనికి ఒకపండైన లభించదో, అట్లుగాక వృక్షమును సంరక్షించినచో స్వయముగా ప్రకాండము పల్లవించి పుష్పించి అప్రయత్నముగా ఫలము పరిపక్వమై క్రిందికి ఎట్లు వ్రాలునో అట్లే తాను అనుష్ఠించవలసిన విధానమును శాస్త్రముద్వారా అనుసరించి చేయుచుండిన బ్రహ్మానందరూపఫలము స్వయముగానే కలుగును. కనుకనే మనుమహర్షి ఇట్లుచెప్పుటకు కారణము: 'వేదాభ్యాసో హి విప్రస్య తపః పరమిహోచ్యతే' వేదాధ్యయనమే ఉత్తమమానవునికి గొప్పదగు తపస్సని గ్రహించవలయును. శ్రీకృష్ణభగవానుడున్ను గీతలో నీలాగున వచించిరి: 'స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే' అధ్యయనమే తపస్సులన్నింటిలోను ముఖ్యమైన వాక్తపస్సని దీనియొక్క భావము.

శ్లో॥ అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే।
ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్॥

తా॥ గురు శాస్త్రోక్తప్రకారము అనుష్ఠానముచేయక, జ్ఞానమును పొందక కేవలము శాస్త్రముమాత్రము చదివి ఆనందించెడి వాడు జలా

శయతీరమున చెట్టుకొమ్మలలో పండియుండు ఫలములు నీటిలో ప్రతిబిం బించినది చూచి జలములో దిగి ఫలములను పట్టుకొని భుజించిన రుచి ఏలాగున ఉండునో, ఎంత ఆనందము కలుగునో ఆలాగున అనుష్ఠానము చేయక అనుభవించెడివాని జ్ఞానమున్ను వుండునని మైత్రేయ్యుపనిషత్తు దెలుపుచున్నది. మరియు శ్రీకృష్ణభగవానుడు ఉత్తర గీతయందు ఉపదే శించినది చూడుడు—

శ్లో॥ నావార్థీ హి భవేత్తావత్ యావత్పారం న గచ్ఛతి।
ఉత్తీర్ణేతు సరిత్పారే నావయా కిం ప్రయోజనమ్॥

తా॥ ఎంతవఱకు నది ఆవలదరిని జేరడో అంతవరకు నదిని దాటుటకై పడవను గోరువాడగుచున్నాడు. ఏరు దాటినమీాద ఆ నావ ఉపయోగములేదు.

వి॥ ఎంత సుందరమైన ఉదాహరణమును భగవానుడు చూపెనో యిది గ్రహించిన చాలును. నది దాటినతర్వాత పడవ అవసరము లేక పోవచ్చును. పడవ లేక నదిని ఎట్లు దాటజాలరో ఆలాగున జ్ఞానవిజ్ఞాన సంపన్నుడైన పిమ్మట శాస్త్రము లేకపోవచ్చును. శాస్త్రమను ఓడ లేనిచో సంసారసాగర మెట్లు దాటగలము? అను తత్త్వము జనులు మరచిపోవుచున్నారు! మరియు దీనియందొక రహస్యము కలదు. నది దాటిపోయినవారికి పడవ అవసరములేదు గాని దాటించేవాడు పడవను త్యజించి వెళ్ళడు. పడవను భద్రముగా నుంచును. ఎందుకనగా ఆవల నుండు జనులను మరల దాటించుటకు అవసరము. అలాగున మనుజులలో దాటేవారు, దాటించువారు అను యిరుతెగలవారు గలరు. ముక్తులైన వారలలో కొందరు యితరులు తరించవలెనను తలంపుతో పనిచేయరు. బద్ధులను విముక్తిచేయ తలంచు ముక్తులైన జీవన్ముక్తులు తమ జీవి తాంతమువరకు శాస్త్రోక్తానుష్ఠానములను ఆచరించుకొనియే యుందురు. కావున ఈ విషయమై వేదాంత పంచదశి తెలిపినది చూడుడు. ఇది గ్రహించిన యెంతవరకు శాస్త్రవిచారణ కావలెనో గోచరము కాగలదు.

శ్లో॥ ఆసుప్తేరామృతేః కాలం నయేద్వేదాంతచింతయా।
దద్యాన్నావసరం కించిత్కామాదీనాం మనాగితి॥

తా॥ ప్రాతఃకాలములో లేచి మరల రాత్రి నిద్రపోవువరకున్ను, జన్మించిన పిమ్మట మరణము కలుగువరకున్ను కాలమును వేదాంత చింతనముచేత గడుపవలయును. కామాదులకున్ను, మనోసంకల్పములకున్ను కొంచెమైనను కాలమును వ్యర్థము చేయరాదు. అని చెప్పిన వాక్యమే ప్రమాణమునకు చాలదా!

మరియు శ్రీవిద్యారణ్యులు చెప్పినది చూడుడు. బ్రహ్మవేత్తలు, ఆత్మజ్ఞానులు ఎల్లప్పుడు ఎట్లు ఉండవలయునో ఈ క్రింది ప్రమాణము నిర్ణయించుచున్నది:

శ్లో॥ జపేచ్చ ప్రణవం నిత్యం జితాత్మా విజితేన్ద్రియః ।
పఠేదుపనిషద్వాక్యం వేదాన్తార్థాంశ్చ చిన్తయేత్ ॥

తా॥ సకలేన్ద్రియముల నిగ్రహించి మనస్సును జయించినవాడు సర్వదా ప్రణవ మన్త్రమును జపించవలయును. ఉపనిషత్తులను పఠించవలయును. వేదాంతార్థముల చిన్తించవలయును.

---

ఓమ్

## మానవుడెట్లు మాధవుడగును ?

మాధవుడు యెట్లు మానవుడైనాడో, మానవుడు మరల ఎలాగున మాధవుడౌనో ఈ విషయము విజ్ఞులందరు గ్రహించుకొనదగినది. అనగా ఈ విషయమై శ్రీ భగవద్గీత గుణత్రయవిభాగయోగమను 14-వ అధ్యాయమున శ్రీ భగవానుడు తెలిపినవి చూడుడు.

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్॥

తా॥ ఓ అర్జునా! నాశరహితుడైన దేహస్థుడగు ఆత్మను దేహమునందు ప్రకృతివలన బుట్టిన సత్త్వరజస్తమో గుణములు బంధించుచున్నవి. సత్త్వగుణము యెట్లు బంధించును ?

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ॥

తా॥ ఓ యర్జునా! ఆ సత్త్వరజస్తమస్సులనెడి మూడుగుణము లలో మొదటిదియగు సత్త్వగుణము నిర్మలమైనదగుటవలన ప్రకాశింప జేయునదియు, ఆరోగ్యకరమైనదియునై ఇంద్రియసుఖములతో గూడుట చేతను, ప్రపంచజ్ఞానముతో చేర్చుటచేతను బంధించుచున్నది. ఇచట చెప్పిన సత్త్వగుణము మిశ్రసత్త్వగుణమేగాని, విశుద్ధ సత్త్వగుణము కాదు. విశుద్ధసత్త్వములోమాత్రమే ఆత్మజ్ఞానము ఉదయించును. ఇది సుకుమారముచేత ఆత్మనుబంధించును. కావుననే 'సుఖసంగేన బధ్నాతి' అని తెలుపుటకు కారణమైనది.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్॥

తా॥ ఓ అర్జునా! రజోగుణము ఆశాపాశములచే గలుగునదనియు, దృశ్యవిషయములయెడ ప్రీతిగలుగజేయునదనియు నెఱుంగుము. ఆ కారణమువలన ఆ రజోగుణము దేహస్థితుడగుజీవుని ఐహికాముష్మికకామ్యకర్మల సంగముచేత బంధించుచున్నది. కావుననే 'రజో రాగాత్మకం విద్ధి' అని ప్రయోగించుటకు కారణమైనది.

శ్లో॥ తమస్త్వజ్ఞానజం విద్ధి మోహానం సర్వదేహినామ్।
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత॥

తా॥ ఇది మంచి, యిది చెడుగు అని తెలిసికొనజాలని అజ్ఞానము వలన గలిగినదియు, సకలప్రాణులకును మోహమును గలుగజేయునదియు నగు తమోగుణము భ్రమ, సోమరితనము, అతినిద్ర అనువానిచే ఆత్మను బంధించుచున్నది. ఆ హేతువువల్లనే "నిద్రాలస్యప్రమాదోత్థమ్" అని ప్రయోగించుటకు హేతువైనది. అతినిద్రను, అతిభోజనమును తమోగుణస్థులే గలిగియుందురు. అల్పాహారము, స్వల్పనిద్ర కలిగియే బ్రహ్మనిష్ఠు లుందురు. ఇదే వీరియొక్క గురుతు. ఇక ఈ మూడు గుణముల నుండి యెట్లు ఆత్మవిముక్తిని పొందగలుగునో ఆ విషయము 20-వ శ్లోకమున శ్రీకృష్ణుడు తెలిపినది చూడుడు.

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే॥

తా॥ ఆత్మ దేహోత్పత్తికి బీజభూతములగు సత్త్వరజస్తమో గుణములను మూడింటిని అతిక్రమించి జననము, మరణము, వార్ధక్యము, దుఃఖము అనువానిచేత విడువబడినవాడై మోక్షమును పొందు చున్నాడు.

ఈవిషయమై ముముక్షువులకు ఒక సందేహము కలుగవచ్చును. అదేమన; దేవుడు యెట్లు మానవుడైనాడు దానిని వివరించలేను. ఆత్మ లేక జీవుడు యెట్లు బంధింపబడెను? తరువాత ఎట్లు ముక్తినొందగలు గును? అనిమాత్రము తెలుపబడెను. ఈ విషయమై గీతలోగాక ఉపని షత్తులలో పరమాత్మయే ఆత్మయైనదనియు, శివుడే జీవుడయ్యెననియు, మరల విముక్తిగలుగునపుడు ఆత్మయే పరమాత్మయగుననియు, జీవుడే శివుడగుననియు చెప్పెడు ప్రమాణము లనేకములుగలవు. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమగు 13-వ అధ్యాయమున —

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

తా॥ ఓ యర్జునా! ఈ దేహము క్షేత్రమనియు చెప్పబడుచున్నది. దీనిని (అనగా క్షేత్రధర్మమును) యెవ డెరుంగుచున్నాడో వానిని క్షేత్రజ్ఞుడని క్షేత్రక్షేత్రజ్ఞుల నెరింగినవారు చెప్పుదురు. క్షేత్రమనగా దేవాలయము. దేవాలయమున నుండువాడు దేవుడుగాక మరి యెవ డగును? కావుననే ఈ విషయములో సందేహము వచ్చునని తలంచియే క్రిందిశ్లోకమున—

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ॥

తా॥ ఓ యర్జునా! సమస్త దేహములయందుండెడి క్షేత్రజ్ఞుని (జీవుని) నన్నుగా యెఱుంగుము. దేహ ఆత్మలయొక్క స్వరూపముల నెరుగునది ఏదిగలదో అదియే జ్ఞానమని నా సమ్మతము. 'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి' అని ప్రయోగించుటవల్ల క్షేత్రజ్ఞుడగు జీవుని నన్నుగా, అనగా భగవత్స్వరూపముగా నెరుంగుము అని చెప్పఁబడినది గదా! ఈలాటి వాక్యములు గీతలో అనేకములు గలవు. 7-వ అధ్యాయమున

శ్లో॥ 18; 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' ఆత్మజ్ఞానియయితే నాయొక్క స్వరూపుడనియే నాయొక్క మతము అని యిచట స్పష్టముగా తెలుపబడి నైనదిగదా! మరియు (అ. 18, శ్లో॥ 61)

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

తా॥ ఓ యర్జునా! సమస్త ప్రాణులకు నియామకుడగుపరమాత్మ దేహములనెడి యంత్రముల నధిష్ఠించియున్న సమస్తప్రాణులను మాయ చేత త్రిప్పుచు హృదయస్థానమునందు ఉంటున్నాడు. ఇచట స్పష్టముగా యీ విషయము తెలుపబడమైనది. "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అని తెలుపబడమైనదిగదా! మచ్చునకు ఇంతమాత్రము నిరూపించబడమైనది. లేనిచో వ్యాసము విస్తారముగా పెరిగిపోవును. ఈ తత్త్వమును ఆధారము చేసుకొనియే అజపామంత్రము సోఽహంభావ మున ఇట్లు తెలుపుటకు కారణము.

శ్లో॥ దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవ స్సదాశివః।
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్॥

ఇచట ఈ దేహమునే దేవాలయముగాను, జీవునినే సదాశివుని గాను వర్ణించబడమైనది. ఇట్టి సోఽహంభావన గలిగియుండుటయే దైవ ప్రాప్తియని తెలుపబడమైనది. మహావాక్యోపదేశమునందును ఈరహస్య మునే నిరూపించబడమైనది. మొట్టమొదట ప్రజ్ఞానం బ్రహ్మమని ఉపదే శించబడమైనది. కావుననే 'ప్రజ్ఞానం బ్రహ్మ' అని మొదట ఉపదేశించుట కును, మరల 'అహం బ్రహ్మాస్మి' అని తెలుపుటకును, పిమ్మట 'తత్త్వ మసి' అని బోధించుటకును, తరువాత 'అయమాత్మా బ్రహ్మ' అని నిర్ణయించుటకును కారణమైనది. ఈ నాలుగు మహావాక్యములను మహావాక్యమను గ్రంథమున కనుగొననగును. అదంతయు నిచట నిరూ పించిన ఈ వ్యాసము చాల విస్తారమగును. ఇక మాధవుండు యెట్లు మానవుడైనాడో దానిని గురించి సంగ్రహముగా తెలిపెద. శ్రీమద్భా గవతమున దశావతారములను గురించిన ఘట్టమును చూడుడు—

శ్లో॥ మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః।
రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కల్కిరేవ చ॥

ఇచట శ్రీ బుద్ధావతారమునుగురించిమాత్రమే తీసికొనబడినది. బుద్ధుడు శ్రీ నారాయణుని నవమావతారమని అందరును యెఱింగిన విషయమే. బుద్ధదేవుడు శుద్ధోదనమహారాజు మాయాదేవులకు పుట్టెను. ఈమహాత్ముడు యశోధరను వివాహము చేసుకొని, రాహులుడను పుత్రునికని, గృహస్థాశ్రమమునందున్నప్పుడు సిద్ధార్థుడని పేరుగలిగియుండెనే గాని, శ్రీ బుద్ధదేవుడని యెవరున్ను పిలువలేదు. తరువాత ప్రపంచ సంబంధములన్నిటినివిడిచి బుద్ధగయయందు చాలాకాలముతపముసల్పి ప్రకృతిసంబంధమైన త్రిగుణములరహిత మునసల్పునప్పుడు సిద్ధార్థుడు శ్రీ బుద్ధదేవుడాయెను. అప్పుడాయన విగ్రహములను నిర్మించి బౌద్ధ విహారములలో బుద్ధదేవుడుగాను, బుద్ధభగవానుడను నామముతో పూజించుటకు లోకము ఆరంభించెను. ఇప్పుడు విగ్రహరూపముగాను, పటములరూపముగాను యీ బుద్ధుని దేవునిగాభావించి లోకమంతట జనులు ఆరాధించుచున్నారు. ఇదే మాధవుడు మానవుడగుటయు, తరువాత మానవుడుమాధవుడగుటయును చెప్పినదని గ్రహించుకొనేది. అట్లు శ్రీ గీతయందు మాయగుణములతో గూడియున్నప్పుడు పరమాత్మ ఆత్మయైనదనియు, మాయగుణములనుండి విముక్తిబొందినప్పుడు ఆత్మయే పరమాత్మయైనదనియు చెప్పినదానిని ముముక్షువులగువారు సదా హృదయములో నుంచుకొనవలయును. జీవుడు శివుడుగా తయారుగావలసియుండిన మంచిపరిశ్రమ చేయవలయును. రాయి దేవుడుగావలసియుండిన శిల్పి యెంతపనిచేయవలయునో ఆలాగున యీ జీవుడు శివుడు కావలసియుండిన అంతపని చేయవలసియుండును. కావుననే మోక్షము సోమరులకు దొరికే మార్గము కాదనియు, సోఽహంపదములు నడచేదారియనియు చెప్పుటకు కారణము. ఈవిషయమై శ్రీ వసిష్ఠమునీంద్రుడు యోగవాసిష్ఠములో చెప్పినదానిని చూడుడు.

శ్లో॥ యథైకం చ సువర్ణాదిమిళితం రజతాదినా ।
అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహంయుతః ॥
యథైవ హి సువర్ణాదిక్షారాద్యైః శోధితం శుభం ।
పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతః ॥

తా॥ ఏలాగు అపరంజి బంగారము వెండి, రాగి మొదలగు లోహములతో కలియునప్పుడు స్వల్ప వెలగలదగుచున్నదో, బంగారు వ్యాపారస్థులు దానిని తీసుకొని స్ఫుటముచేయునప్పుడు ఇతర లోహములు తొలగినందుచే మరల అపరంజి విలువను పొందుచున్నదో, ఆలాగున జీవుడు తన దైవత్వమును మరచినందుచే దీనావస్థను పొందుచున్నాడు. రజత తామ్రాదులను స్ఫుటముచేసి సువర్ణమునుండి తొలగించునప్పుడు ఏలాగున అపరంజి బంగారువిలువను పొందుచున్నదో ఆలాగున జీవుని సంస్కరించి ప్రకృతిస్వభావమగు మూడుగుణములనుండి విముక్తిచేయునప్పుడు శివత్వమును పొందుచున్నాడు. ఓహో! ఎంత సుందరమైన దృష్టాంతమును శ్రీ వసిష్ఠమునీంద్రుడు తెలిపెనో దీని నొక్కదానిని గ్రహించుకొనిన చాలును ఇప్పుడు లోకారాధ్యులగు మహాత్ములందరున్ను ప్రాకృతగుణము లేనివారుగదా! ప్రకృతిగుణములతో గూడినవారి నెవరినిన్ని దేవుడుగాభావించి పూజించుట లేదుగదా! ఇక నీచములగు, నికృష్టములగు గుణములతో కూడిన మానవులను పశువులకన్న అతి నీచముగ చూచుటగూడ కనబడుచున్నదికదా! కావున యీవిషయమును లోకపూజ్యులుగా, దైవసదృశులుగా, జీవన్ముక్తులుగా కావలెనని తలంచువారందరున్ను జ్ఞప్తిలో నుంచుకొనవలయును. ఇంకనువినుడు: 'శంకరశ్శంకరస్సాక్షాత్' శ్రీశంకరాచార్యులవారు సాక్షాదీశ్వరునియొక్క అవతారమనియే లోకము తలంచుచున్నది. ఆర్యాంబా శివగురువులకు పుట్టి, బ్రహ్మచారియై, అధ్యయనము చేయుచున్నప్పుడు వారిని శంకరాచార్యులుగాను, జగద్గురువులుగాను, ఈశ్వరావతారముగాను ఎవరున్ను తలంచలేదు. ఈదివ్యపురుషుడు సర్వసంగపరిత్యాగియై, నర్మదాతీరమున గుహలో తపమొనర్చుచుండు గోవిందభగవత్పాదుల నాశ్రయించి తపమొనర్చి ఆత్మకుగల ప్రకృతిదోషములను రహితమొనర్చినప్పుడు యీ మహాత్ముడు శంకరుండయ్యెను అనగా ఈశ్వరుడయ్యెను. ఇదే దేవుడు మానవత్వము నొందుటయు, మానవుడు దేవుడగుటయు అని గ్రహించుకొనవలయును. శంకరులు ఈశ్వరత్వమునొందనంతవరకు ఎవరున్ను వారి విగ్రహములను ప్రతిష్ఠించి పూజించుటగాని, పటములను ఆరాధించుటగాని చేయలేదు. ఈశ్వరత్వము పొందినపిమ్మ

టనే జగద్గురువుగా, ఈశ్వరునిగా లోకము భావించి ఆరాధించుటకు ప్రారంభించెను. ఈ విషయమై ఆత్మబోధయందు శంకరులు యీ శ్లోకమును వచించిరి :

శ్లో॥ శ్రవణాదిభి రుద్దీప్తః జ్ఞానాగ్ని పరితాపితః।
జీవస్సర్వ మలాన్ముక్తః స్వర్ణవత్ ద్యోతతే స్వయమ్॥

తా॥ శ్రవణమనన నిదిధ్యాసములను నగ్నియందు యీ జీవుని స్ఫుటముచేసినచో, మలినలోహములు చేరిన తెల్లబంగారమును అగ్నియందు స్ఫుటముచేసినచో ఏలాగున అపరంజి బంగారమగుచున్నదో, ఆలాగున జ్ఞానాగ్నియను తపస్సునందు యీ జీవుని స్ఫుటముచేసిన జీవత్వము పోయి శివత్వము నందగలుగును. ఇదిన్ని (శ్రీ) వసిష్ఠులు చెప్పినదివలెనే ఉంటున్నది. మరియు అపరోక్షానుభూతియందు శంకరభగవత్పాదులు యీలాగున తెలిపిరి :

"భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా।
పుమాన్ తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేజే భ్రమరకీటవత్॥

తా॥ భ్రమరము కీటకమును తెచ్చి గూటిలోపెట్టి ఓంకారధ్వని చేయునప్పుడు ఆ క్రిమి దానిని భావన చేసిచేసి ఏలాగున తుమ్మెదయై బయటికి వచ్చుచున్నదో, ఆలాగున జీవుడు ఓంకారము నుచ్చరించి ఓంకారార్థమగు పరబ్రహ్మమును ధ్యానము చేయుచు రాగా రాగా శివత్వమును పొందగలుగును. దీనికన్న సారమగు రహస్యమేమిగలదు? పతంజలి మహర్షియు యీలాగున యోగశాస్త్రమందు వచించిరి :

సూ॥ కాయేన శుద్ధిరశుద్ధ క్షయా త్తపసః

తా॥ ఆత్మకుకలిగిన కాయేంద్రియముల అశుద్ధము మాలిన్యము తపస్సువల్ల నశించును.



ఓమ్

# దృఢాభ్యాసము

శ్లో॥ యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ ।
త్వామనుస్మరతస్సా మే హృదయాన్మాపసర్పతు ॥

తా॥ ఓ విష్ణుదేవా! ఆత్మజ్ఞానశూన్యులగు పామరులకు స్త్రీ పుష్పాది విషయములయందు దృఢమైన యే ప్రీతిగలదో నీయందు నాకు గల అటువంటి ప్రీతి సర్వదా నిన్ను చింతించెడి నామనస్సునందు యెల్లప్పుడు ఉండేలాగున చేయుము. ఇచటినుండి వ్రాయు విషయములు ఒకటి భక్తిపరముగాను, మరియొకటి ఆత్మజ్ఞానపరముగాను ఉండునని గ్రహించుకొనవలయును.

శ్లో॥ ఇతి న్యాయేన సర్వస్మాద్భోగ్యజాతాద్విరక్తధీః ।
ఉపసంహృత్య తాం ప్రీతిం భోక్తర్యేవ బుభుత్సతే ॥

తా॥ ఈ చెప్పబడిన పురాణన్యాయముచేత భర్తృభార్యాది లక్షణములుగల భోగ్యప్రపంచమందు విరక్తబుద్ధిగలవాడు భర్తృభార్యాది లక్షణములుగల భోగ్యపదార్థరాశినుంచి, భోగ్యగోచరప్రీతిని మరలించి ఆప్రీతినంతయు భోక్తయగు తనయందుంచుకొని కూటస్థాత్మ నెరుగుట కిచ్ఛయించుచున్నాడు. లేక ఈశ్వరునియందుంచిఅనిగాని గ్రహించవలెను.

శ్లో॥ స్రక్చందన వధూవస్త్ర సువర్ణాదిషు పామరః ।
అప్రమత్తో యథా తద్వన్న ప్రమాద్యతి భోక్తరి ॥

తా॥ మరియు పామరుడు పుష్పచందన స్త్రీ వస్త్ర సువర్ణాది విషయసుఖములను బొందుటకు ఆ విషయములను సర్వదా చింతించుచున్నట్లు ముముక్షువు భోక్తయగు ఆత్మవిషయమునందు పొరబాటును బొందక సర్వదా ఆయాత్మను చింతించుచుండవలయును.

శ్లో॥ కావ్యనాటకతర్కాదిమభ్యస్యతి నిరంతరం ।
విజిగీషుర్యథా తద్వన్ముముక్షుస్స్వం విచారయేత్ ॥

తా॥ ప్రతివాదులను జయించుటకు యిచ్ఛయించినవాడు కావ్యనాటక తర్క వ్యాకరణాది శాస్త్రములను సర్వదా అభ్యసించునట్లు ముముక్షువును తానైన ఆత్మను సర్వదా విచారించుచున్నాడు. అనగా

శాస్త్రవాదమందు ప్రతివాదిని జయించుటకు యిచ్ఛగలవాడు నిరంతరము అనేక శాస్త్రప్రమాణముల నెట్లు విచారణ చేయుచుండునో ఆలాగున విచారణ చేయుచుండవలయును.

శ్లో॥ జపయోగోపాసనాది శ్రద్ధయా కురుతే యథా।
స్వర్గాదివాంఛయా తద్వ చ్ఛ్రద్ధధ్యాత్మ్వే ముముక్షయా॥

తా॥ స్వర్గలోక బ్రహ్మలోకాదులను గోరెడి వైదికుడు ఆయా లోకవిషయక వాంఛచేత శ్రద్ధాపూర్వకముగా జపయజ్ఞోపాసనాదికముల జేసినట్లు ముముక్షువును మోక్షేచ్ఛచేత శ్రుతిప్రోక్తమగు ఆత్మయైన తనయందు విశ్వాసము గలవాడగును.

శ్లో॥ చిత్తైకాగ్ర్యం యథా యోగీ మహాయాసేన సాధయేత్।
అణిమాదిప్రేప్సయైవం వివిచ్యాత్మ్వం ముముక్షయా॥

తా॥ మరియు యోగాభ్యాసము చేయువాడు అణిమాద్యష్టైశ్వర్య లాభేచ్ఛచేత మహాయాసముతోటి ఏ ప్రకారముగా చిత్తైకాగ్ర్యమును సంపాదించునో ఆ ప్రకారము ముముక్షువును ఆత్మయగు తనను సర్వదా దేహాదులవల్ల విభజించి యెఱుగును.

శ్లో॥ కౌశలాని వివర్ధంతే తేషా మభ్యాసపాటవాత్।
యథా తద్వద్వివేకో స్యాప్యభ్యాసా ద్విశదాయతే॥

తా॥ ఆ కావ్యాదుల నభ్యసించెడివారికి అభ్యాసపాటవముచేత ఆయావిషయములయందు బుద్ధికౌశలత్వము వృద్ధిబొందుచున్నది. ఆ ప్రకారమే, ఈ ముముక్షువునకును అభ్యాసమువల్ల దేహాదులకంటె ఆత్మ భిన్నుడనెడి జ్ఞానము స్పష్టత్వమును బొందుచున్నది.

ఈ విషయమై సీతారామాంజనేయములో చెప్పినది చూడుడు. అయితే ఇది యిచ్చట మంచివిషయము గాకపోయినను లోకమంతయు అట్టి అవిద్యలో పడియుండుటవల్ల యీలాటి దృష్టాంతముల చెప్పిన త్వరలో గ్రహించగలరని తలంచియే మహనీయులగువారు గూడ యీలాటిదానిని చెప్పుటకు కారణము.

చ॥ పరపురుషానురక్తిగల భామిని యెల్లపనుల్ గృహంబునన్
బోరిబోరి చేయుచుం బ్రియునిపొందు సుఖంబుగ జూచు రీతి, భా

స్వరపరతత్త్వవేది నిజవర్ణనిజాశ్రమయోగ్యధర్మముల్
నిరతము సల్పుచుం బరమనిర్మలసౌఖ్యము గాంచు నెమ్మదిన్.

గీతలోను యీలాగున తెలుపడమైనది.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ॥

తా॥ నేనే పరమాత్మయను తత్త్వమును గుర్తెఱింగిన బుద్ధిమంతులు భగవంతుడనైన నాయందు చిత్తముగలవారును, తదేకధ్యానముగా నన్ను చెందిన సకలేంద్రియములు గలవారును, ఒకరికొకరు శ్రుతులచేతను, యుక్తియుక్తములగు వాక్యములచేతను, తమకు గలిగిన అనుభవముచేతను చర్చించువారును, నన్ను భక్తులకొరకు ఉపదేశించుచున్నవారునునై యెల్లప్పుడును యిట్టి పరమాత్మను ధ్యానించుట, స్మరించుట, దర్శించుట మొదలగునవి కలిగియుందురు. ఇంతకంటె మనకేమి కావలెనని తలంచి తమలో తాము సంతోషించుచున్నారు. అంతేగాక ఆత్మారాములై పరమానందము ననుభవించుచున్నారు. ఉత్తమభక్తులయొక్కయు, తీవ్ర ముముక్షువులయొక్కయు లక్షణ మీలాగున యుండునేగాని వ్యర్థముగా మాట్లాడి కాలమును వృథాచేయరు. పంచదశియందు బ్రహ్మాభ్యాసమునుగురించి చెప్పినది చూడుడు —

శ్లో॥ తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥

తా॥ ఆ ప్రత్యగాత్మస్వరూపమును చింతించుటయు, ఆ బ్రహ్మస్వరూపమునుగురించి సంభాషించుటయు, ఒకరికొకరు ఆ పరబ్రహ్మస్వరూపమునుగూర్చి చర్చించుటయు,(లేక గురుశిష్యసంవాదముద్వారా ఆ బ్రహ్మస్వరూపమును తెలిసికొనుటయు) ఈ ప్రత్యగాత్మయందు చిత్తైకాగ్ర్య నిదిధ్యాసంబును, ఈ చెప్పబడిన విషయములను, బ్రహ్మాభ్యాసమును బ్రహ్మవేత్తలు తెలిసికొనిరి. ఇక యీ విషయమై శ్రీ శంకరభగవత్పాదులు శివానందలహరిలో తెలిపినది చూడుడు —

శ్లో॥ అంకోలం నిజబీజసంతతిరయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిధుం లతా క్షితిరుహాం సింధుస్సరిద్వల్లభమ్॥

ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం।
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే॥

తా॥ ఊడుగగింజలు పండి నేల రాలిపోయి మరల వానికవియే ఆచెట్టు నంటుకొనునట్లును, సూది సూదంటురాయి నంటుకొని విడనట్లును, పతివ్రత తనపతిని యెన్నడును యెడబాయక వెంబడించియున్నట్లును, లేక దేశాంతరమువెళ్ళిన పతిని యెల్లప్పుడు తలంచుచున్నట్లును, తీగ చెట్టునల్లుకొని వేరుపడకుండునట్లును, నదులు యెల్లప్పుడు ప్రవహించుచు సముద్రములో లీనమగునట్లున్ను మనోవృత్తి ఈశ్వరుని పాదారవిందములయందు యెల్లప్పుడును ఉండుటయే భక్తియనబడును. ఆత్మయందు నిరంతరము భావన కలిగియుండుటయే జ్ఞానమని గ్రహించదగినది.

శ్లో॥ హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా।
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్॥

తా॥ ఓ సర్వేశ్వరా ! హంస పద్మవనమును, చాతకపక్షి వర్షాకాల మేఘమును, చక్రవాకము సూర్యోదయమును, చకోరము చంద్రోదయమును సదా కోరుచున్నట్లు ఉపనిషద్వేద్యమై కైవల్యసౌఖ్యము నొసగునట్టి నీ పాదకమలములను యెల్లప్పుడు నా చిత్తముకోరుచున్నది.

---

ఓమ్

## మానవుడెట్లు మాధవుడగును ?

మరియు యోగశాస్త్రమున ఏలాగున శంఖపాషాణము, గంధకము మొదలైన ధాతువులు స్ఫుటము చేయుటవల్ల వానియందుగల విషదోషము నశించి శుద్ధదివ్యభస్మమగుచున్నదో, ఆలాగున ప్రాణాయామ తపస్సువల్ల జీవునియొక్క విషయదోషము నశించి, శుద్ధ శివ స్వరూపుడగుచున్నాడు అని చెప్పబడియున్నది. ఉపనిషత్తులున్ను యీలాగుననే తెలుపుచున్నవి. "తపసా కిల్బిషం హన్తి విద్యయా

మృతమశ్నుతే” తపస్సువల్ల జీవునియొక్క సర్వదోషములు నశించు చున్నవి. బ్రహ్మవిద్యచేత అమృతత్వమును పొందుచున్నాడు. ఈలాగున గురునానక్కుగారి చరిత్రమున్ను గ్రహించుకొనవలెను. నానక్కుగారు త్రిప్తాదేవి కాళుడు అనువారలకు జన్మించిరి. వీరున్ను వివాహము చేసుకొని కొంతకాలము గృహస్థాశ్రమములో నుండిరి. అప్పుడు వారిని భగవదవతారమని యెవరున్ను తలచియుండలేదు. తరువాత సమస్తమును త్యజించి ఏకాంతప్రదేశమున కొంతకాలము తపమొనర్చి ప్రకృతి దోషములనుండి రహితుడైన పిమ్మటనే విష్ణ్వవతారమని లోకము పిలుచుటకు ప్రారంభించెను. అప్పటినుండి 'గురు' అని పేరు గలిగి గురునానక్కయిరి. అంతవరకు నానక్కను పేరుమాత్రమే యుండెను. తరువాత వారిని భగవత్స్వరూపముగా ఆరాధించుటకున్ను, మందిరములు గట్టుటకున్ను, పటములను పూజించుటకున్ను కారణమయ్యెను. జీవత్వముపోయి అపుడు శివత్వమును పొందెను. ఆ ప్రకారము మరియా జోసెఫ్‌లకు శ్రీ యేసుక్రీస్తు అవతరించెను. వీరున్ను కొంతకాలము గృహములో నుండి గొఱ్ఱెలను మేపుచు వడ్రంగిపని చేయుచుండేవారు. అత్తరి యీ మహాత్మని యెవరున్ను ఈశ్వరపుత్రుడనిగాని, ప్రవక్తయనిగాని, దేవుడనిగాని తలచియుండలేదు. వీరున్ను చిరకాలము నిర్జనప్రదేశములో యెవరికిని తెలియని స్థలములో తపస్సులోనుండి జీవగుణములను రహితమొనర్చి ఈశ్వరగుణములు గలిగినప్పుడు దేవునిపుత్రునిగాను అవతారపురుషునిగాను లోకము చెప్పుటకు ప్రారంభించెను. తరువాత దేవాలయములు (అనగా చర్చీలు) నిర్మించి జీసను విగ్రహములను పటములనుపెట్టుకొని భగవత్స్వరూపముగా జనులు పూజించుటకు ప్రారంభించిరి. అదే విధముగా మహమ్మదుగారున్ను అబ్దుల్లా, అమీనాలకు జాతమైనవారు. కొంతకాలము వీరున్ను 'ఖతియా' అను శ్రీమంతురాలికి గుమస్తాగా ఉండి తరువాత ఖతియాను వివాహము చేసుకొని సంసారములో ఉన్నప్పుడు ఆ మహనీయాత్మని యెవరున్ను ప్రవక్తయనిగాని భగవంతునిచే పంపబడినవారనిగాని, భగవత్స్వరూపుడనిగాని తలంచియుండలేదు. తరువాత సర్వమును దూరీకరించి హీరాను అను కొండగుహలో 15 సం॥ రములు తపమొనర్చినందుచే ప్రకృతిదోషము లన్నియు నశించి పరమపురుష

డయ్యెను. ప్రవక్తయయ్యెను. అప్పుడు భగవంతుని ధర్మమును ప్రజల కుపదేశించుటకు సర్వేశ్వరునిచే పంపబడినవారని జనులు కనుగొని దైవ స్వరూపునిగా తలంచి వారి వాక్యములను పఠించుచు, ఆరాధించుటకు ప్రారంభించిరి. ఇదే తపశ్శక్తిచేత శుద్ధాత్ములగుటకు కారణము. ఆలాగున రామకృష్ణపరమహంసలున్ను కొంతకాలము బాల్యావస్థలో స్వగృహ ములో నున్నప్పుడుగాని దక్షిణేశ్వరమున కాళికా దేవి పూజారిగానుండి నప్పుడుగాని ఆ మహనీయాత్ముని భగవంతునిగా భావించి యెవరున్ను పూజించలేదు. తరువాత దక్షిణేశ్వరములో బహుకాలము తప మొనర్చి మూడుగుణములతో గూడిన జీవత్వమును రహితమొనర్చి శివత్వమును పొందినప్పుడు దేవుడైనాడు. ఇప్పుడు లోకములో వారి విగ్రహములను నిర్మించి దేవాలయములు ప్రతిష్ఠించి దేవునిగా పూజించుచున్నారు. ఆలాగున పటములనుపెట్టి అనేకులు మాధవునివలె అర్చించుచున్నారు.

ఇదంతయు చూచినవారు అరుదుగా ఉండవచ్చును. కాని గాంధీ మహాత్ముని యెరుంగనివారు భారతదేశములో యెవరున్ను లేరనియే చెప్పవచ్చును: వీరున్ను పుత్లీబాయి కరంచందు గాంధీగారలకు పుత్రులై జన్మించినవారు. శ్రీ కస్తూరీబాయిగారిని వివాహము చేసుకొని సంతానముబడసి బారిష్టరుపనిలో ఉన్నప్పుడు యెవరున్ను మహాత్ముడని పిలువలేదు. మోహనదాసు కరంచంద్ గాంధియని మాత్రమే పిలుచు చుండిరి. వీరు గృహత్యాగముచేసి సర్వసంగమును త్యజించి శ్రీ భగవ ద్గీతను పారాయణచేయ నారంభించి 'రఘుపతి రాఘవ రాజారాం' అని భగవత్స్మరణలో ప్రవేశించి జీవకోట్లసేవయే ఈశ్వరసేవయని ప్రవర్తించినప్పుడే గాంధీగారు మహాత్ములైనారు. గాంధీ దేవుడైనారు. మునియైనారు. భగవత్సమానముగా లోకారాధ్యులైనారు. ఇప్పుడు ప్రపంచములో యెక్కడ చూచినప్పటికిన్ని మంటపములు నిర్మించి, దేవాలయములనుగట్టి, విగ్రహములను ప్రతిష్ఠించి, పటములను నెలకొ లిపి పూజించుట అందరున్ను చూచుచున్నారుగదా ! ఇదే మాధవుడు మానవుడగుటయు, మానవుడు మరల మాధవుడగుటయు అని గ్రహించు కొనవలయును. అయితే ఇట్టి స్థితి పురుషులకు మాత్రమేగాక స్త్రీలకు గూడ గలుగునని శ్రీరామకృష్ణ పరమహంసలవారి సతీమణియగు

శారదా దేవిగారినిన్ని, శ్రీ హరనాథబాబా అర్థాంగియగు కుసుమ కుమారిగారినిన్ని, గాంధీగారి ధర్మపత్నియగు కస్తూరిబాయిగారినిన్ని, జ్ఞాపకములోనికి తెచ్చుకొనిన చాలును. పై చెప్పిన నారీరత్నముల విగ్రహములను, పటములను భగవత్స్వరూపములుగా లోకము పూజించుటలేదా! ఇంక విస్తరించి యేల చెప్పవలయును? పై పేర్కొన్న వారలలో బ్రాహ్మణాది సర్వవర్ణస్థులున్ను గలరు. మహిళామణులున్ను ఉందురని పై చరిత్రమే నిరూపించుచున్నది.

అయితే వేదాంతులలో కొందరు ఒక ప్రశ్న చేయుదురు. అదే మన పరమాత్మ యెప్పుడున్ను జీవాత్మ కాలేదుగదా? రజ్జువెప్పుడైనా సర్పమైనదా? స్థాణువు పురుషుడైనదా? శుక్తి ఏకాలమునందైన రజతమైనదా? కావున ఆత్మ యెల్లప్పుడు పరమాత్మయే, పరబ్రహ్మమే, శివుడే. జీవుడు కాలేదు. జీవుడని తలంచుట భ్రమమాత్రమే. కావున ఆత్మను శ్రవణ మనన నిదిధ్యాసములచే పొందిన చాలునని వచింతురు. అయితే ఇదిన్ని ఒక భ్రమమాత్రమే. అట్టి భ్రమనే జీవత్వమని శాస్త్రము నిర్ణయించు చున్నది. దాని నివృత్తికొరకు శ్రవణ మనన నములు యెట్లేర్పడినవో దానికే తపస్సని చెప్పిన రహస్యము. అట్టి తపస్సు లేనిచో శ్రవణమనన నిదిధ్యాసములు నిలువజాలవు. ఇట్టి భ్రమ నివృత్తియగుటయే జీవత్వరహితమనియు, బ్రహ్మత్వ ప్రాప్తియనియు ప్రతివారును తప్పనిసరిగా గ్రహించవలసియుందురు. కావుననే సాధన చతుష్టయ సంపత్తి గలవాడే వేదాన్త బ్రహ్మవిచారము చేయుటకు అర్హుడని శాస్త్రము విపులముగా చెప్పుటకు కారణము. అందువల్లనే శంకరభగవత్పాదాచార్యులు ఆత్మబోధకు అర్హుడెవడని మొట్ట మొదటనే ఆత్మబోధమను గ్రంథమున నిర్ణయించిరి.

"తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణాం ।
ముముక్షూణామపేక్ష్యోఽయమాత్మబోధో విధీయతే ॥"

తా॥ త్రివిధ తపస్సులచే పాపములు నశించినవారున్ను, ఉపశమనము గలవారున్ను, రాగద్వేషములు క్షయించినవారున్ను యెవరు. గలరో వారే యీ యాత్మబోధ గలుగుటకు అధికారులు. ఇక వేయేల చెప్పవలయును? శ్రీ వేదవ్యాసులున్ను బ్రహ్మసూత్రమున — "అథాతో

బ్రహ్మజిజ్ఞాసా" అని సూత్రీకరించిరి. శమదమాదులు కలిగిన పిమ్మటనే బ్రహ్మజిజ్ఞాస చేయవలయునని పలికిరి. ఇక దీనికి సంబంధించిన ప్రమాణము లన్నియు అనేకములుగలవు. అవి ముముక్షువులు గ్రహించుకొందురుగాక!

ఇత్తర ఒక ముఖ్య విషయమును లోకమునకు తెలుపవలసి యున్నది. అదేమన —

శ్లో॥ న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।
మంథనేన యథా క్షీరాన్నవనీతం ప్రజాయతే ॥

శ్లో॥ మర్దనాదిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।
తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥

తా॥ పరిశ్రమచేయక యెవరున్ను పవిత్రులు గాగలరని తలంచవలదు. అది పరిశ్రమపరమగు కాయక్లేశములచేతనే పొందవలసి యుండును. పెరుగును తరచకనే వెన్న కావలెనని తలంచుట పొరపాటు. చెరుకును గానుగలోవేసి ఆడకనే రసముయేర్పడి బెల్లము, చక్కెరగలుగునని మోసపోవలదు. అదేకాలమునందును సంభవించునది కాదు. ఇది మాత్రము విజ్ఞులు జ్ఞప్తిలో నుంచుదురు గాక! ఇక ఈ విషయమై కొన్ని శాస్త్ర ప్రమాణములను నిరూపించెద.

శ్లో॥ శివోఽన్యస్త్వహమేవాన్యః పృథగ్భావం విసర్జయేత్ ।
యశ్శివస్సోహమేవేతి అద్వైతం భావయేత్సదా॥

తా॥ శివస్వరూపమైన పరమాత్మ వేరు, జీవుడనైన నేనువేరు అను పృథగ్భావమును విడచి యే శివస్వరూపముండునో అదే నేనను అద్వైత చింతన చేయవలయును.

శ్లో॥ కృశోఽతిదుఃఖబద్ధోఽహం హస్తపాదాదిమానహం।
ఇతి భావనరూపేణ వ్యవహారేణ లభ్యతే ॥

తా॥ నేనతికృశుడను, దుఃఖబద్ధుడను, కరచరణములతోటి సంయుక్తుడనై యేమియు చేయుటకు సాధ్యము లేనివాడను, నేను శూద్రుడను, వైశ్యుడను, క్షత్రియుడను, బ్రాహ్మణుడను, స్త్రీని అను అనాత్మయైన దేహమందాత్మబుద్ధితో గూడి మృగప్రాయులై స్వస్వరూపమగు తనస్థితిని బొందక బద్ధులగుచున్నారు.

శ్లో॥ నాహం దుఃఖీ న మే దేహో బంధః కోఽస్యాత్మనః స్థితిః।
ఇతి భావనయా పేణ వ్యవహారేణ ముచ్యతే ॥

తా॥ నిత్యశుద్ధస్వయంప్రకాశుడనైన నేనుదుఃఖినికాను. జననము లేనివాడనైన నాకు దేహమెట్లు కలుగును? సచ్చిదానందలక్షణములు గల ఆత్మనైన నాకు బంధమెక్కడిది? ఈలాటి విచారభావనారూప వ్యవహారముచే ముక్తుడగుచున్నాడు.

శ్లో॥ జ్ఞానయజ్ఞోడుపేనై వ బ్రాహ్మణో వాఽంత్యజోఽపి వా।
సంసారసాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి॥

తా॥ చండాలుడుగాని, బ్రాహ్మణుడుగాని జ్ఞానమను తెప్పచే జననమరణ దుఃఖరూప ఘోరసంసారమును తరించి ముక్తియనెడు పదమును పొందును.

శ్లో॥ అహం బ్రహ్మేతి మాం ధ్యాయేదేకాగ్రం మనసా కృతం।
సర్వం తరతి పాప్మానం కల్పకోటిశతైరపి॥

తా॥ ఎవడు మనస్సు నేకాగ్రముగాజేసి పరమాత్ముడగు శ్రీమన్నారాయణుని ఆత్మగా ధ్యానించునో వాడు నూరు కల్పకోట్ల యందు జేసినపాపమును పోగొట్టుకొని మోక్షము నొందును.

శ్లో॥ నాహం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢం బధ్యతే మనః।
సర్వం బ్రహ్మేతి సంకల్పాత్ సుదృఢం ముచ్యతే మనః॥

తా॥ నేను బ్రహ్మముకాను, జీవుడను అను భావముచే నిశ్చయముగా బద్ధుడగుచున్నాడు. సర్వమును బ్రహ్మమను నిశ్చయముచే భవబంధనమునుండి ముక్తుడగుచున్నాడు.

శ్లో॥ ముక్తిస్తు బ్రహ్మణస్తత్త్వ జ్ఞానాదేవాస్య నాన్యథా।
స్వప్రబోధం వినా నైవ స్వస్వప్నో హీయతే కథమ్॥

తా॥ మోక్షాపేక్ష గలవానికి బ్రహ్మతత్త్వ జ్ఞానోదయముచే మాత్రము ముక్తిసిద్ధించునుగాని ఇతరమగు ఏవిద్యచేత సాధ్యముగాదు. ఎట్లన స్వప్నసమయమందు గనిన కలలు జాగ్రదవస్థ గలుగక యెట్లు నశింపవో ఆలాగున మిథ్యాభూతమగు సంసారస్వప్నము నశించుకొరకు బ్రహ్మప్రబోధము గలుగవలెను.

శ్లో॥ సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాన్తి యే।
తే రత్నమభివాంఛంతి త్యక్త్వా హస్తస్థకౌస్తుభమ్॥

తా॥ ఎవరు తన హృదయమందు ప్రకాశించు పరమాత్మను ధ్యానయోగముచే పొందక యితరస్థలమున దేవుడున్నాడని భ్రమించి తిరుగుచున్నారో వారు తన కరమందుండు కౌస్తుభమణిని యెరుంగక పారవేసి ఇతరస్థలమున రత్నముకొరకు వెదకుచుండువానివలె తెలివిహీనులు—

శ్లో॥ సంత్యక్త్వా తాదృశం దేవం యః సేవేతాన్యదేవతాం।
స హి భాగీరథీం త్యక్త్వా కాంక్షతే మృగతృష్ణికామ్॥

తా॥ ఎవడు తనయందు పరమాత్మసమానమగు ఆత్మను విచారముచేసి తెలిసికొనక యితరస్థలములలో దైవప్రాప్తికొరకు తిరుగుచుండునో, వాడు గంగాతీరమునుండి ఆ పవిత్రజలము మంచిదిగాదని నిశ్చయించి యెండమావులలో గనుపించెడుజలము శుద్ధమైనదని భ్రమించి పరుగెత్తెడు మూఢునివంటివాడు.

ఓమ్

## ఓంకారము

ఓంకారము అనగా ప్రణవము. బ్రాహ్మణేతరులు, స్త్రీలు జపము చేయుటగాని, ఉచ్చరించుటగాని చేయరాదని కొందరు చెప్పుదురు. అయితే అక్షరాభ్యాసకాలమున వేదవేదాంగములు కడవరకు చదివి వేదార్థమును లెస్సగా యెరింగిన పండితులు (శాస్త్రులు) కుమారులకున్ను, కుమార్తెలకున్ను పౌరోహితులు మొట్టమొదట యీ ఓంకారమును గదా ఉపదేశించుచున్నారు. అలాగున బ్రాహ్మణేతర బాలురకున్ను, బాలికలకున్ను అక్షరాభ్యాసకాలమున యీ ప్రణవమునే గదా ఉపదేశించుచున్నారు? అనగా విద్యాభ్యాసకాలమున — ఓం; నః; మః; శి; వా; య; సి; ద్ధం; న; మః అని పౌరోహితులు, శాస్త్రులు, ఆచార్యులు, గురువులు యీ మంత్రమును గదా బోధించుచున్నారు. కొన్ని సాంప్రదాయముల ననుసరించి కొన్నిప్రదేశములలో ఓం శ్రీగణేశాయ

నమః అనియు, ఓం నమోనారాయణాయ అనియు యీలాగున ఆయా దేశ సాంప్రదాయమునననుసరించి అక్షరాభ్యాసము చేయించుచుందురు. ఉత్తరహిందూస్థానమున ముఖ్యముగా ఆర్యమతస్థులు ఓంకార మొక్క-దానినే అక్షరాభ్యాసకాలమందు అందరికిన్ని ఉపదేశించుచుందురు. మన శాస్త్రిలు, పండితులు, పౌరోహితులు బ్రాహ్మణాబ్రాహ్మణ, బాల బాలికల కందరికిన్ని మొట్టమొదట ఓంకారమునే ఉపదేశించుచున్నారు. మరల ఓంకారము నుచ్చరించుటకు, జపించుటకు అబ్రాహ్మణులకున్ను, బ్రాహ్మణస్త్రీలు మొదలగు స్త్రీల కెవ్వరికిన్ని ఓంకారోపాసనకు అర్హత లేదని ఎట్లు చెప్పగలరు? ఇది స్వవాక్యోపఘాతముగదా! అనగా తాను చెప్పినదానికి విరుద్ధముగదా అని భావము. ఇప్పుడెవ్వరైనా ముముక్షువులకు, ధ్యానపరులకు ప్రణవోపాసన చెప్పుచుండినచో పైజెప్పిన పౌరోహితులు, శాస్త్రిలు చెప్పినదానినే మరల జ్ఞాపకపరచి దానియొక్క తత్త్వమగు పరబ్రహ్మమును బోధపరచుచున్నారేగాని మరియొకటి కాదు. ఇది అందరున్ను అంగీకరించవలసినది గదా! అక్షరాభ్యాసకాలమున్నో, శైశవావస్థలో నుండు బాలబాలికలకు అర్థముమాత్రము పై జెప్పినవారు చెప్పక ఉండవచ్చును. ఇప్పుడు ప్రణవోపాసనాసక్తులకు ఓంకారము నెవ్వరైన ఉపదేశించు చుండినచో పై నుదహరించిన శాస్త్రిలు చెప్పిన వాక్యమునకు అర్థమునుమాత్రమే ఇప్పుడు ఓంకారోపాసనచేయవలెనని చెప్పుచుండువారు తెలుపుచున్నారేగాని దీనియందు క్రొత్తవిషయమేమియు లేదు. శాస్త్రవిరుద్ధముగా చెప్పినది యేమియు లేదని విజ్ఞులు గ్రహించుదురుగాక! శ్రీ భగవద్గీతయందు అష్టమాధ్యాయము అక్షరబ్రహ్మోపాసనను గురించి చెప్పునది. దానిలోగల మొదటి ప్రశ్న ఏమన 'కిం తద్బ్రహ్మ'. దానికి సమాధానముగా 'అక్షరం బ్రహ్మపరమం' అని శ్రీ కృష్ణభగవానుడు అర్జునునికి తెలిపెను. ఈ వాక్యమును ఆధారపరచుకొనియే అక్షరము పరబ్రహ్మస్వరూపమని శ్రీ భగవాను డుపదేశించుటకు కారణము. అందువల్లనే అక్షరాభ్యాసమున మొట్టమొదట ఓంకారము నుపదేశించుటకు కారణము. ఒకవేళ కౌమారావస్థలో దీని అర్థము తెలియకపోయినను, బుద్ధి వికసించి శుద్ధమగునప్పుడు అక్షరాభ్యాసకాలమున ఓంకారమును శాస్త్రిలవారు ఉపదే

శించిరే! అక్షరమనగా ఏమి? మనముచేయు విద్యాభ్యాసము అక్షరమును గురించినదా? క్షరమును గురించినదా? అని యీ బాలబాలికలు ఊహింపగలరని ఉద్దేశించియే పరమకారుణికులగు ఋషివరులు విద్యాభ్యాసమునకు అక్షరాభ్యాసమని నామకరణ మిడుటకు కారణమైనది. కావుననే 'అక్షరం బ్రహ్మ పరమ' మనియు, అక్షరము పరబ్రహ్మస్వరూపమనియు 15-వ అధ్యాయమున 'క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే' అని తెలుపుటకు కారణము. అక్షరమగు పరబ్రహ్మమొకటియే నాశము లేనిదనియు, "క్షరస్సర్వాణి భూతాని" సర్వభూతములున్ను నశించునవనియు దానియొక్క అర్థము. కూటస్థుడగు ఆత్మయే అక్షరుడనియు శ్రీభగవానుడు తెలిపెను. మరియు అష్టమాధ్యాయమున మొదటనే అర్జునుండడిగిన కడపటిప్రశ్నలో "ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః" అనగా ప్రాణప్రయాణకాలములో యెట్టి భావన కలిగియుండిన పరమాత్మడవగు నిన్ను అనగా భగవానునిపొంద గలుగుననియు గలదు. అంతియేగాక "నియతాత్మభిః" అని ప్రయోగించుటవల్ల ఒకజాతినిగురించి, కులమునుగురించి, స్త్రీనిగురించి, పురుషుని గురించి, బ్రాహ్మణునిగురించి, అబ్రాహ్మణునిగురించి, గృహస్థునిగురించి, సన్న్యాసినిగురించి అడుగలేదు. ఆత్మనియమము గలిగి పరమాత్మని ధ్యానించెడు భక్తులందరిని గురించియే అడిగినదని ఇచట గ్రహించుకొనవలెను. కావుననే 'నియతాత్మభిః' అని తృతీయాబహువచనప్రయోగమును ఉపయోగపరచుటకు కారణమైనది. దీనికి అష్టమాధ్యాయమున 13-వ శ్లోకమందు శ్రీకృష్ణభగవానుడుపదేశించినది చూడుడు:

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥

తా॥ ప్రాణప్రయాణ కాలములో యేకాక్షరమైన బ్రహ్మవాచకమగు ఓంకారమును ఉచ్చరించుచు, స్మరించుచు, ఓంకారార్థమగు పరమాత్మను భావించుచు యెవండు దేహమును విడిచిపెట్టుచున్నాడో, అట్టివాడు సర్వోత్కృష్టమగు బ్రహ్మపదమును, విష్ణుస్థానమును పొందుచున్నాడని శ్రీభగవానుడే ఉపదేశించెను. ఆశ్లోకమున 'యః ప్రయాతి' అనియు, 'స యాతి పరమాం గతిం' అనియు ఉండుటవల్ల యచ్ఛబ్ద

మునకు యెవఁడైనను అనియు, తచ్ఛబ్దమునకు వాఁడే అనియు అర్థమును పండితులు యెరింగియే యున్నారు. అయితే దీనియందు బ్రాహ్మణుడని గాని, అబ్రాహ్మణుడని గాని, సన్న్యాసియని గాని, గృహస్థుడని గాని, పురుషుడనిగాని, స్త్రీయనిగాని విచక్షణ చేయలేదు. కాని అర్హతను అనగా అధికారినిమాత్రము నిర్ణయించడమైనది. ఇదిమాత్రము సత్యము. అదిమాత్రము తప్పనిసరిగా ఉండవలెను. అధికారినిగూర్చిన శ్లోకమిది. అష్టమాధ్యాయము 12-వ శ్లోకము.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥

తా॥ సర్వేంద్రియములను నిగ్రహించుకొని మనస్సును హృదయ మందు అనగా ఆత్మయందు నిలిపినవారై ఊర్ధ్వదృష్టిగలిగి యోగధారణ గలవారై ఉండవలయునని నిరూపించడమైనది. అంతమాత్రము ప్రణవో పాసకులు గ్రహించుకొనవలసి యుండును. అస్లనుండు సన్న్యాసియు బ్రాహ్మణుడున్ను కాడు. గృహస్థుడున్ను, క్షత్రియుడున్ను అగును. గీతలో "గిరామస్మ్యేకమక్షరం" అని దశమాధ్యాయములో, అనగా వేదములలో ఏకాక్షర స్వరూపమగు ప్రణవమును విష్ణుస్వరూపమనియు, సప్తమాధ్యాయమున 'ప్రణవస్సర్వవేదేషు' అనగా వేదములన్నిటిలోను ప్రణవస్వరూపమగు తనయొక్క అనగా పరమాత్మయొక్క స్వరూప మనియు నిర్ణయించి చెప్పిరి. దీనికన్న పరమప్రమాణము మరియేమి కావలయును? పతంజలిమహర్షి తనయోగశాస్త్రములో 'తస్య వాచకః ప్రణవః' పరబ్రహ్మముయొక్క, పరమేశ్వరునియొక్క నిజమైనవాక్యము ప్రణవమని వచించిరి. మరియు కాశియందు ప్రాణము పీడిపోయెడు కాలమున సమస్త ప్రాణులకున్ను పరమశివుండు తారకమంత్రమగు యీ ప్రణవమునే ఉపదేశించినట్లున్ను అందువల్ల జీవులు సర్వపాపముల నుండి విముక్తిఁబొంది శివలోకమును పొందుచున్నట్లున్ను శివపురాణ మాఘపురాణములలో కనపడుచున్నది. మార్కండేయమహర్షి తల్లి యగు మరుద్వతి మొదలగు నారీమణులు కాశిలో విశ్వేశ్వరాలయమున ప్రాణము విడుచునప్పుడు పరమశివుడు యీ ప్రణవమునే ఉపదేశించి ముక్తులుగాచేసినట్లుకనందగును. మరుద్వతి మొదలగువారు నారీమణులు

గదా! యిందువల్ల స్త్రీలకుగూడ ప్రణవోపాసనకు అర్హత గలదని స్పష్టపడుటలేదా!

శ్లో॥ కాశీపతిః కారుణికః కరాభ్యా
మాదాయ మూర్ధానమతీవ తాసామ్।
ఆగమ్య వేగాన్మృగపచ్ఛ తాసా
మోంకారమోంకారయతిస్మ కర్ణే॥

తా॥ కాశీవిశ్వేశ్వరుడు ఆ మృగశృంగుని భార్యలయందు కనికరము గలవాడై వారితలలు తన చేతులతో లేవనెత్తి పట్టుకొని ఆ నలుగురి చెవులయందును యేకకాలములోనే ఓం, ఓం అని తారకమంత్రమయిన ప్రణవమును ఉపదేశము చేసెను. ఇదే ప్రకారముగా కఠోపనిషత్తునందు యమధర్మరాజు నాచికేతుడను ఋషికుమారునికి యీ ప్రణవోపాసననే ఉపదేశించెను. నాచికేతువు పసివాడు; సన్న్యాసికాడు. ఆలాగుననే గరుడపురాణమున శ్రీ వైకుంఠములో గరుత్మంతునికి యీ ఓంకారమునే భగవంతుడు ఉపదేశించినట్లు కనబడుచున్నది. అవన్నియు ప్రమాణరూపముగా వ్రాయతలంచిన యీ వ్యాసము పెరిగిపోవునని తలంచి విడిచిపెట్టడమైనది. విస్తారముగా చూడతలంచువారు ఓంకారమను పేరుగల ప్రణవోపాసన అను గ్రంథమున చూడందగును. 'ప్రణవః ప్రాణముచ్యతే' మంత్రములన్నిటికి ప్రణవము ప్రాణమనియు, ప్రణవము లేనిమంత్రము ప్రాణములేనిదనియు 'ఓంకారమే వేదం సర్వం' ఇదంతయు ప్రణవమయమగు పరబ్రహ్మమనియు ఉపనిషత్తులు తెలుపుచున్నవి. ఛాందోగ్యమున యీ ప్రణవోపాసన గురించి విస్తారముగా కనందగును. 'ఓమిత్యేత ముద్గీథ ముపాసీత' ఈ యేకాక్షరస్వరూపమగు ప్రణవమునే గానము చేయదగినది. ఉపాసింపతగినదని తెలుపడమైనది. 'ఓంకార ప్రభవా వేదాః' ఓంకారమునుండియే వేదములన్నియు యేర్పడినట్లు తెలుపడమైనది.

అయితే అక్షరాభ్యాసము యొక్కయు, విద్యాభ్యాసము యొక్కయు రహస్యమును పండితులున్ను, పండితులు కానివారున్ను గ్రహించుకొనవలసి యుండును. ఈ క్రింది ప్రమాణములు చూడుడు.

శ్లో॥ నిరక్షరస్యాపి తు యస్య కుక్షౌ
బ్రహ్మైవ చాభాతి స ఏవ సాక్షరః।
సర్వాక్షరస్యాపి తు యస్య చిత్తే
బ్రహ్మైవ నాభాతి స వై నిరక్షరః॥

తా॥ ప్రపంచములో అక్షరాభ్యాసము లేనివాడైనను యెవని యొక్క హృదయమందు అక్షరస్వరూపమగు పరబ్రహ్మోపాసన గలిగి యుండునో అట్టివాడే అక్షరాభ్యాసము గలవాడనియు, సర్వశాస్త్రములు చదివినవాడైనను అక్షరస్వరూపమగు పరబ్రహ్మోపాసన లేనివాడు నిరక్షర కుక్షియనియు గ్రహించుకొనవలయును.

శ్లో॥ విద్యయా చ యయాఽవిద్యా ప్రభయా చ యథా తమః।
నశ్యతి బ్రహ్మవిద్యా సా తేజోరూపా చ నేతరా॥

తా॥ ఏవిద్యచేత అవిద్య నశించునో అట్టివిద్యయే విద్యయగును. యెట్లన? ప్రకాశమువల్ల తమస్సు నశించునట్లుండవలయును. అది బ్రహ్మ విద్య ఒక్కదానివల్లనే గలుగును. తక్కిన యేవిద్యచేతనున్ను కలుగదు. ఈ తత్వము విద్యావంతులని తలంచువారున్ను, విద్యావిహీనులని తలంచువారున్ను గ్రహించుకొనవలయును. ఈ విషయము మాఘ పురాణములోగల సువ్రతునిగురించియు, అందరు యెరింగిన శ్రీ రామకృష్ణ పరమహంసను గురించియు తెలుసుకొనిన చాలును.

---

ఓమ్

# దేవత్వము లేక దైవత్వము

దేవత్వమును బొందవలసియుండిన మానవత్వమును లయమొందించవలయును. ఆలాగున శివత్వమును బొందవలసియుండిన జీవత్వమును సమర్పించవలయును. అనగా ఆత్మార్పణమును సంపూర్ణ సమర్పణము జేసినమాత్రమే దైవత్వము కలుగును. బీజము సంపూర్ణముగా విలయమైనమాత్రమే యదివృక్షమై పరిణామమును బొందును. ఫలపల్లవ పుష్ప పత్రాదులతో శోభించెడు ఆ మహావృక్షమంతయు సూక్ష్మమగు విత్తనమునందు గలదు. ఐతే బీజము విలయమగునపుడే అది మహావృక్షముగా పరిణామమును బొందును. ఆ విత్తనమును ఎంతకాలమువరకైన

యొక డబ్బీలోనుంచిన యెట్లు వృక్షము కాగలుగును? అలాగున నిన్ను యెంతవరకు దైవప్రాప్తి నిమిత్తము సమర్పణ చేయలేదో అంతవరకు నీకు మానవత్వము విడిపోన్నని దేవత్వము లభింపజాలదని మొట్టమొదటనే నిశ్చయము చేసుకొనుము. గౌతమబుద్ధుడు రాజగృహములో యశోధర యను భార్యతోను, రాహులుడను కుమారునితోను కూడియుండువరకు మొదటపెట్టిన పేరగు సిద్ధార్థుడై యే వుండెను. అత్తరి బుద్ధదేవుడని యెవరును ఆయనను పిలువలేదు; దేవునిగా ఆరాధించలేదు. పరమ నిర్వాణము (మోక్షము) కొరకు తన దేహసంబంధులగు భార్యాపుత్రులను, తుదకు రాజ్యమునుగూడ పరిత్యజించి తనయొక్క జీవితమును సమర్పించినపుడే ఆ మహాత్ముడు మానవత్వమునుండి మార్పుజెంది దేవుడయ్యెను. అలాగుననే శ్రీ శంకరభగవత్పాదులు ఆర్యాంబయను తల్లివద్ద బ్రహ్మచర్యవ్రతమును అవలంబించి జీవితమును గడుపునపుడు శంకరుడని నామధేయము గలిగియుండెనేగాని, శంకరాచార్యులనిగాని, శంకరభగవత్పాదులనిగాని పేరు గలిగి యుండలేదు. జీవితమంతయు శివార్పణముజేసి బయటికివచ్చి గోవిందభగవత్పాదులను జేరిసవిన్మాటనే ఆయన శంకరభగవత్పాదులైరి. అపుడు "శంకరః శంకరస్సాక్షాత్" అను దివ్యబిరుదమును పొందెను. ఆదేరీతిగా శ్రీ యేసుక్రీస్తును జోసప్, మేరీ అని పిలువబడు తల్లిదండ్రులతో గూడి కుటుంబములోనుండువరకు అతడు యీశ్వరపుత్రుడు గా లేడు. పై జెప్పిన తల్లిదండ్రులను, గృహములను త్యజించి తన జీవితమును యీశ్వరున కర్పించినపుడే ఆ దివ్య పురుషుడు దేవపుత్రుడు అనగా యీశ్వరకుమారుడయ్యెను. ప్రకృతితో గూడియుండువరకాయన ప్రవక్తగా లేడు. అదేమోస్తరుగా శ్రీ మహమ్మద్ నిబియు అబ్దుల్లా, మదీనా తల్లిదండ్రులతో గృహములోనుండగా ఆయన నిబీ కాలేదు. మహమ్మదని తల్లిదండ్రులుపెట్టిన పేరుతోనే గూడియుండెను. ఆయన కథియా అను పేరుగల శ్రీమంతురాలునకు గుమాస్తాయై ఒక సామాన్య జీవితమును గడుపుచుండెడివాడు. తల్లిదండ్రులను, గృహమును త్రోసివేసి దైవప్రాప్తికొరకు 'హిరాన్' అను కొండగుహలోనికి దూరి తన జీవితమును దేవదేవునకు సంపూర్ణముగా సమర్పించిన తరువాతనే ఆయన మహాప్రవక్తయు, నిబియుగూడ

నయ్యెను. ఆలాగున (శ్రీ) గురునానక్ను భార్యాబిడ్డలతోగూడి నవాబు
నౌకరులో నుండువరకు నానక్ సాహెబ్ గాలేదు. ఇవన్నిటిని వదిలించు
కొని యేకాంతములో ప్రవేశించి జీవితమును సంపూర్ణముగ పరమాత్మా
ర్పణము జేసినపుడే నానక్ సాహెబు అయ్యెను. అనగా జగద్గురువయ్యెను.
నూనె యెంతవరకు తన్ను అగ్నికి సమర్పించలేదో అంతవరకది జ్యోతియై
వెలిగి చీకటిని పారద్రోలి ప్రకాశింపజాలనట్లును, సమిధలు (కట్టెలు)
యెంతవరకు హోమగుండములో తన్ను అగ్నికి సమర్పణ జేయలేదో
అంతవరకు కట్టెలుగానేయుండి అగ్న్యర్పణము జేసినపుడు నిప్పు తనరూ
పముగా మార్చివేయునట్లును, ఉప్పు సముద్రజలమునుండి పుట్టినదైనను
ఎంతవరకు తన్ను నీటిలోనికి సమర్పించలేదో అంతవరకు ఉప్పుకల్లుగాను,
సమర్పణజేసిన వెంటనే జలము తన రూపమును బొందించినట్లు ఆత్మార్పణ
మొనర్చనంతవరకు జీవుడును శివత్వమును పొందజాలడు. సముద్రజలము
మేఘమై భూభాగములో వర్షించినను మరల యెంతవరకు సముద్రము
లోనికి చేరలేదో అంతవరకది చిన్న బొట్లుబొట్లుగా నుండునేగాని ఆ వర్ష
బిందువులు తన గమ్యస్థానమును జేరుటకు కాలువలుగాను, నదులుగాను
నిలుకడలేక ప్రవహించుచు తన్ను సంపూర్ణముగా సముద్రార్పణము
జేసినపు డేలాగున మహాసముద్రమై పరిణామమును బొందినదో దైవా
ర్పణ జేసినవానియొక్క స్థితియు నాలాగున నుండును. దానివలన గలి
గిన ప్రయోజనమేమి? జలబిందువులు కాలువలై పుణ్యానదులై కట్టకడకు
మహాసముద్రమై మారినది. ఆలాగున అణుస్వరూపుడు, కించిజ్ఞుడు జనన
మరణదుఃఖములతోగూడిన యీజీవుడు తన్నుసంపూర్ణముగా యీశ్వ
రార్పణముజేసిన శాశ్వత శివస్వరూపుడగును. దైవార్పణమొనర్చినందు
వలన గలిగెడు ప్రయోజన మిట్టిదే. ఐతే వర్షజలబిందువులు కాలువలై
నదులై అంతగొప్ప అవస్థను బొందినను సముద్రమును జేరువరకు యేలా
గున రేయింబవళ్లు ముందుకు పరుగెత్తుచుండునో ఆలాగున నీవును,
అనంతానందస్వరూపుడగు పరమాత్మను జేరువరకు మధ్య మధ్య యెంత
గొప్పతనము, గౌరవము, పూజ్యత గలిగినను ఆగకుము. వెనుదిరుగక
ముందుకు నడువుము. నడిచిన చాలదు; పరుగెత్తుము. చిన్న చిన్న వర్ష
జలబిందువులు కృష్ణ గోదావరి, గంగా మొదలగు మహాపుణ్యానదులై

పరిణామము పొందినను, అనేకులు దీపారాధనలు పూజలుచేసేస్థితిలోనికి వచ్చినను నిలువకనే సముద్రమువైపు శుభాఽశుభములను. ప్రాతఃసంధ్యలను గమనింపకనే యెట్లు నిలకడలేక పరుగెత్తుచుండునో, దీనిని జూచిన మీకు మఱియొక ఉపదేశము గావలయునా ? అలాగున యీశ్వరార్పణ బుద్ధితో అఖండధ్యానము చేయువారికి ప్రాతః సంధ్యాదికాలములనుగాని శుభాఽశుభకార్యములనుగాని, శుద్ధాఽశుద్ధస్థలములనుగాని, స్నానాది కృత్యములనుగాని చూడసక్కర లేదు. నదిలోచేరక కాలువరూపములోగాని, నదీరూపములోగాని ఆగినట్లయిన ఎండాకాలమున ఎండిపోవుటయో, పాచిపట్టి కుళ్ళి దుర్వాసనపట్టుటయో కలుగునని గ్రహించియే పూజాపురస్కారములకు లోబడక నిరంతరము సముద్రము చేరువరకు వెనుకకు దృష్టిని మరల్చక పరిగెత్తుటకు కారణమని గ్రహింపుము. సముద్రములో బడిపోయిన యెండాకాలములో చిక్కుటగాని, నీరు చెడిపోవుటగాని యెట్లు గలుగనో అలాగున పూర్ణపరబ్రహ్మములో పోయి పడిపోవువరకు మాత్రమే యీ జీవుడు జననమరణ జరావ్యాధులచే దుఃఖపడవలసియుండును. తరువాత అనంతానంద జ్ఞానామృతసాగరమై మారుచుండును. బ్రహ్మజ్ఞానముచే, భగవత్ప్రాప్తిచే గలిగెడి ప్రయోజనమిదియే.

పైజెప్పినవారి విధముగానే పరమభక్తురాలని గణనలోనికివచ్చిన మీరా బాయియు, రాజగృహమును తల్లిదండ్రులను భర్తయగు రాణా కుంభను పరిత్యజించి అర్థరాత్రిలో సౌధాంతరాళములోనుండి బయటికి వచ్చి మామూలు మనుష్యులు నడిచెడి మార్గములో నడువక ముళ్ళ కంపలు చెట్లు గుట్టలతో గూడిన కొండలలో ప్రయాణముజేసి నిద్రాహారాదులనుగూడ మరచి రేయింబవలును దెలియక పరుగెత్తిపరుగెత్తి శ్రీబృందావనములో, శ్రీకృష్ణచరణారవిందములో పడిపోయినందుచేతనే నేటికిని ఆమెను లోకము పూజించుచున్నది. బృందావనమున వారు తపమొనర్చిన స్థలమును, ఆశ్రమమును యిప్పటికీ వెళ్ళిచూడవచ్చును. మామూలుమార్గముగా బోయిన యెవరైన కనుగొనుదురేమోయని తలంచి అరణ్యమార్గముగుండా వెళ్ళడమైనది. ఈ పుణ్యవతి రాజపుత్రస్థానమునరాజకుటుంబములో రతన్‌సింగ్ రాంథార్ అనువారికిపుత్రికయై

అవతరించెను. మహాభ క్తవిజయములో మీరాబాయి చరిత్రము పూ ర్తిగా తెలిసికొనవచ్చును. బృహదారణ్యకోపనిషత్తున బేర్కొనిన మైత్రేయియు తన సంసారమంతయు యాజ్ఞవల్క్యమహర్షికి ధారా ద త్తముజేసి విజనప్రదేశమునకు వెళ్లి ఆత్మార్పణమును పరబ్రహ్మమునకు చేయుటచేతనే ఉపనిషత్తులో అగ్రస్థానము నలంకరించుటకర్హతగలిగెను. ఆలాగుననే వచక్నుని పుత్రియగు గార్గి సంసారదుఃఖమును బడజాలక బ్రహ్మచర్యవ్రతమును శీలించి వేదములోను, వేదాంతములోను ఆరితేరిన దగుటచేతనే జనకచక్రవర్తిచే యేర్పరచబడిన పరమఋషిమండలిలో మహాపండితయూథము మధ్య యాజ్ఞవల్క్యమహర్షితో శాస్త్రార్థ మునుజేసి విజయమునొంది బృహదారణ్యకోపనిషత్తులో అత్యున్నత స్థానము నలంకరింపగలిగెను. ఇదేవిధముగా మహాభారతమున సులభ యను రాజకన్యక బ్రహ్మచర్యమునుండి సన్యసించి యోగవిద్యలోను, జ్ఞానవిద్యలోను జనకభూపాలుని విస్మయమొనర్చగలిగెను. వీరందరును సంపూర్ణాత్మార్పణము చేసినందువలననే మానవత్వమునుండి దేవత్వ మునకు వచ్చిరి.

వ ర్తమానయుగములో మనమందఱమును కండ్లారజూచిన శ్రీ గాంధీగారితత్త్వమును యీ విషయమునే నిరూపించుచున్నది. గాంధీ గారు బారిష్టరు పరీక్షయందు తీర్ణులై న్యాయవాదవృత్తి నవలంబించి భార్యాబిడ్డలతో సంసారమందుండు కాలమువరకు మహాత్మాగాంధీజీ యని యెవరును పిలువలేదు; దైవభావముతో పూజించలేదు. సర్వసంగ పరిత్యాగముజేసి లోకసేవలోను, దైవసేవలోను సంపూర్ణ ఆత్మార్పణము జేసినపిమ్మటనే మహాత్మాగాంధీజీ ఆయెను. అంతవరకు మహాత్మాశబ్ద మనువ ర్తించియుండలేదు; కరంచంద్ గాంధీగానే యుండెను. తరువాత మహాత్ముడై దేవునివలె అంతటను పటములను, విగ్రహములను పెట్టి జను లారాధింప దొడంగిరి. ఇట్టి స్థితిగలుగుటకు యెన్నియోసారులు కారా గృహమునకేగి పరితపించిరి. దానియొక్క ఫలమే భారతదేశమునకు కిరీటములేని సార్వభౌముడై ప్రకాశించెను. అదేవిధముగానే యిపుడు ప్రధానిగానుండు నెహ్రూపండితుడును దేశముకొరకు ఆత్మార్పణముజేసి ఆగర్భశ్రీమంతుడై యుండియు అనేకసారులు కారాగారములో

మగ్గెను. దానియొక్క ఫలితమే యిప్పుడు భారత దేశమునకు ప్రధానిగనై లోకపూజ్యుడయ్యెను. ఇప్పుడుండువారు కష్టమును సహింపక, త్యాగ మొనర్పక దేవత్వము నొందుటకు, లోకపూజ్యులగుటకు కలలు గను చున్నారు. కలలో గన్న వస్తువులు, స్థానములు యెంత సత్యమో వీరియొక్క స్థితియు అలాగునసే యుండును. పరిశ్రమ చేయక పవిత్రులు గాదలంచిన అది యెప్పుడైనా సిద్ధించునా? రాయి దేవుడు గావలసిన శిల్పకారునిచేత, వృక్కు వులివల్ల యెన్ని సుత్తిదెబ్బలు తినవలసియుండునో అది యోచించుట లేదు. ఆ సుత్తిదెబ్బల కోర్చుకొనిన కారణముచేతనే రాయి దేవుడయ్యెను. సహించుకొనక పోయినచో రాయి రాయియే. మనవారో శ్రమపడి చదివి డిగ్రీ పొందకనే వృద్ధులో ద్యోగమును బొందవలయునని స్వప్నము గనుచున్నారు. పాపము! స్వప్నమును మిథ్య యని వారు తెలిసికొనుట లేదు. రత్నమైనను సానబట్టనిచో అది భూషణ ముగా నుపయోగపడునా! కావున మొదటనే శ్రమను సహించుకొను టకు శక్తిలేనివాడు తన జీవితములో విశ్రాంతిని పొందజాలడు. కావుననే శాస్త్రమీలాగున చెప్పుటకు కారణము:

శ్లో॥ న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।
మంథనేన యథా క్షీరా న్నవనీతం ప్రజాయతే ॥

శ్లో॥ మర్దనా దిక్షు దండానాం రసో యద్వత్ప్రజాయతే ।
తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥

సుకుమారులై దేహసుఖమునకు లోబడినవారికి పుణ్యమొనగలుగదు. కాయక్లేశమును సహించి తప మొనర్చువారికే అట్టి పుణ్యము, జ్ఞానము లభించును. ఎట్లన క్షీరమును (పెరుగును) తరచకపోయిన వెన్న బయలు దేరునా? చెఱకుగడను గానుగలో పెట్టి యాడకపోయిన రసము లభించి బెల్లముగాని, చక్కెరగాని లభించునా? అలాగున శరీరపరిశ్రమ చేయు వానికే శరీరాంతర్యామియైయుండు మహాధర్మమైన పరమాత్మజ్ఞానము సిద్ధించును.

ఇక కారణమునుండి యేర్పడిన కార్యసముదాయము కారణమున కన్యముగాదనియు, కార్యము కారణరూపముగా మారుట ప్రకృతి సిద్ధమనియు తెలిపెడు ముండకశ్రుతిని వినుడు:

శ్రుతి॥ యథా సుదీప్తాత్ పావకాత్ విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః । తథాక్షరాద్వివిధాస్సోమ్యభావాః ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి ॥

తా॥ మిక్కిలి ప్రకాశించుచుండెడుఅగ్నివలన కణములు యేప్రకారము అనేకవిధములుగా సమానరూపములు గల్వై పుట్టుచున్నవో ఆ ప్రకారము నాశనరహితమగు పరబ్రహ్మమువలన సాధువగు ఓ శౌనకుడా ! నానావిధములగు జీవులు పుట్టుచున్నారు. మరల అక్షరపరబ్రహ్మమునందే లీనమగుచున్నారు. అగ్నిహోత్రమునుండిలేచిన మిణుగురులను దూదిపీచు మొదలైనవి దానిలోనుంచి వూదుచు చినచిన్న పుల్లలువేసి మరల పెద్దపెద్ద కట్టెలువేసినచో కార్యరూపమగు అగ్నికణము కారణరూపమగు అగ్నిహోత్రమగుచున్నదిగదా ! ఇదే యీశ్వరాంశస్వరూపుడైన అణుస్వరూపుడైన జీవుడు తపోధ్యానాధ్యయనాదులచేత యీశ్వరుడై మారెడు రహస్యము.

శ్లో॥ సువర్ణా జ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్ ।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ ॥

తా॥ స్వర్ణమునుండి యేర్పడిన భూషణములకు నేలాగున సువర్ణత్వము శాశ్వతమో ఆలాగున పరబ్రహ్మనుండి జనించిన జీవులకు బ్రహ్మత్వమును శా శ్వ త మే. ఈ యపరోక్షానుభూతివాక్యమును, పై జెప్పిన ముండకశ్రుతియు సామాన్యమేగాని విశేషముగాదు. ఏలన ఇది ద్వైతవిశిష్టాద్వైతులకు సంబంధించినదేగాని వేదాంతమగు ఉపనిషచ్ఛాస్త్రమందీభేదముగూడ లేదు. అచట ఈ యాత్మయే శాశ్వతమైన పరమాత్మయని వర్ణించుచుండును. తక్కిన భేదము భావనామాత్రమని క్రిందివాక్యము తెలుపుచున్నది:

శ్లో॥ భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా ।
పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥

తా॥ పురుషు డేవస్తువును నిరంతరము తీవ్రవేగముగా భావించుచున్నాడో ఆ దేస్థితిని పొందుట నిశ్చయము. ఎట్లన కీటకము యెల్లప్పుడు అవిచ్ఛిన్నముగా భ్రమరమును భావనచేయుటవలన తుమ్మెదగా మారుచుండునుగదా!

---

ఓమ్

# స్థల మాహాత్మ్యము

శ్రీ భగవద్గీత ప్రారంభములోనే "ధర్మక్షేత్రే" అని ప్రయోగించబడినది. గ్రంథకర్తలు తమనిర్ణయ మేమియో దానిని ముందుగా ప్రయోగము చేయుదురు. ధర్మమును స్థాపించుటకే, అధర్మమును అణచుటకే శ్రీకృష్ణభగవానుని అవతారమని చతుర్థాధ్యాయమున స్వయముగా భగవానుడే నుడివెను. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అను ప్రమాణమే దీనికి తార్కాణము. అనగా యుగయుగములలోను ధర్మమును స్థాపించుటకు భగవంతుడు అవతరించునని దీని యొక్క తాత్పర్యము. ఇందువల్ల దుర్యోధనాదులు అధర్మప్రవృత్తి గలవారలనియు, ధర్మక్షేత్రమగు పుణ్యక్షేత్రములో అడుగుపెట్టిన ఆ స్థల మాహాత్మ్యముచేత దుర్యోధనాదులకు ధర్మబుద్ధి ఉదయమగునని తలంచియే ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున సంగ్రామమేర్పరచుటకు కారణము. శ్రీకృష్ణభగవానుడు, వ్యాసాదిమహర్షులు ధృతరాష్ట్ర దుర్యోధనాదులకు యెంత ధర్మము చెప్పినను మనస్సున మార్పు కలుగలేదు. ధర్మభూమిలో అడుగుపెట్టిన అప్పుడైనా మనస్సున మార్పు కలుగవచ్చునేమో, యేవిధమైనను యుద్ధము లేకయుండుటయే శ్రేయస్కరమని తలంచి శ్రీకృష్ణభగవానుడు కురుక్షేత్రమున సంగ్రామము నేర్పాటు చేయుటకు కారణము. మానవునియొక్క మనస్సు మూడు విధములు. అవి సత్త్వగుణమనియు, రజోగుణమనియు, తమోగుణమనియు పేర్లు కలిగియుండును. సాత్త్వికగుణము కలవారి మనస్సు యెండిన రేగడిమట్టి వలె నుండును. రజోగుణముగలవానిమనస్సు కఱ్ఱవలెనుండును. తామస స్వభావము గలవాని హృదయము నల్లని కఠినరాతివలె నుండును. రేగడి మట్టి ఎండినప్పుడు బిరుసుగా ఉండినను నీళ్లలో తడిసిన వెంటనే యేలాగున మెత్తబడిపోవునో ఆలాగున తామెంత పట్టుదలకలిగియుండినను ధర్మాత్ముల సమీపమునగాని, ధర్మక్షేత్రములలోగాని ప్రవేశించినప్పుడు మనస్సు మృదువైపోవును. రజోగుణము గలవాని మనస్సు కొయ్యవలె నుండునని తెలుపబడినది. ఎండినమ్రాను కొంతకాలము నీటిలో ఉండిన క్రమముగా నాని జలములో మునిగిపోవునట్లు పుణ్యభూమియందుగాని, బ్రహ్మవేత్తలగు మహాత్ముల సమీపమునగాని కొంతకాలముండిన అతని

మనస్సుగూడ ధర్మములో మగ్నమైపోవును. తమోగుణస్థుని చిత్తము కఠినశిలవలె నుండునని పైన తెలుపబడినది. నల్లరాయి ఎంతకాలము నీటిలో నుండినను కరుగనట్లు, పుణ్యభూమియందుగాని పుణ్యాత్ములగు మహనీయుల సాన్నిధ్యమునగానినుండినను అతనిహృదయమునకు కొంచెమైనను మార్పుకలుగదు. పాండవులున్ను దుర్యోధనాదులున్ను కురుక్షేత్రములో ప్రవేశించినను దుర్యోధనునిమనస్సునకు యేలాటిమార్పున్ను కలుగలేదు. అర్జునునియొక్క మానసమున వెంటనే మార్పుకలిగి కరుణార్ద్రహృదయుడై యీ యుద్ధము యెందుకు ప్రారంభించబడెనో అని తలంచి యేడువ ప్రారంభించెను. ఇదే ధర్మక్షేత్రముయొక్క ప్రభావమని విజ్ఞులు తెలిసికొనిన చాలును. కావున స్థలమాహాత్మ్యము గలదని మాత్రము యెవరున్ను మరచిపోగూడదు. యుద్ధముచేసి దుర్యోధనాదులను నాశమొనర్చి రాజ్యమును సంపాదింపగలనని దృఢమైన హృదయముగల అర్జునునికి కురుక్షేత్రమున అడుగిడిన వెంటనే యింత దయాళుత్వ మెట్లుగలిగెను ? దానికి ముందుగా యేల యిట్టి కారుణ్యము లేకపోయెను ? త్యాగము లేకపోయెను ? ధర్మబుద్ధి ఉండకపోయెను ? జ్ఞానముఉదయించకపోయెను? ఈవిషయములనన్నిటిని ప్రథమాధ్యాయమున అర్జునుడు పలికిన వాక్యములచేతనే మనము గ్రహించుకొనగలను.

శ్లో॥ కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్ ॥

తా॥ అర్జునుడు రణరంగమందున్నవార్లను, ద్రోణాచార్య భీష్మాచార్యులను, బంధువులను చూచి అత్యధికమగు దయగలవాడై దుఃఖించుచు శ్రీకృష్ణునితో నిట్లనియెను.

వి॥ "కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్" గొప్పదగు దయగలిగి దుఃఖముతో కూడినవాడై చెప్పినట్లు ఉండుటవల్ల దీనివల్లనే స్థలముయొక్క విశేషమును మనము గ్రహించవలసియుండును.

శ్లో॥ సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥

తా॥ ఈ బంధుజనులనుజూచి నా అవయవములు శిథిలములగుచున్నవి. నోరు యెండిపోవుచున్నది. దేహము వణకుచున్నది. మాట్లాడజాలకున్నాను.

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥

తా॥ మరియు నా గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. నా దేహమునందు మిగుల తపనము కలుగుచున్నది. మనస్సు భ్రమించుచున్నది.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా ॥

తా॥ ఓ కృష్ణమూర్తీ ! నేను జయమును, రాజ్యమును, సుఖమును కోరుటలేదు. గోవిందుడా ! నాకు రాజ్యముచేతను, భోగములచేతను, జీవించి యుండుటచేతను ఏమి ప్రయోజనము ?

శ్లో॥ ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥

తా॥ ఓ శ్రీకృష్ణుడా ! యీ దుర్యోధనాదులందరున్ను నన్ను సంహరించినను, నాకు ముజ్జగముల ఆధిపత్యము దొరికినప్పటికి నేను వీరిని వధింపను. త్రైలోక్యరాజ్యమునందే యపేక్షలేని నేను భూలోక రాజ్యముకొరకు వధింపనని మరల ఏమిచెప్పవలెను ?

శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం ।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః ॥

తా॥ రాజ్యసుఖమునందలి యాశచేత బంధువులను, గురువులను, తాతలను గూడ జంపుట కుద్యుక్తులమైతిమి. ఇవ్విధముగ నుద్యుక్తులమై అయ్యో ! యెంతపాపమును జేయబూనితిమి.

వి॥ "అహో బత మహాపాపం కర్తుం వ్యవసితా వయమ్" అయ్యో! యెంత మహాపాపము చేయబూనితిమి అని చెప్పుటలో అర్జునునియొక్క మనస్సున ఆ స్థలమాహాత్మ్యముచే యెంత జాలికలిగెనో యీయొక్కదాని వల్లనే గ్రహించుకొనవచ్చును.

శ్లో॥ ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా! అర్జును డీవిధముగా చెప్పి దుఃఖముచేత కలవరముగలిగిన మనస్సుగలవాడగుచు ధనుర్బాణములను విడిచిపెట్టి యుద్ధమునందు రథముమీద నుసూరనుచు గూర్చుండెను.

వి॥ తీవ్ర వైరాగ్యముగలిగి సంసారదుఃఖమునుండి తరించవలెనని తలంపుగలుగునప్పుడు అర్జునునకు గలిగేలాగున సర్వత్యాగమున్ను, మనోదుఃఖమున్ను గలుగుచుండును.

ఇట్టి హృదయ పరిణామము గలవారికిమాత్రమే జ్ఞానోపదేశము మంత్రోపదేశము చేయవలెనని దీనివల్ల గోచరమగుచున్నది. అట్లుగాక మంత్రోపదేశముగాని, జ్ఞానోపదేశముగాని చేసినచో కంటకావృతమగు అరణ్యములో చల్లిన విత్తనములవలె అవి ఉపయోగపడవు. భూమిని శుద్ధపరచి కంపలు, ముండ్లచెట్లను తీసివేసి రాళ్ళు రప్పలను తొలగించి మిట్టపల్లములులేక చక్కపరచిన భూమిలోపెట్టిన విత్తనములు యెంత అభివృద్ధిలోనికి వచ్చునో మానవులయొక్క హృదయక్షేత్రములు ఆలాగున ఉండునని దీనివల్ల గ్రహించుకొనవచ్చును. మరియు అర్జునునకు ధర్మోపదేశము, జ్ఞానోపదేశముచేయ సంకల్పము శ్రీకృష్ణభగవానునకు ఉండినను తగిన కాలమును నిరీక్షించుచుండి యిప్పుడు తగుణము లభించె నని తలంచి ధర్మోపదేశము చేయదగ్గమైనది. ఇది దీనియొక్క సారము. రోగముతో భరింపరాని బాధ కలిగియున్నసమయమున ఔషధ మిచ్చినచో శ్రద్ధతో మందును సేవించుకొని సరిగాపథ్యముతోనుండును. అట్లుగాక ఆరోగ్యముతో నున్నప్పుడు మందుయిచ్చిన చక్కగా సేవింపక సరిగా పథ్యముచేయక యెట్లుండునో యీ సత్యమును గురువులు తెలిసి కొని భక్తులకు, శిష్యులకు జ్ఞానోపదేశము మంత్రదీక్ష నొసంగవలయును. కావుననే అనుభూతిప్రకాశమందిట్లు చెప్పుటకు కారణమైనది:

"నాపృష్టః కస్యచిద్బ్రూయాత్ న చాన్యాయేన పృచ్ఛతః"

భక్తిశ్రద్ధలతో తరించవలెనని ఆసక్తిలేనివారికి యీ బ్రహ్మవిద్యోప దేశము చేయరాదు. ఒకవేళ అడిగినను శ్రద్ధాభక్తి వినయములుగలిగి నిజముగా తరించవలెనను బుద్ధితో అడుగుచున్నాడా అని చూచుకొనియే యీ జ్ఞాన ముపదేశించవలెను. లేనిచో ఉపదేశించరాదు. స్థలకాల భేదములు లేనిచో పుణ్యభూమియు, పుణ్యకాలమున్ను శాస్త్రములో

యెట్లు నిర్ణయించవలయును? భూమి అంతట ఒకటియేయైనను, ఒకే స్థలములో శుద్ధజలముండిన సమీపమున మరియొక ప్రక్కన ఉప్పునీరు కనుపించుట లేదా! ఆలాగున శుభముహూర్తము, పుణ్యకాలము, దుర్ముహూర్తము, అనిష్టకాలము, జ్యోతిశ్శాస్త్రము యేల నిశ్చయించవలెను? ఒక్క మానవశరీరములోనే అంతటను రక్తము ఒక్కేవిధముగా ప్రవహించుచుండినను, చూచేగుణము నేత్రమందునను, వినేలక్షణము కర్ణమందునను, రసగ్రహలక్షణము జిహ్వయందునను యేల యేర్పడవలెను? ఆలాగున గోవులయందును, స్త్రీలయందును రక్తప్రచలనము ఏకముగానుండినను ఒకప్రదేశమునుండి పాలున్ను మరికొన్ని ప్రదేశములనుండి మలమూత్రములున్ను ఉద్భవించుట కానుపించుట లేదా! దీనిని గురించి యేమి చెప్పగలరు? ఆలాగున ఒక్కొక్క భూసారముననుసరించి ఒక్కొక్క సస్యములు, పైరులు ఫలించుటయు, మరియొక స్థలమున ఫలింపకపోవుటయు విజ్ఞులెరింగినవిషయమే గదా! మచ్చునకు కడపజిల్లా సిద్ధవటం తాలూకా పాపఘ్ని నదీతీరములో పండెడు దోసకాయలు మహా మధురముగా నుండును. ఆ దేవిత్తనము మరియొక ప్రదేశములో విత్తిన అంత తీపియుండదు. కావున స్థలభేదము తప్పక గలదని అంగీకరించియే తీరవలెను. అయితే దేశకాలములకతీతమగు పరమాత్మయందుమాత్రము యిట్టి భేదము లేదుగాని దేహేంద్రియ మనోబుద్ధుల పర్యంతము యెట్టివారికిన్ని యిట్టి ప్రభేదముగలదు. సామాన్య మనుష్యులేగాక మంచి బ్రహ్మనిష్ఠులు కొన్నిస్థలములలోగల జలము, ఆహారము సరిగా అనుకూలము లేనందుచే రోగగ్రస్తులైయుండుట కానుపించుట లేదా! మదనపల్లె, మదరాసు, తాంబరం మొదలగు స్థలములలోగల క్షయవ్యాధిగలవారికి అట్టి ఆరోగ్యసదనములో నుండువరకున్ను సౌఖ్యముగానుండును. అట్టి స్థలమునుండి మార్చుకొనిన తప్పక అట్టి వ్యాధి ఉదయమగుట అందరికిన్ని విదితమే. అయితే పరమాత్మ సర్వత్ర యేకవిధముగా ఉంటున్నాడుగదా యని కొందరు తలంచవచ్చును. అయితే అట్టి పరబ్రహ్మమును గ్రహించుటకు దేహము యింద్రియములు మనస్సు బుద్ధి చక్కనిస్థితిలో లేనిచో యెట్లు గ్రహించగలరు? కావున దేహేంద్రియ మనోబుద్ధులకు సరియైన ఆరోగ్య

ముండినమాత్రమే యెట్టివారైనను తపస్సుగాని, ధ్యానముగాని, యోగముగాని, బ్రహ్మవిచారముగాని చేయగలరను తత్త్వమును మరువ కూడదు. కావుననే గీతయందు శ్రీకృష్ణభగవానుడు ఆరవ అధ్యాయమున ధ్యానయోగమును గురించి ప్రారంభించునప్పుడు 'శుచౌ దేశే' అని ప్రయోగించడమైనది. మరియు,

శ్లో॥ యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥

తా॥ యోగి (ధ్యానముచేయువాడు) యేకాంతమైనచోట ఏకాకియైయుండి మనోనియమముగలవాడై నిరాశగలిగి, అపరిగ్రహ వ్రతము గలిగియుండవలయునని చెప్పుటకు యిదే కారణము. కావుననే తపోధ్యానాదులకు తగిన స్థలమును యీలాగున శాస్త్రము నిర్ణయించుటకు కారణము:

శ్లో॥ ఏకాంతే విజనే రమ్యే గుహాయాం పుణ్యభూమిషు ।
రహితే మశకై ర్దంశై ర్దేవాయతనకేఽపి వా ॥

,, సిద్ధక్షేత్రే మహాతీర్థే ధ్యానసిద్ధిః ప్రజాయతే ।
తత్ర సిద్ధాసనం బద్ధ్వా ఋజుకాయస్తు కారయేత్ ॥

తా॥ ఏకాన్తమందును, లేక జనశబ్దములేని యింటియందును, మనోహరమగు యితరస్థలమందును, కొండగుహాయందును, పుణ్యభూమియందును, దోమలు మొదలగు జంతువులచే బాధలేనిచోటునను, దేవపూజాదులు చేయు స్థలమందును, సిద్ధక్షేత్రమందును, పుణ్యతీర్థతీరమందును ధ్యానముచేయువారికి శీఘ్రముగా ధ్యానసిద్ధి నిర్విఘ్నముగా సిద్ధించును. ఆలాటిస్థలములలో దేనిలో అనుకూలముగా నుండునో అచ్చోట సిద్ధాసనమందు కూర్చుండి, శిరస్సు, మెడ, శరీరము చక్కగ నిలిపి, ఏకాగ్రచిత్తము గలవాడై, ధ్యానము చేయవలయునని యోగ మార్తాండముచెప్పుచున్నది. స్థలవిశేషమై ఒక్కయితిహాసము తెలిపెద. ఇది చారిత్రకము.

విద్యారణ్యస్వాములవారు పూర్వాశ్రమమున విజయనగర సామ్రాజ్య ప్రధానమంత్రిగా ఉండేకాలమున బుక్కరాయలు మొదలగు

కొందరు తుంగభద్రానదీ దక్షిణప్రాంతారణ్యమున వేటకొరకు వెళ్ళినప్పుడు, వేటకుక్కలను కుందేళ్ళపైని ఉసికొల్పునప్పుడు ఆ అడవిలో గల కుందేళ్లు వేటకుక్కలను తరిమినట్లున్ను, రాజులు ఈవిషయమునుచూచి ఆశ్చర్యపడినట్లున్ను, ఆ విషయమును బుక్కరాయలు వారు మాధవాచార్యులను పేరుగల విద్యారణ్యస్వాములవారికి తెలిపినట్లున్ను, అప్పుడు మాధవాచార్యులవారు అది సిద్ధక్షేత్రమనియు, ఆ భూమిలో ఉండుట వల్లనే ఆ కుందేళ్లకు యింతశక్తిగలిగెననియు, అచ్చట రాజధానినిర్మించే లాగున చెప్పినట్లు చరిత్రము గలదు. మరియొక కథ యిలాటిది గలదు.

ఒక గ్రామసమీపమునగల అడవిలో గొల్లపిల్లవారు ఆవులను మేపుచుండేవారు. అచట నొక సరోవరముగూడ గలదు. దట్టమైన నీడ గల వృక్షములు బహుళముగా ఉండెను. ఒకరోజున పశువులకు నీళ్ళు త్రాగించి మధ్యాహ్నము యెండ అధికముగా నుండుటచే గోవులను ఆ నీడలో ఉంచి పిల్లవారలు భోజనముచేసి విశ్రమించు సమయమున వారిలో ఒకడు ఆ మార్గమున వెళ్లుచుండు ఒకతొండను కొట్టి చంపెను. అప్పుడు చెట్టునీడలో విశ్రమించుచుండు ఒకడు లేచి గంభీరముగా కూర్చుండి యితరపిల్లవాండ్లలో యిద్దరిని పిలిచి, అదిగో అతడు అన్యాయముగా తొండను హింసించెను. అతనిని పట్టుకొనిరమ్మనియు, మరి నలుగురు పిల్లవాండ్లను పిలిచి, మీరు ఆ యా స్థలములలో కూర్చుండి దీనియొక్క న్యాయాన్యాయములను విచారణచేయవలెననియు చెప్పగా, ఆ నలుగురికి నిర్ణీతమైన స్థలములో నాలుగు ఆసీనులగుటయు, తొండను చంపిన హింసావిషయమై ధర్మశాస్త్రచర్చలు చేయుటయు, హింసచేసిన వారికి హింసయే శాస్త్రీయవిధియని తెలుపుటయు, మొదట తొండను హింసించినవానిని పట్టుకొనివచ్చిన యిద్దరితోను యీ హింసాత్మకుని అదిగో ఆ చెట్టుకొమ్మకు కట్టి ఉరితీయవలెననియు చెప్పగా వారున్ను ఆతనిని వృక్షశాఖకుకట్టి ఉరితీసిరి. అప్పటికి యెండతగ్గి పశువుల మేపుటకు వారందరున్ను లేవగా మరణించినవానిని చూచి యేడువ ప్రారంభించిరి. అందరున్ను వెంటనే గోవులను తోలుకొని ఊరిలోనికి వెళ్ళి జరిగిన వృత్తాంతమంతయు ఏడ్చుకొని అందరితోను చెప్పుటయు, చనిపోయిన పిల్లవాని తల్లిదండ్రులకు తెలుపుటయు, యీ ఆశ్చర్యమును

విని గ్రామస్థులలో కొందరు ఆ స్థలమును చూచుటయు, ఉరితీయబడిన వాడు చనిపోవుటయు చూచి. న్యాయస్థానములో యీ విషయమును తెలుపగా న్యాయాధిపతి పిల్లవారలనువిచారణ చేయగా, భయభ్రాంతులై యేడ్చుచు జరిగినవిషయమంతయు న్యాయాధిపతికి తెలిపినప్పుడు, అతడు ఆశ్చర్యపడి మరణించిన పిల్లవానిపై యెవరికిన్ని శత్రుత్వముగాని, విరోధముగాని, ద్వేషముగాని లేదని చెప్పుటలో న్యాయాధిపతి శుద్ధాత్ముడున్ను, ధర్మశీలుడున్ను, సత్యసంధుడున్ను అగుటవల్ల దీని కేదైన అప్రాకృతమగు కారణముండవచ్చునని తలంచి మరురోజున యీ పిల్ల వారినందరినీ గ్రామపెద్దలను కూడపెట్టుకొని ఆ స్థలమునకు వెళ్ళి, మీరు యెచ్చటెచట కూర్చుండిరి అని అడుగగా, పూర్వదినమున యెచటెచట యెవరెవరు కూర్చున్నారో ఆ యా స్థలములలో కూర్చుండగా మరు రోజున మొదటివాడు రాజుగాను, ఆనలుగురు మంత్రులుగాను, యిద్దరు జవానులుగాను గంభీరభావముతో కూర్చుండి అందరికిన్ని విస్మయము గలిగేలాగున ధర్మశాస్త్రములు పఠించుటయు, ప్రాణిహింసకు హింసయే ధర్మశాస్త్రముయొక్క నిర్ణయమని అనేక ప్రమాణములు నిరూపించు టయు చూచి యీ ప్రదేశమున యేదైన మహిమ యుండవచ్చునని న్యాయాధిపతి నిశ్చయించి ఆస్థలమును త్రవ్వేలాగున యేర్పాటుచేయగా మొదటివాడు కూర్చుండెడు భూమియందు విక్రమాదిత్యుని సింహాస నము కనుపించెననియు, నలుగురు పిల్లవారలు కూర్చుండే భూభాగమున మంత్రుల ఉచితాసనములు కనపడెననియు ఆ గాథ తెలుపుచున్నది.

ఆ పిల్లవాండ్రు మొదట కూర్చుండేస్థలమునుండి లేచినప్పుడే చని పోయిన పిల్లవానినిగూర్చి యేడ్చుటకున్ను, భయభ్రాంతులు కలుగుట కున్ను కారణమైనది. మరల న్యాయాధిపతిగారు మొదట యెచ్చటెచ్చట ఆసీనులై యుండిరో ఆ యా స్థానములో కూర్చుండ జేసినప్పుడు గంభీర భావముతో ధర్మశాస్త్రములు చెప్పుటకున్ను, మరణశిక్ష న్యాయసమ్మత మని ఘోషించుటకున్ను వారికి శక్తికలిగెను. ఆ యా స్థానములనుండి లేపి యితరప్రదేశములలో అడుగుపెట్టినప్పుడు మరల మామూలు మను ష్యులవలె రోదనము చేయుటయున్ను, దీనభావముతో చెప్పేస్థితివారికి గలిగెను. దీనినిబట్టి స్థలమాహాత్మ్యము గలదా ? లేదా ? అను సంశ

యము గలవారు తమలో తామే నిర్ణయించుకొనవచ్చును. కావుననే ప్రమాణపూర్వకముగా యిది లిఖించడమైనది. కావున నిర్విఘ్నముగా జ్ఞానసిద్ధిని, తపస్సిద్ధిని, యోగసిద్ధిని పొందతలంచువారందరున్ను స్థల మాహాత్మ్యము నెరింగి ప్రవర్తించుట మంచిది. ముఖ్యముగా యేప్రదేశము నందుండిన బ్రహ్మచర్యమునకు ఆటంకము కలుగుననితోచునో అట్టిస్థలము యెంత పుణ్యభూమియైనను తప్పనిసరిగా విడిచిపెట్టవలయును. ఇది స్త్రీ లైన పురుషులైన సమానధర్మము. ఆహారదోషముచే గలిగెడుపతనము కొంతకాలమునకు తటస్థించునేగాని, నివాసదోషముచే కలిగెడుపతనము తక్షణమే సంభవించును. ఈవిషయమై శాస్త్రమున చెప్పినదిచూడుడు.

శ్లో॥ ముహూర్తమపి నాసీత దేశే హ్యుపద్రవే యతిః।
ఉపద్రవే తు మనసి సమాధిర్నైవ జాయతే॥

తా॥ ఒక ముహూర్తసమయమైనను తననిష్ఠకు ప్రతిబంధకమైన స్థలములో ధ్యాననిష్ఠుడు నివసించరాదు. మనోనిర్మలము లేనిస్థలములో నుండిన నిర్వికల్పసమాధి సిద్ధించదు.

శ్లో॥ నాసమానసహాయేషు నివసేద్యోగవిత్ క్వచిత్।
వసేత్సమానశీలేషు సుశీలేషు తపస్విషు॥

తా॥ ధ్యానయోగపరుడు తనకు సమానమైన అనుష్ఠానముకల వారుండు స్థలములో మాత్రమే యుండవలయును. అట్లు సమానగుణము లేనిస్థలములో ఒకప్పుడున్ను యుండరాదు. నిర్మలశీలమున్ను, పుణ్య స్వభావమున్ను, తపస్సున్ను కలవారుండు ప్రదేశమందే నివసింప వలయును.

శ్లో॥ విహితస్యా ననుష్ఠానాన్నిషిద్ధస్య చ సేవనాత్।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి॥

తా॥ శాస్త్రవిహితకర్మల ననుష్ఠించకపోవుటచేతను, శాస్త్రనిషిద్ధ కర్మల నాచరించుటచేతను, ఇంద్రియముల నిగ్రహించకపోవుటచేతను, (యీ మూడు కారణములచే) మానవుడు పతితుడగుచున్నాడు. ఇక స్థలమహాత్మ్యమును గురించి మహాభగవద్గీతయందు ద్వితీయాధ్యాయ మునగల గాథ నొకదానిని మీకు తెలిపెద. సాధారణ భగవద్గీతయందు

23 శ్లోకములు గీతామాహాత్మ్యమును గురించి తెలుపడమైనది. మహా భగవద్గీతయందు నైమిశారణ్యశౌనకాదిమునులకు సూతమహర్షి గీతా మాహాత్మ్యమునుగురించి చాలవిస్తారముగా చెప్పడమైనది. ఆదిస్నీగాక భగవద్గీత ఒక్కొక్క అధ్యాయమునకున్ను ప్రత్యేకప్రత్యేకముగాగల పదు నెనిమిది అధ్యాయములకున్ను మహాత్మ్యము గలదు. అవి ఒట్టి శ్లోక ములు మాత్రముగావు. ఫలానిఅధ్యాయమును ఫలానివారు పారాయణ చేసి మోక్షమును పొందినట్లు యీశ్వరుండు పార్వతికి తెలిపినట్లు కన బడుచున్నది. రెండవఅధ్యాయములోగల మాహాత్మ్యమున యిప్పుడు వ్రాయబడు గాధ గలదు. ఇది చాల విస్తారమైనది. సంగ్రహాముగా మాత్రము యిచట వ్రాయబడును.

శ్లో॥ దక్షిణస్యాం దిశి శ్రీమానాసీదామ్నాయవాదినాం ।
పురే పురందరాహ్వానే దేవశర్మేతి విశ్రుతః ॥

,, అర్చితాతిథిరామ్నాతః వేదశాస్త్రవిశారదః ।
ఆహర్తా క్రతుసంఘానాం తాపసానాం ప్రియస్సదా ॥

,, దేవాన్ సంతర్పయామాస హవ్యైర్హుతవహం చిరం ।
న చోపలేభే ధర్మాత్మా శాంతిమేకాంతికీం తతః ॥

తా॥ దక్షిణదేశమున పురందరమను నొక పురముగలదు. అందు దేవశర్మయను బ్రాహ్మణు డొకడుండెను. వాడు వేదశాస్త్రముల నభ్య సించి అందు తెలిపియున్నట్లు అతిథిపూజ మొదలగు పంచయజ్ఞములను క్రమముగ చేయుచు, మహర్షులను పూజించి వారి అనుగ్రహామునకు పాత్రుడాయెను. మరియు అనేక యాగములనుచేసి దేవతలను సంతోష పరచెను. ఇట్లనేకసత్క్రియలను చేసినవాడైనను, మనఃశాంతిలేక దుఃఖ పడుచుండెను. వాని మనస్సు తాను చేసిన పుణ్యకర్మలచే తృప్తి చెందలేదు.

శ్లో॥ నిశ్శ్రేయసం స జిజ్ఞాసుః తాపసాననువాసరం ।
నిషేవే సత్యసంకల్పా నన్నైరేవ కల్పకైః ॥

తా॥ వాడు మనశ్శాంతికి తగు సాధనమును తెలియగోరి కాల త్రయమును తెలిసి భువనత్రయమును 'కరతలామలకమునుం బోలె'

నూచేడి మునులకు అగమ్యమేనియు లేదనితలంచి, తనకోరికను నెర వేర్చుకొనుటకై అనుదినమును అనేకతపోనిధులను ఉపచరించెను.

శ్లో॥ ఏవమాచరత స్తస్య కాలేమహతి గచ్ఛతి ।
ముక్తకర్మా తతః కశ్చిత్పామరాసీత్పురా భువి॥
„ అనుభూతనిరాకాంక్షీ నాసాగ్రన్య స్తలోచనః ।
శాంతచేతాః పరం బ్రహ్మ ధ్యాయన్నానందనిర్భరః॥

తా॥ ఇట్లు కొన్ని దినములు గడచినపిదప ఒకదినము అతనియింటికి ఒక సాధువు వచ్చెను. అతని ముఖమున ఆనందము తాండవమాడు చుండెను. వాడు నేత్రములను నాసాగ్రమున నిలిపి ధ్యానములోనుండెను. అతనిని చూచువారికి అతని స్థితిగతులనుబట్టి అతడు మిగుల వైరాగ్యము గలవాడనియు, శాంతమనస్సుగలవాడనియు తెలియుచుండెను.

శ్లో॥ పాదౌ తస్యోపసంగృహ్య ప్రణతేనాంతరాత్మనా ।
చకార విధివ త్తస్మై విద్వానతిథిసత్క్రియామ్ ॥
„ తం చ శుద్ధేన భావేన పరితుష్టం తపస్వినం ।
ప్రణతః పరిపప్రచ్ఛ నిర్మాణస్థితిమాత్మనః ॥

తా॥ దేవశర్మ శాంతచిత్తుడగు యీమహాత్మునిజూచి యిప్పటితో మన దుఃఖము తీరెను. వీరవర్ మహానుభావులు. మనము వీరిమూల మున శ్రేయస్సును బడయవలెనని యెంచి ఆ సాధుపుంగవుని పాదములను స్పృశించి నమ్రుడై వారికి వలసిన సత్కారముల నొనరించెను. అప్పుడా మహాత్ముడు సంతుష్టుడగుటంజూచి యిదియే సమయమని, స్వామీ! నేను అనేక పుణ్యకర్మల నొనరించియు సుఖపడకయున్నాను. నాకు శాంతిని మీరే కల్పించవలయును అని వినయముతో వేడుకొనెను.

శ్లో॥ స తస్మై కథయామాస పురే సౌపురనామని ।
మిత్రవంతమజాపాలం ఉపదేష్టారమాత్మవిత్ ॥

తా॥ భూసురా! సౌపురనగరమున మిత్రవంతుడను గొల్లవాడొక డున్నాడు. వానినిచేరి యడుగుము. వాడు నీకు శాంతిమార్గమును గఱపి మనస్సునకు తృప్తిని గలుగజేయగలడు అని మహాసాధువు వచించెను.

శ్లో॥ స చాభివంద్య తత్పాదా వేత్య సౌపురమూర్జితం ॥
తస్యోత్తరదిశో భాగే దదర్శ విమలం వనమ్ ॥

తా॥ దేవశర్మ అతని వాక్యానుసారముగా సౌపురమును చేరెను. మరియు ఆ పురమునకు ఉత్తరదిశయందు గల ఒక వనమును చూచెను.

శ్లో॥ తస్మిన్వనే సరిత్తీరే నిషీదంతం శిలాతలే ।
మిత్రవంతం దదర్శాథ సానందస్థిమితేక్షణమ్ ॥

,, అపి స్వాభావికం వైరం హిత్వాఽన్యోన్యం విరోధిభిః ।
సత్త్వైరావృతముద్యానే అంధస్యందనభాస్వతి ॥

,, శాన్తేషు మృగయూథేషు మహానంద మనోజ్ఞయా ।
కృపానువిద్ధయా భూమిం నిషించంతమివామృతమ్ ॥

తా॥ అచట నదీతీరమున మిత్రవంతుడు శిలాతలమున కూర్చొని యుండెను. వాని నేత్రములు ఆనందముతో విరిసియుండెను. ఆ వనమున అనేకములగు జంతువులు గలవు. అవి తమ జన్మసిద్ధమగు విరోధమును మరచి ప్రేమతో వ్యవహరించుచుండినవి. అదిచూడ యితని కాశ్చర్యము గలిగెను. మిత్రవంతుడు శాంతములైన ఆ మృగములనుచూచి, ఆనంద ముతో పొంగిపోవుచుండెను. వాని దయామృతమగు చూపు అమృత మును వర్షించుచున్నట్లుండెను.

శ్లో॥ ఉపేత్య వినయేనాముమున్మనా ప్రీతమానసః ।
కించిదానమ్రశిరసా తేనాపి స తు సత్కృతః ॥

,, ఉపతస్థే తతో విద్వాన్ మిత్రవంతమనన్యధీః ।
సమాప్తధ్యానకాలం స పర్యపృచ్ఛత్సమాహితః ॥

తా॥ దేవశర్మ మిత్రవంతునిజూచి తనకు దుఃఖవిమోచనము కలిగెనని యెంచి వినయముతో అతనిని సమీపించి నమస్కరించెను. మిత్రవంతుడు యితని ప్రణామముల నందుకొని ధ్యానకాలమగుటచే అతనికి ప్రతిసత్కారమును చేయక ధ్యానానంతరము సత్కారమును తెలిపెను.తరువాత దేవశర్మ అతి వినయముతో తన సంగతినంతయు చెప్పదొడంగెను.

దేవశర్మోవాచ = దేవశర్మ చెప్పెను.

శ్లో॥ ఆత్మానం వేత్తుమిచ్ఛామి తదముష్మిన్మనోరథే ।
లబ్ధసిద్ధముపాయం మాం ఉపదేష్టుం త్వమర్హసి ॥

తా॥ స్వామీ ! నేను అనేక సత్కర్మలను చేసియున్నాను. అయినను ఆత్మజ్ఞానమును పొందలేదు. అది లేకపోవుటవలన అనేకసత్కర్మలను చేసియు నాకు శాంతియు, తృప్తియు, సంతోషమును కలుగకున్నది. కావున నా దుఃఖవిమోచనమునకు తగినమార్గమును తెలుపవలయునని మిమ్ములను కోరుచున్నాను.

శ్లో॥ అత్రాంతరే మహాన్ ద్వీపీ కశ్చిదాయాదజానుగః ।
అజాఽపి తత్సమీపేఽగాత్ సత్వరం సరిదంతికే ॥

తా॥ ఇట్లు వారిరువురు మాట్లాడుచుండగనే అచటికి ఒక మేకను తరుముకొనుచు ఒక పెద్దపులివచ్చెను. ఆ మేకయు నదీసమీపముననున్న వారిదరి కేతెంచెను —

శ్లో॥ తత్ర సా భయముత్సృజ్య హిత్వా వైరమనర్గళా ।
అవతస్థే స చ ద్వీపీ తూష్ణీమాసీద్విమత్సరః ॥

తా॥ నదీతీరమున చేరినంతనే దానికొక క్రొత్తయనుభవము కలిగినట్లుండెను. అప్పుడది వ్యాఘ్రమునుజూచి భయపడుటలేదు. ధైర్యముతోను, శాంతముతోను దానియాగమనమును యెదురుచూచుచుండెను. అప్పుడు మరియొక విశేషము కలిగినది. అదేమనిన కడుకోపముతో దీనిని భక్షింపగోరివచ్చిన ఆ క్రూరవ్యాఘ్రము శాంతమగు మృగమువలె మాత్సర్యమును విడిచి యూరకుండెను—

శ్లో॥ దృష్ట్వాద్భుతమిమం దృశ్యం పప్రచ్ఛాఽసౌ సుహృద్వరం ।
నిర్వైరశ్చ కథం ద్వీపీ అజాపి భయవర్జితా ॥

తా॥ ఆశ్చర్యకరమగు యీ వింతనుచూచి దేవశర్మ, అయ్యా! యీ పెద్దపులి యింతవరకు యీ మేకను వెంబడించియు, యిచ్చోటికి వచ్చినతోడనే శాంతమగు మృగమువలె వైరమువీడియుండుటయు, మేకగూడ భయరహితమైయుండుటయు మిగుల వింతగానున్నది. దీనికి కారణమేమి ? అని మిత్రవంతు నడిగెను.

శ్లో॥ శృణు వక్ష్యామి తే మిత్ర వృత్తమత్ర పురాతనం ।
ఇదమాయతనం పశ్య పురో వనగతం మహత్ ॥

,, అత్ర త్ర్యంబకలింగం హి ద్రుహిణేన ప్రతిష్ఠితం ।
సుకర్మా నామ మేధావీ పర్యుపాస్తే తపశ్చరన్ ॥

తా॥ మిత్రమా! యీ వృత్తాంతమును చెప్పెదను వినుము. అదిగో యీ ముందరి ఉద్యానవనమున ఒక దేవాలయమున్నది. ఈ ఆలయమునందు బ్రహ్మదేవునిచే ప్రతిష్ఠింపబడిన త్ర్యంబక లింగమున్నది. కొన్నాళ్ళకు పూర్వము యీ లింగమును సుకర్మయను విద్వాంసుడు ఆరాధించుచుండెను.

శ్లో॥ కాలే మహతి తస్యాగాదతిథిః కశ్చిదంతికం ।
ఉపాహృత్య ఫలాహారం స తస్మై పర్యకల్పయత్ ॥

,, తేనాతిథ్యేన సంప్రీతః సుకర్మాణమభాషత ।
కిమిదం కర్మణో మూలం ఫలం భుక్త్వాతు తిష్ఠసి ॥

తా॥ ఇట్లు దేవతాప్రీతికరములగు కర్మలనుచేసి కాలము గడుపుచుండ నొకనాడు అతిథియొకడు అతని దరిజేరెను. సుకర్మ అతిథిని చూచి మిగుల సంతోషపడి నానావిధముల నాతని పూజించెను. అతిథియు మిగుల సంతుష్టుడై, ఓయీ సుకర్మా! నీవెందులకు కేవల ఫలాహారివై యీ భగవత్సేవ చేయుచున్నావు? అని అడిగెను.

శ్లో॥ స ఏవముక్తః ప్రాయేణ ప్రీతేనాత్మవిదా తథా ।
ప్రత్యువాచ వచస్స్పష్టం ఆత్మనో హితముత్తమమ్ ॥

తా॥ అప్పుడు సుకర్మ అయ్యా! నాకు జ్ఞానములేక నేను మిగుల దుఃఖమును జెందుచున్నాను. జ్ఞానమును పొందవలయునని కోరుచున్నాను. మీరు నన్ను అనుగ్రహించితిరేని నా మనోభీష్టము నెరవేరి నేను సుఖపడుదును.

శ్లో॥ తస్యైవం సూనృతం వాక్యం శ్రుత్వా ప్రీతస్తపోధనః ।
ద్వితీయమాలిలేఖాసౌ గీతాధ్యాయం శిలాతలే ॥

,, ఆదిదేశాశు తం విప్రం పఠనాభ్యసనాయ చ ।
ఫలిష్యత్యాత్మనః స్వైరం పరితస్తే మనోరథః ॥

తా॥ సత్యతపోధనుని వాక్యమును విని యితనికి జ్ఞానమార్గమును తెలియజేయవలెనని తలంచి గీతాద్వితీయాధ్యాయమును ఒక రాతికి చెక్కి ఓయీ సుకర్మా! నీవు దీనిని అభ్యసించుము, విచారనుంటదు, నీ దుఃఖములు చెదరిపోవును, నీ యభీష్టము నెరవేరి నీకు తృప్తికలుగును అని ఉపదేశించి పోయెను.

శ్లో॥ విస్మితస్తస్య వాగ్దేశాత్ అభ్యాసాద్దినాగతం ।
తతః కాలేన మహతా భావితాత్మా ప్రసన్నధీః ।

„ యత్ర యత్ర చ వారాసౌ శాంతం తత్ర తపోవనం ।
న ద్వంద్వబాధా నైవ స్యాత్ మిథో న చ వా భయం ।
తపసా తస్య జాపస్య ద్వితీయాధ్యాయ జాపినః ॥

తా॥ సుకర్మ అభ్యాసమును చేసి మహాత్ముని ఉపదేశమునుసరించి యెల్లప్పుడు ద్వితీయాధ్యాయమును జపించుచుండెను. కొలది కాలమునకే అతని పాపములు పోయి మనస్సు నైర్మల్యమును పొందెను. వాని యాత్మకు శాంతి కలిగెను. ఆ జ్ఞానవంతుడు సంచరించిన ప్రదేశములెల్ల శాంతితపోవనములుగా మారినవి. అతని పదస్పర్శము పొందినస్థలములో పరస్పర విరోధములుగల జంతువులు సహితము తమ వైరమునువీడి ప్రేమపూరితములును గలిసినవి. అందువలననే యీ స్థలమున కింతమాహాత్మ్యము కలిగెను. ఆ కారణమువల్లనే శార్దూలము మత్సరమును విడుచుటయు, అజము భయమును వీడుటయు సంభవించెను.

---

ఓమ్

# గీత

"గీత" యను వాక్యమునకు భగవద్గీత అనియే లోకమందు ప్రసిద్ధిగలిగియున్నది. గీతలు అనేకములున్నను "గీత" యను వాక్యము యెచ్చట వినిపించినను శ్రీ భగవద్గీత యనియే లోకమంతయు విఖ్యాతమై యున్నది. వేదములాగున కర్మ, భక్తి, జ్ఞానములు అను కాండత్రయాత్మకమై యుంటున్నదో, వేదములోగల సర్వార్థములున్ను గీతలో ఉండుట

వల్లనేయిదిన్ని కాండత్రయాత్మకమని మహనీయులందరునిర్ణయించుటకు కారణము. మొదటి ఆరధ్యాయములు నిష్కామకర్మమును గురించియు, రెండవ ఆరధ్యాయములు ఉపాసనను (భక్తిని) గురించియు, మూడవ ఆరధ్యాయములు జ్ఞానమును గురించియు తెలుపబడనైనది. ఆలాగున తెలుపుటకు కారణమేమన నిష్కామకర్మయోగముచే అంతఃకరణ శుద్ధియు, దైవోపాసనచే చిత్తైకాగ్రతయు కలిగినపిమ్మటనే జ్ఞానము సుస్థిరముగా నిలుచును. కావుననే మూడవ షట్కము జ్ఞానమునుగురించి ఉపదేశించుటకు కారణమైనది. నిష్కామకర్మయోగముచే పాపమునశించి హృదయము మలరహితమగుననియు, రెండవషట్కమగు ఉపాసనచే అనగా భక్తియోగమువల్ల విక్షేపదోషము తొలగుననియు, మూడవ షట్కమగు జ్ఞానముచే ఆత్మయొక్క ఆవరణము తొలగి బ్రహ్మసాక్షాత్కారము లేక దైవసాక్షాత్కారము గలుగుననియు మహనీయాత్ముల నిర్ణయము. వేదాన్తశాస్త్రములో మల, విక్షేప, ఆవరణములనెడు మూడుదోషములు తొలగునప్పుడే స్వస్వరూపమగు భగవత్సాక్షాత్కారము సిద్ధించునని జ్ఞానసిద్ధులగు మహనీయుల అభిప్రాయము. శ్రీ శంకరభగవత్పాదులున్ను వేదాన్తడిండిమమునందు ఆలాగుననే రచించిరి.

శ్లో॥ కర్మాణి చిత్తశుద్ధ్యర్థ మైకాగ్ర్యార్థ ముపాసనా।
మోక్షార్థం బ్రహ్మవిజ్ఞాన మితి వేదాన్తడిండిమః ॥

దీని అర్థము పైన వివరించినదే. మొదటి కాండమగు మూడవ అధ్యాయమున కర్మయోగముయొక్క ప్రాశస్త్యమును గురించి తెలిపినది చూడుడు:

శ్లో॥ న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥

తా॥ జీవుడు కర్మలయొక్క అనుష్ఠానము లేకుండుటవలన కర్మ నివర్తించిన స్థితిని (నైష్కర్మ్యము) పొందుటలేదు. నిష్కామకర్మను నాచరింపక జ్ఞానమును పొందక కర్మపరిత్యాగముచేత సిద్ధిని పొందుట లేదు. మొదటి కాండాంతమగు ఆరవఅధ్యాయమున ఆత్మసంయమ యోగము చెప్పుటచే యోగము మొదటికాండమున చేరియుండునని

మను దీపముచేత కారుణ్యముచేతనే పోగొట్టుచు ఆత్మస్వరూపమగు సాక్షాత్కారజ్ఞానమును కలుగజేయుచున్నాను.

ఇప్పుడు తృతీయకాండమగు జ్ఞానకాండములోనికి ప్రవేశించుచున్నాము.

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥ (అ. 13)

తా॥ సూర్యచంద్రాగ్నులకుగూడ ప్రకాశము నిచ్చునట్టిదిగను, అజ్ఞానమును దాటియున్నదిగను, జ్ఞానస్వరూపముగను, జ్ఞానముచే యెఱుంగదగినదిగను, జ్ఞానమువలన పొందదగినదిగను, సకల ప్రాణుల హృదయమున నున్నదిగను అగు జ్ఞేయము అందరి హృదయములోను ప్రతిష్ఠితమై యుంటున్నది.

ఈ వ్యాసము అతి సంగ్రహమగుటవల్ల ఒక్కొక్క కాండము నుండి ఒక్కొక్క శ్లోకముమాత్రము మచ్చునకు నిరూపించడమైనది. అట్లు కానిచో కాండత్రయమునుండియు అనేక ప్రామాణ్య శ్లోకములు తెలుపవలసియుండును. భగవద్గీత కాండత్రయ మనుదానిని గురించి శ్రీ మధుసూదనసరస్వతీస్వాములవారి భగవద్గీత వ్యాఖ్యాన గూఢార్థ దీపికయందు నిరూపించినది చూడుడు:

శ్లో॥ సహేతుకస్య సంసారస్యాత్యంతో పరమాత్మకం ।
పరం నిశ్శ్రేయసం గీతాశాస్త్రస్యోక్తం ప్రయోజనమ్ ॥

,, సచ్చిదానందరూపం తత్పూర్ణం విష్ణోః పరం పదం ।
యత్ప్రాప్తయే సమారబ్ధా వేదాః కాండత్రయాత్మకాః ॥

,, కర్మోపాస్తి స్తథా జ్ఞానమితి కాండత్రయం క్రమాత్ ।
తద్రూపాష్టాదశాధ్యాయైర్గీతా కాండత్రయాత్మికా ॥

తా॥ సహేతుకమైన సంసారముయొక్క నివృత్తిరూపకమైన మోక్షమునొసంగుటయే గీతాశాస్త్రమునకు పరమప్రయోజనమని చెప్పబడినది. సచ్చిదానందరూపమగు పరిపూర్ణ పరమపదప్రాప్తికొరకే వేదములుగూడ కాండత్రయాత్మకముగా ఆరంభింపబడినవి. కర్మ, ఉపాసనా, జ్ఞానకాండములని వానికి పేర్లు. ఆ వేదరూపమై అష్టాధ్యాయములతో

గూడిన భగవద్గీతయు క్రమముగా కర్మ, ఉపాసనా, జ్ఞాన కాండత్రయాత్మకమైయున్నది. మరియు నీభగవద్గీత సర్వశాస్త్రమయీ అని తెలుపునట్టి నీలకంఠ వ్యాఖ్యను చూపుదుము:

శ్లో॥ భారతే సర్వవేదార్థో భారతార్థశ్చ కృత్స్నశః ।
గీతాయామస్తి తేనేయం సర్వశాస్త్రమయీ మతా ॥

తా॥ సమస్త వేదార్థములును భారతమునందున్నవి. ఆభారతార్థ మంతయు గీతయందున్నది. అందువలననే గీత సర్వశాస్త్రమయీ అని చెప్పబడినది. మరియు,

శ్లో॥ సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః ।
సర్వతీర్థమయీ గంగా సర్వతేజోమయో రవిః ॥

తా॥ ఏలాగున గంగ సర్వతీర్థమయమై యుంటున్నదో, యెట్లు సూర్యుడు సర్వతేజోమయుడై యున్నాడో, హరి యేలాగున సర్వవేదమయుడై యుంటున్నాడో, ఆలాగున గీతయు సర్వశాస్త్రమయమై యుంటున్నది.

శ్లో॥ మోక్షోపాయం పరం పార్థ సగుణం వాథ నిర్గుణం ।
సోపానైస్తాదృశైరేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥

తా॥ ఓ యర్జునా! సగుణమైనట్టువంటి లేక నిర్గుణమైనట్టువంటి మోక్షోపాయమునకు పరమసాధనీభూతాధ్యాయములను సోపానములనుగా చేసుకొని మనుష్యుడు పరబ్రహ్మమును పొందుచున్నాడు.

శ్లో॥ యస్మాద్ధర్మమయీ గీతా సర్వజ్ఞానప్రయోజికా ।
సర్వశాస్త్రమయీ గీతా తస్మాద్గీతా విశిష్యతే ॥

తా॥ ఎందువల్లననగా భగవద్గీత ధర్మస్వరూపమైనదో, సమస్త జ్ఞానమునకు ప్రయోజనకారియో, మరియు సర్వశాస్త్రస్వరూపమైనదియో, అందువల్లనే భగవద్గీత సమస్త శాస్త్రములందును శ్రేష్ఠమైనదని చెప్పబడుచున్నది..

శ్లో॥ దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి ।
యథా న వేదైర్దానైశ్చ యజ్ఞ తీర్థవ్రతాదిభిః ॥

తా॥ ఎటుల దేవకీనందనుడైన శ్రీకృష్ణభగవానుడు గీతాపఠనముచే సంతుష్టుడగుచున్నాడో, అటుల వేదాధ్యయన, దాన, యజ్ఞ, తీర్థ, వ్రతాదులచే సంతుష్టుడగుటలేదు.

శ్లో॥ సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

తా॥ ఎవ్వడైతే ఘోరమగు సంసారసాగరమును దాటుటకు కోరుచున్నాడో, వాడు గీత యనెడు నావ నాశ్రయించి సుఖముగా తీరమును చేరుచున్నాడు.

శ్లో॥ మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే ।
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్ ॥

తా॥ ప్రతిదినము చేయునట్టి జలస్నానము మనుష్యులయొక్క శరీరమాలిన్యమును పోగొట్టుచున్నది. గీతయను గంగానదియందు ఒకసారి స్నాన మొనర్చిన అనాదినుండి వచ్చుచుండు సంసారమాలిన్యము పోవును. మరియు చాతుర్మాస్యమాహాత్మ్యమున గీతను గురించి తెలిపినది చూడుడు:

శ్లో॥ భారతే భగవద్గీతా తథా నామ సహస్రకం ।
గాయత్ర్యా సమ్మితం ప్రోక్తం పుణ్యే పాపక్షయే తథా ॥
పాఠేన యత్ఫలం ప్రోక్తం అర్థజ్ఞానాచ్చతుర్గుణం ।
మద్భక్తైభ్యశ్శ్రావణాచ్చ పుణ్యం దశగుణం స్మృతమ్ ।
వ్యాఖ్యానాచ్చాపి శిష్యేభ్యః పుణ్యం శతగుణం స్మృతమ్॥

తా॥ మహాభారతమునందు భగవద్గీతయు, విష్ణుసహస్రనామములున్ను గలవు. అయితే గీత గాయత్రీమహామంత్రమునకు సమానమైనది. గాయత్రీజపము పుణ్యప్రాప్తికిన్ని, పాపక్షయమునకున్ను యెంతమహిమ గలిగియున్నదో, గీతయున్ను అటువంటిదే. పారాయణముచే యెంత పుణ్యముగలదో, అర్థముతోగూడ పఠించిన నాలుగు రెట్లు అధిక ఫలము గలుగును. భగవద్భక్తులచే శ్రవణము చేయించిన పదిరెట్లధిక పుణ్యము గలుగును. ఈ గీతకు వ్యాఖ్యానముచేసి భక్తులచే పఠింపజేసినచో నూరు రెట్లు అధికఫలము గలుగును.

శ్లో॥ కర్మణా జాయతే భక్తిః భక్త్యా జ్ఞానం ప్రజాయతే ।
జ్ఞానాత్ప్రజాయతే ముక్తిః ఇతి శాస్త్రస్య నిర్ణయః ॥

తా॥ నిష్కామకర్మ మార్గానుష్ఠానముచే భగవద్భక్తియు, భక్తియోగమువల్ల జ్ఞానప్రాప్తియు, జ్ఞానయోగమువల్ల ముక్తియు గలుగునని సర్వశాస్త్రములు నిర్ణయించుచున్నవి. ఉపాసనయందు ధ్యానయోగము అంతర్భూతమైయున్నది. ఈ శాస్త్రమున్ను భగవద్గీత కాండత్రయాత్మకమైనదిగానే వర్ణించుచున్నది.

“గీత” అను రెండక్షరముల అర్థము క్రింద నిరూపించుచున్నది:

శ్లో॥ గీకారం త్యాగరూపం స్యాత్ తకారం తత్త్వబోధకం ॥
గీతావాక్యమిదం తత్త్వం జ్ఞేయం సర్వముముక్షుభిః ।

తా॥ “గీ” అను అక్షరము త్యాగమును బోధించుచున్నది. “త” అను నక్షరము తత్త్వబోధమును ఉపదేశించుచున్నది. గీత యను రెండక్షరములకీదేయర్థమని ముముక్షువులెరుంగుచు తెలిసికొనందగును. త్యాగమునకు కర్మఫలత్యాగమనియు, కర్మత్యాగమనియు అభిప్రాయము కలవారున్నారు. అయితే మొట్టమొదట కర్మఫలత్యాగమొనర్చి నిర్వాసనస్థితి, నిర్వికల్పసమాధిస్థితిని గలుగుటకొరకు కర్మత్యాగముండవలయును. లేనిచో నిర్వాసన, నిర్వికల్పసమాధి గలుగుట దుస్సాధ్యము. తత్త్వబోధమనగా ఆత్మసాక్షాత్కారము, ఆత్మబోధము, బ్రహ్మసాక్షాత్కారమని గ్రహించేది. కావుననే పాండవులు చేయవలసిన సమస్తకర్మలను అనగా పనులను పూర్తిచేసి పాండవులైదుగురున్ను, పాంచాలియు సర్వసంగపరిత్యాగులై వనమునకేగుటకు కారణము. ఈ సత్యము మహాభారత మహాప్రస్థానపర్వమున కనందగును.

శ్లో॥ నిర్మథ్య చతురో వేదాన్ మునినా భారతం కృతం ।
భారతో దధిమంథస్య గీతా నిర్మథనస్య చ ।
సారముద్ధృత్య తం కృష్ణో అర్జునస్య ముఖే హుతమ్॥

తా॥ శ్రీ వేదవ్యాసమహర్షి నాలుగు వేదములయందలి సారము తీసి భారతమును వ్రాసెను. శ్రీకృష్ణుడు అట్టి భారతమను క్షీరము విచారణరూపమగు తన ధ్యానముతో కాచిన పెరుగుకడవను

మథించి వేదసారమగు నవనీతామృతమును గైకొని అర్జునుని నోటిలో నుంచెను. అనగా అర్జునునకు వేదసారమంతయు నుపదేశించెనని భావము.

---

ఓమ్

## వి జ్ఞా నో ద య మ్

విజ్ఞానభాస్కరు డుదయించెను. కొన్ని అంతస్థులుగల యెత్తైన సౌధములతో కూడిన ఒకనగరముండిన మొట్టమొదట యెత్తైన మేడలపై సూర్యకిరణము ప్రసరించును. క్రమక్రమముగా సూర్యుడు పైకి రాగా రాగా చిన్న చిన్న గృహములపై మధ్యాహ్నమునకు అన్ని యిరుకైన సందులలో కూడ యేలాగున సూర్యప్రకాశము ప్రకాశించునో, ఆలాగున విజ్ఞానసూర్యు డుదయమగునప్పుడు మొట్టమొదట స్వచ్ఛమైన ఉన్నతా శయముగల హృదయములో నది ప్రకాశించును. తర్వాత కాలక్రమ ముగా నందరి హృదయాంతరములలోను అది భాసించును. ఆలాగున మొట్టమొదట యెత్తైన ఆశయముగల హృదయములో విజ్ఞానభాస్కరుని కాంతి వెలిగెను. క్రమముగా రాగా రాగా సామాన్యజనుల మనోవీథు లలో కూడ ఆ కాంతి ప్రకాశింపదొడగెను. ఈ సత్యమును వివేకవంతులు త్వరలోనె తెలుసుకొని తమలోగల సర్వజనుల ఆత్మోన్నతికి అడ్డయిన పూర్వాచారపద్ధతి యేదైన యుండినచో త్వరలో మార్చుకొనుట మంచిది. లేనిచో ప్రజలే మార్పుచేయగలరు. ఏదో అనాగరికకాలమున సర్వజనులకు వారి యోగ్యతానుసారముగ స్వాతంత్ర్యకాలము లేక యుండిన దానిని వెంటనే సవరణచేసుకొనులాగున చూచుకొనుట శ్రేయ స్కరము. మనుజులు విద్యావిజ్ఞానము లేనికాలములో నుండేలాగున యెల్లప్పుడు నుండవలెనని తలంచువారుండిన అది పశుత్వజీవితమేగాని, మానవజీవితముయొక్క లక్ష్యముగాదని తప్పనిసరిగా గ్రహించవలసిన కాల మాసన్నమైనది. ఈ సత్యము నెరుంగక సనాతనమతము, సనాతన ధర్మమని చెప్పుచు, సోదరమానవులను పశువులుగా చేయతలంచెడు కాలము దాటిపోయినదని గ్రహించుకొనవలెను. సనాతనశబ్దము ఒక్క పరమాత్మకు, ఒక్క పరమేశ్వరునికి, ఒక్క పరబ్రహ్మమునకుమాత్రమే చెల్లునుగాని, మనుష్యులచే యేర్పరుపబడిన యీ వర్ణాశ్రమధర్మములు

యిట్లు సనాతనమని చెప్పి కాలము గడుపవలదు. కావుననే గీతలో "సనాతన స్త్వం పురుషో మతో మే" అని తెలుపుటకు కారణమైనది. మఱియు,

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః॥

తా॥ ఈ యాత్మ కత్తితో ఛేదింపదగినదికాదు. అగ్నిచే దహింపదగినదికాదు. నీటిచే తడుపదగినదిగాదు. గాలిచే యెండింపదగినదిగాదు. నిత్యమైనది. అన్నిటిలోను వ్యాపించియుంటున్నది. అది స్థాణువవలె చలనము లేనిది. అందువలన అచలమైనది, సనాతనమైనది. ఇట్టి అర్థమును గ్రహింపక జాతి, వర్ణ, ఆశ్రమములకు సనాతనత్వము చెప్పెడు కాలము కాలగర్భములో విలీనమైపోయినదని యిప్పటికైనా విజ్ఞులు గ్రహించకపోయిన తప్పక ప్రమాదములో పడిపోవలసియుండురు. సృష్ట్యారంభమునుండి ప్రపంచమంతయు ప్రభువులచేత పాలించుచువచ్చినది. ఇప్పుడో ప్రజలే ప్రభువులను పాలనచేయుచున్నారు. కాలమార్పు యెట్లు గలిగినదో అందరున్ను అన్నిటిలోను యీ సత్యమును తెలుసుకొనవలసిన కాలమవతరించినది. రష్యాదేశములో జారుచక్రవర్తుల నిరంకుశ ప్రవర్తనమును చూచి సహింపజాలక లెనిన్, స్టాలిన్ ప్రభృతులు దేశపరిపాలనమును తమ స్వాధీనము చేసుకొని పాలించిరి. అచ్చటినుండి ఆ దివ్యప్రకాశము అమెరికా, ఇంగ్లాండు మొదలగు గొప్పరాజ్యములలో ప్రకాశించుచు, యిప్పుడు ప్రపంచమంతయు ప్రజాపాలనములోనికి వచ్చిన సత్యము లోకజ్ఞానము తెలుసుకొనినవారందరికిని విదితమే. ఈవిషయమై ప్రత్యేకప్రత్యేక దేశములగురించి కాగితపుటలను వృద్ధిపరచతలంచలేదు. చైనా, జపానులయొక్క యవస్థనుకూడ పర్యాలోచన చేయుట విజ్ఞులకవసరమని తోచిన ఆలాగున చేయవచ్చును. ఆలాగున భారతదేశప్రభుత్వముయొక్కయు, ముఖ్యముగా కాశ్మీర్, నేపాల్, నైజాం మొదలగు ప్రభుత్వస్థితియు పర్యాలోచన చేయుట మంచిది. పైజెప్పిన ప్రభుత్వపాలనాసౌధములు సరియైన సత్యధర్మములపై ఆధారము చేసుకొని నిర్మించియుండినచో యిట్టి పతనమునకు కారణము గలిగియుండదు. అట్లుగాక రాయి, రప్పలువేసి మట్టితో గట్టిన కారణముచేతనే వానకురిసి

తడిసి తడిసి యిప్పుడు పతనమైపోవుటకు కారణమైనది. స్థిరమైన గట్టి కట్టడమైనచో దానికి పతనము గలుగదు. రాజులు ప్రజలను రక్షించు వారలుగా వుండవలసినవారై యుండగా భక్షించువారలగుటవలననే యింత దురవస్థగలిగినదని వారిలోవారాలోచించుకొనిన తమ పతనమునకు తామే కారకులమనితలంచి శాంతిని ఆత్మసుఖమునుపొందవచ్చును. ప్రజలను బాధపెట్టి తీసుకొన్న ధనమును ప్రజలకుపయోగపరచక స్వార్థపరులై భోగపరులై యుండుటమాత్రమేగాక పాడుచేసిన పాపముచేతనే వారికి పతనము గలిగినదని గ్రహించిన చాలును. ఈలాగున మఠాధిపతులున్ను, పీఠాధిపతులున్ను శాస్త్రములు చదువుకొనిన మఱికొందరున్ను జనులపై యాధిపత్యమును వహించి ప్రజలను బానిసలుగా, సేవకులుగా చేయ యత్నించిరి. పైజెప్పిన విధమున వీరియొక్క పీఠములకున్ను, ఆధిపత్యమునకున్ను స్వస్తిచెప్పవలసిన కాలము సమీపించిన విషయము మఱువకుండిన మంగళకరమగును. వీరున్ను "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూరాజన్యః కృతః ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రోఽజాయత" అని పావనమగు శ్రుతికి అపార్థమును గల్పించి శివస్వరూపులగు జీవులను పశుస్వరూపులుగ జేయ యత్నించిరి. ఈ శ్రుతియొక్క నిజార్థమును మొట్టమొదట బయటపెట్టినది ఆర్యసమాజస్థాపకులగు శ్రీ దయానందస్వాములవారే. వారు వ్రాసిన సత్యార్థప్రకాశిక, ఋగ్వేదభాష్యభూమిక మొదలగు గ్రంథములను చదివిన అర్థమగును. పైజెప్పిన శ్రుతియొక్కఅర్థమును మనవారు యీలాగున వ్యాఖ్యానించ ప్రారంభించిరి. అనగా పరమాత్మ ముఖమునుండి బ్రాహ్మణులును, బాహువులనుండి క్షత్రియులును, ఊరువులనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును పుట్టినట్లు చెప్పప్రారంభించిరి. అందువలన బ్రాహ్మణులధికులనియు, తర్వాత క్షత్రియులు, పిమ్మట వైశ్యులు, కట్టకడపట శూద్రులు జన్మించుటచేత నిమ్నోన్నతస్థితి గలదని గల్పించిరి. అట్లైనను పోనిండు. అప్పుడున్ను సోదరభావమునకు హాని యేమియు లేదు. భగవంతుడు సత్యజ్ఞానానందస్వరూపుడు. అందువలన అందరున్ను పరమాత్మస్వరూపులని యేల భావించకూడదు? చక్కెరచే చేయబడిన ఒకబొమ్మనుండి శిరస్సుమొదలు పాదమువరకు యే భాగమునుండి తీసినను అదం

తయు మధురమగు పంచదారగాక మరి యేమగును? పనస, అత్తి మొదలగు చెట్లలో మొదటినుండి కొనవరకు కాయలు పుట్టుచుండును. అవన్నియు నొకేవిధముగా నుండునేగాని వివిధ విధములుగా నుండవుగదా ? అలాగున యేకైకస్వరూపుడగు పరమేశ్వరునినుండి యేర్పడినజీవులన్నియు పరమేశ్వరస్వరూపులని అనంతముఖములుగా శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. ఇంగ్లీషు ప్రభుత్వకాలములో రాజకీయపాలన మంతయు ఇంగ్లీషుభాషలో నుండుటచేత సామాన్యజనులు ఆంగ్లేయులే ప్రభువులుగాను భారతీయులమగు మనము ప్రజలుగాను యెల్లప్పుడు నుండవలయునని తలంచిరి. అంతేగాక వారేపాలకులనియు, మనము పాలితులమనియు హృదయాంతరాళమున నాటిపోయెను. అందువలన ఉన్నతోద్యోగములకు భారతీయు లనర్హులనియు చెప్పుచుండిరి. క్రమముగా యింగ్లీషు విద్యను భారతీయు లభ్యసించుటవలన భారతదేశము తమ జన్మహక్కనియు, ఆంగ్లేయు లెచ్చటనుండియో వచ్చి అనేకపన్నాగములుబన్ని మనలను బానిసలుగా జేసుకొనిరను సత్యము నెఱింగి ఇంగ్లీషుప్రభుత్వముపై దాడిచేసి స్వరాజ్యము నెట్లు సంపాదించిరో, ఆలాగున మతముయొక్కయు, జాతియొక్కయు సత్యము సంస్కృతభాషలో నుండుటవలనదానిని చదువుకొనిన మహానుభావులు వారి ననుసరించిన కొన్ని వర్గములవారు సంస్కృతభాషను నిషిద్ధపెట్టి అందరికిన్ని సంస్కృతభాష చదువుటకవకాశమివ్వకపోవుటచేత కోటానుకోట్ల జనులు తమశివత్వమును మరచిపోయి పశుత్వస్థితిలోనికి వచ్చిరి. కావున యింగ్లీషుచదివినందుచే బాలగంగాధర తిలక్, శ్రీగాంధీగారు, నెహ్రూపండితుడు మొదలైనవారు రాజకీయ రహస్యమును తెలుసుకొని తమ భారతదేశము నేలాగున లాగుకొనిరో, ఆలాగున సంస్కృతము చదివి దానిలోగల సత్యమును తెలుసుకొని మానవులందరకు హక్కు గలిగిన స్వారాజ్యమును, ఆత్మరాజ్యమును సంపాదించుకొనవలయును. ఈ విషయమై శ్రుతిస్మృతులు యేమి యుద్ఘోషించుచున్నవో సంక్షిప్తముగా యీక్రింద తెలిపెద:

గీత "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"
ఈశ్వరుడు సమస్త భూతముల హృదయములందు సమానముగా నుండువాడు.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్॥

దీని యర్థమును పైనజెప్పినదే.

శ్రుతి॥ ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః।
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్॥

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥

తా॥ ఈశ్వరుడు సమస్తప్రాణుల హృదయమందును ఏకరూపుడైయుండియు, అంతఃకరణవృత్తి ననుసరించి పాత్రలలోగల జలమున ప్రతిబింబించిన చంద్రునివలె అనేకవిధములుగా గోచరించుచున్నాడు. ఇట్టి శ్రుతిస్మృతు లసంఖ్యాకములు గలవు. కావున యికమీదైన సంకుచితభావమగు కూపస్థమండూకభావమును పరిత్యజించి విస్తృతప్రపంచచారిత్ర్యమును తెలుసుకొనుటకై యత్నించుట శ్రేయస్కరము. అట్లు చేయకపోవుటచేతనే అల్పసంఖ్యాకులగు మహమ్మదీయులు విశాలమగు యీ భారతదేశము నాక్రమించిరి. మహమ్మదీయకాలములోగల పాలనముచే హిందువులగు స్త్రీ పురుషు లనుభవించిన దుఃఖమునుతలంచినచో రాతివంటి హృదయమైనను కరుగకయుండునా! ఈ ఘోర విపత్తునకున్ను సోదరభావము లేకపోవుటయు, జనులను విద్యాబుద్ధులచే సంస్కరింపక పోవుటయు కారణమని యిప్పుడిపుడు సద్బుద్ధిగలవారు తెలుసుకొనుచున్నారు. ఆలాగున వ్యాపారనిమిత్తముగా వచ్చిన ఆంగ్లేయులున్ను భారతదేశమును క్రమముగా లోపరచుకొని పాలించుటకున్ను కారణమిదియే. భారతదేశములో జనులకు కొరత యేమియు అట్టి కాలములోను గలిగియుండలేదు. అయితే యీ మానవులను విద్యాబుద్ధులు చెప్పి సంస్కరింపక పశువులుగా చేసినందుచే యిట్టి దురవస్థ గలిగెను. ఇట్టి సత్యము నెఱింగియే గాంధీగారు మొదలైన కాంగ్రెసు ప్రముఖులు సర్వజనులకు ఆత్మస్వాతంత్ర్యముండవలయునని తెలుపుటకు కారణమైనది. అట్లు చేయకపోయిన కాంగ్రెసు మోమెంటు బలమైయున్నపుడు దానియందు చేరక ఇంగ్లీషు ప్రభుత్వమును అంటుకొని యుండువారిని దేశద్రోహులని యెట్లు పిలువ ప్రారంభించిరో, ఆలాగున

మానవుల యోగ్యతను చూడక కులమునకు ఆధిక్యమునిచ్చి ప్రవర్తించు వారిని తప్పక దేశద్రోహులని పిలిచెడుకాలము దగ్గరకు వచ్చినదని మరువకుందురుగాక !

---

ఓం

# జీవన్ముక్తుని కర్తవ్యమేమి ?

ఈప్రశ్నకు శాస్త్రమంతట వెదకినను సమాధానముకనుపించదు. కర్తవ్యశబ్దమునకు తాను చేయవలసిన పనిని చేయవలయుననియే అర్థమగును. జీవన్ముక్తుడు కృతార్థుడు. కృతార్థశబ్దమునకు అర్థమేమన, కృతకృత్యుడు అనియే కానుపించును. కృతకృత్యుడనగా, "కృతం=చేయబడిన, కృత్యం=కర్మను (గలవాడు)" అనియే శబ్దార్థమగును. అనగా తనకు సంబంధించిన సమస్త కృత్యములను ఏలాటికొరతయులేక చేసిన వాడని అర్థము. ముముక్షువులకు, జిజ్ఞాసువులకు, సాధకులకు కర్తవ్యమేమని అడుగవచ్చునేగాని, ముక్తులకు కర్తవ్యమేమని యడుగుట అనుచితము. విద్యార్థిదశలో నున్నవానికి, ఉద్యోగముచేయువానికి కర్తవ్యమేమని అడుగవచ్చునేగాని ఉపకారవేతనము అనగా పెన్షన్ తీసుకున్నవానికి కర్తవ్యమేమని అడుగుటకెట్లు అవకాశము లేదో, ఆలాగున చక్కగ శాస్త్రములు గురుముఖముగా చదివి, దానియందు చెప్పబడిన సాధనలన్నియు చేసి, జీవన్ముక్తిని పొందినవానికి కర్తవ్యము లేదు. అతడు స్కూలులో తెన్నుగ శాస్త్రములు చదివిన తరువాత సరిగా ఉద్యోగము నిర్వహించి, ఉపకారవేతనము పొందినవానివంటివాడు. అతనికి విద్యార్థిదశలో వుండే పాఠములు చదువుటగాని, ఉద్యోగము విధిప్రకారము నిర్వహించవలెననిగాని విధియెట్లు లేదో, జీవన్ముక్తునిస్థితియు అలాంటిది. అయితే జ్ఞానులని చెప్పువారందరున్ను, ముక్తాత్ములైనారా లేదాయని వారిలోవారున్ను, ప్రేక్షకులున్ను చూచుకొనవలయును. ఐతే ముక్తాత్ములు సమస్తబంధములనుండి విముక్తిని పొందినవారు; స్వతంత్రులు. ఇష్టముండిన లోకహితార్థ కార్యములు చేయవచ్చును లేక మానవచ్చును. కొందరు ఉన్నతోద్యోగము నుండి విరమించి పెన్షను తీసికొనుచున్నప్పటికిన్ని ఇష్టముండిన యింకను యుద్యోగముచేయవచ్చును.

లేక మౌనవచ్చును. కర్తవ్యమనిమాత్రము చెప్పకూడదు. కర్తవ్య శబ్దము కర్మబద్ధులకు, కర్మనుండి విముక్తిబొందుటకు యిచ్ఛగలవారికి మాత్రమే చెప్పవలయును. ఆలాగున జీవన్ముక్తులకు కర్తవ్యముగలదని చెప్పినచో వారింకను కర్మబద్ధులై యున్నారనియే శబ్దార్థమగును. ఐతే అట్టి ముక్తాత్ముల ప్రారబ్ధకర్మ ననుసరించి, లేక సంస్కారము ననుసరించి కొందరు లోకహితార్థము కర్మచేయవచ్చును. కొందరు ఏమియుచేయక తూష్ణీంస్థితిలో నుండవచ్చును. కొందరు మౌనముద్రలోనే సదా కాలం గడుపవచ్చును. ఈలాటి దేహసంబంధవృత్తులనుచూచి మనము జీవన్ముక్తులు యిట్లుండవలయునని నిర్ణయించుటకు లేదు. కనుకనే వివేకచూడామణియందు యీలాగున చెప్పుటకు కారణము :

శ్లో॥ దిగంబరో వాఽపి చ సాంబరో వా
త్వగంబరో వాఽపి చిదంబరస్థః ।
ఉన్మత్తవద్వాఽపి చ బాలవద్వా
పిశాచవద్వాఽపి చరత్యవన్యామ్॥

తా॥ దిగంబరుడుగాగాని, వస్త్రముతో గూడుకొన్నవాడుగాగాని, జింకచర్మమును లేక పులిచర్మమును ధరించువాడుగాగాని, చిత్స్వరూపహృదయాకాశమందు విహరించువాడుగాగాని, పిచ్చివానివలెగాని, బాలునివలెగాని, పిశాచము పట్టినవానివలెగాని భూమియందు సంచరించుచున్నాడు.

అయితే ఏమియు పరిశ్రమచేయక ఊరకుండుట తమోగుణ స్వభావమౌను. కాని బ్రహ్మజ్ఞానులగూర్చి మాత్రము యీ వాక్యము చెప్పినదికాదు. ఇతరుల గురించియని గ్రహించవలెను. మహనీయాత్ములు తమోగుణరహితులు, తమోగుణస్వభావమగు సోమరితనము నిశ్శేషముగా నశించినవారు, రజోగుణమగు ప్రవృత్తియు లేనివారు, సత్త్వగుణమగు సుకుమారత్వమున్ను లేనివారు, విశుద్ధసత్త్వమగు ఆత్మానందములో, దైవానందములో, బ్రహ్మానందములో యెల్లప్పుడున్ను ఓలలాడుచుండేవారు, వారి శరీరప్రకృతి, మానసికస్వభావము అతి నిర్మలమైనదగుటచే ఒక్కక్షణమైనను సోమరులవలె ఊరకుండే స్వభావముండదు. ఒకవేళ మౌనముగా నుండినను ముముక్షువులకు ఆత్మజ్ఞానసంబంధమైన

ధర్మములుపదేశించుచునేయుందురు. లేనిచో అట్టి మౌనసనిష్ఠలో యుండు మహాత్ముని సమీపమునందు అనేక భక్తులు ముముక్షువులు చేరియుండరు. అదేదానికి గురుతు. వారట్టిపో వారు మాట్లాడక పోయినను, భావముతో ముముక్షువులు తరించే మార్గమును వారుపదేశించుచునే యుందురు. లేక అత్యవసరమగు ఒక్కొక్క వాక్యమును అడిగేవారికి చెప్పుటయో వ్రాసి చూపుటయో చేయుదురు. అట్టి ఒక్కొక్క వాక్యమున్ను గొప్ప అర్థము భావము గలిగియుండును. అట్టివారు సామాన్యజనులకు ఉపయోగపడరుగాని, బ్రహ్మవిద్యయందు నిష్ఠగలవారికి ఆ ఒక్క వాక్యమే గొప్పదగు అర్థముతో గూడియుండునని సాధకులు గ్రహించగలరు. అది గొప్పదగు మర్రిచెట్టు సూక్ష్మమైన విత్తనములో యిమిడియున్నట్లు వారి వాక్యములున్ను అలాగుననే సూత్రప్రాయములుగా వుండును. ఈవిషయమై శ్రీ దక్షిణామూర్తి సనకాదులకు ఉపదేశించిన భావమే మనకు ప్రమాణము.

శ్లో॥ చిత్రం వటతరోర్మూలే వృద్ధా శిష్యా గురుర్యువా ।
గురోస్తు మౌనవ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః ॥

తా॥ శ్రీ దక్షిణామూర్తి సనకాది మహర్షులకు మౌనవ్యాఖ్యానమను జ్ఞానముద్రనుచూపిరి. అందువల్ల సనక, సనందన, సనత్కుమార,సనత్సుజాతులనుగు బ్రహ్మమానసపుత్రులు సర్వసంశయములు తీరినవారైరి. ఓహో, ఇదెంతవిచిత్రమైన విషయము! సనకాదులవలె ఉండు యోగిపుంగవులకుమాత్రము జీవన్ముక్తులై మౌననిష్ఠలో నుండువారి ఉపదేశము ఉపకరించును. ఇక యీవిషయమై శ్రీకృష్ణభగవానుడు గీతయందేమి ఉపదేశించెనో చూతము.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥

తా॥ ఎవ్వడైతే తనలో తాను ఆనందించునో, తనలో తానే తృప్తిని పొందునో, తనయందే సంతోషపడుచుండునో, అట్టివాడు చేయదగిన కర్తవ్యమేమియు లేదు. దీనియందు జీవన్ముక్తుడైన మహాత్మునికి మూడులక్షణములు చెప్పడమైనది. 1. ఆత్మయందు రమించువాడనియు, 2. ఆత్మయందు తృప్తిని పొందినవాడనియు, 3. ఆత్మయందు సంతుష్టిని

పొందినవాడనియు తెలుపడమైనది. ఇట్టిలక్షణము తమకు కలిగియుంటు న్నదా? లేదా? యని బాగుగా యోచించుకొనవలయును. లేనిచో ప్రమాదములో పడిపోవుదురు. అజాగ్రత గలిగినచో క్షుద్బాధచేతపీడింప బడువాని నెవరైన అన్నము భుజించెదవా? అని అడిగినచో తృప్తిగా భుజించితినని వాడు చెప్పినచో నెట్లుండునో, రోగముచే బాధింపడువాడు నాకు రోగములేదు, ఆనందముగా ఉంటున్నానని చెప్పినచో యెట్లుండునో వీనియొక్క స్థితియును ఆలాగుననే ఉండును. ఆకలిచే బాధింపబడువాడు అన్నము భుజించిన, రోగముచే సంకటపడువాడు ఔషధసేవచేసిన యెట్లు సౌఖ్యమొందగలరో ఆలాగున జీవన్ముక్తి గలుగువరకు ధ్యానాది అనుష్ఠానములు, శ్రవణ మనన నిదిధ్యాసములు చేయుటయే మంచిది. లేనిచో ఆత్మలో తపించవలసియుందురు. ఈశ్లోకములో ఆత్మజ్ఞానియొక్క కర్తవ్యరాహిత్యమును నిరూపించి, మరియొకవిధమును యీ క్రింది శ్లోకములో శ్రీ కృష్ణభగవానుడు ఉపదేశించడమైనది.

శ్లో॥ నైవతస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥

తా॥ జీవన్ముక్తుడైన మహాత్మునికి యీ లోకములో కర్మము చేయుటచేత పొందవలసిన ప్రయోజనమేమియులేదు. కర్మము చేయక పోవుటచేత గల నష్టమున్ను ఒకటిలేదు. వీరికి బ్రహ్మాది సమస్తభూత ములయందును యేదియును ప్రయోజనము కొరకు ఆశ్రయింపదగినది లేదు. ఏలన చేయవలసినవన్నియు చేసినవాడగుటచేతను, పొందవలసిన వన్నియు పొందినవాడగుటచేతను మరల కర్తవ్యము మిగిలియుండలేదు. కనుకనే శుకాష్టము "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః" అని తెలుపుటకు కారణము. ఈకాలమున గీతాశాస్త్రమే సర్వులచేతను అంగీకరింపబడిన ముఖ్యప్రమాణగ్రంథమై యున్నదిగదా! కాన గీతా చార్యుడగు శ్రీ కృష్ణభగవానుడు తెలిపినది చూడుడు.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

తా॥ ఓ యర్జునా! నాకు చేయదగిన కర్మమేదియును లేదు. మరియు మూడులోకములయందును కొంచమైనను నాచేత పొందబడ

నది గాని, పొందదగినదిగాని లేదు. అట్లు ఏదియును లేకపోయినప్పటికి నేను కర్మమునందు ప్రవర్తించుచునే యున్నాను.

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ।

తా॥ అర్జునా ! నేను సర్వకాలములయందు జాగరూకుడనై కొంచమైనను పొరపాటు లేక కర్మములను చేయకపోతినేని లోకములోని మానవులందరును నావలె కర్మములు చేయక ఊరకుందురు. అట్లుచేయక పోవుటచేత భ్రష్టులగుదురు. మహాత్ములు స్వభావముగా కరుణాస్వరూపులు. అందరిలోని ఆత్మయు, తన ఆత్మయు ఒకటేయని అనుభవజ్ఞానము గలవారగుటచే దుఃఖజీవులనుచూచి సహింపజాలరు. అందువల్ల వారి యొక్క సౌఖ్యముకొరకు కర్మచేయుచునే యుందురు. ఏలన చేసినచో తనకు బంధము లేదు; చేయకపోయినను హానిలేదు. అట్టి అనుభవము గలవారగుటవల్ల జీవకోట్ల క్షేమముకొరకు కర్మచేయుచునే యుందురు. వారు ఈశ్వరావస్థను పొందినవారు. ఈశ్వరుడు సర్వజీవుల సౌఖ్యమును గురించి పంచభూతాత్మకమగు ప్రపంచమును, ప్రపంచసుఖానుభవము కొరకు కర్మానుగుణ్యముగా పంచభూతాత్మకమగు దేహమును, ఇంద్రియములనుసృష్టించి బంధవిముక్తినిపొందుటకుతగినఅనుష్ఠానములను, శాస్త్రములను ఎట్లు సృష్టించియున్నాడో మహాత్ములయొక్క స్థితియు ఆలాగునుండును. అయితే సృష్టికార్యములచే పరమాత్ముడేలాగున బంధముల పొందుటలేదో, మహనీయాత్ములయొక్క కృత్యమున్ను ఆలాగుననే యుండును. దృష్టాంతముగాచూడుడు: శ్రీ బుద్ధభగవానుడు అవతరించి జీవహింసాది పాపకృత్యములగు యజ్ఞాదులను రహితమొనర్చి అహింసాధర్మములను బోధించి జనులను పావనమగు బౌద్ధమతములో ప్రవేశపెట్టి జన్మరహితమగు నిర్వాణమును పొందించెను. ఆలాగుననే శ్రీ యేసుక్రీస్తు అస్వతంత్రులైన జనులకు విముక్తికలుగజేసి పవిత్రమగు తన మతములో జనులను చేర్చుటలో ప్రయత్నించెను. అందువల్ల స్వార్థపరులచే చిత్రవధ పొందినను పరమదయతో అతి శ్రేయస్కరమని తలంచెను. అదేరీతిగ శ్రీమహమ్మదునబిగారు అవతరించిన కాలమున అరేబియా దేశములోగల క్రూరకృత్యమునుచూచి సహింపజాలక తన్నివృత్త్య

పాయమును చూపుచు, ఆకాలపు క్రూరులగు అరబ్బులచే మదీనాక్షు తరుమబడినను, ఓర్చుకొని జనులు తరించుటకు తగిన ఇస్లాంమతమును ఉపదేశించెను. మరియు శ్రీ శంకరభగవత్పాదులు ఆవిర్భవించినప్పుడు గల దుర్మతములను ఖండించి జనులకు పరమాద్వైత అమృతమతము నుపదేశించెను. మరియు శ్రీ రామానుజులున్ను, శ్రీమధ్వాచార్యులున్ను, శ్రీ గురునానక్కున్ను తమతమ దివ్యమతములను జనులకు బోధించి వారలను పాపములనుండి విముక్తిగలుగజేసి పవిత్రులనుగా నొనర్చి దైవకృపకు పాత్రులనుగాజేసిరి. మహనీయుల జీవితమీలాగుననే యుండును. కట్టకడపటివారగు గాంధిగారున్ను భారతీయులను పరాధీనము నుండి విముక్తి గలుగజేయుటకు తన ప్రాణమునుగూడ పోగొట్టుకొనిరి. ఇదే మహాత్ములయొక్క కర్తవ్యము. శ్రీ బుద్ధభగవానుని నుండి శ్రీ గాంధీగారి వరకుగల మహనీయాత్ములు చేసిన అమోఘమగు కార్యమునకు వారేదైన ఫలమునుపొందుట కొరకు ఉద్దేశించిరా? లేదు. కరుణాస్వరూపులగుటచే ఇతరుల కష్టములను చూచి సహింపజాలక అట్టి కార్యములను బూనిరి. వీరందరున్ను తమ మోక్షముకొరకా అట్లు చేసిరి? వారందరున్ను ముక్తాత్ములయి దైవప్రాప్తిని పొంది పరమ సుఖమును అనుభవించి, అయ్యో! ఇట్టి దివ్యసుఖమును జీవకోట్లు అనుభవించుటలేదే! అనిగల కరుణార్ద్రహృదయముతో అట్లు చేసినదేగాని మరియొకటికాదని విజ్ఞులందరును యెరింగిన విషయముగదా! వారిలో ఒక్కొక్కరున్ను యెన్నిగ్రంథములను వ్రాసిరి! ఎన్ని ఆశ్రమములను స్థాపించిరి! పాదచారులై తిరిగి తిరిగి, పట్టణములలోను, పల్లెటూరుల లోను గల జనులకు ధర్మోపదేశములను చేసిరి! వారుచేసిన జీవకోట్ల సేవలో మనస్సునొకసారి ప్రసరింపజేసి కనురెప్పలార్పక చూచుకొనినచో మనము చేసెడు లోకసేవ మేరుపర్వతమునకున్ను, మృత్కణమునకున్ను యెంత తారతమ్యముగలదో అంతేయగును. ఇక మన ఋషుల యొక్క జీవితములోనికి మనస్సును ప్రవేశపెట్టెద. శ్రీవేదవ్యాసమహర్షి చేసిన భాగవతమును చూడుడు.

సీ॥ పైలుండు ఋగ్వేదపఠనంబు దొరకొనె
సామంబు జైమిని సదువుచుండె

యజువు వైశంపాయినాఖ్యుండు వైకొనె
దుది నథర్వము సుమంతుడు పఠించె
నఖిల పురాణేతిహాసముల్ మా తండ్రి
రోమహర్షణుడు నిరూఢి దాల్చె
తమతమ వేదమాతపసులు భాగించి
శిష్యసంఘములకు జెప్పిరంత
తే॥ శిష్యులెల్లను ఆత్మీయ శిష్యజనుల
కంత బహుమార్గముల దుంచి యనుమతింప
బెక్కుశాఖలు గలిగి యీ పృథివిలోన
నిగమ మొప్పారె భూసురనివహమందు.

(శ్రీ) వ్యాసభగవానుడు నాలుగు వేదములను విభజించి వేదాన్త సారముఃగు బ్రహ్మసూత్రములను రచించెను. పదునెనిమిది పురాణము లను, మహాభారతమును నిర్మించి ప్రజలకు అనుగ్రహించెను. శివపురాణ మున (శ్రీ) వేదవ్యాసమహాముని (శ్రీ) కాశీక్షేత్రమునకు వచ్చినప్పుడు పదివేల శిష్యులగు మునులతోగూడ అరుదెంచిరని గలదు. అలా గున చరకముని వల్ల ఆయుర్వేదము లభ్యపడెను. పాణినిమునిచేత వ్యాకరణశాస్త్రము సిద్ధించెను. ఆలాగున జ్యోతిషశాస్త్రమున్ను పరాశ రాది ఋషులవల్ల లభ్యపడెను. ఇవన్నియు లేనిచో మానవులమగు మన మున్ను పశువులవలె ఉండవలసినవారముగదా ! (శ్రీ) వసిష్ఠాశ్రమమున నెంతమంది శిష్యులుండిరో! శ్రీయోగవాసిష్ఠము ఆమునివల్లగదా మనకు లభించినది. ఆలాగునవిశ్వామిత్రమహర్షి యొక్క సిద్ధాశ్రమములోయెందరు మునులుండిరో ! అదేమాదిరి గౌతమాశ్రమములో యెందరు మహర్షు లుండిరో! అట్లేభృగ్వాశ్రమములో, అగస్త్యాశ్రమములో, వాల్మీకాశ్రమ ములో యెందరు మహర్షులు, బ్రహ్మచారులు నివాసము గలిగియుండిరో! అట్టి మహాత్ములగు ఋషుల చరిత్రము కనురెప్పలార్పక ఏకాగ్రబుద్ధితో చదివినచో అట్టి మహర్షి సంతతిలో పరంపరలో వారి శిష్యప్రశిష్య సాంప్రదాయములో చేరిన మనము ఏమిచుయున్నామని తెలిసికొన వచ్చును. అట్లయిన మన ఆశ్రమములు మన శిష్యసమూహములు యెంత గొప్పవో తెలుసుకొనిగర్వించుటయో, పశ్చాత్తాపపడుటయో చేసుకొన

వచ్చును. ఏలాగున ఆయుర్వేదము బోధించెడు భిషగ్వర్యులు ఆయుర్వేదమును గురించి నిరంతరము అంతేవాసులకు ఉపదేశించుచుందురో, ఇప్పటివరకు కనబడినదేగాక యికేదైన సూక్ష్మమగుఔషధ ప్రయోగముగలదాయని చూచుచుందురో, ఆలాగున శాస్త్రములు చెప్పుచుండు పండితులు తమ శిష్యులకు యెల్లప్పుడు శాస్త్రములను చెప్పుటలోను, క్రొత్తవిషయములు కనిపెట్టుటలోను కాలము గడుపుదురో, ఆలాగున శిల్పశాస్త్రజ్ఞులగు ఇంజనీరులు దానిని గురించి చదువుచుండువారికి చెప్పుటలోను, నూతనవిషయములను కనుగొనుటలోను పరిశ్రమపరులై యుందురో, ఆలాగున సమస్తశాస్త్రముల బోధించెడు సర్వులున్ను; తత్తద్విషయములను శిష్యులకు ఉపదేశించుచు నూతన నూతన విషయములను కనుగొనుటలో యత్నించుచుందురో, అట్లే బ్రహ్మవేత్తలగు మహాత్ములున్ను, జీవన్ముక్తులున్ను ఆధ్యాత్మవిద్యను, బ్రహ్మవిద్యను అంతేవాసులకు, ముముక్షువులకు, జిజ్ఞాసువులకు ఉపదేశించుటలో కాలము గడుపుదురు. అట్టివారికి అధ్యయనములకున్ను, తపస్సుచేయుటకున్ను, వేదాన్తశ్రవణమునకును, సాధనచేయుటకును తగినఆశ్రమములను, దానికి తగిన వసతులను నిర్వహించుచుందురు. జీవన్ముక్తులకు కర్తవ్యమేదైన యుండినచో యీ పైనచెప్పినదే వారికర్తవ్యమైయుండును. కర్తవ్యము కలదని చెప్పగూడదని ప్రప్రథముననే తెలుపడమైనది. జీవకోట్లపై కరుణగలిగి వారేదైన చేయుచుండినచో పైని చెప్పినవిధముగా నుండునని మాత్రమే చెప్పవలెను. లేనిచో పైనుదహరించిన మహాత్ములపై కర్తవ్యము విధింపజాలని వేదములను గూడ తిరస్కరించిన అహంకారి పొందుచుండు పాపమును మాత్రము పొందగలుగునని మనవిచేయుచున్నాను.

శ్రీ గురుగీతలో యీ విషయమై శ్రీ పరమశివుండు పార్వతీదేవికి తెలిపినదానిలో కొన్నిటి నిచట నిరూపించెద.

శ్లో॥ గురుస్సదా దర్శయితా ప్రవృత్తిం
తీర్థం వ్రతం యోగతపాదిధర్మాన్ ।
ఆచారవర్ణాది వివేక యజ్ఞాన్
జ్ఞానం చ భక్తిం చ వివేకయుక్తమ్ ॥

తా॥ శ్రీ గురుదేవుడు వేదాన్తతత్త్వమార్గమందలి ప్రవృత్తిని తీర్థయాత్రలను, వ్రతములను, యోగమును, తపస్సును, ధ్యానమును, సత్యమును, శాంతమును, ధర్మము మొదలగువానిని, సదాచారములను, వర్ణాశ్రమాది ధర్మములను, జ్ఞానయజ్ఞములను, భక్తిని, ఆత్మానాత్మ విచారముతో గూడుకొన్న జ్ఞానమును, మోక్షమునకు కావలసిన సకల ధర్మములను వారివారి మనఃపరిపక్వము ననుసరించి యెల్లప్పుడును భక్తులకు బోధించుచుండును. ఇదే జీవన్ముక్తులు చేయుచుండు పనియని గ్రహించునది.

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా !
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ।

తా॥ అజ్ఞానమనెడి తిమిరవ్యాధిచే కన్ను కనపడనివానియొక్క జ్ఞానమనెడు కాటుకశలాకచేత కన్నును బాగుగా కనపడేలాగున చేయునట్టి శ్రీ గురుదేవునికి నమస్కారము. కన్నాస్పత్రిలోనికి వెళ్ళిచూచిన యీ సత్యము కనుగొనవచ్చును. ఈ ప్రపంచమును చూచుటకు నేత్ర వైద్యులు యేలాగున చికిత్స చేయుచున్నారో ఆలాగున పరమాత్మని చూచుటకు మహాత్ములున్ను చేయుచుందురు. కన్నాస్పత్రిలోనికి వెళ్ళిన నేత్రమునకు ఆపరేషనుచేయుట, మందులుపోయుట, పథ్యములు తెలుపుట మీరు చూచియుందురుగదా. భవరోగవైద్యులగు జీవన్ముక్తులున్ను ఆలాగున ప్రవర్తింతురు.

శ్లో॥ నమోఽచ్యుతాయ గురవే జ్ఞానధ్యానైకభానవే ।
శిష్యసన్మార్గపటవే కృపాపీయూషసింధవే॥

ఈ శ్లోకమందు "శిష్యసన్మార్గపటవే" అని ప్రయోగించుటవల్ల ముముక్షువులను, భక్తులను సన్మార్గమందు నడుపుటలో పటుత్వము అనగా గట్టితనము గలవాడని వర్ణించడమైనది. తక్కినది సులభార్థము.

శ్లో॥ శిష్యాణాం జ్ఞానదానాయ లీలయా దేహధారిణే ।
సదేహాయ విదేహాయ తస్మై శ్రీ గురవేనమః ॥

తా॥ శిష్యులకు జ్ఞానదానమునొసంగి తరింపజేయుకొరకు విలాసార్థము దేహమును ధరించినవాడును, విదేహముక్తిని పొందిన

వాడై నను దేహముగలవారివలె తోచెడు గురుదేవునకు నమస్కారము. ప్రాణికోట్ల జన్మము రెండువిధములు. కర్మబద్ధుల దేహము ప్రకృతికి వశ పడియుండును. కర్మవిముక్తులైనవారి జన్మము ప్రకృతిని వశపరచుకొని ఆవిర్భవించినదిగా ఉండును. అదేముక్తులయొక్కయు, బద్ధులయొక్కయు తారతమ్యమని గ్రహించవలయును. కావుననే గీతలో యీలాగున చెప్పటకు కారణము. "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామి యుగే యుగే" ప్రకృతిని వశపరచుకొనియే రామకృష్ణాద్యవతారములు వచ్చి నట్లు జీవన్ముక్తులగు మహనీయులు లోకోద్ధారముకొరకు ఆలాగుననే ఆవిర్భవింతురు. కావుననే 'లీలయా దేహధారిణే' అని చెప్పటకు కారణము.

శ్లో॥ నానాయుక్త్యుపదేశేన తారితా శిష్యసంతతిః।
తత్కృపాసారవేదేన గురుచిత్పదమచ్యుతమ్ ॥

తా॥ అనేకయుక్తులచేతను, దృష్టాంతములచేతను శిష్యులకు బోధించి వారినిసంసారసాగరమునుండి తరింపచేయుచున్నారు. గురుకృప యనెడు వేదాంతసారవిజ్ఞానముచేత శాశ్వతమగు బ్రహ్మప్రాప్తిని పొందింప జేయుచున్నారు.

శ్లో॥ నమస్తే నాథ భగవన్ శివాయ గురురూపిణే।
విద్యావతారసంసిద్ధ్యై స్వీకృతానేకవిగ్రహ ॥

దీనియందు "విద్యావతారసంసిద్ధ్యై స్వీకృతానేకవిగ్రహ" అని చెప్పటవల్ల ప్రపంచములో ఆత్మవిజ్ఞానము ముముక్షువులకు తెలిపి తరింప జేయుటకొరకు స్వాయముగా శరీరముగలవాడని గ్రహించదగును. "స్వీకృత" అని చెప్పటవల్ల కర్మప్రేరితజన్మముకాదనియు, స్వాయముగా కల్పించుకొన్నజన్మముగలవాడనియుఅర్థమగును. తక్కినదిసుగ్రాహ్యము.

శ్లో॥ వాగ్మితూత్కటసంసారసాగరోత్తరణక్షమః।
యతోఽసౌ సంశయచ్ఛేత్తా శాస్త్రయుక్త్యనుభూతిభిః॥

తా॥ మహాభయంకరమైనట్టి, సంసారసాగరమును తరింపజేయుట యందు మహాసమర్థుడైన ముముక్షువుల సర్వసంశయములను దూరీక రించునట్టి మహనీయాత్ముడే గురుదేవుడై ఆవిర్భవించును. ఇచట

"వాగ్మి" అని ప్రయోగించుటవల్ల యెట్టి సందేహములనైన క్షణములో పోగొట్టువాడని గ్రహించేది. అనగా జీవులను సంసారసాగరమునుండి తరింపజేయుటకే అటువంటి మహాత్ములు దేహమును గ్రహించి భూలోకమున అవతరింతురు. "ఉత్కటసంసారసాగరోత్తరణక్షమః" అని ప్రయోగించుటవల్ల సంసారసాగరమునుండి జీవులనుతరింపజేయుటకుసమర్థులుగా గురువులు ఉండవలయును అని తెలియుచున్నది.

శ్లో॥ తత్త్వమస్యాది వాక్యానా ముపదేష్టా తు పార్వతి ।
కారణాఖ్యో గురుః ప్రోక్తో భవరోగనివారకః ॥

తా॥ ఓ పార్వతీ ! "తత్త్వమసి" మహావాక్యార్థమును అనగా జీవబ్రహ్మల యేకత్వమును తెలుపునట్టి మహానుభావుడే కారణగురువని గ్రహించవలెను. ఈతడు జనుల భవరోగమును నివారించుటకొరకు కరుణతో మానవజన్మమును గ్రహించినవాడగును.

శ్లో॥ హేతవే జగతామేవ సంసారార్ణవసేతవే।
ప్రభవే సర్వవిద్యానాం శంభవే గురవే నమః ॥

తా॥ సర్వలోకములకు కారణముగా ఉండువాడుగను, సంసారమను సముద్రమునకు వంతెనవంటివాడుగను, సమస్తవిద్యలకు ఆధారభూతమైనవాడుగను గురుదేవుని వర్ణించడమైనది. ఇక్కడ "సంసారార్ణవసేతవే" అని ప్రయోగించుటవల్ల జననమరణదుఃఖములకాలయమగు భవసాగరమును తరింపజేయుటలో వారధివంటివాడు అని వర్ణించడమైనది.

శ్లో॥ భవారణ్య ప్రవిష్టస్య దిఙ్మోహభ్రాంతచేతసః ।
యేన సందర్శితః పంథాః తస్మై శ్రీ గురవే నమః॥

తా॥ సంసారమనెడు ఘోరారణ్యములోనుండి స్వస్థలముచేరుటకు దిగ్భ్రమచే దిక్కుతెలియనివానికి మార్గమును చూపుటకే మహాత్ములగువారు అవతరింతురు.

శ్లో॥ అనేకజన్మసంప్రాప్త కర్మబంధవిదాహినే।
జ్ఞానానలప్రభావేన తస్మై శ్రీగురవే నమః॥

తా॥ అనేకజన్మపరంపరలోనుండి వచ్చుచుండు కర్మపాశములచే అజ్ఞానావరణవృక్షమునందు కట్టుబడియుండు జీవునియొక్క కర్మపాశము

లను బంధములను దహింపజేసి ముక్తి కలుగజేయుటకొరకే కారణగురువులు ఆవిర్భవింతురు.

శ్లో॥ బహుజన్మ కృతాత్పాపా దయమర్థో న రోచతే।
జన్మబంధనివృత్త్యర్థం గురుమేవ భజేత్సదా॥

తా॥ అనేకజన్మములలో చేసిన పాపముగలవారికి దైవమందుగాని, గురువులయందుగాని ప్రీతికలుగదు. ఏలాగున జ్వరాదివ్యాధులచే అరుచిగల జిహ్వగలవానికి మంచిపదార్థముగూడ అరుచిగానేతోచునో, యెట్లు రుచింపదో, ఔషధసేవచే రోగశమనము కలుగునపుడు యెట్లు ఆహారమందు రుచికలుగునో, ఆలాగున పాపజీవులకు జ్ఞానములో భక్తిలో రుచికలుగదు. పుణ్యకర్మచే దైవకరుణకలుగునప్పుడు పాపము శమించినవారికే భక్తిజ్ఞానవైరాగ్యములలో ప్రీతిగలుగును. ఆలాగుననే త్రాచుపాముచే కరువబడి విషమెక్కినవానికి యెంతరుచిగల పదార్థమైనను రుచింపదు. కన్నులుగూడ కనబడవు. శబ్దముగూడ వినరాదు. మంత్రౌషధములవల్ల విషము తగ్గునప్పుడు రుచియు, దృష్టియు, శబ్దశ్రవణమున్ను యెట్లు గలుగునో, ఆలాగున అజ్ఞానసర్పవిషమెక్కిన జీవులకు దైవకార్యమందు రుచియు, జ్ఞానదృష్టియు, భగవద్వాక్యశ్రవణమందు ఆసక్తియు వుండదు. భగవత్కృప అనెడు దివ్యౌషధముచే పాపము శమించినప్పుడు పైజెప్పిన మూడింటియందును ఆసక్తియేర్పడును. ఇదే దానికి గురుతు.

శ్లో॥ అంతస్తిమిరనిర్భేదభానవే కామధేనవే।
త్వదంతేవాసినాం కల్పతరవే గురవేనమః॥

తా॥ హృదయాంతరాళములోగల అజ్ఞానమనెడు తమస్సునకు సూర్యునివంటివాడును, భక్తులకు సర్వాభీష్టములను కలుగజేయుటలో కామధేనువువంటివాడును, ఆత్మశిష్యులకు కల్పతరువువంటి వాడునగు గురుదేవునికి నమస్కారము.

ఇక జీవన్ముక్తునకు కర్తవ్యము కలదా? లేదా? అను విషయమై ఉత్తరగీతయందు శ్రీకృష్ణభగవానుడు తెలిపినది చూడుడు.

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
న చాస్తి కించిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్॥

తా॥ బ్రహ్మసాక్షాత్కార జ్ఞానామృతముచే తృప్తిజెందినట్టి కృతకృత్యుడగు యోగికి చేయదగిన కార్యమేమియులేదు. చేయవలసి నదియుండినచో అతడు తత్త్వవేత్తకాడు. దీనికన్న పరమప్రమాణమేమి కావలయును ? అయితే దీనియందు 'కృతకృత్యస్య' అని ప్రయోగించిన శబ్దార్థము మొదటనే తెలుసపడమైనది. అది తెలుసుకొనకపోయిన ప్రమాదములోపడిపోవుటకు అవకాశముకలదని మాత్రము మరువకూడదు.

ఇక ఈ విషయమై పంచదశియందు చెప్పినది చూడుడు. ఇది దత్తాత్రేయోపనిషత్తునందు గలదు.

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్ ।
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్॥

తా॥ నాకు చేయదగిన కర్తవ్య మేమియును లేనందున నేను కృతార్థుడనైతిని. మరియు పొందదగిన ఫలవర్గమంతయు ఇప్పుడు నాచే పొందబడినందున నేను కృతార్థుడనైతిని, కృతార్థుడనైతిని. దీనియందు 'కర్తవ్యం మే న విద్యతే కించిత్' అనియును, 'ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్' అనెడు రెండుపదముల అర్థములను బాగుగా యోచించుకొనవలయును. లేనిచో గమ్యస్థానమును చేరక పతితుడు గాగలుగునని మరువకూడదు.

శ్లో॥ కృతకృత్యతయా తృప్తః ప్రాప్తప్రాప్యతయా పునః।
తృప్యన్.........

తా॥ జీవన్ముక్తుడు చేయదగినదానిని సంపూర్ణముగా చేసిన వాడగుటచేతను, పొందదగినదానిని సంపూర్ణముగా పొందినవాడగుట చేతను తనలో తాను తృప్తి పొందుచున్నాడు. ఇచటగూడ "కృత కృత్య" శబ్దము ప్రయోగించబడినది. దానిని మొదటనే చూచుకొన వలయును.

ఓమ్

# అవధూతయదుసంవాదము

## (శ్రీమద్భాగవత ఏకాదశస్కంధము)

ఇది శ్రీకృష్ణభగవానుడు నిర్యాణకాలము ఆసన్నమైన సమయమున అంతరంగభక్తుడగు ఉద్ధవునికి గంగాతీరమందుపదేశించిన పరమరహస్యము. ఆంధ్రభాగవతమున యీ అవధూతయదుసంవాదము విశదీకరించి వ్రాసియుండవచ్చును. శ్రీకృష్ణభగవానుడు అవధూతలవారి యిరువదినలుగురు గురువులను గురించి చెప్పిన భాగము ముముక్షువులకు జిజ్ఞాసువులకు పరమభక్తులకు యెంతో ఉపయోగకరము. ఐతే ఆంధ్రభాగవతము అచ్చువేయుటకు ముందుగా వ్రాతప్రతిలో చెదలు తిని పోవుటవల్ల పండితులు గ్రంథపూర్తికొరకు యిరువదినలుగురు గురువులలో ముగ్గురు నలుగుర గురువుల లక్షణములుమాత్రము వ్రాసిరేగాని తక్కినవారి పేర్లుమాత్రము వ్రాసి విడిచిపెట్టిరి. సంస్కృతమున యిది సంపూర్ణముగా గలదు. కీర్తిశేషులగు కోవూరి పట్టాభిరామశర్మగారు యీ భాగమును చక్కనిశైలిలో సర్వులకు సుబోధకమగునట్లు ఆంధ్రమున పద్యరూపముగా రచించియున్నారు. సంస్కృతభాగవతము ననుసరించి వ్యాసాశ్రమమున దత్తాత్రేయోపదేశమను పేరుతో ఒక చిన్న పొత్తము వేదాంతాచార్య బి. కృష్ణచరణంగారిచే వ్రాసి ముద్రించబడియున్నది. ఇప్పుడు చతుర్వింశతి గురువులనుండి గ్రహించినదానిలో దశమగురుడగు సముద్రము యేముపదేశించినదో ఆ ఒక్కదానిని దీనియందు కొంత విస్తరించి తెలిపెలాగున సంకల్పము కలిగినది. మనుష్యమాత్రుడై ఉపదేశించినమాత్రమే గురూపదేశమగునని తలంచనక్కరలేదు. ఒక్కొక్కదానినుండి యే భావము తనకు అభివ్యక్తమగునో దానిని గురువుగా గ్రహించుకొనవచ్చును. ఈ పద్ధతి ననుసరించియే అవధూతలవారు సముద్రమును ఒక గురువుగా గ్రహించుటకు కారణమైనది. సంస్కృతభాగవతము—

శ్లో॥ మునిః ప్రసన్నగంభీరో దుర్విగాహ్యో దురత్యయః।
అనంతపారో హ్యక్షోభ్యః స్తిమితోద ఇవార్ణవః॥
సమృద్ధకామో హీనో వా నారాయణపరో మునిః।
నోత్సర్పేత న శుష్యేత సరిద్భిరివ సాగరః॥

తా॥ సముద్రము ప్రసన్నమై గంభీరమై యూహింపనలవిగాక అనతిక్రమణీయమై అపారమయ్యు వికారరహితమై స్థిమితముగా నున్నట్టుల యోగియు నిర్మలహృదయుడై గంభీరుడై వికారాదులచే నాక్రాంతుడు గాక స్థిరచిత్తము గలిగియుండవలయును. మరియు సముద్రము యెన్ని నదులు తనయందు పడుచున్నను తానుమాత్రము తన హద్దున కొంచమైనను హెచ్చుతగ్గులు పొందక ఒకేరీతిగా నున్నటుల జ్ఞానియు సుఖదుఃఖముల రెంటియందును వైపరీత్యమును పొందక ధైర్యమవలంబించి భగవదాయత్తచిత్తుడు కావలయును. ఈ మనోస్థైర్యరూపగుణమును సముద్రమునుండి గ్రహించుటచేసి సాగరమును ఒక గురువుగా పరిగణించితిని.

వి॥ యదుమహారాజు గొప్పదైన ఒక యజ్ఞమును ప్రారంభించి అనేకమంది ఋషులను మునులను బ్రహ్మవేత్తలను ఆహ్వానించియుండిరి. వారలలో ప్రసన్నవదనమున్ను నిర్మలహృదయమున్ను ప్రశాంతభావమున్ను అగాధజ్ఞానమున్ను గలిగియుండు అవధూతను గురించి యిట్లడిగెను. మీారలు యౌవనవయస్సుగలవారై యుండియు యిట్టి శాంతియు అపారజ్ఞానమున్ను ప్రసన్నతయు యెట్లు గలిగియున్నారని అడిగినప్పుడు ఇవి యిరువదినలుగురుగురువులనుండి గ్రహించుకొనడమైనదని చెప్పెను. వారలలో ఒకడు సముద్రుడు. అవధూతలవారు ఒకరోజున సముద్ర తీరమున ప్రయాణము చేయుచున్నప్పుడు పై చెప్పిన లక్షణములన్నియు తన కొరకు సముద్రముపదేశించినట్లు భావముకలిగెను. సముద్రములో వర్షాకాలమున అనేకనదీనదములచే కొట్టుకొనివచ్చెడు చెత్తచెదారములు కంపలు ముండ్లు మ్రానులు మొదలగు అనేకవస్తువులను తనలోనుంచక యెప్పుడును కెరటములచే ఒడ్డుచేర్చుచుండును. అట్లు చేయకపోయిన యివన్నియు సముద్రోపరిభాగమునచేరి తన్ను మరుగుపరచి జలమును మలినమొనర్చునని తలంచి ఒక గడ్డిపోచనైన తనలో నుంచక తీరమున చేర్చుచుండును. ఆలాగున సముద్రమంత వైశాల్యమున్ను అగాధమున్నుగల యోగియైనను ప్రాపంచికమైన యేవృత్తులనుగాని, గుణములనుగాని తన హృదయములో నుండుటకు అవకాశము గలుగనీయక

వివేకజ్ఞానబుద్ధియనెడు తరంగములచే యెల్లప్పుడును బహిరంగము చేయుచుండవలయును. ఓహో యెటువంటి ఉపదేశము! మరియు వాన కాలమున అనేకనదులచే కొట్టుకొని వచ్చుచుండు పంకిలజలములనన్నిటిని నిరంతరము కల్లోలములచే శుద్ధపరచి బురదను అడుగంటచేసి స్వచ్ఛజలమును తనలో చేర్చుటవల్లనే యెల్లప్పుడున్ను సముద్రజలము స్వచ్ఛముగా నుండుటకు కారణము. విద్యుచ్ఛక్తి ప్రాణవాయువులు కెరటములలో కలిగి ఉండుటచేతనే జలము శుభ్రముగా ఉండుటకు హేతువు. అట్లు నిరంతరము మథించకపోయినచో కొంతకాలమున సముద్రజలము పంకిలమైపోవును. ఆలాగుననే యోగియు నిరంతరము ఆత్మానాత్మ విచారణచే అనాత్మభావములనన్నిటిని అడుగంటచేసి నిర్మలోదకమువలెను, గంభీరమగు సముద్రమువలెను ఉండవలెను. అట్లు చేయకపోయిన కొంతకాలమునకు ప్రపంచవాసనలుచేరి తన్ను కల్మషమొనర్చునని మరువకూడదు. మరియు సముద్రోపరిభాగము యెల్లప్పుడు కల్లోలములచే చంచలముగా కనపడినను కొంత లోతునదిగి అగాధములో ప్రవేశించిన అచట నిశ్చలముగా నుండును. ఆలాగుననే గంభీరస్థితిలో నుండు యోగియు కరచరణవాగాదీంద్రియములతో లోకోద్ధారక కార్యములు చేయునప్పుడు ఆమహాత్మునికి నిశ్చలత్వము లేనట్లు మనకు తోచినను వారి హృదయము సముద్రముయొక్క అగాధభాగమువలె పరమశాంతిగనుచంచలరహితముగనుఉన్నట్లుమనముగ్రహించుకొనవలయును. ఇదే మహాత్ములగు అవధూతలవారు సముద్రమునుండి గ్రహించిన పరమరహస్యము. మరియు సముద్రమపారమైయుండియు సృష్ట్యారంభమునుండి నేటివరకు యేలాగున ఆత్మమాలిన్యమును గలుగనీయక నిరంతరము కల్లోలములచే పరిశ్రమచేయుచున్నదో యోగియున్ను సముద్రము వంటి అగాధజ్ఞానము గలిగినను లోకహితకార్యములలో ప్రవర్తించి యుండవలెనని సముద్రమువల్ల అవధూతమహాముని తెలిసికొన్నాడు. కావుననే శ్రీకృష్ణభగవానుడున్ను ద్వితీయాధ్యాయమున స్థితప్రజ్ఞుని లక్షణమును చెప్పునప్పుడు సముద్రము దృష్టాంతముగా ఉపదేశించెను. ఇదియును గొప్ప అగాధమైన భావముతో కూడినదే. చిల్లరజనులు దీనిని అవగాహనము చేసుకొనజాలరు.

శ్లో॥ ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతిమాప్నోతి న కామకామీ॥ (గీ॥ 2-70)

అంతటను నిండింపబడినదియును స్థిరమైన యునికి కలది (హద్దును మించుటకాని తగ్గుటకాని లేక యెల్లప్పుడు ఒకేరీతిగా ఉండునట్టిది)యునైన సాగరమును ఉదకములు (నదులు మొదలగునవి) యేవిధముగా ప్రవేశించుచున్నవో ఆవిధముగా సమస్తమైన దృశ్యవిషయములు యే బ్రహ్మనిష్ఠునియందు ప్రవేశించి చలింపకయున్నవో అట్టి బ్రహ్మనిష్ఠుడే చిత్తోపరతిని పొందుచున్నాడు; విషయాసక్తుడగువాడు పొందడు.

వి॥ వర్షాకాలములో అనేక నదీనదములచే సముద్రములోనికి జలము ప్రవేశించినను యెట్లు యెక్కువగుటగాని యెండాకాలములో యేనదిచేత జలము ప్రవేశింపకపోయినను తక్కువగుటగాని లేదో అనగా సమాన స్థితిలోఉంటున్నదో ఆలాగున నవద్వారములును, స్పర్శేంద్రియ మొకటి చేరి దశేంద్రియములద్వారా శబ్దాదివిషయము తనలోనప్రవేశించినను యే యోగియైనవానికి వికారముకలుగదో అట్టి యవస్థ గలిగియుండవలయునని గ్రహించుకొనవలయును. లేక భిక్షువైనవానికి ఒకసమయమున మృష్టాన్నములభించినను, మరియొకప్పుడు తృప్తిగా లభించకపోయినను ఏకైకస్థితిలో సముద్రమువలె గంభీరముగా నుండవలయును. ఆలాగుననే స్తుతినిందలలోను నిర్వికారుడైయెల్లప్పుడు అగాధధ్యానములో మగ్నుడై యుండవలయును. కావుననే శ్రీకృష్ణభగవానుడు సముద్రమును దృష్టాంతముగా నిరూపించిరి. ఇట్టి భావములన్నిటిని బ్రహ్మనిష్ఠుడు మననము చేయుచుండవలయును.

(పట్టాభిరామశర్మగారి ఏకాదశస్కంధమునుండి)

సీ॥ నిండి లోతెరుగరాకుండు నన్యుడు
దన తలపును గనిపట్ట వలతిగాడు
తను మించ నెట్టివాడును జాల డిట్లని
దేశకాలాదులు దెల్ప నోప

వేమాత్రము గలంగ డేవికార మెరుంగ
డలలు లేని సముద్రమట్లు మాని
విషయసక్తుడుగాని విషయము
ల్నిండుగా నున్న లేకున్న దా నుబ్బ డణగ
తే॥ గీ॥ డెపుడు నారాయణపదంబు నేమరడు స
మృద్ధిగా నేళ్లు పారిన నెచ్చలేని
నెండిపోయిన దానును నుండులేని
లేని సాగరమును బోలి మాని యుండు.

---

ఓమ్

# సంసారవృక్షము

తత్త్వవేత్తలగు ప్రాజ్ఞులు సంసారమును ఒక వృక్షముతో సరి పోల్చిరి. కొందరు అశ్వత్థవృక్షమునుగా వర్ణించిరి. ఈ సంసారవృక్ష స్వరూపము చాలచిత్రమైనది. దీనిస్వరూపమును చక్కగా తెలుసుకొనిన గాని దాని మూలచ్ఛేదముచేయ వలనుపడదు. కావుననే శ్రీ శంకర భగవత్పాదులవారు వివేకచూడామణియను గ్రంథమున నిట్లువివరించిరి:

శ్లో॥ బీజం సంసృతిభూమిజస్య తు తమో దేహాత్మధీరంకురః
రాగః పల్లవమంబు కర్మ తు వపుః స్కంధోఽసవశ్శాఖికాః।
అగ్రాణీంద్రియసంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహువిధం భోక్తాఽత్ర జీవః ఖగః॥

తా॥ సంసారవృక్షమునకు అజ్ఞానమే బీజము. దేహాత్మబుద్ధియే అంకురము. అనురాగమే పల్లవము. కర్మమే జలము. దేహమే మ్రాను. ప్రాణములేకొమ్మలు. త్వగాదీంద్రియసముదాయమే కొనలు. స్రక్చందన వనితాదివిషయములే పుష్పములు. సమస్త కర్మజాతసంజాతమును, బహువిధ స్వరూపముగల దుఃఖమే ఫలము. ఇట్టి దుఃఖరూపఫలము ననుభవించు జీవాత్మయే పక్షి. కొందరు సుఖదుఃఖములను రెంటిని ఫలముగా వర్ణించిరి. కాని ఇచ్చట ఆచార్యులవారు దుఃఖము మాత్రమే ఫలమని చెప్పిరి. ఏలననగా, సాంసారికవృక్షమునుండి ఫలించునది దుఃఖమే.

ఒకవేళ తాత్కాలికనుగా సుఖములుగా తోచినను పరిణామమునందు దుఃఖమే కలుగును. మరియు ఈ సంసారవృక్షమునే కఠోపనిషత్తునందు —

"ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః"

అని అనాదియగు అశ్వత్థముగా ప్రతిపాదింపబడినది. ఈ మంత్రమునకు ఆచార్యులవారు భాష్యమును వ్రాయుచు యీ క్రిందివిధముగావివరించిరి.

భాష్యము॥ వేదాన్తనిర్ధారితపరబ్రహ్మమూలసారః అవిద్యాకామకర్మావ్యక్తబీజః ప్రభవః అపరబ్రహ్మవిజ్ఞానక్రియాశక్తిద్వయాత్మక హిరణ్యగర్భాంకురః సర్వప్రాణిలింగభేదస్కంధః తృష్ణాజలావసేకోద్భూతదర్పః బుద్ధీంద్రియవిషయప్రవాళాంకురః శ్రుతిస్మృతిన్యాయవిద్యోపదేశ పలాశః యజ్ఞదానతపఆద్యనేకక్రియాసుపుష్పః సుఖదుఃఖవేదనాఅనేకరసః ప్రాణ్యుపజీవ్యానంతఫలః తత్తృష్ణాసలిలావసేకప్రరూఢజడీకృతదృఢబద్ధమూలః సత్యనామాదిసప్తలోకబ్రహ్మాదిభూతపక్షికృతనీడః ప్రాణిసుఖదుఃఖోద్భూత హర్షశోకజాతనృత్యగీతవాదిత్ర క్ష్వేళితాస్ఫోటితహసితాకృష్ట రుదితహాహా ముంచముంచేత్యాద్యనేక శబ్దకృతతుములీకృత మహారవః వేదాన్తవిహితబ్రహ్మాత్మదర్శనాసంగశస్త్రకృతోచ్ఛేదఏష సంసారవృక్షోఽశ్వత్థః అశ్వత్థవత్కామకర్మవాతేరితనిత్యప్రచలితస్వభావఃస్వర్గనరకతిర్యక్ప్రేతాదిభిః శాఖాభిః అవాక్శాఖః సనాతనః అనాదిత్వాచ్చిరంప్రవృత్తః॥

తా॥ ఉపనిషద్భాగమున నిర్ధారణజేయబడిన పరబ్రహ్మమే మూలముగాను, సారముగాను గలదియు, అవిద్యాకామకర్మ అవ్యక్తమను బీజమునుండి పుట్టినదియు, విజ్ఞానశక్తి, క్రియాశక్తిద్వయస్వరూపమైన ఆ పరబ్రహ్మస్వరూపుడగు హిరణ్యగర్భుడే అంకురముగాగలదియు, సకలప్రాణుల లింగశరీరమే ప్రకాండముగాగలదియు, తృష్ణయను జలము యొక్క సేచనముచేగలిగినదర్పముగలదియు, బుద్ధీంద్రియవిషయములను చిగురుటాకులు గలదియు, శ్రుతి స్మృతి న్యాయములు వీటియొక్క జ్ఞానోపదేశమే ఆకులుగాగలదియు, యజ్ఞము దానము తపస్సు మొదలుగాగల క్రియలే పుష్పములుగాగలదియు, సుఖదుఃఖముల నెరుంగుటయే రసముగాగలదియు, ప్రాణులజీవనమే అనంతఫలముగాగలదియు, వాటిననుభవించవలెనను ఆశారూపజలముచే తడుపబడి మిక్కిలి నాటుకొన్న

దియు, స్తబ్ధమై దృఢమగు మూలముగలదియు, బ్రహ్మవిష్ణ్వాదులను పక్షులచే కట్టబడిన సత్యాదిలోకములను గూళ్లుగలదియు, ప్రాణుల యొక్క సుఖదుఃఖములచే గలిగిన హర్ష శోకజన్యములగు నృత్య గాన వాదిత్ర క్రీడాస్ఫోటన ఆక్రందన రోదన హాహాకారములును, విడువు విడువు అను అనేకశబ్దములచే చేయబడిన సంకులమహారవముగలదియు, బ్రహ్మాత్మదర్శనరూప అసంగమను శస్త్రముచే భేదింప శక్యమగునదియు నగు సంసారవృక్షము రావిచెట్టువలె కామ్యకర్మలనుపెనుగాలిచే చలించు స్వభావముగలదియు, స్వర్గనరక ప్రేతాదిలోకములే అడ్డముగాప్రసరించు కొమ్మలుగలదియునై అనాదియగుటచే సనాతనమని చెప్పబడుచున్నది. ఈ విషయమే యీ క్రింద కనపరచబడు పురాతన పురాణశ్లోకములచే సంగ్రహముగా తెలుపబడుచున్నది:

శ్లో॥ అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోత్థితః।
బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాంతరకోటరః॥
మహాభూతవిశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా।
ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః॥
ఆజీవ్యస్సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః।
ఏతద్బ్రహ్మవనం చైవ బ్రహ్మాచరతి నిత్యశః॥
ఏతచ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా।
తతశ్చాత్మరతిం ప్రాప్య తస్మాన్నావర్తతే పునః॥

తా॥ అవ్యక్తమను మూలమునుండి పుట్టి దాని యనుగ్రహము వలననే పెరిగినదియు, బుద్ధియనెడు మ్రానుగలదియు, ఇంద్రియములనెడు తొఱ్ఱలుగలదియు, పంచభూతములనెడు కొమ్మలుగలదియు, శబ్దాది విషయములనెడు ఆకులుగలదియు, ధర్మాధర్మములనెడు పుష్పములు గలదియు, సుఖదుఃఖములను ఫలములు గలదియు, సమస్త ప్రాణికోట్ల జీవనాధారమైనదియు నగు బ్రహ్మమను వృక్షము (బ్రహ్మమే కారణముగా గల సంసారవృక్షము) అనాదియైనది. ఇది పరబ్రహ్మమునకు స్థానము. దీనిని జ్ఞానఖడ్గముచే ఛేదించి, భేదించి ఆత్మానందమును పొందిన పురుషుడు తిరుగ జన్మమునకురాడు. దీనియందు 'ఛిత్వా చ భిత్వా' అని

ప్రయోగించినందువల్ల ఛేదించిన చాలదు. మరల అట బ్రతుకవచ్చును. అందువల్ల చీల్చవలయుననిచెప్పుటకు కారణమైనది. శ్రీకృష్ణభగవానుడు గీతయందీ సంసారవృక్ష చిత్రణమును, దాని నిర్మూలనోపాయమును అత్యంతమనోజ్ఞముగను, యుక్తియుక్తముగను భగవద్గీత 15-వ అధ్యాయమున ప్రతిపాదించినదానిని చూడుడు:

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం।
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్॥

తా॥ ఈ సంసారవృక్షము విచిత్రముగా నుంటున్నది. వృక్షము లన్నిటికిని మొదలు క్రిందుగాను, శాఖలు పై భాగమున నుండును. ఈ వృక్ష మట్లుగాదు. దీనికి మొదలు పై భాగముననను, కొమ్మలు క్రిందిభాగముననను ఉంటున్నవి. ఈ సత్యము నెరింగినవాడే వేదసారము నెరింగినవాడని ఋషులు చెప్పుచున్నారు. వేదములున్ను ఉద్ఘోషించుచున్నవి. ఇదే మాయయొక్క మహిమ. ఒక జలాశయముయొక్క తూర్పుభాగము నుండి పశ్చిమభాగమునకుపోవు మనుష్యులను చూచినచో, లేక వృక్షాదులను చూచినచో తల క్రిందికి, కాళ్ళు పైకి కనుపించును. ఆలాగున మాయచే అనిత్యమైన లోకము సత్యమైనదిగా అజ్ఞానదశలో తోచును. మాయయొక్క మహిమను నాలుగు విధములుగా పతంజలి మహర్షి యోగశాస్త్రములో వివరించెను.

సూ॥ అనిత్య – అశుచి – దుఃఖ – అనాత్మసు, నిత్య – శుచి – సుఖ ఆత్మఖ్యాతిరవిద్యా॥

అనిత్యవస్తువులలో నిత్యబుద్ధియు, దేహాద్యశుచివస్తువులలో శుచిత్వబుద్ధియు, ఇంద్రియాదివిషయములు దుఃఖములైనను వాటియందు సుఖత్వబుద్ధియు, అనాత్మయగు దేహమందు ఆత్మబుద్ధియు దేనినుండి గలుగుచుండునో దానికి మాయయని పేరు. రోగాదులచే నరుచిపొందిన నాలుకగలవాని కెంతమధురమగు వస్తువైనను రుచిలేకనే యుండును. అనగా చేదుగా గనుపించును. త్రాచుపాముయొక్క విష మెక్కినవానికి చేదైన వేపాకు తీపిగానుండును ఇది యెట్లు విపరీతముగా గలిగెను. మాయామోహితుడగు జీవునికిన్ని యిట్టి భ్రాంతియే గలు

గును. మరియు క్రొత్తప్రదేశమునకు వెళ్లినవారి కేలాగున తూర్పు పడమరగాను, పడమర తూర్పుగాను దిగ్భ్రమచే గోచరించునో, మాయా భ్రమ గల జీవుడాలాగుననే యుండును.

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాళాః।
అధశ్చ మూలాన్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే॥

శ్లో॥ న రూపమస్యేహ తథోపలభ్యతే నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా।
తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తంతి భూయః॥

తా॥ మనుష్యలోకమునందా సంసారవృక్షముయొక్క మూలమును సన్నవేరులగు జీవాత్మలు కర్మబద్ధములై క్రిందనే భూలోకమునందే నాటుకొనుచున్నవి. కాబట్టి దానియొక్క అనగా మనుష్యజన్మమనెడు ఆదిశాఖయొక్క యుపశాఖలు కర్మఫలానుగుణ్యములగు జన్మములనెడు ప్రక్కకొమ్మలు త్రిగుణములనెడు రసములచే వృద్ధినొందినవియు, విషయవాంఛలనెడు చిగుళ్ళుగలవియునగుటచే నధోముఖముగ, నూర్ధ్వముఖముగ వ్యాపించియున్నవి. లెస్సగాబారిన వేరులుగల యీ సంసారవృక్షమనెడు అశ్వత్థమును దృఢమైన (చలింపనివైరాగ్యమనెడు) ఖడ్గముతో (గండ్రగొడ్డలితో) ఛేదించి, అట్లు ఛేదించినపిమ్మట యే స్థానమునందు చేరినవారు మరల తిరిగిరారో ఆ స్థానము (బ్రహ్మపదము) వెదుకదగినది. ఇట్టి సంసారవృక్షమును ఆత్మజ్ఞానమను గొడ్డలిచేత ఛేదించినవాడు ప్రతిబంధకము లన్నియు తొలగుటంజేసి కేవలాత్మనిష్ఠుడై మరల సంసార బంధమును బొందక కైవల్యమును బొందును. వృక్షముయొక్క ఆకులను దూసివేసినను మరల కొంతకాలమునకు యథాప్రకారము చిగురించును. చిన్న చిన్న కొమ్మలను నరికివేసినచో అదియును కొంతకాలమునకు చిగిర్చి వృక్షమగును. పెద్దకొమ్మలను నరికివేసినను, లేక మొదలేనరికివేసినను అదిన్ని చిగిర్చి కొంతకాలమునకు యథాప్రకారము వృక్షమగును. కూకటివేరుతో తీసివేసిన మరల నెప్పటికిని పుట్టదు. ఆలాగున బ్రహ్మసాక్షాత్కార జ్ఞానముచే మూలావిద్యను ఉన్మూలనము చేసినవానికి ప్రకృతి నశించినందుచే మరలజన్మము గలుగదు. అందువలన ముముక్షువులందరున్ను సామాన్య పుణ్యకర్మల

చేతగాని, భక్తిచేతగాని, వైరాగ్యముచేతగాని, యోగసమాధినిష్ఠల చేతగాని తృప్తినొందక మూలప్రకృతి నశించునంతవరకు ప్రయత్నపరులై యుండవలయును. చిరకాలమునుండి యుండినదగుటచే లెస్సగా వేరులు బారినదగు వృక్షము మంచి ఉక్కుతో చేయబడి సానబట్టిన గొడ్డలిచేత మాత్రమే నరికిన తెగునట్లు దృఢమైనవైరాగ్యమను గొడ్డలిచేత నరికిన మాత్రమే ఈ యజ్ఞానవృక్షము సమూలముగా నశించును. స్వల్పమైన వైరాగ్యముతో నరుకజూచిన, మంచి చేవగల యేపి, చందనాదివృక్షములను తగరపు కత్తితో నరుకజూచినట్లుండును. కనుకనే ఖడ్గము యొక్క లక్షణము— 'అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా' అని చెప్పబడినది. అసంగమనగా దేహసంబంధ సమస్తబంధములనుండి విడుదలపొందుట. దీనితో తృప్తినొందక దేహేంద్రియబుద్ధుల కన్నింటికిని సాక్షియగు అనగా విలక్షణమగు ఆత్మస్థితిలో నిలకడగలిగియుండుట. ఇది యే సరియైన నిస్సంగత్వము. ఇక నీ సంసారవృక్షమునుండి పండిన ఫలమును జీవుడనే పక్షి అనుభవించును. 'భోక్తాఽత్ర జీవః ఖగః' అని శ్రీ శంకరభగవత్పాదులు చెప్పిన విషయము ముండకోపనిషత్తు మిక్కిలి విపులముగా, విస్పష్టముగా ప్రతిపాదించుచున్నది.

మూ॥ ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥

తా॥ మంచి రెక్కలుగలిగినట్టియు, ఎల్లప్పుడు కలిసియే వుండునట్టియు, స్నేహితులునగు రెండుపక్షులు (జీవేశ్వరులను రెండుపక్షులు) ఒకేవృక్షమును (వృక్షమనగా ఛేదింపబడునది) (శరీరముసైతము నశించునదియే గావున యిచ్చట వృక్షమనగా శరీరమని గ్రహించవలయును.) ఆశ్రయించి యున్నవి. అనగా జీవేశ్వరులను పక్షిద్వయము శరీరమను వృక్షమును ఆశ్రయించియున్నది. ఫలోపభోగార్థము పక్షులు వృక్షము నాశ్రయించినటుల జీవేశ్వరులిద్దరు శరీరమను వృక్షము నాశ్రయించుచున్నారు. వారిలో నొకడగు లింగశరీరోపాధిగల క్షేత్రజ్ఞుడు అనగా జీవుడు శరీరమనువృక్షము నాశ్రయించినవాడై కర్మనిష్పన్నమైనట్టియు, సుఖదుఃఖలక్షణమైనట్టియు, అనేక విచిత్ర వేదనాస్వాదరూపమగు ఫలమును అవివేకముచేత అనుభవించుచున్నాడు. రెండవవాడగు ఈశ్వరుడు

సత్త్వోపాధిగలవాడగుటచేత సర్వజ్ఞుడును, నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపు డును అగుటచేత కర్మఫలరూపమగు ఫలము నపేక్షింపక సాక్షిమాత్రు డయి చూచుచున్నాడు. జీవుడు పరమాత్మస్వరూపుడగుటచేత అతడు సర్వదా ఆనందస్వరూపుడై యుండుట సహజమైయుండగా, అజ్ఞాన వ్యామోహముచేత తాను పరమాత్మకంటె భిన్నుడగు సంసారిగా భావించి దుఃఖించుచున్నాడు. తాను సంసారికాడనియు, ఆత్మస్వరూపు డేననియు గురూపదేశానుభవాదులచేత తెలిసికొన్న వెంటనే సమస్తదుఃఖ ములు తొలంగి సచ్చిదానంద స్వరూపుడగుచున్నాడు. ఈ విధముగా జీవుడు తన నిజస్వరూపమును గుర్తించినప్పుడే జ్ఞానఖడ్గముచేత అజ్ఞాన వృక్షమును (సంసారవృక్షమును) ఛేదించి సమూలముగా నాశముచేయు చున్నాడు. అప్పుడే తాను నిత్యసచ్చిదానందస్వరూపు డగుచున్నాడు.

ఇక నీ విషయమున భగవద్గీత **మూడవ** అధ్యాయమున చెప్పినది చూడుడు :

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః॥

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

తా॥ బ్రహ్మవేత్తలు దేహమునకన్న కర్మేంద్రియములు చైత న్యము గలవనియు, వాటికన్న జ్ఞానేంద్రియములు, వాటికంటె మనస్సు, మనస్సుకంటె బుద్ధి, బుద్ధికంటె ఆత్మ చైతన్యముగలదని చెప్పుచురు. మరి యొకవిధముగా శరీరముకన్న కర్మేంద్రియములు పైభాగమునను, వాటి కంటె జ్ఞానేంద్రియములు పైభాగములోను, వాటికంటె మనస్సు, మనస్సుకంటె బుద్ధి, దానికంటె ఆత్మ పైభాగమున నుండునదియని వచింతురు. ఇచ్చట 'ఊర్ధ్వమూలం' అని చెప్పినట్లుగా ఆత్మ ఊర్ధ్వము గాను, దానినుండి ఉత్పన్నమైన ప్రకృతివృక్షము అధశ్శాఖాదుల గలిగి యున్నదని గ్రహించవలెను. అట్టి ప్రకృతివృక్షముయొక్క తత్త్వమును బాగుగా గ్రహించి, ఆత్మచే లెస్సగా నిగ్రహించి ప్రయాసముచే పొంద దగినదియును, కామరూపమైనదియునగు మూలప్రకృతిని త్యజింపుము; లేక వధింపుము; లేక ఛేదింపుము.

'ఏతచ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా' ఈ యజ్ఞాన వృక్షమును పరమోత్కృష్టమగు జ్ఞానఖడ్గము (గండ్రగొడ్డలి) చేత ఛేదించుము; చీల్చుము. నరికిన చాలును. అయితే దీనియందు చీల్చుము అని చెప్పుటచే నరికినచో మరల అంకురించునేమో. చీల్చినచో మరలచిగురించదు. ప్రకృతియొక్క శక్తి ఇట్టిదని గ్రహించవలయును. ఈ విషయమును కఠోపనిషత్తున్ను ప్రతిపాదించియున్నది చూడుడు:

శ్లో॥ ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసశ్చ పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్పరః॥
మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః।
పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః॥

దీనియర్థము పై శ్లోకములో నిరూపింపబడినదే. 'సాకాష్ఠా సాపరాగతిః' అదే నిష్ఠయొక్క మరమకాష్ఠయనియు, అదే సర్వోత్కృష్టమగు మోక్షమనియు తెలుపడమైనది. అదే శివము, అమృతము, ఆనందము, అద్వైతము.

---

ఓమ్

# కర్మయోగము గొప్పదా? లేక జ్ఞానయోగము గొప్పదా?

పై విధముగా కొందరు ప్రశ్నింతురు. విశాలదృష్టితో, శాస్త్ర విచారణ భావముతో చూచిన దీనికిముఖ్యమైన అర్థమేమియు కనబడదు. ఆలాగున లోతైన దృష్టితో చూడక ఒక్కొక్కరి బాహ్యమైన కృత్యమును చూచినవారు మాత్రమే యీ ప్రశ్న చేయుదురు. ఇట్టి ప్రశ్న నాతోను కొందరు ప్రశ్నించిరి. దానికి సమాధానముగా జ్ఞానయోగము గొప్పదా? కర్మయోగము గొప్పదా? అనునది నాకేమియు కనుపించుటలేదు. అయితే కర్మయోగము మొదటిదిగా ఉంటున్నదని మాత్రము వారికి సమాధానము చెప్పడమైనది. వారి ఉద్దేశమేమన జ్ఞానయోగము చేత మాత్రము మోక్షమా? లేక కర్మయోగముచేత మోక్షమా? అని. మోక్షమనునది ఒక్క కర్మయోగమునకుగాని, జ్ఞానయోగమునకుగాని,

భక్తియోగమునకుగాని, ధ్యానయోగమునకుగాని సంబంధించినదిగాదు. అవినాలుగున్ను వారివారి సంస్కారము ననుసరించి యేదైన ఒక దానిలో ప్రవృత్తిగలిగి వుండవచ్చును. మోక్షమనునది ఆత్మ సాక్షాత్కారమగును. దానిని దైవసాక్షాత్కారమనియు చెప్పవచ్చును, జ్ఞానమనియుగూడ వచించవచ్చును. మానవుని ప్రవృత్తియంతయు అంతఃకరణ సంస్కారము ననుసరించియుండును. అవి యన్నియు మనస్సుయొక్కయు, బుద్ధియొక్కయు సంస్కారములుగా వుండును. ఆత్మవస్తువు వీటికి విలక్షణము, సాక్షిస్వరూపము. శుద్ధమైన జ్ఞానమే దానికి స్వరూపము. ఇట్లు గ్రహించుటయే విశాలభావమగును. ఆశ్రమములు నాలుగింటిని చెప్పునప్పుడు ఒకటి బ్రహ్మచర్యము, రెండు గార్హస్థ్యము, మూడు వానప్రస్థము, నాలుగు సన్యాసము. ఈ నాలుగింటిలో యేది మోక్షమును గలుగచేయునని చేయు ప్రశ్నకు యెట్లు అర్థమే లేదో, ఏలన యీనాలుగున్ను వ్యావహారిక ధర్మము లేగాని పారమార్థిక మైనవీగావో ఆలాగున కర్మ భక్తి యోగ జ్ఞానమార్గములున్ను వ్యవహారములతో సంబంధించినవే. బ్రహ్మచర్యాది ఆశ్రమములకే మోక్షమని చెప్పినచో అది వ్యావహారిక విషయముతో సంబంధించినదగును. వేదాంత శాస్త్రము బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమములకున్ను, బ్రాహ్మణాది నాలుగు వర్ణములకున్ను సంబంధించినది కాదనియు, యీ నాలుగింటికిన్ని అది విలక్షణమనియు, అది అంతఃకరణ శుద్ధిద్వారా పొందవలసిన ఆత్మసాక్షాత్కారజ్ఞానమనియు శాస్త్రము తెలుపుచుండును. అట్లుగాకపోయిన బ్రహ్మచర్యాశ్రమములో నుండువారికి మాత్రమే మోక్షమనియు, ఆలాగున గృహస్థాశ్రమమునం దుండువారికే ముక్తియనియు, అదేరీతిగా వానప్రస్థులకే కైవల్యమనియు, ఆలాగున సన్న్యాసులకే ముక్తియనియు చెప్పవలసియుండును. అట్లైన పరబ్రహ్మము వర్ణాశ్రమములకు లోబడియుండుననియు ఘంటాపదముగ చెప్పవలసియుండును. అదిన్నిగాక బ్రహ్మచర్యాశ్రమమునందుండి యెందరో ముక్తులైరి. ఆలాగున గృహస్థాశ్రమములోనుండి యెందరో మోక్షమును పొందిరి. ఆలాగున వానప్రస్థులైయుండి యెందరో కైవల్యమును పొందిరి. అదేరీతిగ సన్యాసమునుండి యెందరో బ్రహ్మప్రాప్తినొందిరి. దీనికి యేమి సమాధానము చెప్పగలరు? వరాహోపనిషత్తు తెలిపినది చూడుడు.

శ్లో॥ సర్వసాక్షిణమాత్మానాం వర్ణాశ్రమవివర్జితం ।
బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్॥

తా॥ సర్వేంద్రియ మనోవృత్తులకు సాక్షియైయుండు ఆత్మను వర్ణాశ్రమములకు దూరముగాను, పరమాత్మస్వరూపముగాను యెరింగిన వాడు స్వయముగా పరమాత్మస్వరూపుడు (పరబ్రహ్మస్వరూపుడు) గా వుంటున్నాడని శాస్త్రము తెలుపుచున్నదిగదా! ఆలాగున శంకరభగవత్పాదులు వివేకచూడామణిలో చెప్పినది చూడుడు.

శ్లో॥ జాతినీతికులగోత్రదూరగం రూపనామగుణదోషవర్జితం ।
దేశకాలవిషయాతివర్తి యత్ బ్రహ్మతత్త్వమసిభావయాత్మని॥

తా॥ పరమాత్మ స్వరూపము బ్రాహ్మణాది జాతులకున్ను, బాహ్యమైన నీతినియమములకున్ను, కులగోత్రములకున్ను, నామరూపములకున్ను, సత్త్వాదిగుణములకున్ను, దేశకాలములకున్ను, ఇంద్రియాది విషయములకున్ను అతీతమై అన్నిటిలోను సాక్షియై వెలుగుచుండు యే పరబ్రహ్మముగలదో అదే నీయొక్క స్వరూపముగా అనగా ఆత్మగా నిరంతరము భావనచేయుము. ఈలాటి ప్రమాణము లసంఖ్యాకములు గలవు. గీతలో చెప్పినదిన్ని చూడుడు.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥

తా॥ సర్వభూతాంతరాత్ముడనగు నన్ను యెవడు ఏకాత్మజ్ఞానము గలవాడై సేవించుచున్నాడో, అట్టి ధ్యానయోగి యెల్లప్పుడు కర్మలు చేయుచుండినను, చేయకున్నను నాయందున్నవాడేయగును—తార్కాణముగా చూడుడు. శ్రీ శుకుడు మొదలగువారెందరో బ్రహ్మచర్యాశ్రమమునుండియే జీవన్ముక్తులైరి. ఆలాగున జనకాదులెందరో గృహస్థాశ్రమములో నుండియే బ్రహ్మప్రాప్తిగలవారైరి. యాజ్ఞవల్క్యాది మునులెందరో వానప్రస్థములోనుండియే కైవల్యము నొందిరి. సనకాది యోగిపుంగవులు యత్యాశ్రమమునందుండియే కైవల్యమును పొందిరి. ఆలాగున వసిష్ఠాది మహర్షులు బ్రాహ్మణకులములోను, విశ్వామిత్రాది మునులు క్షత్రియకులములోను, తులాధారాదులు వైశ్యకులములోను,

సూతాదిపరమఋషులు శూద్రకులములోను, మైత్రేయాదినారీమణులు స్త్రీలలోను వుండియే జీవన్ముక్తిని పొందిరి. కావున మోక్షము యేవర్ణములో, యే ఆశ్రమములో, యే యోగములో నుండినైన పొందవచ్చును. అది ఆత్మకుగల అన్ని బంధములనుండి విముక్తి పొందుట యేదిగలదో అదేమోక్షము అని గ్రహించేది. ఆలాగున కర్మ, భక్తి, యోగ, జ్ఞానములయొక్కయు స్థితియని గ్రహించవలయును. అయితే మొట్టమొదటి ప్రశ్న కర్మయోగము గొప్పదా? లేక జ్ఞానయోగము గొప్పదా? అనుదానికి కర్మయోగము మొదటిదని సమాధానము చెప్పబడినదేగాని జ్ఞానయోగము గొప్పదనిగాని, కర్మయోగము గొప్పదనిగాని చెప్పియుండలేదు. ఆవాక్యమును జ్ఞప్తిలో నుంచుకొనినమాత్రమే యీ వ్యాసముయొక్క సత్యము గోచరము కాగలుగును. నాలుగు ఆశ్రమములలో బ్రహ్మచర్యాశ్రమము మొదటిదనియు, ఆలాగున నాలుగు యోగములలో నిష్కామకర్మము మొదటిదనియు, చెప్పుటకు కారణమేమన, మూడంతస్థులుగల ఒక హార్మ్యమును నిర్మింపదలంచిన పునాది యేలాగున ధృఢముగా నుండవలయునో, అస్థిభారము దృఢము లేనిచో తక్కిన మూడంతస్థులున్ను యెంత సుందరముగా నిర్మించినను సౌధ మేలాగున సుస్థిరముగా నిలువజాలక గాలివానలచే పడిపోవునో, ఆలాగున భక్తి, యోగ, జ్ఞానములకు మూడింటికిన్నీ కర్మయోగము పునాదివంటిది. అది దార్ఢ్యములేనిచో హార్మ్యము కూలునట్లు తక్కిన మూడు యోగములున్ను సుస్థిరముగా నిలువజాలవు. అంతేగాక యీ నాలుగు యోగములలో యేది గొప్పది? యేది కొద్దిది? అని చెప్పుటకు లేదు. ఒక గోవుకు నాలుగుపాదములుగలవు. వానిలో ఏది ముఖ్యము, ఏది అముఖ్యమని యెట్లు చెప్పతరముగాదో, ఆలాగున ముక్తియనెడు కామధేనువునకు నాలుగు యోగములున్ను నాలుగు కాళ్ళవంటివి. అలాగున ముక్తియనెడు మంటపమునకు నాలుగు స్తంభములుగలవు. అవి నాలుగు యోగములని గ్రహించవలెను. మంటపముయొక్క సుస్థిరతకు నాలుగు స్తంభములలో యేది ముఖ్యము, ఏది అముఖ్యమని యెట్లు నిర్ణయింపజాలమో దీనియొక్క స్థితియు ఆలాగున యుండును. ఈ నాలుగు యోగములలో సామాన్యముగా కొందరికి జ్ఞానమైనా, భక్తి

యైనా యేదో ఒకటిమాత్రమే యుండును. కొందరికి జ్ఞానము, కర్మము రెండు వుండవచ్చును. కొందరికి మూడైనా యుండవచ్చును. నాలుగున్ను సమానములుగా గలవారే లోకోద్ధారకులు. అయితే తనయొక్క ముక్తికి య్యేదైన ఒకటి వుండిన చాలును. నాలుగు యోగములు గలవారు చతుర్ముఖబ్రహ్మకు సదృశులు. ఆలాగున యీనాలుగు యోగములలోను ప్రవృత్తిగలవారు చతుర్భుజములుగల విష్ణుభగవానునకు సదృశులు. అయితే ఒక్కరికి సర్వవిధ సౌఖ్యము లనుభవించుటకు సార్వభౌముడు కావలసిన పనిలేదు. శ్రీమంతుడో, జమీందారో, రాజో, మహారాజో అయినచాలును. అయితే రాజ్యమును నిష్కంటకముగా పాలించవలసియుండిన చక్రవర్తి కావలసియుండును. ఆతనికి చతురంగ సైన్యములు (బలములు) వుండవలయును. లేనిచో శత్రురహితముగ రాజ్యమును పాలింపజాలడు. ఆలాగున మోక్షసౌఖ్యమునకు పై జెప్పిన మార్గములలో యేదో నొకటి చాలును. ప్రజల అంతఃకరణసంస్కారము ననుసరించి అందరినీ మోక్షమార్గములో నడుపవలసియుండిన కర్మ, భక్తి, యోగ, జ్ఞానములు నాలుగు వుండవలయును. అయితే మోక్ష సుఖములో అందరున్ను సమానులే. కార్యనిర్వాహణమందు మాత్రము భేదముకలదు. కనుకనే గురుగీతయందు మహాత్ములగు గురువును గురించి యీలాగున చెప్పడమైనది:

శ్లో॥ అత్రినేత్రశ్శివస్సాక్షాత్ ద్విబాహుశ్చ హరిస్స్మృతః।
యోఽచతుర్వదనో బ్రహ్మ శ్రీగురుః కథితః ప్రియే॥

తా॥ ఓ పార్వతీ! ఎవ్వడైతే మూడు కన్నులులేని సాక్షాదీశ్వరుడుగాను, రెండుచేతులుగల విష్ణువుగను, నాలుగు ముఖములులేని బ్రహ్మదేవుడుగను చెప్పబడెనో అట్టి సర్వోత్తముడగువానిని గురుదేవునిగా యెరుంగుము. అనగా ఈశ్వరునకు త్రినేత్రము లుండవలెను. గురుదేవునకు రెండు నేత్రములేగలవు. విష్ణుమూర్తియైన చతుర్భుజము లుండవలెను. గురుదేవునికి ద్విబాహువులేగలవు. ఆలాగున బ్రహ్మదేవుడైన నాలుగు ముఖము లుండవలెను. గురుదేవునికి ఒకటే ముఖము గలదు. అనగా ఏకనేత్రముగల శివుడుగాను, రెండు బాహువులు గల విష్ణువుగాను, ఒకే ముఖముగల బ్రహ్మగాను యెరుంగవలయును.

సామాన్యముగా ఒక్కొక్కటున్ను కర్మయోగాది నాలుగు యోగము లలో దేనియందుండునో అది గొప్పదని చెప్పుదురు. ఆలాగున అట్టి శాస్త్రమున్ను దానినే గొప్పదనిచెప్పుట మామూలు. లేనిచో దానికి స్వాతంత్ర్య ముండదు. ఒక్కొక్కయోగముయొక్క పర్యవసానము మోక్షమనియే ఆ శాస్త్రము వక్కాణించును. లేనిచో దానికి స్వాతంత్ర్యముండదు. అది శాస్త్రలక్షణమేకాదు. అస్వాతంత్ర్యమైన శాస్త్రమును యెవరు ఆశ్రయింతురు? కావున ఆ నాలుగు యోగము లున్ను స్వతంత్రముగా మోక్షమును గలుగజేయునని చెప్పుటలో లోప మేమియులేదు. ముముక్షువులయొక్క పూర్వజన్మ సంస్కారము ననుస రించి పైజెప్పిన నాలుగు యోగములలో దేనియందైన నొక్కదాని యందు ప్రవృత్తి గలుగునని మొదటనే తెలుపఢమైనది. జీవుల సంస్కా రము ననుసరించియే సాక్షాద్వేదముఖమునుండి నాలుగు యోగము లున్ను యేర్పడినవి. ఈ సత్యము నెరింగినవాడే శాస్త్రరసహ్యా మెరిం గినవాడు. కావుననే కృష్ణభగవానుడు గీతలో యిట్లు తెలుపుటకు కారణము.

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః ।
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విందతే ఫలమ్ ॥

తా॥ బాలురవంటివారు సాంఖ్యయోగపరమగు జ్ఞానమును వేరు గాను, నిష్కామకర్మయోగమును వేరుగానుచెప్పుదురు. శాస్త్ర సార మెరింగిన పండితులు ఆలాగున చెప్పరు. పై జెప్పిన జ్ఞానయోగముగాని కర్మయోగముగాని ఒక్కదానిని లెస్సగా ఆచరించిన ఉభయులున్ను పొందెడు మోక్షస్థానము ఒకటేయని గ్రహించుకొనవలయును. దీనిని దృఢము చేయుటకొరకు యీ క్రింది శ్లోకము ప్రవర్తించఢమైనది.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥

జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచేత పునరావృత్తిరహితమైన యే మోక్షము పొందబడుచున్నదో, అట్టి మోక్షము నిష్కామకర్మయోగ నిష్ఠులచేతగూడ చిత్తశుద్ధిద్వారా పొందబడుచున్నది. కావున యే పురు షుడు సాంఖ్యయోగము, నిష్కామకర్మయోగము రెండును ఒక్క ఫల

మునకే కారణములగుచున్నవని తెలుసుకొనుచున్నాడో, అట్టివాడే పరమార్థమును చక్కగా తెలిసినవాడగును. "యః పశ్యతి స పశ్యతి" అని చెప్పుటవల్ల పై చెప్పిన రెండు యోగములయొక్కయు గమ్యస్థానము మోక్షమని యెరింగినవాడే శాస్త్రదృష్టిగలవాడు; అనగా శాస్త్రసారమెఱింగినవాడగును. అట్లుగాక రెండింటియొక్క ఫలములు భిన్నమని చెప్పువాడు శాస్త్రముయొక్క సారము నెరుంగనివాడనియు, శాస్త్రములో గ్రుడ్డివాడనియు గ్రహించుకొనవలయును. కావుననే శ్రీ యోగవాసిష్ఠములో యీలాగున చెప్పుటకు కారణమైనది:

శ్లో॥ అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్ఞ్జాన నిశ్చయః।
ప్రకారౌ ద్వౌ పురా దేవో జగాద పరమేశ్వరః॥

తా॥ ఒకనికి యోగసాధనయందు సాధ్యముగలుగకపోవచ్చును. మరియొక్కనికి విచారజనితమగు జ్ఞానయోగమందు సమర్థత లేకపోవచ్చును. ఈ తత్త్వమును పరమేశ్వరుడు పూర్వమెఱింగియే జ్ఞానయోగములు రెండింటిని వేదముఃద్వారా వుపదేశించుటకు కారణమైనది. దీనికన్న పరమప్రమాణమిక నేమిగలదు? యోగచతుష్టయమున నిష్కామకర్మయోగము మొదటిదనియు, దానినిగురించిన కారణమున్ను పైనుదహరించడమైనది. ఇప్పుడు చతురాశ్రమములలో బ్రహ్మచర్యాశ్రమము మొదటిదనియు చెప్పుటకు హేతువున్ను తెలిపెద. నిష్కామకర్మయోగము తక్కిన నాలుగు యోగములకు యెట్లు పునాదివంటిదో ఆలాగున ఆశ్రమచతుష్టయమునకు బ్రహ్మచర్యాశ్రమము పునాదివంటిది. బ్రహ్మచర్యాశ్రమము గురుకులములో ఉండి అనుష్ఠించి ఆత్మశుద్ధి గలుగజేయునదగుటచే తక్కిన మూడాశ్రమములున్ను చక్కగా నిర్వహించుటకు తగిన హృదయదార్ఢ్యమున్ను పవిత్రతయు గలుగును. లేనిచో దుర్బలమైనపునాదిపై నిర్మించిన మూడంతస్థులుగలహార్మ్యము వలె తక్కిన మూడాశ్రమములనుండియు ఆతడు పదభ్రష్టుడగును. ఈవిషయమై మనుమహర్షి తెలిపినదిచూడుడు. ఇచట సంగ్రహముగా తెలుపబడును. విస్తారముగా చూడదలంచువారు మనుస్మృతి మొదలగు గ్రంథములలో చూడవచ్చును.

"సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్ ।
సన్నియమ్యేంద్రియగ్రామం తపో వృద్ధ్యర్థమాత్మనః॥"

తా॥ బ్రహ్మచారి గురుకులమున వసించుచు, ఇంద్రియములను నియమించి ఆముష్మికమునందలి తపోవృద్ధికై యీ క్రింది నియమములను అనుష్ఠించవలెను.

శ్లో॥ చోదితో గురుణా నిత్య మప్రచోదిత ఏవవా ।
కుర్యాదధ్యయనే యత్న మాచార్యస్య హితేషు చ॥

తా॥ గురువు చెప్పినను చెప్పకున్నను, ప్రతిదినము వేదాధ్యయనమునందును, గురుహితకార్యములయందును, ప్రయత్నము చేయవలయును. బ్రహ్మచారికి అధ్యయనము, బ్రహ్మచర్యవ్రతమును పాలించుట, ఇంద్రియములను స్వాధీనమందుంచుట, ప్రణవాది మంత్రములను జపించుట ముఖ్యధర్మమగును. చరకముని ఆయుర్వేదమును శిష్యులకు చెప్పుచుండగా ఒకే మూలికవల్ల సర్వరోగములు నశించునది గలదాయని అంతేవాసులు ప్రశ్నింపగా యీ శ్లోకము నుపదేశించిరి.

శ్లో॥ మృత్యువ్యాధిజరానాశి పీయూషం పరమౌషధం।
బ్రహ్మచర్యం మహద్యత్నం సత్యమేవ వదామ్యహమ్॥

తా॥ బ్రహ్మచర్యవ్రతము అమృతస్వరూపమై, మరణమును, రోగమును, వృద్ధావస్థను నాశనముచేయునదిగా ఉన్నది. ఇది నిజము. దీనిని గొప్పయత్నముతో సాధించవలయును.

శ్లో॥ బ్రహ్మచర్యం ప్రవక్ష్యామి బ్రహ్మప్రాప్తికరం నృణాం ।
ఆయురారోగ్యమైశ్వర్యం మనస్స్వాస్థ్యం శివాత్మకమ్॥

తా॥ నేను బ్రహ్మచర్యమునుగూర్చి చెప్పుచున్నాను. అయ్యది సకలజనులకును బ్రహ్మప్రాప్తిని (మోక్షమును) గలుగజేయును. ఆయుస్సును, జ్ఞానసంపత్తును, మనశ్శాంతిని గలిగించును. మరియు ఆ బ్రహ్మచర్యమనునది శివస్వరూపము అనగా మంగళరూపము శివత్వమును గలుగజేయునది. ఈ విషయమై ఒక్కశ్లోకమునుచెప్పి విరమించెద. విస్తారముగా చూడదలంచువారు బ్రహ్మచర్యమను గ్రంథమును పఠించదగును.

శ్లో॥ బ్రహ్మచర్యవతో భీమ స్సింహోఽపి శునకో భవేత్ ।
బ్రహ్మచర్యస్య హీనే తు శ్వా భీమస్సింహవద్భవేత్ ॥

తా॥ బ్రహ్మచర్యవ్రతము గలవానికి సింహము శునకమువలెను, బ్రహ్మచర్యవ్రతహీనునకు శునకము సహా గొప్ప గండుసింహమువలె గోచరించును. ఇక నాలుగుయోగములను గురించిన ఒక ప్రమాణశ్లోకమును తెలిపి విరమించెద.

శ్లో॥ జ్ఞానలభ్యం పరం మోక్షం ప్రాహు స్తత్త్వార్థచింతకాః ।
తజ్జ్ఞానం భక్తిమూలం చ భక్తిః కర్మవతాం తథా॥

తా॥ వేదాంతార్థతత్త్వ మెరింగిన మహనీయులు మోక్షము జ్ఞానమువల్లనే గలుగునని చెప్పిరి. అట్టిజ్ఞానము భక్తివల్లను, అట్టి భక్తి నిష్కామ కర్మవల్లను గలుగునని వచించిరి.

శ్లో॥ ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్ప వివర్జితం ।
జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్॥

తా॥ మనకు పండ్లే కావలసియున్నప్పటికిన్ని పుష్పమునుండియే ఫలమేర్పడును. పుష్పమునకు వృక్షమాధారము. వృక్షమునకు పోషణ హేతువు; ఆలాగుననే మనకు జ్ఞానమే కావలసియున్నప్పటికిన్ని జ్ఞానము భక్తియను పుష్పమునుండియే కలుగును. పుష్పమునకు వృక్షమాధారమగునట్లు, నిష్కామకర్మయోగము ఈశ్వరార్పణబుద్ధితో చేయుచు రాగారాగా భగవదనుగ్రహమగు నిర్మలహృదయమగు పుష్పమేర్పడును. అట్టి శుద్ధాంతఃకరణమగు హృదయపుష్పమునుండి జ్ఞానమనెడు ఫలము ఆవిర్భవించును. చెట్టును పోషింపక, పండ్లయొక్క మాధుర్యమును, ఆరోగ్యమును, ఆనందమునుగూర్చి మాట్లాడిన యేమైనను ప్రయోజనము గలుగునా? అట్టి వర్ణనమానిచెట్టును చక్కగా పోషించిన స్వయముగానే పుష్పింపచేసి ఫలమును కలుగజేయునట్లు నిష్కామకర్మయోగము చక్కగా ఆచరించిన అదే భక్తియనెడు పుష్పమును జ్ఞానమనెడు ఫలములను స్వయముగానే గలుగజేయును.

---

ఓమ్

# కర్తవ్యము

మానవుని కర్తవ్యమేమని అనేకులు ప్రశ్నింతురు. ఇది వాస్తవముగా దెలియదగిన విషయమే. ఇట్లడుగువారు సామాన్య మనుజులు కారు. విద్యావంతులును, జ్ఞానవంతులును, జిజ్ఞాసువులును, నిజముగా మానవజన్మ కర్తవ్యమును తెలిసికొని అనుష్ఠింపవలయునను తలంపుగలవారలే. దీనికి సమాధానము సంగ్రహముగా జెప్పవలసియుండిన రెండు వాక్యములలో పూర్తి జేసికొనవచ్చును. ధర్మములన్నిటిలోను ముఖ్యమనియు, గౌణమనియు యిరుతెగలు గలవు. గౌణము అనగా అప్రధానము. ముఖ్యము అనగా ప్రధానము. గౌణములో అరితేరనిచో ముఖ్యములను నిర్వహింపజాలరు. భగవత్సృష్టిలో మానవజన్మము శ్రేష్ఠమైనదని అందరెఱింగిన విషయమే. శ్రేష్ఠత్వముచేతనే జ్యేష్ఠత్వము సిద్ధించుచున్నది. మాతాపితరులకుగల సంతానములలో జ్యేష్ఠపుత్రు డేలాగున కనిష్ఠ సోదరీ సోదరులను తండ్రివలె జూడవలయునో ఆలాగున జంతుసృష్టిలో మానవుండు శ్రేష్ఠుడగుటచే జ్యేష్ఠపుత్రుడువలె సమస్త ప్రాణికోట్లను రక్షించువాడై యుండవలయును. భగవత్సృష్టిలోగల ప్రాణికోట్లన్నియు భగవత్సంతానములని తలంచి జ్యేష్ఠపుత్రుడు కనిష్ఠులను పోషించులాగున జంతుకోట్లపై కరుణగలవాడై యుండవలయును. పై జెప్పిన విధముగా జ్యేష్ఠపుత్రుడు కనిష్ఠసంతానములను చక్కగా సంరక్షించినచో తండ్రి యేలాగున జ్యేష్ఠపుత్రునిపై ప్రీతిగలిగి తనయొక్క ధనమును అధికారమును జ్యేష్ఠపుత్రునికిచ్చి అన్త్యకాలమున తన స్థానమును అతనికిఒప్పజెప్పునో ఆలాగున భగవత్సంతానములగు జీవకోట్లలో దయగలిగి వాని పోషణమందు శ్రద్ధవహించువానికి భగవంతుని కరుణ గలిగి భగవచ్ఛక్తిని, జ్ఞానమును అతనికొసగి కట్టకడకు తన స్థానమును (బ్రహ్మపదమును–మోక్షస్థానమును) ఇచ్చి వానిని భగవత్సమానునిగా అనగా భగవత్స్వరూపునిగా భగవంతుడు జేయుచున్నాడు. ఇదియే నిష్కామ కర్మయోగముయొక్క పరమలక్ష్యమగును.

రెండవది ముఖ్యధర్మము. ఇది మానవునికిగల సర్వదుఃఖములను తొలగించి బ్రహ్మసాక్షాత్కారస్థితిని గలుగజేయుటయే యగును. అనగా

ముక్తిని పొందుటయే యగును. తనయొక్క నిజస్వరూపమగు ఆత్మను బ్రహ్మమును పొందుటయని తాత్పర్యము.

ఆత్మ యేలాగున అమృతస్వరూపము, ఆనందస్వరూపము, శివ స్వరూపము అయియున్నదో ఆ స్థితిని గలుగజేసికొనుటయే ముఖ్యధర్మమని గ్రహించుకొనవలయును. మొదటిది క్రమముక్తియనియు, రెండవది సాక్షాన్ముక్తి యనియు రెండు విధములు. ఈ విషయమై అనుభూతి ప్రకాశము దెలిపినది జూడుడు.

శ్లో॥ కర్తవ్యమేతద్విజ్ఞానమితి వేదానుశాసనం ।
అస్యాతిలఙ్ఘనే దోషస్సంసారానర్థ సంగతిః॥

తా॥ ఈ విజ్ఞానమును కలుగజేసికొనుటయే మానవుని ముఖ్య కర్తవ్యమని వేదమాజ్ఞాపించుచున్నది. ఈ ఆజ్ఞ నుల్లంఘించినచో జనన మరణ సంసారదుఃఖములను అనర్థమును పొందుటయే దోషమగును.

శ్లో॥ కుర్వతస్తు మహాన్ లాభః స్వాత్మనః కృతకృత్యతా।

తా॥ ఈ విజ్ఞానమును గలిగించుకొనినవారికి గొప్ప లాభము గలదు. అదియేదన ఆత్మ కృతార్థమగుటయే; మోక్షమనెడు అమృతత్వమును పొందుటయే. ఈ విషయమై కేనోపనిషత్తు తెలిపినదానిని చూడుడు.

శ్రుతి॥ ఇహ చేదవేదీదథ సత్యమస్తి
న చేదిహావేదీన్మహతీ వినష్టిః ।
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి॥

తా॥ ఈ లోకమునందు బ్రహ్మస్వరూపము దెలిసికొనినవానికి సత్యస్వరూపమగు ఆత్మలాభము కలదు. ఈ లోకమునందు బ్రహ్మస్వరూపమును (ఆత్మను) దెలిసికొననివానికి గొప్పనష్టము గలుగుచున్నది. జ్ఞానులు సమస్త భూతములందుండెడి అద్వితీయమగు నేకస్వరూపమైన ఆత్మతత్త్వము దెలిసికొని ఈ లోకమునుండి మరణమును పొంది జననమరణరహితమయిన శాశ్వతమయిన అమృతమును (ముక్తిని) పొందుచున్నారని శ్రుతి బోధించుచున్నది.

కొద్ది చదువు గలవారున్ను, ఎక్కువ చదువు లేనివారున్ను, మధ్యమస్థితిలోనుండు కొందరు జ్ఞానమును పొందకపోయిన గలిగెడు నష్టమేమి ? పొందిన గలిగెడులాభ మేమి ? అని ప్రశ్నను వేయుచుందురు. దానికి సమాధానమునే శ్రుతిమాత, తల్లి బిడ్డలకు బోధించునటుల దెలిపెను. సామాన్యముగా నందఱికిని యీ ప్రశ్న వేయకనే కంటికి గనిపించెడు విషయమేయిది. సామాన్యముగా ధర్మాత్ములై ప్రవర్తించెడు గృహస్థులుగూడ లోకమున నెంత గౌరవమును, పూజ్యతను, మనశ్శాంతిని మానసిక సుఖమును పొందుచున్నారో కండ్లారజూచుచున్నాము గదా ! ఆలాగున దుర్మార్గులగువారు పడెడు అశాంతిని, ఆత్మసౌఖ్యము లేని కష్టములను, కారాగృహము మొదలగు వానిలో పొందెడు దండనములను, లోకదూషణములను అందఱును జూచుచున్నారుగదా ! ప్రత్యక్షముగా గనపడెడుదానికి మరల సాక్షి కావలసిన పనిలేదుగదా ! అయితే మాయామోహముచే కండ్లారజూచియు చూడకనేయున్నారు. చెవులచే వినియు విననటులనే యున్నారు. ఇదియే మాయయొక్క మహిమయని గ్రహించుకొనవలయును. గీత పదునాల్గవాధ్యాయములో శ్రీకృష్ణభగవానుడు దీనినే ఉపదేశించెను.

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమం।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః॥

తా॥ దేనిని తెలిసికొని వసిష్ఠవామదేవవ్యాసాది సమస్త ఋషులున్ను ఉత్తమమయిన మోక్షమును పొందిరో, అట్టిపరమాత్మ విషయమగు నీజ్ఞానము, జ్ఞానములన్నిటిలోను మహోత్తమమయినది. దానినే మీకు చెప్పెదను అని ప్రారంభించి త్రిగుణములయొక్క స్వభావమును త్రిగుణాతీతజ్ఞానమును ఈ అధ్యాయములో నిరూపించ బూనిరి. ఈ శ్లోకమందు "యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః" అని ప్రయోగించుచు మునులందఱున్ను, మహాత్ములందఱున్ను అట్టి జ్ఞానమును పొందియే సర్వోత్కృష్టమగు బ్రహ్మపదమును పొందిరి అని చెప్పుటవల్ల దీనియొక్క ఉత్కృష్టత యెంత గొప్పదో తెలియనగును. అందువలన ఈ యధ్యాయమును భక్తులు, ముముక్షువులు అందరున్ను బాగుగా తెలిసికొనవలయును.

శ్లో॥ ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ॥

తా॥ ఈ జ్ఞానము నాశ్రయించి నాసాయుజ్యమును పొందినవారు జగత్సృష్టి కాలమునందు పుట్టరు. ప్రళయకాలమందును (మరణము నందును) వ్యథనొందరు. అనగా యట్టిజ్ఞానమును పొందినవారు జనన మరణములను పొందక శాశ్వత బ్రహ్మమందు నిలకడగలవారగుదురు. కావున జ్ఞానమును పొందిన గలిగెడు లాభమున్ను, పొందకపోయిన గలిగెడు నష్టమున్ను దీనియందు భగవానుడే తెలిపెను. నష్టమేమనగా, మానవుండు తన సౌఖ్యముకొఱకు సంపాదించిన ధనధాన్య గృహారామములలో నేదైన కొంచమునష్టముగలిగిన, ఎంతో దుఃఖించుచున్నాడు. అలాగున, పుత్ర, కళత్రాదులలో హానిగలిగినను ఎంతో క్లేశమునొందుచున్నాడు. మరియు తన శరీరములో నేదైన వ్యాధికలిగినను, ఏదైన అవయవములలో హానిగలిగినను మహాక్లేశ మొందుచున్నాడు. అట్లుండగా తాను సంపాదించిన గృహ ధన ఆరామ పశువు లన్నిటిని, పుత్రకళత్రాది బంధువులనందఱిని, కట్టకడకు దేహమునుకూడ ఒకేసారి వదలిపోవునప్పుడెంత దుఃఖమును పొందవలసియుండునో, ఎంత నష్టపడవలసియుండునో యోచించుకొనుడు. కావుననే పైయుపనిషత్తు నందు "మహతీ వినష్టిః" అని ప్రయోగించుటకు హేతువు.

దీనివల్లగలిగెడులాభమేమనగ, నిరాధారుడై వ్యాధిపీడితుడై వీధులలో భిక్షమెత్తి జీవించుచుండు ఒక బాలకుని, ఏకచ్ఛత్రాధిపతియయిన వాడు తెచ్చి, శుద్ధికర్మచే పునీతునిగా జేసి, తనస్థానమున చక్రవర్తిగా చేసిన యెటులుండునో, అలాగున నిస్సహాయుడయి తాపత్రయముచే తపించి భవరోగముతో సల్లాడుచు, యిన్ద్రియ విషయములచే క్లేశమొంది యుంటున్న ఈజీవుని నిత్యమై అమృతమై శివమై ఆనందమయమై యుండు బ్రహ్మభావమును లేక భగవద్భావమును గలుగజేయునది ఈ జ్ఞానము. ఇది యెటువంటిలాభమో ఆలోచించుకొనుడు. కావుననే గీతా శ్లోకమున "మమసాధర్మ్యమాగతాః" అని తెలుపుటకు కారణమయినది. సాధర్మ్యమనగా సమానధర్మముతో నుండుటయని అర్థము. అనగా బ్రహ్మమయము, శివమయము, విష్ణుమయము గాగల్గునని

భావము. ఇది గొప్ప లాభముగదా! గీత అష్టమాధ్యాయమున తెల్పి నది జూడుడు.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః ॥

తా॥ సర్వోత్తమమగు ముక్తిపదమునుపొందిన మహానుభావులు నన్ను (పరమాత్మను) పొందినవారై దుఃఖభాజనమైనదియు, అనిత్యమయినదియు నగు జన్మమును మరల పొందరు.

శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే॥

తా॥ ఓ అర్జునా! బ్రహ్మలోకము మొదలుగాగల చతుర్దశభువనములున్ను వానిలోగల జీవకోట్లున్ను పునరావర్తి స్వభావము గలవి. నన్ను పొందినట్లైనచో, మరల జన్మము గలుగదు. ఇదియే జ్ఞానముచే గలిగెడు లాభమని గ్రహించుడు. గీత 13వ అధ్యాయము:

శ్లో॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్॥

తా॥ సకల ప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగాను, తన ఆత్మగాను తెలిసికొనినవాడు తనచేత తనను చంపుకొననివాడగుచున్నాడు. అట్లు పరమాత్మను సమముగా సర్వములో తెలిసికొననివాడు తన ఆత్మను తాను చంపుకొనినవానితో సమానుడు. అట్టి దైవమును సాక్షాత్కరించినవాడు మోక్షమును పొందుచున్నాడు. అనగా అట్టి ఆత్మజ్ఞానమును పొందనివాడు, ఆత్మహత్య జేసికొనినవానితో సదృశుడు; తెలిసికొనినవాడు బ్రహ్మముతో సమానుడు. ఇదియే జ్ఞానముచే గలిగెడు లాభమున్ను, జ్ఞానము గలుగనిచో గలిగెడు నష్టమున్ను అని గ్రహించుకొనవలయును.

శ్లో॥ లబ్ధ్వా కథఞ్చిన్నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్।
యస్త్వాత్మముక్త్యై న యతేత మూఢధీ
స్స ఆత్మహా స్వం వినిహన్త్యసద్గ్రహాత్॥

తా॥ పూర్వజన్మార్జిత పుణ్యావశమువను, దైవానుగ్రహము వలనను, దుర్లభమగు మనుష్యజన్మమును పొంది, పురుషశరీరమును దాల్చి సాంగవేదపారంగతుడయ్యును, ఏమూఢుడు తన ముక్తికొఱకు ప్రయత్నింపక, అనిత్యములగు ధనార్జనాది కార్యములలోనే కాలము గడుపునో, వాడు దేహాభిమానముచే తనను తానే చంపుకొనునట్టి ఆత్మఘాతకుడగును. ఇది శ్రీ శంకరభగవత్పాదులచే నుపదేశింపబడినది (వివేక చూడామణి.)

శ్లో॥ ఆయుర్వర్ష శతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం
తస్యార్ధస్య పరస్య చార్ధమపరం బాలత్వవృద్ధత్వయోః।
శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే
జీవే వారితరంగచంచలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్॥

తా॥ మర్త్యులకు జీవితకాలము నూరుసంవత్సరములు పరిమితి గలది. దానిలో సగము రాత్రియందు చనినది. తరువాత సగములో మఱియొక సగము బాలత్వవృద్ధత్వదశలలో గడచినది. మిగతకాలము రోగములచేతను, వియోగములచేతను గలిగిన దుఃఖముతో గూడినది గాను, తక్కినది దేహపోషణాదులకొఱకైన సేవకావృత్తులచేతను గడుపబడుచున్నది. కావున నీటియందలి యలవలె అస్థిరమైన జీవితమందు సుఖమెక్కడిది?

శ్లో॥ యావత్స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరా దూరతః
యావచ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
సన్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః॥

తా॥ ఎంతవరకు యీ దేహమారోగ్యవంతమై స్వస్థముగ నున్నదో, ఎంతవరకు ముదిమి దూరముగానుండునో, ఎంతవరకింద్రియముల పాటవము తప్పిపోలేదో, ఎంతలోపల ఆయుస్సు క్షీణించలేదో, అంతలోపలనే విద్వాంసునిచే ఆత్మశ్రేయస్సుకొఱకు గొప్పప్రయత్నము చేయదగినది. అట్లుగాక అస్వస్థదశలో ప్రయత్నపడుట, గృహము దగ్ధమగుచుండగా చల్లార్చుటకు నీళ్ళకై నూతిని త్రవ్వ ప్రయత్నించినటు

ఉండును. ఇది పూర్ణాయుస్సు గలవారినిగురించి చెప్పినవిషయము. "న హి ప్రమాణం జన్తూనా ము త్తరక్షణజీవనే" మానవులు యింకొక్క క్షణమువరకు జీవించుట కేలాటిప్రమాణమున్ను లేదు. ఈనిమిషమునన్నో, ఉత్తరనిమిషమునన్నో, రేపో మాపో ఎప్పుడు ప్రాణము వెళ్ళిపోవునో తెలియదు. కావున త్వరలో త్వరపడి ఆత్మజ్ఞానముకొఱకు, దైవకరుణకొఱకు యత్నింపుడు; అని భర్తృహరి తెలిపెను.

శ్లో॥ వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహం।
ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివామ్భో
లోక స్తథా వ్యహితమాచరతీతి చిత్రమ్ ॥

తా॥ జర (ముదిమి) పెద్దపులివలె పట్టుకొని చంపుటకు కనిపెట్టియున్నది. రోగములు శత్రువులవలె దేహమును బాధించుచున్నవి. జీవితము పగిలినకుండనుండి నీరు ఒక్కొక్క బొట్టుకారిపోవునట్లు నిమిషనిమిషమునకును నశించుచున్నది. అట్లుండియు మనుజుడు తన ఆత్మశ్రేయస్సుకై ప్రయత్నింపక ప్రాణికోట్లకు అహితమునే నొనరించుచున్నాడు. ఓహో, ఇదెంత ఆశ్చర్యము! మాయామహిమ నేమని చెప్పవచ్చును! అని ఉపనిషద్వాక్యము.

శ్లో॥ మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా ।
పారం దుఃఖోదధేర్గన్తుం తర యావన్న భిద్యతే॥

తా॥ ఓ! మానవుడా! నీవు పూర్వజన్మమున గొప్పదయిన పుణ్యమను క్రయముచేత ఈ మానవశరీరమనెడు ఓడను కొనియున్నావు. దేనికనగా సంసారదుఃఖసాగరమును తరించుటకొఱకు. అయితే నీశరీరమను ఓడ శిథిలమైపోవుటకు ముందుగా దాటుకొనుము అని వాసిష్ఠము.

శ్లో॥ క్షణం విత్తం క్షణం చిత్తం క్షణం జీవితమావయోః ।
యమస్య కరుణా నాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

తా॥ ధనము క్షణకాలముమాత్రమే యుండునది. మనస్సున్ను క్షణక్షణమునకు మారు స్వభావముగలది. మన యిద్దఱియొక్క జీవితమున్ను క్షణకాలముండునదే. అనగా నీమూఁడున్ను ఉత్తరక్షణములో

యుండునని నమ్ముటకవకాశము లేదు. యమునకు దయ యనునది లేదు. అందువల్ల ఓ జీవుడా! జాగ్రత్తపడుము.

శ్లో॥ మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు ।
చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః ॥

తా॥ ధనవనితాది విషయప్రపూర్ణమయిన మహారణ్యములందు మనస్సనెడు పెద్ద పులి సర్వదా సంచరించుచుండును. కావున మోక్షాసక్తులగు సాధువులు ఆ విషయారణ్యమున ప్రవేశింపకుందురుగాక (వివేక చూడామణి)

శ్లో॥ శాన్తే సముద్రకల్లోలే స్నానమిచ్ఛతి మూఢధీః ।
తథైవ శాన్తసంసారే జ్ఞానమిచ్ఛతి దుర్మతిః ॥

తా॥ సేతుస్నానమునకు వెళ్ళినప్పుడు అలలనుచూచి భయపడి ఇవి శాన్తించిన పిమ్మట స్నానము జేయవచ్చునని తలంచువాడు ఎట్టి మూఢబుద్ధియో, అలాగున సంసారసంబన్ధ సమస్తకార్యములు శాంతి నొందినపిమ్మట జ్ఞానము ననుష్ఠించి మోక్షమును పొందవచ్చునని తలంచు వాడుగూడ అట్టిదుర్మతియేయగును. ఏలాగునఎంతకాలముండినను కెరటములు అణగెడు స్వభావము సముద్రమునకు లేదో, అలాగున అన్ని కార్యములున్ను శాంతినొందుస్వభావము సంసారమందు లేదు. ఏలాగున సముద్రస్నానమునకు వెళ్ళువారు ఎంత ముసలమ్మలయినను ఎవరిసహాయముచేతనో, ఆ కల్లోలములోనే స్నానము జేసి వచ్చుచుందురో, అలాగున ఈ సంసారకార్యములలోనే కొంచెమైనా సమయమును సంపాదించుకొని జ్ఞానార్జనమునకై ప్రయత్నింపవలయును. లేనిచో జన్మమువ్యర్థమై పోవును.

శ్లో॥ నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవతస్సేవాం నజానే విభో ।
మజ్జన్మాన్తరపుణ్యపాకబలత స్త్వం శర్వ సర్వాన్తర
స్తిష్ఠస్యేవ హి తేన వా పశుపతే తే రక్షణీయోఽస్మ్యహమ్॥

తా॥ ఎల్లప్పుడు స్వకీయమైన ఉదరపోషణకొరకు ధన వాంఛ చేతను, సకలమయినవారల (ఉచ్చనీచస్థితిలో యుండువారిని జూడక

ఉద్యోగము దానము మొదలగువారి) నుద్దేశించి నిప్ప)యోజనమయిన పర్యటనము చేయుచున్నాను. ఓ సర్వవ్యాపకుడవయిన ఈశ్వరా! నీ యొక్క సేవను గుఱుతెఱుగను. ఓ బ్రహ్మాది సమస్తజీవులకును ప్రభువైన ఈశ్వరా! ఏకారణమువలన నాయొక్క జన్మాన్తరములలోని సుకృతములయొక్క పరిపక్వబలమువలనను, ఓఈశ్వరా! సమస్తములయిన అన్నమయాదికోశములకంటెను సూక్ష్మరూపుడై యున్నావో ఆ హేతువుచేత నేను రక్షింపదగినవాడను (శివానందలహరి).

శ్లో॥ జప్యేనైవ తు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః।
కుర్యాదన్యన్న వా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే॥

తా॥ బ్రహ్మనిష్ఠుడు తన కిష్టదైవమునకు సమ్బన్ధించిన జపమొకదానిమాత్రముచేతనే ఆత్మసిద్ధిని పొందగలుగును. దీనియందు సందియములేదు. ఇతరములగు యజ్ఞ దాన వ్రతాది కర్మలను చేయని, చేయకపోని విరోధములేదు. బ్రహ్మనిష్ఠుడు అందఱిని మిత్రభావముగా చూడవలయును. దీనియందు ఓంకారమును ముఖ్యమన్త్రముగా పేర్కొనడమైనది. (మనుస్మృతి)

---

ఓమ్

# గురుయోగము

శ్రీభగవద్గీతయందు నిష్కామకర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగమను నాలుగు యోగములను మాత్రమే చెప్పియున్నట్లు చాలమంది తలంచుచున్నారు. దానిననుసరించి ఆయా మతకర్తలు భాష్యమును రచించిరి. గురుభక్తియోగమను నొండొకటి గీతాశాస్త్రమందు గూఢమైయుంటున్నది. దాని నెవరుగూడ ప్రకాశింపచేయదలంచలేదు. శ్రీ రామావతారమందు వసిష్ఠమునీంద్రునివలన శ్రీరామచంద్రుడును, కృష్ణావతారమున సాందీపునివలనగురూపదేశము పొందినట్లు శాస్త్రవిదితము. ఈ సత్యమును ఆధారము జేసికొనియే మన పూర్వీకులు భూపాలురనుండి గోపాలురవరకును, పండితులనుండి పామరులవరకును, అగ్రజాతినుండి అంతిమజాతివరకును, పురుషులనుండి

స్త్రీలవరకున్ను బాల్యావస్థలో గురువులచేత, ఆచార్యులచేత, పౌరోహితులచేత పిల్లలకు అక్షరాభ్యాసము చేయించుటకు కారణము. ఎట్టివారైనను మొదట పై జెప్పిన ఆచార్యులవలన అక్షరాభ్యాసముచేయక పాఠశాలకు నెవరిని పంపరు. ఉపనయనకాలములో గాయత్రీ మంత్రోపదేశమున్ను, బ్రహ్మవిద్య ప్రవేశకాలములోను ఆచార్యులవల్ల, గురువులవల్ల మాత్రోపదేశము చేయించుకొనుటకున్ను కారణమిదియే. గురువు లేనిచో గుఱుతు తెలియజాలరని పూర్వాచార వాక్యమునకు నిదియే కారణము. దీనివలన నిర్విఘ్నవిద్యాప్రాప్తి గలుగును. అంతేకాదు; వారివారి మతానుసార నిజతత్త్వమును తెలియుటకును నిట్టియుపదేశము అవసరమైయుంటున్నది. శ్రీకృష్ణభగవానుడీ గురుకీలకమును గీతలో నతి రహస్యముగా నుంచినాడు.

శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥

,, అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥
(గీత అ. 13 శ్లో॥ 25, 26)

తా॥ పరమాత్మను కొందరు తనయం దున్నవానినిగా శుద్ధ మనస్సుతో కూడిన ధ్యానయోగముచేతను, మరికొందరు ఆత్మానాత్మ విచారణపరమగు సాంఖ్యయోగముచేతను, ఇంక కొందరు కర్మయోగము చేతను దర్శించుచున్నారు. ధ్యానయోగమందు ఉపాసనాయోగము అనగా భక్తియోగము అన్తర్భూతమగుటవలన ఇచట ప్రత్యేకముగా పేర్కొనబడలేదు. భక్తియోగము నాలుగు యోగములలో నొకటి యగుట వలననే ద్వాదశాధ్యాయమందు శ్రీకృష్ణభగవానుడు భక్తి యోగమును ప్రత్యేకముగా జెప్పుటకు కారణము. ఆలాగున తృతీయాధ్యాయమున కర్మయోగమును గురించియు, షష్ఠాధ్యాయమున ఆత్మ సంయమయోగమును గురించియు, త్రయోదశాధ్యాయమున క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగమును గురించియు, ద్వితీయాధ్యాయమున సాంఖ్య యోగమును జెప్పుటకు కారణమిదియే. మరికొందరు పై జెప్పబడిన ధ్యానయోగము, సాంఖ్యయోగము, కర్మయోగము, భక్తియోగము

అనువాటిలో దేనిని నాచరింపజాలక పరమాత్మ నెరుంగవలెనని ఆసక్తి గలవారు, పరమదయాళురగు గురువులవలన 'పరమాత్మ నిట్లుపాసన చేయుడు' అని ఉపదేశించబడినవారై స్వయముగా వేదాన్తశాస్త్ర విచారణయందసమర్థులైనను, సద్గురూపదేశమున శ్రవణము చేయబడిన దానియందు ఆసక్తిగలవారై యుండినచో జనన మరణ రూపమగు సంసారసాగరమును తప్పక దాటగలరు. ఇది వయస్సు ముదిరిన ముస లమ్మలగురించియు, చదువులేని భక్తులగురించియు శ్రీకృష్ణభగవానుడు కరుణతో ఉపదేశించిన వాక్యమని మనవకూడదు. అట్టివారు చదువు టకుగాని, వేదాన్త విచారముచేయుటకుగాని, యోగనిష్ఠను శీలించుటకు గాని కాలములేదనితలంచి దయతో చెప్పిన వాక్యము. అట్టివారు మహా త్ముడగు గురుదేవునివలన ఒక్క యక్షరము చెప్పించుకొని తదేకనిష్ఠగల వారై యుండిన పైజెప్పినవారికన్న వీరు ముందుగా తరించగలరని జెప్పు టకు కారణమేమన, వారలను వీరు సంతోషపరులుగ చేయవలెనని తలంపుతోనే యిట్లానతిచ్చిరి. లేనిచో వారు నిరుత్సాహపరులై పోవు దురు. నిరుత్సాహముగలిగిన నెట్టి ప్రజ్ఞాశాలురగు విద్యావంతులు సైత మేమియు జేయజాలరు. కావున గురువులు శిష్యుల నెప్పుడున్ను నిరుత్సా హులనుగా చేయరాదు. ఉత్సాహవంతులుగా నెల్లప్పుడు చేసేలాగున చూడవలెను. ఒక తామరపుష్పముగాని, రోజాపుష్పముగాని, మల్లె పుష్పముగాని ముకుళించియున్నప్పు డెట్లుండును? వికసించియున్నప్పుడు గల్గెడు శోభయు, సుగంధవాసనయు, కింజల్కములయొక్క ప్రకాశ మున్ను ఎట్లుండునో, ఇదియు నాలాగుననే యుండునని ఉపాధ్యాయులు, గురువులు గ్రహించవగినవి. కావుననే సేనాధిపతులు యుద్ధమునుగురించి సైన్యములను సమావేశపరచి రణరంగమునకు పంపునపుడు ఉత్సాహ పరులనుగా చేయుటకు గొప్ప ప్రబోధమును చేయుదురు. అపుడు సైన్య మునకు గలిగెడు ధైర్యము, శూరత్వము, ధీరత్వము, ఆనందము అంతింతగాదు. ధైర్యోద్రేకములు పొంగి ప్రవహించుచుండును. దీనిని గురించి శ్రీమద్రామాయణమున నొక గాథ కలదు. సుగ్రీవుండు సీతా న్వేషణకొరకు నలుదిశలకు వానరులనుబంపెను. దక్షిణమునకు వెళ్లేవారు జటాయువువలన సీతాదేవిని రావణుడు తీసుకొనివెళ్లినది యెఱింగి,

జాంబవంతుడు మొదలగువారు దక్షిణ సముద్రతీర రామేశ్వర సమీపమునగల గంధమాదన పర్వతమునచేరి, సముద్రము దాటుటకు నీ కపి సమూహములో నెవండు సమర్థుడని సమాలోచన జరుపునపుడు, అంగదుడు మొదలగు కొందరు నేను శతయోజనదూరము వెళ్ళగలననియు, ఇంకొకడు లంకలో ప్రవేశించగలననియు, తిరిగి రాజాలననియు, నీలాగున వారివారి అభిప్రాయములు చెప్పుచుండగా, జాంబవంతుడు నాయావన కాలమున నాలుగు సముద్రములలో సంధ్యవార్చుకొని ప్రతిదినము భోజనము చేయువాడను. ఇపుడు వృద్ధుడనై తిని, శక్తిహీనుడనై తిని, అంతపని చేయజాలను. అయితే మన యీ సభలో సదా ఒకడు మౌనముగా కూర్చున్నాడు. వాడే యాంజనేయుడు. అంజనాదేవీ తపఃప్రభావముచే పుట్టినవాడు. వాయుదేవుని పుత్రుడు. పుట్టినప్పుడే ఏదో యెఱ్ఱ పండని తలంచి సూర్యబింబమును చూచి ఆకసముమీదికి నెగిరినవాడు. ఇంద్రునిచే నేయాయుధము వలనను భేదింపదగనివాడని వరమును పొందినవాడు; మహాపరాక్రమము గలవాడు. అతనియందు నివురుగప్పిన నిప్పువలె మహాదివ్యశక్తి మరుగుబడియున్నది. అతడు లంకలోనికి వెళ్లుటకు, సమాచారము తెలుసుకొనుటకు, తిరిగివచ్చుటకును సమర్థతగలవాడని జాంబవంతుడు చెప్పినవెంటనే మహాసంతోషముతో నాకాశములోకెగిరి లంకలోప్రవేశించి చేయవలసిన కార్యములన్నియుచేసి తిరిగి వచ్చి సీతాదేవి వృత్తాంతమంతయూ తెలుపడమైనది. ఉత్సాహము కలుగచేసిన దానివలన కలిగిన ఫలమిట్టిది. ఆంజనేయులకు ఋషులశాప మొకటికలదు. తన మహిమనుగురించి యెవరైన చెప్పినచో నప్పుడు జ్ఞాపకమునకు వచ్చును. ఆపనిపూర్తియైన మరల మరుపుగల్గును. ఆ విషయము మన కర్మసిద్ధాన్తగ్రంధమున కనందగును. కావుననే యీ శ్లోకమున 'తేఽపిచాతితరన్త్యేవ' అని ప్రయోగించుటకు కారణమైనది. పై జెప్పినవారికన్న వీరుముందుగా తరింపగలరని శ్రీకృష్ణభగవానుడు ముముక్షువుల నుత్సాహపరచుటకు కారణమైనది. వీరికి ఇతరసందేహము లేవియుండవు. భల్లూకపట్టువలె గురువాక్యములో నొకేపట్టుదలగలిగి నిరంతర మదేనిష్ఠలో నుందురు. అన్త్యకాలమున నెట్టిభావన కల్గియుండునో యట్టిస్థితిని పొందునని కదా గీతాశయము. దానికిపూర్వ మెట్లుండినను

అది లెక్కకురాదు. ఇతరులకయినచో శాస్త్రములుచదువగా,చదువగా సందేహము లధికమగుచుండును. వారికి గీతకు శంకరభాష్య మెట్లుండును ? శ్రీరామానుజభాష్య మెట్లుండును? మధ్వభాష్య మెట్లుండును? శ్రీకంఠశివాచార్యభాష్య మెట్లుండును ? తిలక్ భాష్యమును, కర్మయోగ రహస్య మెట్లుండును ? ఇటువంటి గ్రంథములను పరిశీలించుటలోనే కాలము అధికముగా గడచిపోవును. కావుననే విద్యారణ్యస్వాములు 'శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారణం' అని ప్రయోగించుటకు కారణమైనది. కావున నీ గొడవలేమి అమ్మమ్మల కుండవు. అందువలన తదేకనిష్ఠలో నుండుటవలన వారికేలాటి సంశయముండదు.

శ్లో॥ వేదాన్తానా మనేకత్వాత్ సంశయానాం బహుత్వతః ।
వేద్యస్యాతి సూక్ష్మత్వాత్ న జానాతి గురుం వినా॥

తా॥ వేదాన్తము అనేకమార్గములుగానుండుటవలనను, సంశయములు బహువిధములుగా నుండుటవలనను, తెలిసికొనందగిన బ్రహ్మము అతిసూక్ష్మమగుటవలన గురూపదేశము లేకయే ఎవరును నెఱుంగజాలరు.

గురుకీలకము విషయమై నాలుగవ అధ్యాయములో శ్రీకృష్ణ భగవానుడు తెలిపినది చూడుడు.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥

తా॥ తత్త్వవేత్తలైన ఆత్మజ్ఞానులు మీకొరకు నాత్మజ్ఞానము నుపదేశింపగలరు. అట్టి జ్ఞాన మెట్లు గలుగుననిన, వినయముతో చేయు నమస్కారముచేతను, సమయమును కనిపెట్టి యడుగుటచేతను, గురువు యొక్కయాజ్ఞను పాలించెడు సేవచేతను వారు చెప్పగలరు. దీనియందు శిష్యలక్షణము, గురులక్షణమును నిరూపించడమైనది. ప్రణిపాతము, పరిప్రశ్న, సేవ ఈ మూడు లక్షణములు శిష్యుల కుండవలెను. 'జ్ఞానినః, తత్త్వదర్శినః' తత్త్వజ్ఞానముగల జ్ఞానులుగా నుండవలయును. ఇది గురు లక్షణము. అట్టి బ్రహ్మతత్త్వజ్ఞానోపదేశము ఆత్మజ్ఞానులగు మహాత్ములపైన శ్రీకృష్ణభగవానుడు భారమునుంచెను. మరియు పదునేనిమిదవ యధ్యాయమున జూడుడు.

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥

తా॥ ఈ యాత్మ జ్ఞానమును తపస్సులేనివానికిని, భగవద్భక్తి లేనివానికిని, గురుసేవచేయనివానికిని చెప్పందగదు. మరియు భగవన్నింద గలవానికిని చెప్పందగదు. ఇచట యోగ్యతనుగురించి నిరూపించవలసినదే కాని, జాతినిగురించిగాని, ఆశ్రమమునుగురించిగాని, స్త్రీపురుషుల గురించిగాని వ్యక్తిగతమైన భేదమేమియు తెలుపలేదు. ఇదే గీతకుగల ప్రభావము. దీనియందు తపస్సు అని యొకపదము ప్రయోగించడమైనది. దీనిని విని యెవరున్ను భయపడనవసరములేదు. భగవత్ప్రాప్తికొరకు, ఆత్మజ్ఞానముకొరకు హృదయమున తపించుటయే నిజమైన తపస్సగును. శ్రీరామకృష్ణపరమహంస, మీరాబాయిలు నిట్టితపమునే చేసిరి. అట్లుగాక, శరీరమును తపింపచేయుట ఆత్మజ్ఞానులకు, భగవద్భక్తులకు తగిన తపస్సుకాదు. అది కర్మతపస్సేగాని, జ్ఞానతపస్సు కానేరదు. ఈ యధ్యాయమున 'నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత' ఈ వాక్యము కట్టకడ కర్జునుడు చెప్పినది. ఓ శ్రీకృష్ణభగవానుడా! మీ యనుగ్రహమువలన నా మోహమంతయు నష్టమైనది. నిజమైన జ్ఞానోదయమైనది. ఈలాగున జెప్పుటవలన దైవానుగ్రహమువలననే సంసారదుఃఖములన్నియు నశించవలెననియు, నాత్మజ్ఞానప్రాప్తి కలుగవలెననియు స్పష్టమగుటలేదా?

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరం।
యోగం యోగేశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్॥

తా॥ నేను వ్యాసమహర్షియొక్క యనుగ్రహముచే నతిగోప్యమైనదియు, శ్రేష్ఠమైనదియగు ఈ యోగశాస్త్రమును శ్రీకృష్ణభగవానుడు స్వయముగా తానే యర్జుననిగురించి చెప్పుచున్న యోగీశ్వరుండగు శ్రీకృష్ణభగవానునివలన ప్రత్యక్షముగా వింటిని. ఇది సంజయునియొక్క కట్టకడపటి వాక్యము. శ్రీ వేదవ్యాసముని యనుగ్రహమువలననే వినడమైనదని చెప్పుటలో గురుభక్తిగాని, లేక అర్జునుడు చెప్పినట్లు భగవదనుగ్రహము కలవారికి ఆత్మజ్ఞానము కలుగునని అర్థమగుటలేదా? ఒక్కరికా ఆత్మజ్ఞానమందుగాని, లేక భగవద్భక్తియందుగాని యెంత

కంత కనుభవజ్ఞానము కల్గియుండునో యట్టివాని కంతకంతకు గురుదేవుని యందుగాని, పరమేశ్వరునియందుగాని భక్తివిశ్వాసములు కలిగియుండును. ఇదే దానికి గుర్తు. గురుదేవునియందుగాని, పరమేశ్వరునియందుగాని భక్తిలేనివానికి పైజెప్పిన గురుభక్తిగాని, దైవభక్తిగాని కల్గియుండదు; ఇదే దానికి నిదర్శనము.

శ్లో॥ యస్య దేవే-పరా భక్తిః యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

తా॥ పరమభక్తుడైనవాడు తన ఇష్టదైవమం దెటువంటి పరాభక్తి గలిగియుండునో, ఆలాగున నెవనికి తన గురుదేవునియందు పరాభక్తిగలిగియుండునో, అట్టివానికి మాత్రమే వేదాన్తశాస్త్రములో చెప్పబడిన యర్థము గోచరమగునుగాని, అట్టి భక్తిలేనివానికి పరమార్థతత్త్వ (ఆత్మజ్ఞాన) ముదయముకాదు అని శ్వేతాశ్వేతతారోపనిషత్.

"గురువక్త్రే స్థితం బ్రహ్మ ప్రాప్యతే తత్ప్రసాదతః"

తా॥ బ్రహ్మజ్ఞానము గురుముఖమునందే యుంటున్నది. అది గురుకృపవలననే లభించునుగాని, వేరుపాయము లేదు. అనగా గుర్వనుగ్రహమువలననే బ్రహ్మజ్ఞానము సిద్ధించును.

"శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన"

తా॥ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు శపించినను గురుదేవుడు శాపవిమోచనము చేయగల్గును. గురుశాపమును పొందినవానిని త్రిమూర్తులు సైతము రక్షింపజాలరు అని గురుగీత.

శ్లో॥ గురోర్వినా న శ్రవణం భవేత్కస్యాపి కస్యచిత్।
వినా కర్ణేన శాస్త్రస్య శ్రవణం తత్కుతో భవేత్॥

తా॥ శాస్త్రశ్రవణము జేయవలసియుండిన కర్ణము లేనిదే తక్కిన జిహ్వా, ఘ్రాణ, నేత్రాదులచే నెట్లు సాధ్యముకాదో, తక్కిన యింద్రియములు సమృద్ధిగాయుండినను, కర్ణేంద్రియము లేనిచో శాస్త్రజ్ఞానము పొందజాలడో, ఆలాగున ననేకధర్మములు చేసినవాడై అనేకోపాసనలు చేసినవాడైనను, బ్రహ్మజ్ఞానము కలుగవలసి యుండిన తప్పక గురువు కావలయును.

శ్లో॥ చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యస్స్మరేత్।
హస్తస్థ ముదకం త్యక్త్వా ఘనస్థమభివాంఛతి॥

తా॥ నేత్రమునకు కానుపించు గురుదేవుని త్యజించి, నేత్రమున కగోచరమగు జ్ఞానమును సంపాదింపతలంచువాడు, చేతిలోగలజలపాత్ర మును త్యజించి మేఘములోగల జలమును పానముచేయ యత్నించు వానివలె నుండును.

శ్లో॥ సులభస్తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే।
లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతే క్షితౌ॥

తా॥ కన్నులకు ప్రత్యక్షముగా కన్పించెడు జ్ఞానోపదేష్టయగు గురుదేవుని యాశ్రయించి జ్ఞానమునుపొందక, శాస్త్రమందు చెప్పబడిన ఉపాసనద్వారాగాని, లేక శాస్త్రములో తెలుపబడిన జ్ఞానముగాని దృష్టికి గోచరించునదికాదు. కావున సులభమైన మార్గమును పొందక దుర్లభమైన పైజెప్పిన స్వయంశాస్త్రవిచారణ లేక దైవోపాసనవల్ల జ్ఞానము పొందదలంచువాడు, స్వకీయ ధనరాశిని వదలిపెట్టి, రత్నగర్భ యను పేరుగల్గిన భూమినిత్రవ్వి నిక్షేపమును సంపాదించుకొనుటకు యత్నించెడు మూఢునివలె యుండును. వినుటకు కర్ణముతప్ప తక్కిన నేత్రజిహ్వాఘ్రాణము లెట్లుపయోగపడవో, అలాగున బ్రహ్మవేత్తలగు మహనీయుల బోధవలననే, ఉపదేశమువలననే కలుగవలసినదేగాని మరి దేనివలనను కలుగదు.

శ్లో॥ అత్యల్పోఽపి యథా దీపస్సు మహాన్నాశయేత్తమః।
జ్ఞానాభ్యాస్తథాఽల్పోపి మహత్పాపం వ్యపోహతి॥

తా॥ ఏలాగున దీపము చిన్నదైనను గృహాంతరాళములో గల గొప్పదగు చీకటినినశింపచేయుచున్నదో ఆలాగున జ్ఞానాభ్యాసము కొంచ మైనను మహత్తైన పాపసంఘమును నశింప జేయుచున్నది. చుక్కానిలేని పడవ యేవిధమున గమ్యస్థానము చేరక, ప్రవాహవేగమునో వాయు వేగమునో అనుసరించి పోవుటవలన కట్టకడపట సముద్రములో పడి నశించుచుండునో, అవ్విధముననే గురుదేవుడు లేనివాని గతియు నతని సంస్కారము వాసన ననుసరించి పయనించుటవలన లక్ష్యమగు ముక్తిని

చేరక, వాసనాసంస్కారము ననుసరించి సంసారసాగరములో పడిపోవును. చుక్కానివాడుండిన పడవ నపాయములోనికి పోనీయక గమ్యస్థానము చేర్చునట్లు, గురుదేవుడు సంస్కారముచే వాసనా చెడుమార్గములోనికి పోనియక శ్రేయమగు గమ్యస్థానమునకు చేర్చును. ఇదే గురుదేవుడు గల్గినదానికి గురుతు.

శ్లో॥ కర్ణధారం గురుం ప్రాప్య తద్వాక్యం ప్లవవద్దృఢం।
సంసారసాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి॥

(శ్రీ) శంకరభగవత్పాదులు గుర్వష్టకమున చెప్పినది జూడుడు.

శ్లో॥ షడంగాదివేదో ముఖే శాస్త్రవిద్యా
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥

తా॥ ఎవని మనస్సు గురుచరణారవిందమునందు లగ్నము గాక నుండునో వానియొక్క ముఖమునందు నాలుగు వేదములున్ను ఆరు శాస్త్రములున్ను గద్యపద్యాది కవిత్వరచనలున్ను గలిగియుండినను, వీటిచే పరలోకమున ఏమిప్రయోజనము, ఏమిలాభము, ఏమిసిద్ధించును, ఏమిపొందగల్గును? అనగా ఏమియు ప్రయోజనము లేదని సారము.

---

ఓమ్

# భగవద్గీత

(పునాదిపాడు గీతామందిరమునకు పంపిన సందేశము)

ఇదివరలో గీతాప్రచారముగాని, ఆధ్యాత్మిక జ్ఞానప్రచారము గాని చేయుటలో రంగారావుగారికి ప్రీతి ఉండెడిదిగాదు. ధ్యానమందే అనుష్ఠానమునందే ప్రీతి గలిగి యుండెను. నిజముగా ఆలోచించిన ప్రచారములోను, ప్రబోధములోను అంత సత్తాలేదు. అను ష్ఠానములోనే, ధ్యానములోనే మహిమయంతయు అణగిఉంటున్నది. అయితే ఎంతసుగంధ, సుందరపుష్పమైనను వికసించనంతవరకేముకుళించి యుండునుగాని, వికాసము పొందునప్పుడు దానియొక్క సౌందర్య

మును, పరిమళమును స్వయముగా ప్రకృతియే వ్యాపింపజేయును. అప్పుడు యెవ్వరున్ను దానిని గుప్తముగా నుంచజాలరు. పుష్పము వికసించి, మధువుద్భవించినప్పుడు భ్రమరములను పిలువనక్కరలేదు. అవియే గుంపులు గుంపులుగా పరుగెత్తివచ్చి పుష్పముపైని వ్రాలుచుండును. ఆలాగున సాధనచే హృదయము వికసించినప్పుడు, భక్తిరసము ఆవిర్భవించినప్పుడు, జ్ఞానామృత ముద్భవించినప్పుడు యెవ్వరిని పిలువకనే ముముక్షువులు, జిజ్ఞాసువులు, భక్తులగు తుమ్మెదలు గుంపులు గుంపులుగా అట్టి హృదయమును ఆశ్రయించుచుండును. ఈవిషయమై కృష్ణాతీర చాతుర్మాస్యవ్రతమున రంగారావుగారిని దైవవిషయమై కొద్ది ఉపన్యాసముచేయవలెనని జిజ్ఞాసువులుకోరగా కండ్లుమూసుకొని క్రిందికి చూచుచు కొన్ని జ్ఞానవాక్యములు అమోఘములైనవివచించిరి. అప్పుడు కొందరు యీ ఉపాధిని, "మీరు నేత్రములు మూసుకొని, క్రిందికి చూచుకొని చెప్పుటకు కారణమేమి" అని అడిగిరి. సింహశిశువులు మొదట కండ్లుమూసికొనియేయుండును. కొంతకాలమునకునయనములు తెరువగలవు. గంభీరగర్జనమును చేయగలుగును అని యీ ఉపాధి తెలిపినట్లు జ్ఞాపకము. అట్టిఅవస్థ రంగారావుగారికి ఇప్పుడు ఆరంభమగుట చేతనే గీతాజయంతి మొదలగు ప్రబోధకార్యములు చేయుటకు కారణమని తలంచెద. ఇది యింతేచాలును.

భగవద్గీత సమస్తపాపములను పోగొట్టి మానవులను పావనులుగా నొనర్చునదైనను ప్రపంచములో విశేషముగా వ్యాపకము కలుగక పోవుటకు రెండు కారణములుగలవు. వానిలో (1) శుద్ధాత్ములు, శ్రేష్ఠమగు ఆచారముగలవారుమాత్రమే చదువవలెననియు, స్త్రీలున్ను, బ్రాహ్మణేతరులున్ను పఠన, పాఠనములొనర్చకూడదనియు ఒక వాదము పూర్వముండెడిది. అది మహాత్మగాంధీగారి అవతారమువల్ల కాలగర్భములో లీనమైపోయినది. దానిని గురించియు ఇంతమాత్రము చెప్పినచాలును. రెండవది మరియొకటిగలదు. అదేమన ఉపనిషత్తులలోను గీతాదిస్మృతులలోను గూఢము, గుప్తము, గుహ్యము, రహస్యము అను యీనాటి పదములు కొన్ని కలవు. వానియొక్క నిజార్థమును లోతులో దిగి ఆలోచింపక పోవుటవల్ల, గుప్తముగాను, గోప్యముగానుఉంచవలసినది

అను అర్థమును చెప్పుటవల్ల ఆధ్యాత్మికజ్ఞానము మరింత పతనమగుటకు కారణమైనది. లోతులో విచారించిచూచిన ఈ బ్రహ్మవిద్య గుప్తముగా, రహస్యముగా ఉంటున్నదని అర్థమేగాని మరియొకవిధముగా కాదని విశాలహృదయులకున్ను, విశుద్ధాంతఃకరణులకున్ను స్పష్టముగా అర్థమగును. ఇక దీనినిగురించి యెక్కువ చెప్పదలంచలేదు. మరియు భారతదేశమున శ్రీ బౌద్ధయుగమునకు యీవల సంఘసంస్కరణము, ఆత్మసంస్కరణము యెక్కువ జరుగలేదు. పాపులను చూడకూడదు, ముట్టకూడదు; వారికి పాపవిముక్తికరమగు జ్ఞానమును ఉపదేశింపకూడదు, చెప్పకూడదు అని గల-అంధవిశ్వాసము ప్రబలమైనందుచే పాపులను పవిత్రులనుగా నొనర్చెడు జ్ఞానమును, గీతాదిశాస్త్రములను అట్టివారికి ఉపదేశించి పావనులనుగా చేయకపోవుటయును బ్రహ్మవిద్య వ్యాపింపకపోవుటకు ఒక ప్రబలకారణమైనది. పాపులు యెట్లు పవిత్రులగుదురో, ఆ మార్గమును ఆలోచింపకపోవుటయు ఒక హేతువయ్యెను. ఈ పాపపిశాచమును హోమమొనర్చుటకు, భస్మీభూతముచేయుటకు గాంధీగారు అవతరించిరి. ఇదియు యింతవరకే చెప్పతలంచడమైనది. గీతయందు తృతీయకాండమగు జ్ఞానమును ప్రారంభించిన త్రయోదశాధ్యాయమునం యీ శ్లోకము కలదు. ఇది గీతకు ప్రాణమువంటిది.

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ॥

తా॥ శ్రీ కృష్ణభగవానుడు యీశరీరమును క్షేత్రముగా వర్ణించిరేగాని పశువులను గొఱ్ఱెలను గురించిన శాలగా వర్ణన చేయలేదు. క్షేత్రము అని చెప్పుటచేత క్షేత్రములో ఉండేవాడు దేవుడుగాక మరి యెవరగును? దేవాలయమని చెప్పినచో దానియందుండువాడు దేవుడుగాని మరియొకడు కాదని ఏలయర్థము చేయకూడదు? ఇల్లుఅని చెప్పినచో దానిలో ఉండువారు మనుష్యులనియు, శాల అని చెప్పినచో, లేక కొట్టము అనిచెప్పినచో దానిలో పశువులుగాని, గొఱ్ఱెలుగాని ఉండునని తెలియనివారుయెవరుగలరు? "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు

భారత” సర్వక్షేత్రములలో ఉండు ఆత్మను “మాం విద్ధి” నన్నుగా అనగా సర్వేశ్వరునిగా, పరమాత్మునిగా, పరబ్రహ్మముగా నెరుంగుము అని చేసిన ఉపదేశమునకన్న వేదాంతసారము మరియొకటిలేదు. ఇది తత్త్వమసి మహావాక్యముయొక్క లక్ష్యార్థమగును. మీరందరున్ను గ్రహించుకొనవలసిన పరమ సత్యమిది ఒకటియే. అప్పుడే మానవజన్మ మెత్తినదానికయ్యొ ఫలితమును మీరు పొందగలరు. ఒకడు ఉత్తమ జాతిలో, ఉన్నతకుటుంబములో, రూపలావణ్యము కలిగి మంచి విద్యావంతుడైయుండెను. అతడు శిల్పశాస్త్రజ్ఞులను రప్పించి సుందరమైన ఒక దేవాలయమును కట్టించెను. అయ్యో పాపము! ప్రతిష్ఠచేయుటకు ముందుగా దివంగతుడయ్యెను. వ్యయప్రయాసములతో నిర్మించిన దేవాలయముయొక్క ఫలితము ప్రతిష్ఠచేయకపోవుటవల్ల ఎట్లుపొందకపోయెనో, ఆలాగున స్త్రీ, పురుషులగు మీరందరున్ను పూర్వపుణ్యవశమున ఉత్కృష్టజాతిలో శ్రీమంతులకుటుంబములో సర్వాంగసౌష్ఠవము కలిగి విద్యావంతులై ఉంటున్నారు. అయితే శ్రీకృష్ణభగవానుడుపదేశించినట్లు శరీరమైన క్షేత్రములో సర్వేశ్వరుని, పరమాత్మజ్ఞానమును, బ్రహ్మసాక్షాత్కార స్వరూపమును ప్రతిష్ఠించినారా? లేదా? ఇది ఒకటి మాత్రము యోచించుకొనుడు. ఓటికుండలోగల నీరు ఒక్కొక్కబొట్టు కారిపోయి నశించునట్లు శరీరమగు ఘటములోనుండి ఒక్కొక్కశ్వాసము బహిర్గతమగునప్పుడు ఆయువుకూడ క్షణక్షణము నశించిపోవుచున్నదని జ్ఞప్తిలోనుంచి దే వా ల య ప్ర తి ష్ఠ కు జాగ్రతపడుడు. తొమ్మిదవ అధ్యాయమున —

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిమ్ ॥

తా॥ పాపయోనిలో అనగా పాపవృత్తిగల కులములో జన్మించిన వారెవరుకలరో వారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను, వెయ్యేల, సమస్త మానవులున్ను యీ భగవద్గీత పారాయణముచేసి పవిత్రులై సర్వోత్కృష్టమైన మోక్షమును, భగవంతుని, పరబ్రహ్మమును పొందుచున్నారని శ్రీకృష్ణభగవాను డుపదేశించియుండగా మరల గీతాపారాయణముచేసి తరించుటలో ఏల కాలవిలంబనమును చేయు

చున్నారు ? మరియు యీ యధ్యాయముననే శ్రీ భగవానుడు తెలిపినది చూడుడు——

శ్లో॥ అపి చేత్సు దురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥
క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి।
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥

తా॥ మిక్కిలి దురాచారములతో కూడినవాడైనను, భగవద్గీత పారాయణముచేసి, భగవదాజ్ఞానుసారముగా ప్రవర్తించినచో వానిని పరమపవిత్రునిగాను, పరమసాధువుగాను భావన చేయవలెననియు, అతి శీఘ్రములోనే అతడు ధర్మాత్ముడగుననియు, అతిత్వరలోనే శుద్ధాత్ముడై పరమశాన్తిని అనగా ప్రకృతి శమించిన పరమపదమును పొందుననియు భగవానుడు తెలిపెను. అంతేకాదు, ఓ కౌంతేయా! నాభక్తుడు ఎంత పాపాత్ముడైనను త్వరలోనే పవిత్రాత్ముడై నన్ను పొందగలడనియు రెండు చేతులు పైకెత్తి మహాసభలో నన్ను ఆనపెట్టి ఉచ్చస్వరముతో చెప్పుమా! అని గల భగవద్వాక్యము ఎంత కరుణతో కూడినదో జ్ఞాపకములో నుంచుకొనుడు. నాయకులారా! పుణ్యాత్ములారా! ఈ సంబోధన చాలదు. ఇది సామాన్యమైనది. దైవాత్మస్వరూపులారా! అని చేసెడు సంబోధనయే నిజమైనది. ఊర్ధ్వలోకములు ఏడింటికిన్ని అధోలోకములు ఏడింటికిన్ని మధ్య యీ మానవలోకము గలదు. జీవులగు మీరు జాతి, కులము, వర్ణము, ఆశ్రమము, దేశము, స్త్రీ, పురుషాదులతో కూడినవారని, దాని ననుసరించిన కార్యములనే చేయవలయునని యెవరు మీకు తెలుపుదురో, లేక యెవరు తలంతురో, వారు మిమ్ములను అతల, సుతల పాతాళలోకములకు తీసుకొనివెళ్ళి పశువులనుగా నొనర్పగలవారని దృఢముగా నమ్ముడు. జీవులగు మీరు ఈశ్వరాంశస్వరూపులు, లేక ఈశ్వరస్వరూపులు, లేక దైవస్వరూపులు అని ఉపదేశించువారు మిమ్ములను భూలోక, భువర్లోక, సత్యలోకములగు ఏడులోకములను దాటించిన శివస్వరూపులనుగా మార్చెడు కరుణాస్వరూపులని నమ్ముడు. ఇది మీపైగల అపారదయతో చెప్పినవాక్యమే గాని మరియొకటిగాదని నిశ్చయముగా నమ్ముడు. అనగా సంచితకర్మము

నకున్ను ప్రారబ్ధకర్మమునకున్ను ఒకవేళ మీరు వశ్యులై యుండవలసి యుండినను, ఆగామికర్మ మీహస్తగతముగా, మీస్వాధీనము గలిగి యుండునని మరువకుడు. అనగా మీరు భావికాలమున జీవులుగాను, పశువులుగాను, శివస్వరూపులుగాను, మార్పుచెందవలసిన కార్యములలో, స్వతంత్రులై యుంటున్నారు. అది మీహస్తగతము. గీతయంతయు బోధించిన తరువాత కట్టకడకు శ్రీకృష్ణభగవానుడు దీనినే చెప్పెను. 'యథేచ్ఛసి తథా కురు' నీ యిష్టమెట్లో అట్లుచేయుము. ఈ ఉపాధి యున్న ఇదే మీకు ఈ శుభదినమున చెప్పడమైనది. ఇంకొకవిషయము సంగ్రహముగా చెప్పి యీ సందేశమును పూర్తిచేయతలంచడమైనది.

శ్లో॥ సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః॥

తా॥ సముద్రమును దాటువారికి ఓడ యెటువంటిదో అట్లే జననమరణాది దుఃఖములతో కూడిన సంసారసాగరమును తరింప తలంపు గలవారికి భగవద్గీత యను నావను శ్రీకృష్ణపరమాత్ముడు సృష్టించి యున్నాడు. టికెట్టుకలవారు ఏజాతివారైనను, ఏమతమువారైనను, ఆశ్రమమువారైనను, స్త్రీలైనను, పురుషులైనను ఏలాగున స్టీమరులో ప్రయాణముచేసి గమ్యస్థానమును చేరవచ్చునో ఆలాగున భగవద్గీతను ఆశ్రయించువారందరున్ను సంసారసముద్రమును దాటి ముక్తిపారమగు భగవంతుని, పరమేశ్వరుని, పరమాత్మను, పరబ్రహ్మమును, మోక్షమును పొందగలరు.

ఓం అసతో మా సద్గమయ ఓం తమసో మా జ్యోతిర్గమయ
ఓం మృత్యోర్మామమృతం గమయ.

---

ఓమ్

# గురుదేవుని లేక భగవంతుని అనుగ్రహము లేనిచో జీవుడు తరింపజాలడు

గీత — అ. 18 సంజయుడు చెప్పినది.

శ్లో॥ వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేతద్గుహ్యాతమం పరం।
యోగం యోగీశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్॥

తా॥ నేను వ్యాసమహర్షి యొక్క అనుగ్రహమువల్ల అతి గోప్యమైనదియు, శ్రేష్ఠమైనదియు నగు యీ యోగశాస్త్రమును అర్జునునకు స్వయముగా చెప్పుచున్న శ్రీ కృష్ణభగవానునివలన వింటిని. అ. 18 అర్జునుడు చెప్పినది—

శ్లో॥ నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ॥

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! నీ యనుగ్రహము వలన నాచేత జ్ఞానము పొందబడినది. అజ్ఞానము వీడిపోయినది. సంశయరహితుడనై సుస్థిరుడనై యుంటున్నాను. నీయొక్క ఆజ్ఞను పాలించెదను.

వి॥ సంజయుడు "వ్యాసప్రసాదాత్" అనియు, అర్జునుడు "త్వత్ప్రసాదాత్" అని చెప్పుటవల్లనే గురుదేవుని లేక సర్వేశ్వరుని అనుగ్రహముతప్ప జీవుడు తరింప జాలడని మరల చెప్పవలెనా! అ.11

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుసా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥

తా॥ శ్రీ భగవంతుడు చెప్పినది. ఓ యర్జునా! నీయొక్క ప్రాకృతమైన యీనేత్రములచేత విశ్వరూపధరుడనగు నన్ను చూచుటకు శక్తుడవుగావు. కావున అప్రాకృతమైన దివ్యనేత్రమును యిచ్చుచున్నాను. ఈ దివ్య నేత్రముచేత నాయొక్క యోగమహిమను, ఈశ్వరశక్తిని చూడుము.

వి॥ దివ్యమనగా దైవసంబంధమైనదని అర్థము. అనగా జ్ఞాననేత్రము అని గ్రహించేది. పంచభూతాత్మకమగు యీ నేత్రము పాంచభౌతిక వస్తువును మాత్రమే చూడగలుగును. అప్రాకృతమగు దైవ

మును, ఆత్మను చూడవలసియుండిన దివ్యదృష్టికాక జ్ఞానదృష్టి గలుగవలసి యుండును. ఈ కారణమువల్లనే దేవుడు లేక ఆత్మ వుండిన యేల కనిపించుటలేదని ప్రశ్నలు గలుగుటకు కారణము. ఈ నేత్రమును నేత్రధర్మమును యే యాత్మ తెలుసుకొనుచున్నదో అదే దివ్యదృష్టియని గ్రహించుకొనవలయును. అది దైవానుగ్రహమువల్ల లేక మహాత్ముడగు గురుదేవుని కృపవల్లనే జీవులకు కలుగవలసి యుండును. ఒకవేళ యీ జన్మములో అట్టి దైవోపాసనగాని గురుసేవగాని లేకనే ఒకానొక దివ్యపురుషునికి దైవజ్ఞానము కలిగి వుండినచో అది పూర్వజన్మసంస్కారమని గ్రహించదగినది. అందువల్ల యీజన్మములో గురుదైవముల అనుగ్రహము పొందక పోయినను పూర్వజన్మములో అట్టి గురుదైవముల అనుగ్రహము గలిగినవాడనియే మనము గ్రహించుకొనవలయును. కావుననే అ. 6

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైన హ్రియతే హ్యావశోఽపి సః ॥

తా॥ యోగభ్రష్టుడైనవాడు అట్టి కోరతబడిన ముందటిజన్మమునందు చేయబడిన అభ్యాసవాసనావశముచేతనే ఆకర్షింపబడుచున్నాడు. దీనికన్న పరము ప్రమాణము మరియేమి కావలయును? అ. 2

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! కృపణత్వమువలన గలిగిన దోషముచేత కొట్టబడిన గుణముగలవాడను గనుక యుక్తాయుక్త పరిజ్ఞానములేనివాడనై నిన్ను అడుగు చున్నాను. ఏది శ్రేయస్కరమగునని నీచేత నిశ్చయింప బడుచున్నదో దానిని నాకుచెప్పుము. నేను నీకు శిష్యుడను. ఆ కారణమువలన నిన్ను శరణుబొందిన నన్ను శాసింపుము.

వి॥ కృపణత్వమనగా ప్రాకృతగుణముకలవాడు (జ్ఞానహీనుడు) "శాధి" (శాసింపుము) అని ప్రయోగించుటవల్ల గురుదేవుడు శిష్యునికి యేలాగున ధర్మోపదేశము (జ్ఞానోపదేశము) చేయునో, ఆలాగున చేసేలాగున అర్జునుడు భగవానుని ప్రార్థించెను.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥

తా॥ తత్త్వవేత్తలైన ఆత్మజ్ఞానులు మీకొరకు జ్ఞానము నుప దేశింపగలరు. అట్టి జ్ఞానము యెట్లు గలుగుననిన, వినయముతో చేయు నమస్కారముచేతను, సమయమును కనిపెట్టి అడుగుటచేతను, గుర్వాజ్ఞను పాలించుటచేతను వారు చెప్పగలరు.

వి॥ శ్రీ భగవానుడు చెప్పిన యీ వాక్యములో యెంతో అర్థము గలదు. అదే ప్రకారము గురుగీతలో తెలిపినది చూడుడు.

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

తా॥ అజ్ఞానమగు తిమిరవ్యాధిచేత గ్రుడ్డివానియొక్క నేత్రమును, జ్ఞానాంజనమను శలాకచే తెరువబడునట్లు చేసిన శ్రీ గురుదేవునికి నమస్కారము.

వి॥ ఇట్లు చెప్పుటవల్ల గురుదేవుని కృపగాని, ఈశ్వరానుగ్రహముగాని వుండ వలయునని తప్పనిసరిగా పుణ్యాత్ములు గ్రహించుకొనవలయును. నేత్రరోగముచే అంధత్వము గలిగినవారకి యేలాగున నేత్రవైద్యులు శస్త్రచికిత్సచేసి కన్ను కనబడేలాగున చేయుచున్నారో యిదిన్నీ అటువంటిదని పరమభక్తులు గ్రహింతురుగాక !

శ్లో॥ భవారణ్యప్రవిష్టస్య దిఙ్మోహభ్రాంతచేతసః ।
యేన సందర్శితః పంథా తస్మై శ్రీ గురవేనమః॥

తా॥ అజ్ఞానమగు కారడవియందు దిగ్భ్రమచే మోహమునొంది మార్గము తెలియని వానికి యెవనివల్ల మార్గము చక్కగా చూపబడుచున్నదో అట్టి శ్రీ గురుదేవునికొరకు నమస్కారము.

వి॥ గీతయందు అర్జునుడు శ్రీకృష్ణపరమాత్ముని ప్రార్థించిన ప్రకారమే గురుగీత యందును తెలుపడమైనది. మహారణ్యమునందుగాని, సముద్రమునందుగాని, గొప్ప పట్టణమందుగాని, పెద్ద రైలు జంక్షను నందుగాని, ఎడారిలోగాని కొందరికి ఉత్తర దక్షిణ తూర్పు పడమర దిక్కులు తెలియవు. తెలిసినవారివల్ల దిక్కు తెలుసుకొని

వెళ్ళవలసియున్నట్లు యీ సంసారారణ్యములో మోక్షమార్గము తెలియక భ్రమ నొందిన జీవికి జ్ఞానమార్గమును చూపెడు గురుదేవుడు తప్పనిసరిగా వుండవలయును. లేనిచో తూర్పు దిక్కుకు వెళ్ళవలసిన వాడు దిగ్భ్రమచే పడమర దిక్కును గూర్చి నడచినవాని దుర్గతివలెనే సంభవించును. ఇక యీ విషయమై విస్తారముగా తెలుపపనిలేదు.

శ్లో॥ తేషా మేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ గీత అ.10

తా॥ ఎల్లప్పుడు ధ్యానముచేయు భక్తులను అనుగ్రహించుట కొరకు వారి అంతఃకరణమందున్నవాడనై, వారి అజ్ఞానజన్యమైన మోహాంధకారమును వెలుగుచున్న జ్ఞానమనెడు దీపముచేత పోగొట్టుచున్నాను.

వి॥ భక్తియోగముచే కలిగెడు ప్రయోజనమెట్టిదో యీ శ్లోకమున శ్రీ భగవానుడు తెలుపడమైనది.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే॥

తా॥ భగవంతుడనగు నాయందు యెల్లప్పుడు ఏకాగ్రచిత్తులైన వారును, ప్రీతిపూర్వకముగా నన్ను భజించువారునైన నిరంతర ధ్యానపరులకు పరమేశ్వరుడనగు నన్నుపొందుటకు యే జ్ఞానము కలుగవలెనో అట్టిదానిని నేను కలిగించుచున్నాను.

వి॥ "దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే" అని ప్రయోగించుటవల్ల అట్టి పరమభక్తులు యే జ్ఞానముచేత నన్ను పొందవలయునో అట్టి జ్ఞానమును నేనే కలుగచేయుచున్నానని భగవంతుడు చెప్పిన వాక్యములో నమ్మకము కలిగియుండువారిని తప్పక తరింపచేయగలుగును. అ 12

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥

తా॥ నాయందు చేర్చబడిన చిత్తము గలవారలను నేను శీఘ్రముగా జనన మరణ కారణమగు సంసారసాగరమునుండి వుద్ధరించుచున్నాను.

వి॥ ఇట్టి భగవానునికి భక్తులపైగల వాత్సల్యమును గురించి చెప్పినవాక్యములో విశ్వాసముగలవారిని తప్పక తరింపచేయును. నైమిశారణ్యములో శౌనకాదిమహర్షులకు పురాణములు చెప్ప ప్రారంభించినప్పుడు శ్రీ సూతమహర్షి చెప్పినవాక్యమును వినుడు.

శ్లో॥ తస్మాద్భూయః ప్రవక్ష్యామి మునయశ్శృణుతాదరాత్।
రోమహర్షణనామ్నశ్చ శిష్యతాయశ్చ మద్గురోః।
నారాయణాంశతాయాశ్చ సదృశం ప్రబ్రవీమి వః॥

తా॥ కావున ఓ మునులారా! ఆదరముతో నేనుచెప్పిన వాక్యమును వినుడు. మా తండ్రియగు రోమహర్షణునికి శిష్యుడనైనందుచేతను, నారాయణాంశ సంభూతుడగు శ్రీ వేదవ్యాస మహాముని అనుగ్రహము కలవాడనైనందుచేతను, అందుకు తగినట్లు మీారడిగినదంతయు చక్కగా చెప్పగలను.

జనులారా! సూతమహామునియొక్క పితృభక్తియు, గురుభక్తియు చూచితిరా! ఇప్పుడు నారదభక్తిసూత్రమునందు దేవర్షియగు శ్రీ నారదుడు చెప్పినది చూడుడు.

సూ॥ తస్మిన్ అనన్యతా తద్విరోధిషూదాసీనతా చ॥

తా॥ ఆ భగవంతునియందు అనన్యభక్తి గలిగియు, ఆభక్తికి విరోధములైన కార్యములయందు సంబంధములేక సాక్షివలెనుండుట పరమభక్తుల కర్తవ్యము.

సూ॥ ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశాద్వా॥

తా॥ ఈదైవభక్తి (ఆత్మజ్ఞానము) గలుగుటకు మహాత్ములయొక్క కృపయు లేక భగవత్కరుణాలేశమున్ను ముఖ్యకారణము.

సూ॥ లభ్యతేఽపి తత్కృపయైవ॥

తా॥ మహాత్ముల సహవాసము ఆ భగవంతుని యనుగ్రహము వల్లనే లభించును.

సూ॥ యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవత్యమృతో భవతి తృప్తో భవతి॥

తా॥ జీవుడు భగవద్భక్తిని పొంది (ఆత్మజ్ఞానమును పొంది) సిద్ధుడున్నూ, అమృతస్వరూపుడున్నూ, సంపూర్ణతృప్తుడున్ను అగుచున్నాడు.

శ్రీ దత్తాత్రేయ మహర్షి అవధూతగీతయందు మొట్టమొదట చెప్పిన శ్లోకము చూడుడు.

శ్లో॥ ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।
మహాభయపరిత్రాణా ద్విప్రాణాముపజాయతే॥

తా॥ జననమరణ మహాభయమునుండి రక్షించెడు ఈశ్వరానుగ్రహమువల్లనే రక్షణములేని జీవులకు జ్ఞానము గలిగెడు వేదాంతమున చెప్పబడిన అద్వైతవాసన వుదయించును.

శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమందు శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవున కుపదేశించినది చూడుడు.

శ్లో॥ న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ ।
న స్వాధ్యాయ స్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా॥

తా॥ ఓ యుద్ధవా! నన్ను పొందుటకు భక్తికి సమానమైనశక్తి యోగమునందుగాని, సాంఖ్యమునందుగాని, ధర్మమునందుగాని, వేదాధ్యయనమునందుగాని, తపస్సునందుగాని, త్యాగమునందుగాని లేదు.

శ్లో॥ ఈశ్వరానుగ్రహాచ్ఛాంతి దాన్త్యాది గుణసంయుతం।
జన్మ చేల్లభ్యతే తస్మిన్ విద్యయా మోక్షమాప్నుయాత్॥

తా॥ ఈశ్వరానుగ్రహమువల్లనే జీవునికి శమదమాదులతో గూడిన జన్మ లభించును. అట్టి శాన్తిదాంత్యాది దైవగుణములుగల జన్మమందే జ్ఞానము గలుగును. జ్ఞానమువల్లనే జీవన్ముక్తి (మోక్షము) సిద్ధించును.

శ్రీశంకరభగవత్పాదులు సర్వవేదాన్తసారసంగ్రహమున తెలిపినది చూడుడు.

శ్లో॥ శ్రుత్వా తత్త్వమసీత్యేవం బోధ్యమానోప్యనేకధా।
న విజానాత్యయం తత్త్వ మీశానుగ్రహవర్జితః॥

తా॥ 'తత్త్వమసి' యను మహావాక్యమును యనేకసారులు మహాత్ముడగు గురువువల్ల శ్రవణముచేసినను, అనేక యుక్త్యనుభవముల చేత యనేకవిధములుగా స్వయముగా శోధించినను, ఈశ్వరానుగ్రహము లేనివారికి జీవేశ్వరుల యేకత్వమగు అద్వైతతత్త్వము బోధపడజాలదు.

ఉపనిషద్వాక్యమును వినుడు — ముండకోపనిషత్తు.

మూ॥ నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన। యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్॥

తా॥ ఈ యాత్మ వేదవేదాన్త విశేషప్రవచనములవల్ల లభించునదిగాదు. ప్రాపంచిక విషయబుద్ధి బలముచేతనూ లభించునదిగాదు. అనేకవిధములగు శాస్త్రశ్రవణములచేతను లభించునదిగాదు. పరమాత్మను ఏ జీవుడు వరించునో (ఆశ్రయించునో) అట్టి జీవునిచేత లభింపబడును. శ్రీపతంజలి మహాముని యోగశాస్త్రములో చెప్పినది చూడుడు.

సూ॥ ఈశ్వరప్రణిధానాద్వా॥

తా॥ ఈశ్వరప్రణిధానము అనగా పరమేశ్వరునియందు సర్వము సమర్పించిన అనన్య భక్తిగల వానికి మోక్షము త్వరలో సిద్ధించును.

సూ॥ సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్॥

తా॥ సర్వకర్మలను భగవంతునకు సమర్పించిన, లేక భక్తి విశేషము అను ప్రణిధానమును దృఢముగ అలవరచుకొనిన యోగికి సమాధిసిద్ధి (బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము) త్వరలో సిద్ధించును.

శ్లో॥ యస్య దేవే పరా భక్తి రథ్యా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

తా॥ పరమభక్తుడగువానికి తన యిష్టదైవమందు యెట్టి గాఢతమ మగు భక్తి యుండునో ఆలాగున గురుదేవునియందు దృఢమగు భక్తిగల మహాత్మునికి మాత్రమే యీ బ్రహ్మతత్త్వము బోధపడును. అనగా గురుదేవుని యందుగాని యీశ్వరుని యందుగాని భక్తి విశ్వాసము గలవారికి మాత్రమే యీ బ్రహ్మతత్త్వము బోధపడును.

శ్లో॥ యేన నారాధితో దేవో యస్య నో గుర్వనుగ్రహః।
న వశ్యం హృదయం యస్య తస్య శాన్తి ర్నసిధ్యతి॥

తా॥ ఎవడైతే పరమేశ్వరుని భక్తితో నారాధింపలేదో, యెవని కైతే గురుదేవుని అనుగ్రహము గలుగలేదో, యెవని మనస్సు స్వాధీనముగా లేదో ఆతనికి ఉపరతియు ఆత్మశాన్తియు గలుగదు.

శ్లో॥ వేదాన్తానామనేకత్వా త్సంశయానాం బహుత్వతః ।
వేద్యస్యాప్యతిసూక్ష్మత్వా న్నజానాతి గురుం వినా॥

తా॥ వేదాన్తశాస్త్ర మనేక ముఖములతో గూడినదగుట చేతను, శిష్యులనేక విధములగు సంశయములు గలవారగుటచేతను, తెలియదగిన బ్రహ్మవస్తువు అతి సూక్ష్మమగుటచేతను, గురుదేవుని కరుణ లేనివారు దానిని తెలిసికొనజాలరు. అని అనుభూతి ప్రకాశము.

శ్లో॥ తం త్యక్త్వా తాదృశం దేవం యస్సేవ్యేతాన్యదేవతాం।
స హి భాగీరథీం త్యక్త్వా కాంక్షతే మృగతృష్ణికామ్॥

తా॥ ఎవడైతే సాధనానుష్ఠానపరుడై ఆత్మ సాక్షాత్కారము గల గురుదేవుని విడనాడి యితరదేవతలను సేవించుచు తిరుగుచున్నాడో, అట్టివాడు గంగాతీరమందుండి ఆ పావన జలములను పానముజేసి సుఖింపక యెండమావులను జూచి అది మంచి జలప్రవాహమను భ్రాంతి కలిగి పరుగెత్తువానివలె వుంటున్నాడు.

శ్లో॥ చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యః స్మరేత్।
హస్తస్థ ముదకం త్యక్త్వా ఘనస్థ మభివాంఛతి॥

తా॥ దృష్టికి సాక్షాత్తుగా గనుపించెడు గురుదేవుని త్యజించి నేత్రమునకగోచరమగు శాస్త్రముచు చదివి జ్ఞానమును సంపాదింప తలంచువాడు చేతిలోగల జలపాత్రమును విడిచి మేఘములోగల జలమును పానము చేయుటకు యత్నించువానివలె నుండును.

శ్లో॥ సులభం తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే।
లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతే క్షితౌ॥

తా॥ సులభముగా కన్నులార గానబడు గురుదేవుని వుపేక్షించి దుర్లభమైన దేవతోపాసనగాని, శాస్త్రమునందలి నిగూఢ జ్ఞానమును గాని పొంద తలంచువాడు తనకు లభించిన ధనమును వదలిపెట్టి,

ఉపనిషద్వాక్యమును వినుడు — ముండకోపనిషత్తు.

మూ॥ నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన । యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్॥

తా॥ ఈ యాత్మ వేదవేదాన్త విశేషప్రవచనములవల్ల లభించునదిగాదు. ప్రాపంచిక విషయబుద్ధి బలముచేతనూ లభించునదిగాదు. అనేకవిధములగు శాస్త్రశ్రవణములచేతను లభించునదిగాదు. పరమాత్మను ఏ జీవుడు వరించునో (ఆశ్రయించునో) అట్టి జీవునిచేత లభింపబడును. శ్రీపతంజలి మహాముని యోగశాస్త్రములో చెప్పినది చూడుడు.

సూ॥ ఈశ్వరప్రణిధానాద్వా॥

తా॥ ఈశ్వరప్రణిధానము అనగా పరమేశ్వరునియందు సర్వమును సమర్పించిన అనన్య భక్తిగల వానికి మోక్షము త్వరలో సిద్ధించును.

సూ॥ సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్॥

తా॥ సర్వకర్మలను భగవంతునకు సమర్పించిన, లేక భక్తి విశేషము అను ప్రణిధానమును దృఢముగ అలవరచుకొనిన యోగికి సమాధిసిద్ధి (బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము) త్వరలో సిద్ధించును.

శ్లో॥ యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

తా॥ పరమభక్తుడగువానికి తన యిష్టదైవమందు యెట్టి గాఢతమ మగు భక్తి యుండునో ఆలాగున గురుదేవునియందు దృఢమగు భక్తిగల మహాత్మునికి మాత్రమే యీ బ్రహ్మతత్త్వము బోధపడును. అనగా గురుదేవుని యందుగాని యీశ్వరుని యందుగాని భక్తి విశ్వాసము గలవారికి మాత్రమే యీ బ్రహ్మతత్త్వము బోధపడును.

శ్లో॥ యేన నారాధితో దేవో యస్య నో గుర్వనుగ్రహః ।
న వశ్యం హృదయం యస్య తస్య శాన్తి ర్నసిధ్యతి॥

తా॥ ఎవడైతే పరమేశ్వరుని భక్తితో నారాధింపలేదో, యెవనికైతే గురుదేవుని అనుగ్రహము గలుగలేదో, యెవని మనస్సు స్వాధీనముగా లేదో ఆతనికి ఉపరతియు ఆత్మశాన్తియు గలుగదు.

శ్లో॥ వేదాన్తానామనేకత్వాత్సంశయానాం బహుత్వతః ।
వేద్యస్యాప్యతిసూక్ష్మత్వాన్నజానాతి గురుం వినా॥

తా॥ వేదాన్తశాస్త్ర మనేక ముఖములతో గూడినదగుటచేతను, శిష్యులనేక విధములగు సంశయములు గలవారగుటచేతను, తెలియదగిన బ్రహ్మవస్తువు అతి సూక్ష్మమగుటచేతను, గురుదేవుని కరుణ లేనివారు దానిని తెలిసికొనజాలరు. అని అనుభూతి ప్రకాశము.

శ్లో॥ తం త్యక్త్వా తాదృశం దేవం యస్సేవ్యేతాన్యదేవతాం।
స హి భాగీరథీం త్యక్త్వా కాంక్షతే మృగతృష్ణికామ్॥

తా॥ ఎవడైతే సాధనానుష్ఠానపరుడై ఆత్మ సాక్షాత్కారము గల గురుదేవుని విడనాడి యితరదేవతలను సేవించుచు తిరుగుచున్నాడో, అట్టివాడు గంగాతీరమందుండి ఆ పావన జలములను పానముజేసి సుఖింపక యెండమావులను జూచి అది మంచి జలప్రవాహమను భ్రాంతి కలిగి పరుగెత్తువానివలె వుంటున్నాడు.

శ్లో॥ చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యః స్మరేత్।
హస్తస్థ ముదకం త్యక్త్వా ఘనస్థ మభివాంఛతి॥

తా॥ దృష్టికి సాక్షాత్తుగా గనుపించెడు గురుదేవుని త్యజించి నేత్రమున కగోచరమగు శాస్త్రముచు చదివి జ్ఞానమును సంపాదింప తలంచువాడు చేతిలోగల జలపాత్రమును విడిచి మేఘములోగల జలమును పానము చేయుటకు యత్నించువానివలె నుండును.

శ్లో॥ సులభం తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే।
లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతే క్షితౌ॥

తా॥ సులభముగా కన్నులార గానబడు గురుదేవుని వుపేక్షించి దుర్లభమైన దేవతోపాసనగాని, శాస్త్రమునందలి నిగూఢ జ్ఞానమును గాని పొంద తలంచువాడు తనకు లభించిన ధనమును వదలిపెట్టి,

భూమిలో యెచ్చటనో నిక్షేపము గలదని తలంచి త్రవ్వవానివలె మూఢుడగును.

శ్లో॥ గురోర్వినా న శ్రవణం భవేత్కస్యాపి కస్యచిత్ ।
వినా కర్ణేన శాస్త్రస్య శ్రవణం తత్కుతో భవేత్ ॥

తా॥ నేత్ర, జిహ్వా, ఘ్రాణేంద్రియము లుండియు శ్రవణేంద్రియము లేనిచో శాస్త్రశ్రవణము నెట్లు చేయజాలడో, ఆలాగున యితర దైవోపాసనాద్యనుష్ఠానములు అన్నియు కలిగి యుండినను గురువు లేనిచో బ్రహ్మతత్త్వ సాక్షాత్కారజ్ఞానము గలుగ జాలదు. సంజయునికి దివ్యశ్రవణము, దివ్యదృష్టి, దివ్య హృదయము శ్రీ వేద వ్యాస మహర్షి యొసంగినందువల్లనే గలిగినదని భారతము భీష్మపర్వమున గలది వినుడు. సంజయుడు సూతకులసంజాతుడు, రథముతోలు బ్రాహ్మణేతర జాతిలో జన్మించినవాడు.

"ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబు తెరంగు వినిపింప నియోగించి యా సూత నందనునకు నా రెండు దెరంగులవారి దివారాత్రి ప్రవర్తనంబులు గనునట్లును, రహస్యప్రకార భాషణంబులు వినునట్లును, మనోవృత్తంబు లెరుంగునట్లుంగా వరంబిచ్చి యతి శీఘ్ర గమనంబు నొసంగి భారత సమర ధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాకకుండునట్టి ప్రభావంబు ప్రసాదించి, దివ్యుల యాలాపంబులు రూపంబులున్ దలంపులున్ దేటపడునట్టి మహనీయ బోధంబును గలుగ నను గ్రహించి యా*వైచిత్ర్యవీర్యు నాలోకించి యిది ప్రాప్తకాలంబయి వచ్చిన భూప్రజాక్షయంబు, దీనికిం వగవంబనిలేదు. 'ధర్మోజయతి' అనుచు నిశ్చింతంబుననుండు మేనును కురుపాండవుల కీర్తిం బ్రకటింపం గలవాడనని యతని నాశ్వాసించి ♦సాత్యవతేయుండు వెండియు—"

---

* వైచిత్ర్యవీర్యుడు = ధృతరాష్ట్రుడు
♦ సాత్యవతేయుడు = శ్రీ వ్యాసభగవానుడు

ఓమ్

# ధ్యా న దీ ప ము

చీకటిలోగల వస్తువును తెలుసుకొనుటకు, తీసికొనుటకు దీప మెట్టిదో ఆలాగున అజ్ఞానమనెడు తమస్సుతో ఆచ్ఛాదింపబడిన ఆత్మను తెలుసుకొనుటకు ధ్యానము దీపమువంటిది. మరియు చీకటిలో దీపము లేనిచో యేలాగున మార్గము చక్కగా తెలియదో ఆలాగున ధ్యాన దీపము లేనిచో అవిద్యారూపమగు ప్రపంచములో మానవుడు తిరిగి ఋజుమార్గమున పరమాత్మను కనుగొనజాలడు. అంతేగాదు పొంద జాలడు. కావుననే దీనిని ధ్యానదీపమని నామకరణ మిడుటకు కారణ మైనది. మరియు దీపమేలాగున స్వయముగా వెలుగుచు చీకటిని దగ్గరకు చేరనీయక స్వప్రకాశమై నిలుచునో ఆలాగున ధ్యానము గలవానిదగ్గరకు అవిద్యగాని మాయగాని అజ్ఞానముగాని చేరనేరదు. కావుననే శ్రీ వ్యాస భగవానుడు తనకుమారుడున్ను, శిష్యుడున్ను అగు శుకబ్రహ్మర్షి తనను విడిచి వెళ్లునప్పుడు యీ శ్లోకము నుపదేశించి పంపడమైనది.

శ్లో॥ నాస్తి ధ్యానసమం తీర్థం నాస్తి ధ్యానసమం తపః ।
నాస్తి ధ్యానసమో యజ్ఞ స్తస్మా ద్ధ్యానం సమాచరేత్ ॥

తా॥ ధ్యానమునకు సమానమైన తీర్థములేదు. ధ్యానమునకు సదృశమైన తపస్సున్ను లేదు. ధ్యానమునకుసమమగు యజ్ఞమున్ను లేదు. కావున ధ్యానము లెస్సగా గలిగియుండుము అని చెప్పుటకు కారణము. అయితే యిచ్చట ధ్యానశబ్దమువల్ల ధ్యేయమగు ఆత్మ లేక పరమాత్మ యని యొకటిగలదుగదా; అదిగదాగమ్యము, గమ్యస్థానమనిశంకింప పని లేదు. గమనములేనిచో గమ్యము నేలాగున చేరజాలరో ఆలాగున ధ్యానములేనిచో ధ్యేయమును పొందజాలరు. ధ్యానము రెండు విధ ములు. ఒకటి భగవంతుని అనగా పరమేశ్వరుని తదేక నిష్ఠతో ధ్యానిం చుట. రెండవది ఆ భగవంతుడే ఆ పరమాత్మయే తనఆత్మ స్వరూపమై తనలో వెలుగుచున్నదని శ్రవణముచేత గ్రహించి నిదిధ్యాసనములో అనగా ధ్యేయైకస్థితిలో యెల్లప్పుడున్ను నిలుచుటయు నగుచున్నది. అంతే గాక ధ్యేయైక పరమాత్మస్వరూపమునకు అన్యమైన విషయములు వృత్తులు ఆత్మలో చేరనీయక చేయుటకున్ను యీ ధ్యానము అత్యావ

సరము. దీనికే నిదిధ్యాసన మనిగూడ పేరుగలదు.అట్లు ధ్యానము అనగా నిదిధ్యాసనము చేయకపోవుటవల్లనే కొందరిహృదయములోగల విషయ వాసనలు, ప్రపంచవృత్తులు, సంకల్పములు నశింపకపోవుటకు కారణము. కనుకనే మహర్షులు, సిద్ధపురుషులు, యోగీశ్వరులు ధ్యానమును తప్పని సరిగా ఆచరించుచు వచ్చుటకుకారణమైనది. వేదాన్తవిచారణచేత వస్తు స్వరూపమగు ఆత్మ యిట్టిదని నిరూపణ జరుగును. ఆ స్థితిలో సర్వకాలములో నుండుటకున్ను ప్రపంచవాసనాదోషములు ఆత్మలో చేరనీయక సంరక్షించుటకున్ను ధ్యానము వుపయోగపడును. ఇదే దీనియొక్క పరమ రహస్యము. అట్లు ధ్యానము చేయకపోవుటవల్లనే కొందరు వేదాన్త విచారణ గలవారైనను సంస్కారములు వాసనలు ప్రాకృతవృత్తులు నశింపకపోవుటకు కారణము. ధ్యానము యోగముతో సంబంధించినదిగాను, జ్ఞానము తత్త్వవిచారముతో సంబంధించినదిగా వుంటున్నది. ఈ విషయము యోగతత్త్వోపనిషత్తునందు చతుర్ముఖ బ్రహ్మకు శ్రీమన్నారాయణమూర్తి వుపదేశించిన ఘట్టముచూచిన (సత్యము) తెలియగలదు.

బ్రహ్మదేవుడు అడిగిన ప్రశ్న యిది. జ్ఞానముచేత మోక్షమా? లేక యోగముచేత మోక్షమా? అని అడిగినప్పుడు శ్రీమన్నారాయణ మూర్తి వుపదేశించిన వాక్యము క్రింద తెలుపబడుచున్నది.

శ్లో॥ తస్మాద్దోషవినాశార్థ ముపాయః కథయామి తే।
యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్॥
యోగోఽపి జ్ఞానహీనస్తు న క్షమో మోక్షకర్మణి ।
తస్మాజ్జ్ఞానం చ యోగం చ ముముక్షుర్దృఢమభ్యసేత్ ॥

తా॥ ఓ బ్రహ్మదేవుడా! ప్రకృతిదోషము నశించి జ్ఞానప్రాప్తి గలుగుటకు వుపాయము చెప్పెద. యోగములేని జ్ఞానము యెట్లు మోక్షము నొసంగదో, అట్లే జ్ఞానములేని యోగమున్ను మోక్షము నొసంగదు. కాబట్టి మోక్షమును గోరువాడు జ్ఞానమును, యోగమును చక్కగా అభ్యసింపవలయును. గీతలో శ్రీకృష్ణభగవానుడున్ను యీలాగుననే వచించెను. "ధ్యానేనాత్మని పశ్యంతి" ధ్యానముచేతనే తనలో వెలుగుచుండు పరమాత్మనుచూడసాధ్యపడును. ఇంకను వేదాన్త గ్రంథములలో యీలాగున తెలుపడమైనది.

"ధ్యానహ్రదే జ్ఞానజలే రాగద్వేషమలాపహే ।
యః స్నాతి మానసే తీర్థే స యాతి పరమాం గతిమ్॥"

ఇచటగూడ ధ్యానధ్యేయములను కలిపియే చెప్పడమైనది. ధ్యానమనెడు మడుగులో రాగద్వేషాది దోషరహితమైన జ్ఞానజలములో యెవండు స్నానము చేయునో వాడు సర్వోత్కృష్టమగు మోక్షమును పొందగలుగును. ఇక నీవిషయమై వేదాన్తపంచదశియందు 9-వ ప్రకరణమున తెలిపినది చూడుడు. ఆ విషయము యిచ్చట తెలుపుటకు కారణమేమనగా సాధారణముగా వేదాంతులు పంచదశిని పరమప్రమాణముగా తీసికొనెదరు. వారు జ్ఞానము మాత్రము తెలిసికొనిన చాలుననియు మరల ధ్యానముచేయ నవసరములేదనియు చెప్పుదురు. అందువల్లనే యిచట పంచదశి ప్రమాణమును చూపుటకు హేతువైనది.

శ్లో॥ తత్సామర్థ్యాజ్జాయతే ధీర్మూలావిద్యానివర్తకా ।
అవిముక్తోపాసనేన తారకబ్రహ్మబుద్ధివత్ ॥

తా॥ సగుణబ్రహ్మోపాసనముచేత సగుణ బ్రహ్మముయొక్క సాక్షాత్కారము గలుగునట్లు నిర్గుణబ్రహ్మోపాసనా సామర్థ్యమువలన సంసారకారణమగు అజ్ఞానమును నివర్తింపజేయునట్టి అపరోక్షజ్ఞాన సాక్షాత్కారము గలుగుచున్నది.

శ్లో॥ సో కామో నిష్కామ ఇతి హ్యశరీరో నిరింద్రియః ।
అభయం హీతి ముక్తత్వం తాపనీయే ఫలం శ్రుతమ్॥

తా॥ నిర్గుణోపాసకుడు మోక్షకామియగుచు, ఇతరకామములు లేనివాడగుచు మోక్షమును పొందుచున్నాడనియు. శరీరము లేనివాడగుచు, ఇంద్రియములు లేనివాడగుచు సంసారభయరహిత మోక్షమును పొందుచున్నాడనియు మోక్షరూపమగు ఫలము తాపయోపనిషత్తు నందు వినబడుచున్నది.

శ్లో॥ ఉపాసనస్య సామర్థ్యాద్విద్యోత్పత్తిర్భవేత్తతః।
నాన్యః పంథా ఇతి హ్యేతచ్ఛాస్త్రం నైవ విరుధ్యతే॥

తా! నిర్గుణోపాసకులయుక్క సామర్థ్యమువలన జ్ఞానముయొక్క వుదయమగును. ఆ కారణమువలన మోక్షప్రాప్తికి జ్ఞానమార్గము

కంటె అన్యమగు మార్గములేదని జెప్పెడి యీ శ్రుతివాక్యము విరోధ మును పొందదు.

శ్లో॥ ప్రణవోపాసయః ప్రాయో నిర్గుణా ఏవ వేదగాః।
క్వచిత్సగుణతాప్యుక్తా ప్రణవోపాసనస్య హి॥

తా॥ వేదోక్తములైనట్టి ప్రణవోపాసనములు తరచుగా నిర్గుణ ములే యగును. ప్రణవోపాసనమునకు సగుణత్వంబును ఒకానొక స్థల మందు చెప్పబడెను. అనగా ఓంకారోపాసన ముఖ్యముగా నిర్గుణబ్రహ్మో పాసనను గురించి చెప్పుచుండినను, సగుణోపాసనగూడ చెప్పటగలదు. నిర్గుణోపాసన అయినచో ఓంకారమగు ఏకాక్షరమాత్రమును, సగుణో పాసన అయినచో శ్రీశివ, శ్రీవిష్ణు, శ్రీకృష్ణ శ్రీరామ ఆది మంత్రాక్షర ములుగూడ కలిసియుండును. కొందరు ప్రణవముతో మాత్రము పై జెప్పిన సద్గుణమూర్తులయొక్కయు, నిర్గుణ బ్రహ్మముయొక్కయు వుపా సన చేయుదురు.

శ్లో॥ పరాపర బ్రహ్మరూప ఓంకార ఉపవర్ణితః।
పిప్పలాదేన మునినా సత్యకామాయ పృచ్ఛతే॥

తా॥ పిప్పలాదుడను పేరుగల మునిచేత సత్యకాముని కొరకు బ్రహ్మయొక్క రూపమగు ఓంకారము (ప్రణవము) పరమనియు, అపర మనియు వర్ణింపబడెను.

శ్లో॥ ఏతదాలంబనం జ్ఞాత్వాయో యదిచ్ఛతి తస్య తత్।
ఇది ప్రోక్తం యమేనాపి పృచ్ఛతే నచికేతసే॥

తా॥ ఏ పురుషుడు యీ బ్రహ్మరూప ప్రణవమును తెలిసికొని దేనిని కోరుచున్నాడో వానికి అది లభింపబడుచున్నదని యమునిచేత నచికేతసునికొరకు చెప్పబడెను. గీతయందు అర్జునుండు అంత్యకాలమున యెట్టి భావన గలిగియుండిన పరమాత్ముడవగు నిన్ను పొందగలుగునని చేసిన ప్రశ్నకున్ను శ్రీకృష్ణభగవానుడు యీఓంకారమునేవుపదేశించెను.

ప్రశ్న॥ "ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః"
దీని అర్థము పైన చెప్పినదే.

ఉత్త॥ "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాంగతిమ్॥"

తా॥ అంత్యకాలమున వేదమూలమగు ఓంకారము నుచ్చరించి పరమాత్మభావముతో యెవండు దేహమును వీడిపోవుచున్నాడో వాడు సర్వోత్కృష్టమగు బ్రహ్మమునుపొందుచున్నాడు. ఇదిన్నీ సాకారముతో నైనను, నిరాకారముతో నైనను చేయవచ్చును. వారి వారి భావన ననుసరించి భగవత్ప్రాప్తిగాని పరబ్రహ్మప్రాప్తిగాని గలుగును.

శ్లో॥ ఇహావా మరణే చాస్య బ్రహ్మలోకేఽథవా భవేత్ ।
బ్రహ్మసాక్షాత్కృతిస్సమ్య గుపాసీనస్య నిర్గుణమ్॥

తా॥ నిర్గుణబ్రహ్మమును శాస్త్రోక్తప్రకారము లెస్సగా వుపాసనము జేసెడివానికి యీ జన్మమందైనను, మరణకాలమందైనను లేక బ్రహ్మలోకమందైనను బ్రహ్మసాక్షాత్కారము(అపరోక్షజ్ఞానము)కలుగును.

శ్లో॥ అర్థోఽయ మాత్మగీతాయా మపి స్పష్టముదీరితః ।
విచారాక్షమ ఆత్మాన ముపాసీతేతి సంతతమ్॥

తా॥ తత్త్వంపదార్థ విచారణ చేయుటకు తగిన శాస్త్రమున్ను బుద్ధిశక్తియున్ను లేనివాడు ప్రత్యగాత్మరూప పరబ్రహ్మమును సర్వదా వుపాసన చేయవలయు ననెడి యీ యర్థము ఆత్మగీతయందును స్పష్టముగా చెప్పబడినది. (ఈ యాత్మగీత గ్రంథము యిప్పుడెచ్చటను దొరుకదు. అది కాలగర్భములో కలసిపోయినదో లేక గుప్తముగా వుంటున్నదో యెవరికిన్ని తెలియదు.)

శ్లో॥ సాక్షాత్కర్తుమశక్తోఽపి చింతయేన్మామశంకితః।
కాలేనానుభవారూఢో భవేదాఫలితో ధ్రువమ్॥ (ఆత్మగీత)

తా॥ బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటకు బుద్ధిశుద్ధియు, ఏకాగ్రతయు, విద్యాపటుత్వమున్ను లేనివాడయినను నిస్సంశయముగల వాడై ఆత్మను పరమాత్మధ్యానముతో వుపాసన చేసినచో పరిపక్వకాలముచేత సత్యముగా బ్రహ్మసాక్షాత్కారము గలవాడగును.

శ్లో॥ యథాఽగాధ నిధేర్లబ్ధౌ నోపాయః ఖననం వినా ।
మల్లాభేఽపి తథా స్వాత్మ చింతాం ముక్త్వా న చాపరః ॥

తా॥ మిక్కిలి లోతునందుగల సువర్ణనిధిని పొందుటకు త్రవ్వుట తప్ప మరియొక వుపాయములేనట్లు, పరబ్రహ్మమగు నన్ను బొందుటకు

తన స్వరూపమును ధ్యానించుట తప్ప మరియొకవుపాయము యెద్దియును లేదని తెలియవలెను.

శ్లో॥ దేహోపలమపాకృత్య బుద్ధికుద్దాలకాత్పునః ।
ఖాత్వా మనోభవం భూయో గృహ్ణీయాన్మాంనిధింపుమాన్॥

తా॥ పురుషుడు దేహము, మనస్సు, రాతిని పెల్లగించి బుద్ధి యనెడు గునపము (గడ్డపార అనెడు) ఆయుధముతో త్రవ్వి, హృదయ మందుగల శ్రేష్ఠమగు నిధి యనెడు నన్ను గ్రహించవలెను అని ఆత్మ గీతయందు చెప్పబడెను అని తెలియవలెను. భూమిక్రింద వుండు నిధిని తీయవలసియుండిన గడ్డపారచేత రాయి, మట్టి మొదలగు ఆటంకములను తొలగించవలసి యుండునట్లు సూక్ష్మమై శుద్ధమై దృఢమైన బుద్ధిచేత ధ్యానమనెడు సాధనచేతనే మనోబుద్ధీంద్రియముల కతీతమగు పరమాత్మను పొందవలసియుండును.

శ్లో॥ అనాత్మబుద్ధిశైథిల్యం ఫలం ధ్యానా ద్దినేదినే ।
పశ్యన్నపి న చేద్ధ్యాయే త్కోఽపరోఽస్మాత్పశుర్వద ॥

తా॥ ఏ పురుషుడు ధ్యానమువలన ప్రతిదినమందును అనాత్మ బుద్ధిశైథిల్యరూపమగు ఫలమును జూచుచున్నవాడగుచుండియు, ధ్యానమును చేయడో వీనికంటె యితరమైన పశువెద్దియో చెప్పుము. అనగా వీడే పశుప్రాయుడు. అనగా బుద్ధిగతమైన వాసనావృత్తి సంస్కారములు ధ్యానమువల్లనే క్షయించవలసియుండునని శాస్త్రములు చెప్పెడి వాక్యమును వినియు, స్వయముగా శాస్త్రములు చూచియు, అట్లు ధ్యానము చేయనివాడు పశుప్రాయుడని వేదాన్తశాస్త్రము చెప్పుచున్నది. ఓహో! దీనికన్న పరమప్రమాణ మేమిగలదు?

శ్లో॥ దేహాభిమానం విధ్వస్య ధ్యానాదాత్మాన మద్వయం ।
పశ్యన్మర్త్యోఽమృతో భూత్వా హ్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥

తా॥ మర్త్యుడు బ్రహ్మధ్యానమువలన మరణశీలమగు దేహమందు నేను అనెడి యభిమానమును విడచుటచేత తా నమృతరూపుడై యీశరీరమందే యిచ్చటనే తన నిజరూపమగు అద్వితీయ సచ్చిదానంద లక్షణ పరబ్రహ్మమును పొందుచున్నాడు. మృత్యువుతో గూడినవాడగు

ట చే మర్త్యుడనియు, మృత్యువును జయించి జ్ఞానము గలుగునప్పుడు అమర్త్యుడనియు, అనగా మరణరహితమగు అమృతత్వమును పొందు చున్నాడనియు తెలియందగినట.

శ్లో॥ బహువ్యాకుల చిత్తానాం విచారా త్తత్వధీర్నహి !
యోగో ముఖ్య స్తత స్తేషాం ధీదర్ప స్తేన నశ్యతి ॥

తా॥ బహు వ్యాకులచిత్తము గలవారికి (ప్రాపంచిక విషయ వృత్తులునశించనివారికి) తత్త్వంపదార్థ విచారమువలన అపరోక్షజ్ఞానము గలుగదు. ఆ కారణమువలన అట్టి జనులకు ధ్యానయోగము ముఖ్యమైనదగును. అట్టిధ్యానయోగమువల్ల బుద్ధియొక్క వృత్తినశించుచున్నది. అనగా మనోవృత్తి నశించుటకున్ను, మనస్సు నిర్మలమగుటకున్ను, బుద్ధి యొక్క మాంద్యము తొలగుటకున్ను ధ్యానయోగము లేక ఉపాసనా యోగము ముఖ్యముగా వుండవలెనని తాత్పర్యము. లేనిచో వానితత్త్వం పదార్థ విచారణజ్ఞానము గాలిలో దీపమువలెనేవుండును. అయితే దీని యందు ఒక ప్రశ్న గలదు. అదేమన బహువ్యాకులచిత్తము గలవారికి గదా ధ్యానయోగము లేక ఉపసనాయోగము విధిండమైనది. మాకు ఆలాటి చిత్తవ్యాకులము లేదు. కావున ధ్యానయోగముగాని, ఉపాసనా యోగముగాని మేమేల చేయవలయును? సమాధానము: ఆత్మసాక్షిగా విషయవాసనలుగాని, ప్రకృతిగుణములుగాని లేనిచో అట్టివారికి ధ్యానోపాసనాయోగములు అవసరము లేదు. వారు మహావాక్య విచారణ మాత్రము చేసినచాలును. అయితే ఔషధసేవచేసి రోగము నిశ్శేషము శమించక రోగచిహ్నముండిన మరికొన్నిరోజులు ఔషధసేవనము, పథ్యము గలిగియుండుట మంచిది. లేనిచో గలిగెడు సంకటము వారికే తెలియును. ఇది వేదాంత శాస్త్రముయొక్క నిర్ణయము.

శ్లో॥ అనేకజన్మభజనాత్ స్వవిచారం చికీర్షతి॥

తా॥ అనేకజన్మములలో చేసినభజన మొదలగు దైవోపాసనవల్ల ప్రకృతిదోషము క్షయించి బ్రహ్మరూపుడగు తనయొక్క విచారమును అనగా జ్ఞానసాధనమగు శ్రవణాదికమును చేయుటకు యిచ్ఛయించు చున్నాడు. ఇది శ్రీవిద్యారణ్యస్వాములవారి ఆశయము. ఇక శ్రీ శంకర భగవత్పాదులవారి ఆశయము అపరోక్షానుభూతిలో చెప్పినదిచూడుడు.

శ్లో॥ ఏభిరంగైః సమాయుక్తో రాజయోగ ఉదాహృతః।
కించిత్పక్వకషాయాణాం హఠయోగేన సంయుతః॥

తా॥ శమదమాది సాధనచతుష్టయ అంగములతో గూడినది రాజయోగమనియు, అది పక్వావస్థగలవారికనియు, కొంచెము పక్వకషాయము గలవారికి అనగా అంతఃకరణము సంపూర్ణముగా శుద్ధముగానివారికి హఠయోగములో చెప్పబడిన యమనియమాది ధ్యానోపాసన యోగము తప్పనిసరిగా వుండవలెనని భావము.

శ్లో॥ పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః।
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్॥

తా॥ అత్యంత పరిపక్వహృదయము గలవారికి తత్త్వంపదార్థ విచారణ పూర్వకమగు యీరాజయోగముసిద్ధించును. కొంచెము మనః పరిపక్వము లేనివారికి గురుభక్తిచేతను, దైవభక్తిచేతను, వుపాసనా యోగముచేతను సులభముగాను, శీఘ్రముగాను యీ జ్ఞానయోగము సిద్ధించును. ఇదే అభిప్రాయమును ఆత్మబోధయందు మొట్టమొదటనే శ్రీ శంకరభగవత్పాదు లుపదేశించిరి.

శ్లో॥ తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణాం।
ముముక్షూణామపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే॥

తా॥ తపస్సులచేత పాపములు నశించినవారికిన్నీ, మనశ్శాంతిగల వారికిన్నీ, రాగద్వేషములు క్షయించినవారికిన్నీ, తీవ్రముముక్షుత్వము గలవారికిన్నీ, యీ ఆత్మబోధ మను గ్రంథము విధింపబడుచున్నది. ఇట్టి లక్షణము గలవారికి మహావాక్యవిచారణ మాత్రము చాలును. లేనివా రుండిన ధ్యానోపాసనాది సాధనలను శీలించుకొనుట శ్రేయోదాయకము. ఇది చిన్నవ్యాస మగుటచే యెక్కువవిస్తరించి చెప్పబూనలేదు. గీతలో చెప్పన రెండువాక్యములను యిచట తెలిపి యీ వ్యాసము సమాప్తిచేయ దలంచడమైనది.

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

తా॥ ఎవరియొక్క మనస్సు సకల ప్రాణులయెడ సమభావము నందు స్థిరమైయుంటున్నదో వారలచేత యీదేహముతో యీలోకము నందే జనన మరణములకు హేతువగు సంసారబంధము జయింపబడినది. పరబ్రహ్మము సమభావముగలదియును పరిశుద్ధమైనదిగదా! ఆ కారణమువలన అట్టి బ్రహ్మానుభవము గలవారు పరబ్రహ్మమునందే వున్నవారగుదురు. "ఇహైవ తైర్జితస్సర్గః" ఈలోకమున యీదేహ మున్నప్పుడే పునర్జన్మమునకు కారణమగు సంస్కారములు, వృత్తులు, విషయ వాసనలు నశించవలయునని నిరూపించడమైనది. ఇట్టి స్థితి తమకు కలిగినదా యని బ్రహ్మవిచారకుడు తనలోతాను ఆలోచించుకొనవలయును. మరియు "నిర్దోషం హి సమం బ్రహ్మ" అని ప్రయోగించుటవల్ల బ్రహ్మమెట్టి ప్రకృతిదోషరహితమైనదో అట్టి స్థితిగలవారుమాత్రమే బ్రహ్మమందుండగలుగుదురు అని చెప్పినదియు విచారణీయము.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥

తా॥ ఎవడు యీ లోకమునందే యీ శరీరముతో వున్నప్పుడే శరీరమును విడుచుటకు ముందుగానే కామ క్రోధ జన్యమగు వేగమును సహించుటకొరకు శక్తుడగుచున్నాడో, అట్టిమనుజుడు యోగసిద్ధిగలవాడగుచున్నాడు. అట్టివాడు శాశ్వతమగు బ్రహ్మసుఖమును గలవాడగుచున్నాడు. "శక్నోతీహైవ యస్సోఢుమ్" ఈదేహము వదలిపోవుటకు ముందుగా ప్రాకృతవిషయాది దోషములు లేనివాడుగానే వుండవలెను. ఏదైన కొంచెము మిగిలియుండిన పునర్జన్మమునకుగాని, స్వర్గలోకమునకుగాని, కట్టకడకు బ్రహ్మలోకమునకుగాని వెళ్ళవలసియుండును. జీవించియున్నప్పుడే జీవగుణములనుండి విముక్తి పొందుట యేదిగలదో అదే జీవన్ముక్తియని గ్రహించుకొనవలయును.

శ్లో॥ దుర్జన స్సజ్జనో భూయాత్ సజ్జనో శాంతిమాప్నుయాత్ ।
శాంతో ముచ్యేత బంధేభ్యో ముక్తశ్చాన్యా న్విమోచయేత్ ॥

తా॥ దుర్జనులు సజ్జనులగుదురుగాక! సజ్జనులు శాంతిని పొందుదురుగాక! శాంతాత్ములు బంధములనుండి విముక్తులగుదురుగాక! ముక్తాత్ములు బద్ధజీవులను విముక్తులనుగా చేయుటకు యత్నింతురుగాక!

శ్లో॥ ఏభిరంగైః సమాయుక్తో రాజయోగ ఉదాహృతః।
కించిత్పక్వకషాయాణాం హఠయోగేన సంయుతః॥

తా॥ శమదమాది సాధనచతుష్టయ అంగములతో గూడినది రాజయోగమనియు, అది పక్వావస్థగలవారికనియు, కొంచెము పక్వకషాయము గలవారికి అనగా అంతఃకరణము సంపూర్ణముగా శుద్ధము గానివారికి హఠయోగములో చెప్పబడిన యమనియమాది ధ్యానోపాసన యోగము తప్పనిసరిగా వుండవలెనని భావము.

శ్లో॥ పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః।
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్॥

తా॥ అత్యంత పరిపక్వహృదయము గలవారికి తత్త్వంపదార్థ విచారణ పూర్వకమగు యీరాజయోగముసిద్ధించును. కొంచెము మనః పరిపక్వము లేనివారికి గురుభక్తిచేతను, దైవభక్తిచేతను, వుపాసనా యోగముచేతను సులభముగాను, శీఘ్రముగాను యీ జ్ఞానయోగము సిద్ధించును. ఇదే అభిప్రాయమును ఆత్మబోధయందు మొట్టమొదటనే శ్రీ శంకరభగవత్పాదు లుపదేశించిరి.

శ్లో॥ తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణాం।
ముముక్షూణామపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే॥

తా॥ తపస్సులచేత పాపములు నశించినవారికిన్నీ, మనశ్శాంతిగల వారికిన్నీ, రాగద్వేషములు క్షయించినవారికిన్నీ, తీవ్రముముక్షుత్వము గలవారికిన్నీ, యీ ఆత్మబోధ మను గ్రంథము విధింపబడుచున్నది. ఇట్టి లక్షణము గలవారికి మహావాక్యవిచారణ మాత్రము చాలును. లేనివారుండిన ధ్యానోపాసనాది సాధనలను శీలించుకొనుట శ్రేయోదాయకము. ఇది చిన్నవ్యాస మగుటచే యెక్కువవిస్తరించి చెప్పబూనలేదు. గీతలో చెప్పిన రెండువాక్యములను యిచట తెలిపి యీ వ్యాసము సమాప్తిచేయ దలంచడమైనది.

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

తా॥ ఎవరియొక్క మనస్సు సకల ప్రాణులయెడ సమభావము నందు స్థిరమైయుంటున్నదో వారలచేత యీ దేహముతో యీలోకము నందే జనన మరణములకు హేతువగు సంసారబంధము జయింపబడినది. పరబ్రహ్మము సమభావముగలదియును పరిశుద్ధమైనదిగదా! ఆ కారణమువలన అట్టి బ్రహ్మానుభవము గలవారు పరబ్రహ్మమునందే వున్నవారగుదురు. "ఇహైవ తైర్జితస్సర్గః" ఈలోకమున యీ దేహ మున్నప్పుడే పునర్జన్మమునకు కారణమగు సంస్కారములు, వృత్తులు, విషయ వాసనలు నశించవలయునని నిరూపించడమైనది. ఇట్టి స్థితి తమకు కలిగినదా యని బ్రహ్మవిచారకుడు తనలోతాను ఆలోచించుకొనవలయును. మరియు "నిర్దోషం హి సమం బ్రహ్మ" అని ప్రయోగించుటవల్ల బ్రహ్మమెట్టి ప్రకృతిదోషరహితమైనదో అట్టి స్థితిగలవారుమాత్రమే బ్రహ్మమందుండగలుగుదురు అని చెప్పినదియు విచారణీయము.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥

తా॥ ఎవడు యీ లోకమునందే యీ శరీరముతో వున్నప్పుడే శరీరమును విడుచుటకు ముందుగానే కామ క్రోధ జన్యమగు వేగమును సహించుటకొరకు శక్తుడగుచున్నాడో, అట్టిమనుజుడు యోగసిద్ధిగలవాడగుచున్నాడు. అట్టివాడు శాశ్వతమగు బ్రహ్మసుఖమును గలవాడగుచున్నాడు. "శక్నోతీహైవ యస్సోఢుమ్" ఈదేహము వదలిపోవుటకు ముందుగా ప్రాకృతవిషయాది దోషములు లేనివాడుగానే వుండవలెను. ఏదైన కొంచెము మిగిలియుండిన పునర్జన్మమునకుగాని, స్వర్గలోకమునకుగాని, కట్టకడకు బ్రహ్మలోకమునకుగాని వెళ్ళవలసియుండును. జీవించియున్నప్పుడే జీవగుణములనుండి విముక్తి పొందుట యేదిగలదో అదే జీవన్ముక్తియని గ్రహించుకొనవలయును.

శ్లో॥ దుర్జన స్సజ్జనో భూయాత్ సజ్జనో శాంతిమాప్నుయాత్ ।
శాంతో ముచ్యేత బంధేభ్యో ముక్తశ్చాన్యా న్విమోచయేత్ ॥

తా॥ దుర్జనులు సజ్జనులగుదురుగాక! సజ్జనులు శాంతిని పొందుదురుగాక! శాంతాత్మలు బంధములనుండి విముక్తులగుదురుగాక! ముక్తాత్మలు బద్ధజీవులను విముక్తులనుగా చేయుటకు యత్నింతురుగాక!

---

ఓమ్

# ఆత్మ, నిత్యము శుద్ధము ఆనందము అమృతము

ఆత్మ శాశ్వత వస్తువగుటవల్లనే యెట్టివారైనను మరణమును యిచ్ఛయింపకపోవుటకున్ను, స్థిరముగా నుండగోరుటకున్ను కారణము. మహాత్ములలోగూడ చాలమందిన్నీ ఎల్లప్పుడున్ను సుఖముగా స్థిరముగా ఉండేలాగున తలంచుదురేగాని, మరణించుటకు యిచ్ఛయింపరు. అయితే మహాత్ములలో యేకొద్దిమందిమాత్రమే ఆత్మ శాశ్వతమైనది అని యెరింగి మరణమునకు భయమునొందక యుందురు. అట్లైన అట్టి మహానీయాత్ములుసహా రోగమువచ్చినప్పుడు ఔషధసేవ యేల చేయవలెనను ప్రశ్న ఒకటి బయలుదేరును. అయితే దేహాత్మబుద్ధిగల పామరులవలె చిరకాలము ఆరోగ్యముగలిగి విషయసుఖము లనుభవింపవలెనను తలంపుతో మహానీయులు ఔషధాది సేవచేయుటలేదు. దేహముతో గూడి యుండువరకు యెట్టివారికైనా ఆ దేహసంబంధబాధ కొంత కలిగియే యుండును. అట్టి బాధానివృత్తికొరకు ఆత్మజ్ఞానులు ఔషధాది సేవలు చేయుదురేగాని స్థిరముగా ఉండవలయునను తలంపు గలిగికాదు. శరీరమునకు రోగములు వచ్చినను యేఔషధసేవచేయనివారుగూడ ప్రపంచములో కొంతమంది మహానీయాత్ములు ఉండియుండిరి; ఉంటున్నారు. అది సకృద్విషయమగుటచే ఇచట ప్రస్తావించ పూనలేదు. ఆత్మయొక్క నిత్యత్వవిషయమును గురించియే యిచట ప్రారంభించడమైనది. జ్ఞానియైననేమి, అజ్ఞానియైననేమి; ఆత్మ నిత్యమైనది కావుననే యెల్లప్పుడున్ను ఉండేలాగున అంతరాత్మ ప్రేరణచేయుటకు కారణము. అట్టి ఆత్మానాత్మ జ్ఞానము లేనివారు దేహముతోసహా తానున్ను నశించునని తలంచి స్థిరముగా యీ లోకములో ఉండుటకు యత్నము కలిగియుందురు. అందువల్ల ఆత్మ శాశ్వతమను భావనయే వారిని ఆలాగున ప్రేరణచేయుటకు కారణము. ఈ సత్యమొక్కదాని నెరింగినచో యెట్టివారికిన్నీ ఆత్మ నిత్యమైనదను జ్ఞానముదయమౌను. ప్రపంచమున నేత్రములు తెరచి విశాలమగు యీ లోకమును చూచినచో యీ సత్యము అందరికిన్ని గోచరము గాకమానదు. 80, 90 వయస్సుగలవారుగూడ స్థిరముగా ఉండవలెనని కోరుచున్నారేగాని మరణమును యిచ్ఛయించుటలేదు.

ఔషధసేవాదులేమి ? దైవప్రార్థనలేమి ? దేవతాదుల మ్రొక్కులేమి ? ఇంకను యీమరణగండమును తప్పించుటకు కార్యక్రమములేమి ? జనులందరికిన్నీ తెలిసినవిషయమే. వయస్సు ముదిరినది యొకప్రక్క ఉండనీ; ఘోరమైన కుష్ఠు మొదలగు దారుణ వ్యాధులతో బాధపడినను మరణమును యిచ్ఛయించుటలేదు. ఇంకను బ్రతుకవలయుననియే తన శక్తి సంతయును వినియోగపరచ చూచుచున్నారు. రోగాదులేగాక దారిద్ర్యబాధచే జీవితము గడుపుట మహాప్రయాసముగ నుండినను దానిని సహించుకొనియైనను జీవించుటకే చూచుచున్నారు. ఈలాటివిషయములన్నిటిని దీర్ఘముగా ఆలోచించిచూచిన వారి అంతరాత్మ శాశ్వతమను ప్రేరణవల్లనే స్మృతివల్లనే ఆలాగున చేయుటకు కారణమని దూరాలోచన గలవారలందరికిన్నీ విదితము కాగలదు. మహాత్ముల విషయమై మరియొక విషయముగూడ తెలిపెద. దాహముగలిగినప్పుడు జలపానము చేయుట, ఆకలిగలిగినప్పుడు అన్నమును భుజించుట ఏలాగున ఉండునో, వ్యాధి గలుగునప్పుడు ఔషధము సేవించుటయు ఆలాగున ఉండును. మహనీయాత్ముల గురించి యింకొక్క రహస్యముగూడ గలదు. వారికి జీవించవలయుననే తలంపు లేకపోయినను అట్టివారు జీవించియుండిన లోకమునకెంతో శ్రేయోదాయకమని తలంచి భక్తుల ప్రార్థనవల్లను ఔషధసేవ చేయుచుందురు. లోకముతో వారికేమియు కావలసినది లేనప్పటికిన్నీ వారివల్ల లోకమునకు కావలసిన శ్రేయస్సు యెంతయో కలదు. ఇట్టి కారణమువల్లను వారు పరప్రేరణవల్ల ఔషధాదులను సేవించుచుందురు. మరియు ఒకొక్క మహనీయులున్నూ కారణపురుషులగుటవల్ల వారు యేకార్యము నిర్వహించుటకొరకు జన్మించిరో ఆ పని పూర్తియగువరకు దేహముండవలసి యుండుటవల్ల దేహమందు కొంత అభిమానము కలిగియుందురు. అట్టి అభిమానము లేనిచో దానిని సంరక్షించెడు భావన ఉండదు. ఇదియును ఒక పరమరహస్యము. దేహసంరక్షణ లేనిచో శరీరము శిథిలమైపోవును. ఇదిన్నీ పామరులకు కలిగిన దేహాభిమాన శరీర సంరక్షణవంటిదిగాదు.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే॥

తా॥ ఏమనుష్యుడైతే తనఆత్మలోతాను ఆనందించువాడుగను, తన ఆత్మలోనే తాను తృప్తిపొందినవాడుగను, తన ఆత్మలోనే తాను సంతుష్టిగలవాడుగను అగునో వానికి చేయదగినదిలేదు అని గీతాచార్యుడు వచించెను. ఇట్టివారిని ఆత్మారాములని శాస్త్రములో పేర్కొనడమైనది. ఆత్మ నిత్యవస్తువని, దేహము అనిత్యవస్తువని తెలుపుటకొరకే గీత ఆదినుండి అంత్యమువరకు యత్నించుచున్నది. ఈ సత్యమునే అర్జునునకు తెలుపుటకొరకు ద్వితీయాధ్యాయమగు సాంఖ్యయోగము ప్రవర్తించుచున్నది. ఆత్మ నిత్యమనియు, దేహమనిత్యమనియు బాగుగా తెలుసుకొనిన దేహముయొక్క నాశమువల్ల అతడెప్పుడున్ను వ్యాకులము నొందడు. కావుననే సాంఖ్యయోగమగు ఆత్మజ్ఞాన నిత్యత్వమును ఉపదేశించి తృతీయాధ్యాయ కర్మయోగమును తెలుపుటకు కారణము, ఇది గరుడమంత్రము నుపదేశించి త్రాచుపామును పట్టుటకు నేర్పినట్లుండును. అతనికి కాలసర్పమును పట్టుకొనుటకు యేలాటి అధైర్యమున్ను గలుగదు. మరియు నదిలో మునిగిపోయిన వానిని దరిజేర్చుటకు యీతగానిని దిగేలాగున చేసినట్లున్నది. గరుడమంత్రము తెలియని వానితో నాగుపామును పట్టేలాగున చెప్పినచో అతడు మరణించును. ఈతగాడు కానివానితో నదిలో మునిగినవానిని దరిచేర్చేలాగున చెప్పినచో ఉభయులున్ను మరణింతురు. అలాగున ఆత్మజ్ఞానము లేనివానిని కర్మయోగములో, యుద్ధములో, కార్యనిర్వహణములో నియోగించిన అది వ్యర్థమేయగును. గీతాతత్త్వమంతయు దీనిపై ఆధారపడియున్నది. శ్రీకృష్ణభగవానుని ఉపదేశమును చూతుము.

శ్లో॥ దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి॥

తా॥ దేహధారియగు జీవునికి యీ శరీరమందు బాల్యదశయును, యౌవనదశయును, వార్థక్యదశయును ఏప్రకారము గలుగుచున్నదో ఆదే విధముగ మరియొక దేహము నొందుట యగుచున్నది. ఆ కారణము వలన ఆత్మస్వరూప మిట్టిదని యెరింగినవాడు మోహమును చెందడు. అనగా బాల్యదశలో ఉండేశరీరము పరిణామమునొంది యౌవనదశయందుండదు. యౌవనకాలపు శరీరము వార్థక్యమున మార్పుచెందిపోవు

యున్నది. దేహముయొక్క అంతిమస్థితియు యీలాగున నుండును. దీనిని ప్రవాహన్యాయమని చెప్పుదురు. ఒక నదిలోగాని కాలువలోగాని మనము స్నానము చేయునప్పుడు ఉండేజలము యెంతో దూరముగ వెళ్ళి యుండును. ఆ దేస్థాయిలో పైనుండి నీరు వచ్చుటవల్ల మనకు తెలియ కున్నది. దేహముయొక్క మార్పున్ను యీలాగున ఉండును.

శ్లో॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥

తా॥ ఎవడు ఆత్మను వధించువానినిగా నెరుగుచున్నాడో, యెవ డైతే యీ ఆత్మను సంహరింపబడిన వానినిగా తలంచుచున్నాడో, వారుభయులును, ఆత్మతత్త్వమును తెలిసినవారు కారు. ఈ ఆత్మ తా నొరులను చంపువాడు కాడు. ఇతరులచే చంపబడువాడును కాడు.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥

తా॥ ఈ ఆత్మ యెప్పటికి పుట్టువాడును, చచ్చువాడును కాడు. మరియు కొంత కాలముండి పిమ్మట లేకపోవువాడును, కొంతకాలము లేక పిదప నుండువాడును కాడు. కావున పుట్టుకలేనివాడనియు, చావులేని వాడనియు, సర్వకాలములయందు నొకేవిధముగా నుండువాడనియు, అనాదియైనవాడనియు తెలిసికొనుము. కావుననే శరీరము మారిపోవు చున్నప్పటికిని యీ ఆత్మ మారిపోవువాడు కాడు.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

తా॥ మనుష్యుడు యేప్రకారము చినిగిపోయిన వస్త్రములను విడిచి నూతనములైన వస్త్రములను గ్రహించుచున్నాడో ఆప్రకారము ఆత్మ జీర్ణమైన దేహమును వదలి క్రొత్త క్రొత్త దేహములను పొందు

చున్నాడు. అనగా ఒక యుద్యోగియైనవాడు ఒక స్థలమునకు వెళ్ళి ప్రస్తుతము దొరికిన గృహమును అద్దెకు తీసుకొని మరల అది అనుకూలపడదని తలంచి ఉపయోగకరమగు యింటిని కొని యేలాగున దానియందు ప్రవేశించునో శరీరముయొక్కయు, శరీరియొక్కయు స్థితి యీలాగున నుండును. గృహమును త్యజించినను అతడేలాగున ఉంటున్నాడో, దేహముయొక్కయు, దేహియొక్కయు స్థితి యీలాగున ఉండును.

శ్లో॥ నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః॥

తా॥ ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపలేవు. అగ్ని యీ ఆత్మను కాల్పజాలదు. ఉదకములు యీ ఆత్మను తడుపజాలవు. వాయువు యీ ఆత్మను శోషింపచేయజాలదు. ఆత్మ నిత్యమైనది.

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥

తా॥ ఎప్పుడు నీయొక్క మనస్సు అజ్ఞానమనెడి కల్మషమును దాటగలదో అప్పుడు వినదగిన అర్థమును, విన్న అర్థమును గ్రహింపగలవు. అట్టిస్థితి గలిగినప్పుడే ప్రకృతినుండి విముక్తిని పొందగలుగును. అనాత్మవస్తువు లన్నిటినిన్నీ త్యజింపగలుగును. ఎవరైన ఆత్మయందు నిలుకడ గలుగక యుండిరేని ప్రకృతిని ఇంకను దాటలేదని గ్రహించుకొనవలయును. వారు ప్రకృతినిదాటక ప్రకృతికి పరమగు పరమపురుషుని అనగా పరబ్రహ్మమును ఎట్లు పొందగలుగును ?

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥

తా॥ ఓ యర్జునా! ఇంతవరకు చెప్పబడిన అనగా గీతలో ఉపదేశింపబడిన జ్ఞాననిష్ఠ యేదిగలదో దానిని పొందినవాడు మోహమును పొందజాలడు. ఇట్టి నిష్ఠ అనగా భావన అంత్యకాలమున కలిగినను బ్రహ్మప్రాప్తి నొందగలుగును. పరీక్షిన్మహారాజుకొరకు శుకదేవుడు ఏడు రోజులు శ్రీమద్భాగవతము నుపదేశించి ముక్తునిగా చేసెను. ఖట్వాంగమహారాజు రెండుఘడియలలోపల భగవత్ప్రాప్తిని పొందెను.

శ్రీకృష్ణభగవానుడు అంతదూరముగూడ చెప్పలేదు. ప్రాణప్రయాణకాల మందైనను దైవభావనగలిగియుండినచాలుననియు, అందువల్ల మోక్షము గలుగుననియు ఉపదేశించడ మైనది. ఇది ముదుసలివారిని గురించి కరుణతో భగవానుడు ఆనతిచ్చెను. పెద్దవారై జీవితమంతయు సంసారములో ఉపయోగపరచి ఏదోయొక పుణ్యవిశేషముచే వార్ధక్యదశలో యెట్లు తరించగలుగుదుమని వ్యాకులము గలవారి ఆత్మశాంతి కొరకు పరమకరుణతో భగవంతుడిట్లుపదేశించడమైనది.

శ్లో॥ అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః।
జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥

తా॥ ఆత్మ నిత్యమనునది యేదిగలదో, అట్టి జ్ఞానము అజ్ఞానము చేత అనగా దేహమే ఆత్మయను అజ్ఞానముచేత ఆచ్ఛాదితమైయున్నది. అందువల్ల నిజస్వరూపమగు ఆత్మను తెలియక జీవులు మోహమును పొందుచున్నవి. అట్టి అజ్ఞానమును ఆత్మ నిత్యస్వరూపమను జ్ఞానముచే యెవడు రహితమొనరించుచున్నాడో, అట్టివానికి ఆత్మ నిత్యమను జ్ఞానము, సూర్యునివలె ప్రకాశింపచేయుచున్నది. అనగా సూర్యోదయమునకు పూర్వముఅంధకారమయమగుటచే ఏమియుకనుపించదు.సూర్యోదయమైన వెంటనే చీకటి తొలగి అన్నివస్తువులున్న ఉన్నదున్నట్లు కానుపించునట్లు ఆత్మ నిత్యమను జ్ఞానము ఉదయమగును.

శ్లో॥ జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్॥

తా॥ అట్టి ఆత్మజ్ఞాని నాయొక్క స్వరూపుడని శ్రీకృష్ణభగవానుడు తెలిపెను. 'ఇతి మే మతమ్' ఇది భగవానుని మతమని వెల్లడి చేసెను. భగవానుడు అనగా పరబ్రహ్మము లేక పరమాత్మ యేలాగున నిత్యుడో అందువల్ల యీ యాత్మయు నిత్యమని గల జ్ఞానమే దృఢమైన లేక అపరోక్షమైన జ్ఞానమని గ్రహించవలయును. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అని భగవానుడానతిచ్చిన కారణమువల్లనే సాధువులపై పరమ భక్తులపై జనులకు ఇంతమాత్రమైన విశ్వాసము కలుగుటకుకారణము. అదిన్నిగాక జ్ఞానులపై పరమభక్తులపై బ్రహ్మనిష్ఠులపై శ్రీభగవాను

నకు యెంతప్రీతిగలదో విశ్వాసము గలదో దీనివల్ల వెల్లడియగుచున్నది. ఇట్టి జ్ఞానము యేలాగున మరుగుపడినదో ఆ విషయము యీ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్॥

తా॥ సత్త్వము, రజస్సు, తమస్సు అను పేర్లుగల త్రిగుణాత్మకమగు మాయాపాశముచే నిత్యుడై, శుద్ధుడై ఉండు ఆత్మ నిజస్వరూపము తెలియక బంధమును పొందుచున్నాడు. కావున వివేకజ్ఞానము గలవాడు సత్త్వగుణము యెట్లు ఆత్మనుబంధించునో, రజోగుణమెట్లు బంధించునో, తమోగుణమెట్లు బంధించునో అను నీ విషయము గీత పదునాలుగవ అధ్యాయమున కనుగొని అట్టి బంధములను తొలగించేలాగున చూడవలయును.

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥

తా॥ నిత్యుడగు జీవుడు దేహోత్పత్తికి బీజభూతములు మూడునగు యీ సత్త్వరజస్తమోగుణములను అతిక్రమించి జననము, మరణము వార్ధక్యము, దుఃఖములనువానిచేత విడువబడినవాడై మోక్షమును పొందుచున్నాడు. పై జెప్పిన రెండుశ్లోకములవల్ల బంధమెట్లు కలిగెను? ముక్తియెట్లుసిద్ధించును? అను విషయము తెలుపడమైనది. ఈవిషయమై ఆత్మబోధయందు శ్రీ శంకరభగవత్పాదులు ఉపదేశించినది చూడుడు.

శ్లో॥ నిత్యశుద్ధవిముక్తైక మఖండానంద మద్వయం।
సత్యం జ్ఞానమనంతం యత్పరం బ్రహ్మాహమేవ తత్॥

తా॥ ఎల్లప్పుడు ఉండునదిగాను, పరమశుద్ధముగాను, ముక్తస్వరూపముగాను, ఒకటిగాను, అఖండముగాను, ఆనందస్వరూపముగాను, అద్వయస్వరూపముగాను, కాలత్రయమందు బాధింపబడనిదిగాను యేస్వరూపముగలదో అటువంటి శ్రేష్ఠమైన సర్వపరిపూర్ణస్వరూపమును తనఆత్మగా భావన చేసుకొనవలయును. ఇదే ఆత్మ 'నిత్య'మను వాక్యముయొక్క కట్టకడపటి స్థితియని గ్రహించుకొనవలయును.

శ్లో॥ వివిక్తదేశ ఆశీనో విరాగో విజితేంద్రియః॥
భావయేదేకమాత్మానం తమనంతమనన్యధీః॥

తా॥ జనసంకులముగాని ప్రదేశమందు కూర్చున్నవాడై సమస్తాశలను వర్జించి యింద్రియములను వ్యాపారమందు ప్రవేశింపకుండ అణచి మనస్సును చలింపకుండ ఆత్మయందుంచి ఆ యాత్మయే తన ఆత్మయని చింతింపవలసినది.

1. ఆత్మ నిత్యమను విషయమై యిదివరలో వ్రాసినదానివల్ల తెలిసికొనగలరు.

2. ఆత్మ శుద్ధమగుటవల్ల అశుద్ధమును ప్రేమింపకపోవుటకున్ను శుద్ధమును ప్రేమించుటకున్ను కారణము.

3. ఆత్మ ఆనందస్వరూపమగుటవల్ల దుఃఖమును ఆచరించక పోవుటకున్ను, సుఖమును ఆదరించుటకున్ను కారణమగుచున్నది.

4. ఆత్మ అమృతస్వరూప మగుటవల్లనే మరణమును యిచ్ఛయింపకపోవుటకున్ను, అమృతమును అనగా మోక్షమును అభిమానించుటకున్ను కారణమగుచున్నది. ఈ నాలుగు విషయములను పైనుదహరించిన వ్యాసమున సంగ్రహముగా నిరూపించడమైనది.

ఇట్టి ఆత్మయొక్క నిత్యత్వము యీలోకములో జీవించియున్నప్పుడే పొందవలయును అని కేనోపనిషత్తు చెప్పుచున్నది.

శ్లో॥ ఇహ చేదవేదీదథ సత్యమస్తి
న చేదిహావేదీన్మహతీ వినష్టిః।
భూతేషు భూతేషు విచింత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి॥

తా॥ ఈ లోకమునందు పరమాత్మస్వరూపము నెరింగినవారలకు సత్యస్వరూపము సిద్ధించుచున్నది. అనగా గొప్పలాభముగలుగుచున్నది. ఈలోకమునందు పరమాత్మస్వరూపము నెరుంగనివారలకు గొప్పనష్టము కలుగుచున్నది. కావున బ్రహ్మజ్ఞానులు సకల భూతములయందుండెడి యద్వితీయమైన పరమాత్మను తెలిసికొని యీలోకమునుండి మరణము నొంది జననమరణరహితమైన అమృతత్వమును (మోక్షమును) పొందుచున్నారు.

వి॥ తాను సంపాదించిన యేదైన ఒకవస్తువు వదలిపోవునప్పుడు యెంతైన క్లేశమును పొందుచుండగా సమస్తమును, దేహమునుసహ విడిచి వెళ్ళునప్పుడు యెంత క్లేశము కలుగునో అదే గొప్పనష్టమని చెప్పుటకు కారణము. అలాగున ఒక్క నిధి దొరికినప్పుడు యెంత సంతోషము పొందుచుండునో అట్లుండగా శాశ్వతసుఖమగు మోక్షము గలుగుట యేదిగలదో అదే గొప్పలాభమని నిరూపించుటకు కారణమైనవి. గీతయున్ను యిదేవిధముగానే వచించుచున్నది.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ।

తా॥ ఏపురుషుడు బ్రతికియున్నప్పుడే అనగా యీ లోకమున యీ శరీరముతో ఉండునప్పుడే కామక్రోధములయొక్క వేగమును సహింప శక్తిగలిగియున్నాడో అట్టి పురుషుడు యింద్రియ నిగ్రహము గలవాడును శాశ్వతానందము గలవాడునగుచున్నాడు. "ప్రాక్ఛరీరవిమోక్షణాత్" అని ప్రయోగించుటవల్ల శరీరవిమోచనమునకు ముందుగానే అమృతత్వమును పొందేలాగున చూడవలెనని తెలుపడమైనది. ఇదే విధముగ అయిదవ అధ్యాయమున మరియొక శ్లోకమున్ను గలదు.

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

తా॥ ఎవరియొక్క మనస్సు సకల భూతముల యందును బ్రహ్మము సమముగా నున్నదను విషయమునందు నిశ్చలమైయున్నదో అట్టివారు యీ లోకమునందే జన్మమును జయించినవారగుచున్నారు. మరియు బ్రహ్మము ప్రకృతిదోషరహితమైనది. కనుక అట్టి దోష రహితులు సదా బ్రహ్మమునందున్నవారగుచున్నారు. ఈశ్లోకమందును "ఇహైవ" అని ప్రయోగించుటవల్ల యీ దేహముతో యీలోకమున నున్నప్పుడే జననమరణరహితస్థితిని పొందవలసియుండునని భగవానుడు హెచ్చరించెను, మరల "నిర్దోషం హి సమం బ్రహ్మ" బ్రహ్మము యెట్లు నిర్దోషమో అట్టి నిర్దోషత్వము యీఆత్మకు కలుగునప్పుడే బ్రహ్మప్రాప్తి కలుగునని ముముక్షువులు లెస్సగా తెలిసికొనవలసియుండును.

---

ఓమ్

# జీవన్ముక్తులు

సాధువుల, పరమభక్తుల, బ్రహ్మనిష్ఠుల ప్రార్థనలు యీ క్రింది విధముగా కనపడుచున్నవి.

శ్లో॥ దుర్జనస్సజ్జనో భూయాత్సజ్జనశ్శాంతి మాప్నుయాత్।
శాంతో ముచ్యేత బంధేభ్యః ముక్తశ్చాన్యాన్విమోచయేత్॥

తా॥ దుర్జనులు సజ్జనులగుదురుగాక! సజ్జనులు శాంతిని పొందుదురుగాక! శాంతిపరులు బంధమునుండి ముక్తినొందుదురుగాక! ముక్తాత్ములు అన్యులను బంధమునుండి విముక్తులుగా చేయుదురుగాక!

ఇచట కట్టకడపటి పదము యోచించవలసినది. అదేమన "ముక్తశ్చాన్యాన్విమోచయేత్" జీవన్ముక్తులు బద్ధులైన జీవులను బంధవిముక్తలను చేయుదురుగాక! అని గలదు. దీనివల్ల జీవన్ముక్తిని పొందినవారు సంసారబంధములో చిక్కుకొనినవారిని విముక్తిచేయుటలో యత్నించవలెననిగలదు. నిజముగా ఆలోచించిన యిదేనిజమైన మహాత్ముల ధర్మమగును. బద్ధుడైనవాడు మరియొకనిని బంధమునుండి విమోచనము చేయజాలడు. బంధింపబడినవాడు బంధములోనుండు మరియొకరిని యెట్లు బంధవిమోచనము చేయగలుగును? కొందరు యీ పరమసత్యమును తెలుసుకొనజాలక జీవన్ముక్తులకు ప్రపంచముతో యేమిపని? అని తలంతురు. ఇది ఋషి సాంప్రదాయము తెలియకపోవుటచే గలిగిన ప్రమాదమనియే గ్రహించవలెను. బ్రహ్మవేత్తల చరిత్రము తెలియకపోవుటవల్లను, తాను ముక్తిని పొందకపోవుటచేతను యీలాటి ఆలోచన కలుగుటకు హేతువు. ఒక్కొక్క మహాత్ముడున్ను ముక్తుడై యితరులను ముక్తులనుగా చేయకపోయిన బ్రహ్మవిద్యయే నశించును గదా! వ్యాసాది ఋషులు ముక్తాత్ములై ఆలాగుననేవుండిపోయిన బ్రహ్మవిద్యయే నశించిపోయెడిదిగదా! ఆలాగున సనకాది యోగులు యోగసిద్ధిని పొంది అట్టిమార్గమును జిజ్ఞాసువులకు వుపదేశింపకపోయిన యోగ సాంప్రదాయమే నశించియుండునుగదా! ఆలాగున కపిల, జైమిని, పతంజలి మొదలగు మహామునిసత్తములు శిష్యులకు బోధింపకయు, శాస్త్రములను రచింపకయు పోయినచో వారితోసహా అట్టివిద్యలున్ను నశించి

పోయియుండునుగదా! అదేప్రకారము జినుడు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలగు మహనీయాత్ములు ఉత్తమజిజ్ఞాసువులను దగ్గరకు చేరదీసి మోక్షధర్మము నుపదేశింపకపోయిన, జ్ఞానమార్గ గ్రంథములను రచింపక పోయిన, ఆశ్రమములు, మఠములు నిర్మింపకపోయిన వారివారికి గలిగిన బ్రహ్మవిద్య క్షయించిపోయివుండునుగదా! వెయ్యేల, బ్రహ్మాదిమునులు వేదమార్గమును అంతేవాసులకు తెలుపకపోయిన వేదమే లుప్తమైపోయి యుండునుగదా! కావుననే గురుగీతయందు యీ లాగున తెలుపుటకు కారణము.

శ్లో॥ నిత్యం బ్రహ్మ నిరాకారం నిర్గుణం బోధయేత్పరం।
భాసయన్బ్రహ్మభావం చ దీపో దీపాంతరం యథా॥

తా॥ నిత్యమైనట్టియు, నిరాకారమైనట్టియు, నిర్గుణమైనట్టియు పరబ్రహ్మమును ఉత్తమ జిజ్ఞాసువులకు బోధించవలెననియు, ఒక దీపము అనేక దీపములను వెలిగింపచేయునట్లు తనకు గలిగిన ఆత్మజ్ఞానము ముముక్షువుల హృదయమందు ప్రకాశింప చేయవలెననియు పరమశివుడు పార్వతీదేవికి ఉపదేశించెను. ఇదే నిజమైన ఋషిపరంపరా ధర్మము. కావుననే వారివారి గురుపరంపరాస్తోత్రమును పఠించునప్పుడు ఆదిమూలపురుషునినుండి యిప్పటివరకుగల గురువులను స్మరించుటకు కారణము. చూడుడు. వేదాన్తమార్గములో

"ఓం నారాయణం పద్మభువం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్రపరాశరం చ।
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం
గోవిందయోగీంద్రమథాస్య శిష్యమ్॥

"శ్రీశంకరాచార్యం"అని పఠించుచు "అస్మద్గురూన్సంతతమానతోఽస్మి" అని యిట్లు స్మరించుచుందురు. వైష్ణవులును యీలాగుననే వారి గురుపరంపరను స్మరింతురు.

"లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమాం।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్॥

ఈలాగున ప్రతి సాంప్రదాయములోనున్న వారివారి గురుపరంపరను స్మరించుచుందురు. ఆ యా పరంపరలన్నిటిని వ్రాయుటతో వ్యాసము పెరుగుటయే తప్ప సారము పై నిరూపించినదానివల్లనే సుస్పష్టము గాగలదు. ఉపనిషత్తులలోను యీలాగుననే కనబడుచున్నది.

శ్లో॥ సర్వేఽత్ర సుఖినస్సంతు సర్వే సంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చి ద్దుఃఖమాప్నుయాత్ ॥

శ్లో॥ సర్వ స్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।
సర్వస్సద్బుద్ధిమాప్నోతు సర్వస్సర్వత్ర నందతు॥

తా॥ సర్వజీవులున్ను సుఖమును పొందుదురుగాక! సర్వులున్ను ఆరోగ్యవంతులై యుందురుగాక! సర్వులున్ను మంగళము నేచూచెదరుగాక! ఒక్కరున్ను దుఃఖమును పొందకుందురుగాక! సర్వజీవులున్ను ఆటంకములను దాటుదురుగాక! సర్వులున్ను నిత్యమంగళస్వరూపుడగు పరమాత్మను దర్శింతురుగాక! అన్నిజీవులున్ను సద్బుద్ధిగలవి యగుగాక! అందరున్ను అంతటను ఆనందము ననుభవింతురుగాక! వేదాస్తశాస్త్రములో యేలాగున చెప్పబడినదో వైదికమార్గ యజ్ఞాది క్రతువులలోను ఆలాగుననే ప్రార్థనలు కనబడుచున్నవి. ఇదంతయుచూచిన ఋషులందరు లోకానుగ్రహతత్పరులై ఉన్నట్లే గోచరించుచున్నది.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు॥

తా॥ ప్రజలందరికిన్ని సౌఖ్యము గల్గునుగాక! న్యాయమార్గముగా భూపాలురు లోకమును పరిపాలింతురుగాక! గోబ్రాహ్మణులకు (జ్ఞానులకు) యెల్లప్పుడున్ను శుభము గలుగునుగాక! సమస్తలోకములున్ను సుఖమును పొందునుగాక!

శ్లో॥ అపుత్రాః పుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః ।
అధనాస్సధనాస్సంతు జీవంతు శరదాం శతమ్॥

తా॥ అపుత్రులు పుత్రవంతులగుదురుగాక! పుత్రవంతులు పౌత్రులుగలవారలగుదురుగాక! నిర్ధనులు ధనవంతులగుదురుగాక! మానవులు పూర్ణాయుస్సుగలవారై నూరుసంవత్సరములు జీవింతురుగాక!

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సంతు నిర్భయాః॥

తా॥ మేఘము సకాలమున వర్షించునుగాక! భూమి సస్యశ్యామలముగ సమృద్ధినొందునుగాక! దేశము యేవిధమైన సంక్షోభమును పొందకయుండుగాక! బ్రాహ్మణులకు (ఆత్మజ్ఞానులకు) ఏలాటి భయమున్ను గలుగక ఉండుగాక! ఓహో! ఋషులు, మహాత్ములు యెటువంటి కరుణాస్వరూపులు, దయాసముద్రులు అని యీ ప్రార్థనవల్లనే తెలుసుకొనవచ్చును గదా! ఇక యీవిషయమై గీతాశాస్త్రము యేమి చెప్పుచున్నదో చూచెదము.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే॥

తా॥ ఏ బ్రహ్మజ్ఞానియయితే ఆత్మయందు రమించువాడును, తనలోతానే ఆత్మజ్ఞానముచే తృప్తినిపొందువాడును, తనయందే ఆనందమును పొందుచున్నవాడును అగునో అట్టి ఆత్మారామునకు చేయదగినదొకటియు లేదు.

ఆత్మజ్ఞానికి చేయదగినది గలదని చెప్పినచో కొందరుమహాత్ములు వారిసంస్కారము ననుసరించి అనగా ప్రారబ్ధకర్మానుసారముగా అవధూతవృత్తిలోను, మౌనముతోను, వృత్తిశూన్యముగాను ఉందురు. కావున వారుగూడ కర్మచేయవలెనని చెప్పినచో పామరజనులు నిందలు చేయవచ్చునని తలంచి శ్రీ కృష్ణభగవానుడు యిట్లు చెప్పుటకుకారణము. అయితే అట్టి మహాత్మునియొక్క లక్షణము మూడుపదములతో నిరూపించినారు. 1. ఆత్మరతి, 2. ఆత్మతృప్తి, 3. ఆత్మసంతుష్టి మొదలైన గుణములు కలిగియుండవలయును. ఇదిన్నీ జ్ఞాపకములో నుంచవలయును. ఇదియొక పక్షము. రెండవపక్షము మరియొకటిగలదు. అది క్రింద నిరూపింపబడుచున్నది.

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥

తా॥ అట్టి ఆత్మజ్ఞానికి యిచట ఏదైనాచేసి పొందవలసినది మరి యొకటిలేదు. చేయక ఉండినను దానివల్లకలిగెడు లోపమేమియులేదు. ఈ ఆత్మజ్ఞానికి యే ప్రాణివల్లను పొందవలసినది కొంచమైననులేదు. దీని వల్ల అట్టి ఆత్మజ్ఞాని లోకహితార్థము కర్మచేసినను దానివల్ల బంధ మునుపొందడు. చేయకపోయినను దానివల్ల ప్రత్యవాయమునుపొందడు. అది అట్టి మహాత్ముని యిష్టమునననుసరించి ఉండవచ్చును. ఇచట యీలాగున చెప్పుటకు కారణమేమన అనేకమహాత్ములు లోకోద్ధార తత్పరులై యుందురు. అజ్ఞానులు అట్టివారినిచూచి ఆత్మజ్ఞానులకు యీలోకవ్యవహారమెందు కుండవలయును? అట్టివారు యేకాంతములో నిర్వికల్పస్థితిలో ఉండవలసినవారుగదా ? యని ప్రశ్నచేయవచ్చునని తలంచియే యీలాగున భగవానుడు తెలుపుటకు కారణమైనది. ఇవి యన్నియున్ను మనస్సున నుంచుకొనియే ఆరవ అధ్యాయమున యిట్లు ఉపదేశించుటకు కారణమైనది.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥

తా॥ ఏ యోగి అయితే జీవాత్మపరమాత్మల ఏకత్వము నెరింగిన వాడై, సమస్త భూతాంతర్యామినగు నన్ను తన ఆత్మస్వరూపముగా తెలుసుకొనుచున్నాడో, అట్టియోగి సర్వప్రకారములుగా వర్తించు చున్నవాడైనను, సదా నాయందు ఉండువాడే యగుచున్నాడు. సర్వ విధముల ప్రవర్తించువాడైనను అని చెప్పుటలో సదా నిర్బీజసమాధిలో నుండువాడైనను, ఏకాంతముగా మౌనియై యుండినను లేక లోకోద్ధర ణము కొరకు ప్రవర్తించువాడైనను యెల్లప్పుడున్ను పరమాత్మయందు ఉండువాడేయగును.

లేక బ్రహ్మచర్యాశ్రమములోగాని, గృహస్థాశ్రమములోగాని, వానప్రస్థాశ్రమములోగాని, సన్యాసాశ్రమములోగాని ఉండినను విరోధములేదు. లేక బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీ పురుషులలో యెవరైయున్నప్పటికిన్ని విరోధములేదు.

ఈలాగున చెప్పుటయే సరియైన భావమగును. ఏలన వారివారి సంస్కారము లేక ప్రారబ్ధము అనేకవిధములుగా నుండును. ఒకేవిధమగు సంస్కారము యేమహాత్మునికిన్ని ఉండదు.

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥

తా॥ ఏ మహాత్ముడు ఆత్మను, ప్రకృతిని, ప్రకృతిగుణములను విభజించి యెరుంగుచున్నాడో, అట్టిముక్తాత్ముడు బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమములలోగాని, బ్రాహ్మణాది నాలుగు వర్ణములలోగాని ఉండినను, తత్తద్వర్ణాశ్రమగుణములతో కూడినవాడైనను లేక లేనివాడైనను, వాడు మరల జన్మము నెత్తడు. వేగినవిత్తనము యెచ్చటబెట్టినను యెట్లు మొలకెత్తదో, నీటిలోకరిగిన ఉప్పు యేలాగున జలమయమైపోవునో ఆలాగున ఆత్మ పరమాత్మలోయేకత్వమునుపొందినజీవుడు మరల ద్వైతాకారస్థితి గలిగిఉండును. వాడు లోకోపకారకార్యములలో ప్రయత్నించినను లేక యేమియు చేయకుండినను ముక్తుడే. సంశయములేదు. గీతయొక్క ఆశయము శ్రీకృష్ణభగవానుడు యీక్రిందిశ్లోకమున తెలిపెను.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి॥

తా॥ జనకాదిజీవన్ముక్తులగు మహాత్ములు కర్మముచేసికొనియు మోక్షమును పొందిరి. కావున నీకు కర్మము చేయవలసిన అవసరము లేనప్పటికిన్ని లోకహితార్థమును ఉద్దేశించిఅయినా ఫలాపేక్షరహితమైన కర్మను చేయుటకు అర్హుడవైయున్నావు. దీనికి దృష్టాంతముగా భగవంతుడు తన ప్రవృత్తిని యీక్రిందిశ్లోకమున నిరూపించి చెప్పెను.

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥

తా॥ ఓ యర్జునా! నేను సర్వకాలములయందును, జాగరూకుడనై కొంచమైనను పొరపాటులేక కర్మలను చేయకపోతినేని లోకములోని మానవులందరును నావలెనే కర్మములను చేయక యూరకుందురు. అట్లు చేయకపోవుటచేత ఆత్మశుద్ధి గలుగక పతితులగుదురు. దీనికి మరియొక దృష్టాంతము క్రింద నిరూపింపబడుచున్నది.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువ ర్తతే ॥

తా॥ శ్రేష్ఠుడగువాడు ఏ యే కర్మను ఆచరించుచున్నాడో, ఆయా కర్మనే యితరుడైన మనుజుడు చేయుచున్నాడు. వాడు దేనిని ప్రమాణముగా అంగీకరించుచున్నాడో, ప్రపంచజనము దానినే అనుసరించుచున్నది. మహాత్ముల జన్మము లోకమునకు ఆదర్శప్రాయముగా నుండును. ఈ సత్యమునే భగవానుడు యిట్లు నిరూపించెను. మనము ఒక మహాత్ముని దర్శనము కొరకు వెళ్ళిన వారియొక్క వర్తమానస్థితిని గ్రహించగలముగాని అట్టి మహోన్నతస్థితికి వారేలాగున అధ్యయన తపోధ్యానయోగాదులనుచేసిరో చూడజాలము. అయితే వారిజీవిత చరిత్రము చదివిన ఆ సత్యము తెలిసికొనగలము. కావుననే లోకోత్తరపురుషులు యీమానవులు యెట్లు తరింపగలరో అట్టిధర్మమును తమజీవితాంత్యమువరకున్ను అనుష్ఠించిచూపుదురు. ఈకారణమువలన భగవానుడు తనజీవితచరిత్రను అనగా అవతారములను గురించి స్వీయముగా యీలాగున చెప్పుటకు కారణమైనది.

శ్లో॥ పరోపకృతి కైవల్యే తులయిత్వా జగద్గురుః ।
గుర్వీం చోపకృతిం మత్వా అవతారా న్దశాగ్రహీత్ ॥

తా॥ జగద్గురుడగు సాక్షాత్ శ్రీమన్నారాయణమూర్తి శ్రీ వైకుంఠములోనుండి యీలాగున ఆలోచించెను. "వైకుంఠములో యీలాగునవుండుట మేలా? లేక పరప్రాణులకు వుపకారార్థముగాజన్మించి వారిని తరింపచేయుట మేలా" అను రెండుశక్తులను త్రాసులోపెట్టి తూచెనట. అప్పుడు పరప్రాణులకు మేలుచేసెడు భాగముగు త్రాసుయొక్క తట్టు అధికభారముతో వుండెననియు, రెండవ సిబ్బి భారరహితమైనదై పైకిలేచెననియు, ఆకారణమువల్ల దశావతారములెత్తి లోకకంటకమును తొలగించి మోక్షమార్గము జనులకు వుపదేశించుటకు కారణమైనదని దీని యర్థము. ఇంతకన్న పరమప్రమాణము మరి యేమి కావలయును? కావుననే మహర్షులందరున్ను, సనకాదియోగులున్ను, శ్రీ బుద్ధ, శ్రీ శంకరాచార్య, శ్రీ యేసుక్రీస్తు, శ్రీ మహమ్మదునబి, శ్రీగాంధీగారు మొదలగు మహాపురుషులందరున్ను తమ బంధవిముక్తిని కలుగజేసికొని

దైవానందసుఖము ననుభవించి మరల లోకములోనికి దిగి యితరులను వుద్ధరించడమైనది.

శ్లో॥ పరేషా ముపదేశాయ క్షేమాయ చ మనీషిణః ।
పక్వాశ్చ కర్మ కుర్వంతి భయాన్నాదేశశాస్త్రతః ॥

తా॥ మహాత్ములైనవారు జీవన్ముక్తస్థితిగలిగి పరిపక్వాత్ములై యున్నప్పటికిన్ని యితరులయొక్క క్షేమముకొరకున్ను తమఆత్మయొక్క నిర్మలత్వముకొరకున్ను నిష్కామకర్మలను చేయుచునేయుందురు. అట్లు చేయకపోవుట శాస్త్రోల్లంఘనము గలుగునని భయముచేతగాని, జీవన్ముక్తి సిద్ధించదని గలిగెడు భయముచేతగానిగాదు. అట్లుచేయుట వారి స్వభావమేగాని మరియొకటిగాదు. అయితే జీవన్ముక్తులలో యిరుతెగల వారుగలరు. ఒక తెగవారు తాముమాత్రము తరించే స్వభావము గలిగి యుందురు. రెండవతెగవారు యిదివరలో జీవన్ముక్తులైయుండి యితరులను తరింపచేయుటకొరకు జన్మించినవారలు. ఈ శ్రేణిలో చేరినవారు లోకోద్ధారకులు. అయితే జీవన్ముక్తులు మరల జన్మింతురా? అను ప్రశ్న ఒకటిగలదు. వారి జన్మము ప్రాకృత కర్మబద్ధుల జన్మమువంటిదిగాదు. ప్రాకృతజనులు కర్మకు బద్ధులైనవారు, ప్రకృతికిలోబడినవారు. వీరయితే కర్మబంధ విముక్తులు, ప్రకృతిని లోపరచుకొని తనజన్మహేతువును జనులకు బోధించుటకొరకు వచ్చినవారు. ఈవిషయమై వివేక చూడామణి యందు శ్రీశంకరభగవత్పాదులు తెలిపినది చూడుడు. ఈ సత్యమును మనము తెలిసికొనకపోయిన రామకృష్ణాద్యవతార పురుషులను గూడ ప్రకృతి బద్ధకర్మ జీవరాశిశ్రేణిలో గణించవలసియుందుము. అది యెటువంటి ప్రజ్ఞయో మనీషులే నిశ్చయించుదురుగాక!

శ్లో॥ శాంతా మహాంతో నివసంతి సంతో వసంతవల్లోకహితం చరంతః।
తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనానహేతునాన్యానపి తారయంతః॥

తా॥ వసంతఋతువువలె లోకహితమును ఆచరించువారును, శాంతులును, గొప్పవారును అగు సత్పురుషులు తాము భయంకరమైన గొప్ప సంసారమను సముద్రమును దాటినవారు కనుకనే నిరపేక్షతో యితరులైన జనులనుకూడ తరింపజేయుచున్నారు. శిశిరఋతువులో వృక్షములన్నిటియొక్క ఆకులన్నియు రాలి చెట్లన్నియు యెండినవివలె

కళాశూన్యములై యుండును. వసంతఋతువు ప్రవేశించినవెంటనే అన్ని వృక్షములున్ను చిగురించి పుష్పించి శోభాయమానమై యుండును. అయితే వసంతఋతువు అరణ్యమున నేయననేమి, ప్రపంచములోగలవృక్షములనన్నింటిని పుష్పపల్లవాదులచే శోభాయమానమై షోడశకళాపూర్ణముగాచేసినను యేలాటి ప్రతిఫలమును కోరుటలేదు. ఆలాగున సంసారారణ్యములోగల జనుల హృదయక్షేత్రములలో సత్య, శాంత, దయ, జ్ఞాన, కరుణాదులు నశించునప్పుడు మహాత్ములవతరించి వారి హృదయక్షేత్రమును సత్య, శాంత, కరుణ, జ్ఞానాదులచే శోభింపజేయుదురు. మరియొక స్వంతఫలము నుద్దేశించి వారుచేయుటలేదు. ఈవిషయమునే యోగవాసిష్ఠమున వసిష్ఠమునీంద్రుడు యీలాగున తెలిపెను.

శ్లో॥ సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా।
హృదయేనాస్త సర్వాస్థో ముక్త ఏవో త్తమాశయః॥

తా॥ ఏ మహాత్ముడు బుద్ధిచేత సకలాసక్తి విశేషములను నిశ్శేషముగా విడిచినవాడగు నిర్మలజ్ఞానము గలవాడగునో ఆ పురుషుడు కర్మములనుచేసిన చేయుగాక ! విడచిన విడుచుగాక ! ఎల్లప్పుడును ముక్తుడే యగును. కనుకనే అతని కర్మము లన్నియు సమాధియను యోగాగ్నియందు భస్మములై పోవుచున్నవని శాస్త్రములు చెప్పుచున్నవి. పంచదశియందు ధ్యానదీపమున శ్రీ విద్యారణ్యస్వాములవారు చెప్పినభాగము చదివినచో యీ సంశయమంతయు దూరీకృతమగును. అది అనేక శ్లోకములతో విస్తారముగా చెప్పడమైనది. సంక్షిప్తముగా యిచ్చట నిరూపింపబడును.

శ్లో॥ తదిత్థం తత్త్వవిజ్ఞానే సాధనా నుపమర్దనాత్ ।
జ్ఞానినా చరితుం శక్యం సమ్యగ్రాజ్యాది లౌకికమ్॥

తా॥ తత్త్వజ్ఞానము కలుగుచుండగా లౌకికవ్యవహార సాధనములగు మనస్సు మొదలగువానిని స్వాధీనము చేసుకొనుటవలన జ్ఞానికి రాజ్యపరిపాలనాది లౌకికకర్మలు చేయ శక్యమగును.

శ్లో॥ మిథ్యాత్వబుద్ధ్యా తత్రేచ్ఛా నాస్తి చేత్తర్హి మాస్తు తత్ ।
ధ్యాయన్వాఽథ వ్యవహరన్యథాఽఽరబ్ధం వసత్వయమ్॥

తా॥ మిథ్యాత్వజ్ఞానముచేత ప్రపంచభ్రాంతి జ్ఞానికి లేనందువలన ధ్యానమును చేయుచున్నైనను లేక వ్యవహారమును చేయుచున్నైనను ప్రారబ్ధకర్మ ప్రకారము ప్రవర్తించును.

ప్రారబ్ధము అనేకవిధములుగా ఉండుటవల్ల జ్ఞానులందరు ఒకే విధముగా ఉండవలెనని చెప్పుటకు సాధ్యముకాదు. అయితే వారి ప్రవర్తనలు వేరు వేరుగా ఉన్నప్పటికిన్ని శాస్త్రనిషిద్ధమైన, పాపమైన కృత్యము లెవరున్ను చేయరు.

శ్లో॥ అవశ్యంభావి భావానాం ప్రతీకారో భవేద్యతి।
తథా దుఃఖైర్న లిప్యేరన్ నల రామ యుధిష్ఠిరాః॥

తా॥ ప్రారబ్ధకర్మమునకు ప్రతీకారముచేయగల శక్తి గలిగి ఉండెనేని నలమహారాజు శ్రీరామచంద్రుడు ధర్మరాజు యిట్టివారలు అరణ్యములో అనేకవిధములగు క్లేశములను పొందవలసియుండరు. అయితే నలుడు శ్రీరామచంద్రుడు ధర్మరాజాదులు యేలాటి నిషిద్ధకార్యమును మాత్రము చేసియుండలేదు. నీచకృత్యములు ఏమియు చేయలేదు. ఇది యిచట ముఖ్యముగా గ్రహించవలసిన విషయము. దీనియొక్క వివేచన బుద్ధి లేకపోవుటవల్లనే కొందరు నిషిద్ధకార్యములు మా ప్రారబ్ధకర్మమని చెప్పుటకు కారణము.

శ్లో॥ కష్ణో భోగీ శుకస్త్యాగీ నృపౌ జనక రాఘవౌ।
వసిష్ఠః కర్మకర్తా చ పంచైతే జ్ఞానినస్సమాః॥

తా॥ శ్రీకృష్ణభగవానుడు మహాభోగిగాను, శుకబ్రహ్మర్షి పరమత్యాగిగాను, జనకమహారాజు, శ్రీరామచంద్రుడు రాజ్యపాలకులుగాను, వసిష్ఠమునీంద్రుడు కర్మకాండ ప్రవర్తకుడుగాను ఉండినను వీరయిదుగురున్ను ఆత్మజ్ఞానావస్థలో సమానులుగానే యుండిరి.

ఇక యీ వ్యాసము పూర్తిచేయువిషయములో మహేశ్వరుండు సూతసంహితయందు సనకాది ఋషులకు, యెంత ఆత్మజ్ఞాని యైనను యెంత త్యాగియైనను లోకమునకు తానుపొందిన జ్ఞానమును బోధించవలెననియు లేనిచో బ్రహ్మమార్గమును విచ్ఛేదముచేసిన పాపియగుననియు తెలిపిన విషయము చూడుడు.

మహేశ్వర ఉవాచ = ఈశ్వరుడు చెప్పెను.

శ్లో॥ భవంతోఽపి మహాత్మానో మత్తః ప్రాప్తాత్మవేదనాః ।
అభవన్ కృతకృత్యాశ్చ మా శంకిధ్వం కదాచన॥

తా॥ మహాత్ములగు మహర్షులారా! నావల్ల మీరందరున్ను జ్ఞానమున్ను, యోగమున్ను గలిగిన యీవేదాన్తసారమును విని ఆత్మవేత్తలైతిరి. మీరందరు కృతకృత్యులైతిరి. దీనియందు సంశయము లేదు. బ్రహ్మప్రాప్తి గలిగిన తరువాత కృతకృత్యుడైన యోగి అట్టి ఆత్మానుభవజ్ఞానమును భక్తులకు బోధించవలసినదని యీ క్రింది శ్లోకములచేత చెప్పుచున్నారు.

శ్లో॥ స్థాపయధ్వమిమం మార్గం ప్రయత్నేనాపి హే ద్విజాః।
స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్ ॥

తా॥ బ్రహ్మవేత్తలారా! మీరు ప్రయత్నపూర్వకముగా యిట్టి జ్ఞానమార్గమును ప్రపంచములో స్థాపించవలయును. ఇట్టి పుణ్యమార్గమును స్థాపించితిరేని ప్రపంచమంతయు సౌఖ్యము నొందగలుగును.

శ్లో॥ యో హి స్థాపయితుం శక్తో న కుర్యాన్మోహితో నరః।
తస్య హంతా స పాపీ స్యా దితి వేదాన్తనిశ్చయః॥

తా॥ ఇట్టి ఆత్మజ్ఞానము పొందినవాడు అట్టి దైవమార్గమును ప్రపంచములో ఆశ్రమముల నిలిపి జనులకు బోధింపగల శక్తిగలిగియుండియు, య్యేదైన కారణముచే మోహితుడై అట్లుచేయని మానవుడు అట్టిదైవమార్గమును నశింపజేసిన పాపియగుచున్నాడు. ఇది వేదాన్త శాస్త్రముయొక్క నిశ్చయమని మరువకుడు.

శ్లో॥ యః స్థాపయితు ముద్యుక్తః శ్రద్ధయైవా క్షమోఽపి సన్।
సర్వపాప వినిర్ముక్త స్సాక్షాద్జ్ఞాన మవాప్నుయాత్॥

తా॥ అట్లు స్థాపించువారు శ్రద్ధయు, క్షమయు గలిగియుండవలెను. అట్టివాడు సర్వపాపములనుండి విముక్తుడై సాక్షాద్బ్రహ్మజ్ఞానమును పొందుచున్నాడు.

శ్లో॥ యశ్చ విద్యాభిమానేన వేదమార్గప్రవర్తకం ।
చలజాత్యాదిభిర్జ్ఞియా త్సమహాపాతకీ భవేత్ ॥

తా॥ ఏమానవుండు విద్యాగర్వముచేతను, జాత్యభిమానము చేతను, సన్న్యాసాద్యాశ్రమాభిమానముచేతను, అధికారాభిమానము చేతను ధర్మమార్గప్రవర్తకుని కుతర్కాది మోసకృత్యముచేత జయింప చూచునో వాడు మహాపాతకియగును. (శ్రీ) నారద భక్తిసూత్రముల యందు చెప్పినది చూడుడు.

సూ॥ స తరతి స తరతి స లోకాంస్తారయతి॥

వాడు తరించును. వాడు తరించును. వాడు లోకములను తరింప జేయును. దీనివల్ల సంసారసాగరము తరించినవాడు ఇతరులను తరింప చేయును. ఇది జీవన్ముక్తుల సహజ ధర్మము.

ఇక యీవిషయమై విస్తరించిచెప్పతలంచలేదు. ఒకానొకవాక్య మమాత్రము చెప్పి పూర్తిచేసెద. ఇది పరమభక్తులు, జిజ్ఞాసువులు, ముముక్షువులు, కృతజ్ఞతా స్వభావముగలవారెల్లప్పుడును మరువరాని విషయము. ఇది (శ్రీ)పరమశివుడు గీతయందు పార్వతీదేవికి తెలిపినది.

శ్లో॥ గురుధ్యానేనైవ నిత్యం దేహీ బ్రహ్మమయో భవేత్ ।
స్థితశ్చ యత్ర కుత్రాపి ముక్తోఽసౌ నాత్ర సంశయః ॥

తా॥ జీవుడు నిరంతరము (శ్రీ) గురుపరబ్రహ్మ స్వరూపధ్యానము చేతనే బ్రహ్మస్వరూపుడగుచున్నాడు. వేరుపాయము మరిలేదు. అట్టివాడెచ్చోట నుండినను ముక్తుడే. ఇందు సందియములేదు. గురువాక్యమందు విశ్వాసముగలిగి అనుష్ఠించువాడు గురుసన్నిధినుండి యెంతదూరముగానుండినను యెల్లప్పుడును గురుసన్నిధిలోనున్నవాడే. గురుదేవుని వాక్యమందు విశ్వాసములేక అనుష్ఠానముచేయక గురుసమీపమున నుండినను వాడు గురుదేవునకు చాలదూరమునందున్నవాడే యగును.

ఓమ్

# ఆత్మయొక్క పరిణామము

ఆత్మ పరిణామరహిత స్వరూపముగలదైనను యిచట మానసేంద్రియ దేహములయొక్క పరిణామమని గ్రహించుకొనవలయును. ముఖ్యముగా మనస్సుయొక్క పరిణామమనియే దీనియొక్క నిజార్థమగును. ఒకనికి జ్ఞానోదయము గలుగునపుడు దేహేంద్రియమనస్సులకు సహా పరిణామము గలుగునా? లేదా? అను విషయమై గ్రహించుకొనవలసి యున్నది. జ్ఞానోదయము గలుగునపుడు తప్పక మానసేంద్రియ దేహములకు పూర్వస్వభావము మార్పు జెంది, తమోరజోగుణములు నశించి, తప్పక సత్త్వగుణ స్వభావము గలుగవలసి యుండును. సత్త్వగుణము గలుగువంకకు ఆత్మజ్ఞానోదయముగలుగదు. ఈగుణపరిణామము తమస్సునుండి రజస్సులోనికిన్ని, రజస్సునుండి సత్త్వగుణములోనికిన్ని క్రమముగా పరిణామము జెందుచుండును. అచ్చటినుండియే విశుద్ధసత్త్వములోనికి పరిణామము నొందును. అదియే జీవన్ముక్తులయొక్కయు, బ్రహ్మజ్ఞానులయొక్కయు నిలయమగును. ఈ పరిణామము గలుగునప్పుడు పూర్వాపూర్వము గలిగియుండు యితని స్వభావములన్నియు మార్పు జెందుచుండును. ఆహారములోను, వస్త్రధారణలోను, నివాసములోను, బంధుత్వములోను, సహవాసములోను, పఠనీయగ్రంథ వార్తాపత్రికలలో సహా పరిణామ మేర్పడును. అట్లు పరిణామము ననుసరించియుండిన మాత్రమే అతనికి శాంతి గలుగును. అదియే దానికి గురుతు. దృష్టాంతముగా, ఒక మంచి మామిడిఫలము లేతకాలమున చేదు, వగరుగాను, మధ్యకాలమున పులుపుగాను, పండుకాలమున మధురముగాను యెట్లు స్వభావముగ మార్పు జెందుచుండునో, మానవునియొక్కస్థితియు ఆలాగున యుండును. ఆలాగున వర్ష ఋతువు, వసంతఋతువు, గ్రీష్మఋతువు యేలాగున సృష్టిక్రమము ననుసరించి స్వభావముగా మార్పు జెందుచుండునో, మానవునియొక్కస్థితియు ఆలాగున యుండును. ముఖ్యముగా మానవునికి మృగావస్థయనియు, మనుష్యావస్థయనియు, దేవతావస్థయనియు మూడవస్థలుగలవు. మృగావస్థకు అసురావస్థయనియు, పైశాచికావస్థయనియును పేర్లుగలవు. గీతయందు దైవాసుర సంపద్విభాగ యోగమగు 16-వ అధ్యాయమున యీ విషయము విస్తారముగ వర్ణింప

బడినది. 'దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా' దైవగుణము గలవాడు దైవమును, ఆసురస్వభావముగలవాడు అసురత్వమునుపొందు నని దీనియొక్క సారాంశము. అనగా దైవగుణము గలవాడు మోక్షమును. ఆసురస్వభావముగలవాడు సంసారబంధమును పొందునని సిద్ధాంతము. దైవగుణము యీ ప్రకారముండును.

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥
అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాంతి రపైశునం ।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥

తా॥ 1. అభయము, 2. సత్త్వసంశుద్ధి, 3. జ్ఞానయోగవ్యవస్థితి, 4. దానము, 5. దమము, 6. యజ్ఞము, 7. స్వాధ్యాయము, 8. తపస్సు, 9. ఋజుత్వము, 10. అహింస, 11. సత్యము, 12. అక్రోధము, 13. త్యాగము, 14. శాంతి, 15. అపైశునము, 16. భూతదయ, 17. అలోలత్వము, 18. మృదుత్వము, 19. లజ్జ, 20. చపలత్వములేకయుండుట.

శ్లో॥ తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత॥

21. తేజస్సు, 22. ఓరిమి, 23. ధైర్యము, 24. శుచిత్వము, 25. అద్రోహము, 26. అభిమానము లేకయుండుట — ఇవన్నియు దైవగుణములని గ్రహించుకొనవలయును.

ఇక అసురగుణము గలవాని స్వభావము తెలుపబడుచున్నది. సంగ్రహముగా ఒక్క శ్లోకముచే మాత్రమే తెలుపబడుచున్నది. విస్తారముగా తెలుసుకొన తలంచువారు గీతలో 16-వ అధ్యాయమున చూడవచ్చును.

శ్లో॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్॥

తా॥ 1. డాంబికము, 2. గర్వము, 3. దురభిమానము, 4. కోపము, 5. క్రూరవాక్యము, 6. అజ్ఞానము — ఇవి ఆసురగుణములని గ్రహించుకొనవలయును. మఱియు,

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥

తా॥ అసురస్వభావము గలవానికి యిది ప్రవృత్తిమార్గమనియు, యిది నివృత్తిమార్గమనియు తెలియదు. శౌచము, ఆచారము, సత్యము గలిగియుండవు. ఇదే దానికి గురుతు. మఱియు 14-వ అధ్యాయమున యీ మూడుగుణములను గురించి తెలిపినది చూడుడు. జిజ్ఞాసువులు దీనినిగూడ గ్రహించుకొనవలయును. అప్పుడే తాను యేగుణము గలిగి యుంటున్నాడో గ్రహించుకొనగలుగును.

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయం।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ॥

తా॥ సత్త్వగుణము నిర్మలమగుటచేత తెలివిని, ఆరోగ్యమును గలుగజేయునదియైనను, దృశ్యసుఖముచే యీ ఆత్మను ప్రపంచమున బంధించును. కావున సుకుమారత్వమునకు వైరాగ్యపురుషులు లోబడ గూడదు. బంధించుటకు సువర్ణశృంఖలమును, తామ్రశృంఖలమును, ఇనుపశృంఖలమును సమానములే యని విరక్తపురుషులు సదాజ్ఞప్తిలో నుంచుకొని వర్తించవలెను. (శ్రీ) గౌతమబుద్ధదేవుడే దీనికి తార్కాణము. ఈ శ్లోకమందు జ్ఞానశబ్దమునుగూడ ప్రయోగించినను యిచట శాస్త్ర జ్ఞానమని గ్రహించుకొనవలయును.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగసముద్భవం।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్॥

తా॥ రజోగుణము యేలాగున యీ యాత్మను సంసారమున బంధించునో నిరూపించడమైనది. రజోగుణము ఆశచేతను, ప్రాపంచక సౌఖ్యములయందు ప్రీతిని గలుగజేయుటచేతను యీ యాత్మను సంసార ములో బంధించును.

శ్లో॥ తమ స్త్వ జ్ఞానజం విద్ధి మోహానం సర్వదేహినాం।
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత॥

తా॥ ఇక తమోగుణము యెట్లు బంధించునో అదిన్ని నిరూపిం చడమైనది. తమోగుణము అజ్ఞానముచేతను, మోహాముచేతను, ప్రమా

దముచేతను, ఆలస్యముచేతను, అతినిద్రచేతను యీ జీవుని సంసారమున బంధించును. ఇక సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము గలవారికి ఏయే ఆహారమునందు ప్రీతి గలిగియుండునో, దానినికూడ జిజ్ఞాసువులు గ్రహించుకొనవలయును. గీత 17-వ అధ్యాయమున గనుగొనవచ్చును.

శ్లో॥ ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।
రస్యా స్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః॥

తా॥ సత్త్వగుణము గలవారికి ఆయుస్సు, సత్త్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి వీటిని వృద్ధిపరచునట్టియు, రసము, చమురు గలిగి దేహమందు స్థిరముగా నుండునట్టియు, మనోహరములగునట్టియు ఆహారములయందు ప్రీతి గలిగియుండును.

శ్లో॥ ఖట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకా మయప్రదాః॥

తా॥ ఇక రజోగుణము గలవారి ఆహారమును గురించి తెలుపఁబడినది. వారికి చేదు, పులుపు ఉప్పు, కారము, అత్యుష్ణమును గలుగజేయునదియు, సారము లేనిదియు, దాహమును గలుగజేయునదియు నగు ఆహారములయందు అభిరుచి గలిగియుండును. వీనివలన దుఃఖమున్ను, శోకమున్ను, బాధయున్ను గలుగును. ఇచట అతిశబ్దము ప్రయోగించియుండుటవలన పైఁ జెప్పిన ఉప్పు, కారాదులు యెక్కువగా నుండకూడదని గ్రహించుకొనవలయును. శరీర ఆరోగ్యాదులను గమనించి కొద్దిగ వాడుకొనవచ్చును; బొత్తిగా విడిచినను మేలే.

శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్టమపి చాఽమేధ్యం భోజనం తామసప్రియమ్॥

తా॥ వండిన పిమ్మట ఒక యామకాలము దాటినదియు, రసము తీసిన పిప్పి మొదలైనదియు, దుర్గంధముగలదియు, చలిదన్నము మొదలైనదియు, ఎంగిలి మొదలైనదియు పూజార్హముకానిదియు నగు ఆహారము తామసస్వభావము గలవారికి ప్రీతి గలిగియుండును. ఇకను దేవ, మనుష్య, పశ్వాదులకు దైవసృష్టియందు యేర్పడిన ఆహారమును గురించి వినుడు.

శ్లో॥ దేవానా మమృతం నృణామృషీణాం చాన్న మోషధిః।
దైత్యరక్షః పిశాచాదే ర్దత్తం మద్యామిషాది చ॥

తా॥ దేవతలకు అమృతమున్ను, మానవులకు అన్నమున్ను, ఋషులకు కందపక్వ ఫల మూలాదులున్ను, దైత్య రాక్షస అసురులకు మద్యమాంసాదులున్ను సృష్టించెను.

ఇచట ఆహారమును గురించి చాల విమర్శనలు గలవు. పాశ్చాత్యదేశీయులలో మాంసభక్షణము గలవారిలో మహాప్రజ్ఞావంతులు, తత్త్వజ్ఞానులు, విద్యావంతులు అనేకులుగలరుగదా? వారందరున్ను దైత్య రాక్షసులా? వారున్ను మనవలె మానవులుగారా? మన భారతీయులకన్న యెంతో సూక్ష్మబుద్ధిగలిగి అనేకయంత్రములు, విమానాదులు కనిపెట్టియున్నారుగదా? ఒక కాలమున భారతీయులను గూడ వారు పాలించెడు స్థితిలోనుండిరిగదా? దీనికేమి సమాధానము చెప్పెదరని కొందఱు ఆంగ్లేయవిద్యగల ప్రవీణులు ప్రశ్నింతురు. దీనికిసమాధానము చెప్పుటకు అంత ప్రయాస మేమియులేదు. ఏమన కొన్ని దేశీయులకు, కొన్ని జాతులకు పూర్వమునుండి వచ్చెడు అలవాటు ప్రకారము భోజనాదులు జరుగుచుండును. అది అనాగరిక కాలమునుండి యేర్పడిన దగుటచే నాగరికకాలము గలిగినను అంత పరిశీలనచేయరు. దానిని స్వభావమని తలంతురు. పాశ్చాత్యులేమి, భారతీయులుగూడ ఆదికాలమున మాంసభక్షకులై యుండినట్లు శాస్త్రములలో గలదు. అయిననువిద్యావివేకజ్ఞానాదులు వృద్ధియై రాగా రాగా, ఉన్నతజాతివారు క్రమముగా పవిత్రహృదయులగుటవలన హింసలోగలపాపమున్ను, హింసాహారముచే గలుగు దోషమున్ను కనుగొని శుద్ధాహారులైరి. పాశ్చాత్యులలోకూడ యిప్పుడు శాకాహారులై యుండేవారుగలరు. వారును ఒక కాలమున మాంసభక్షకులై యుండినప్పటికిని వివేకవిజ్ఞానములో నధికులగుటచేత మాంసమునకన్న శాకాదులలో విశేషయోగ్యత, నిర్మలతగలదని విజ్ఞానశాస్త్రముచే కనుగొని యిపుడు శాకాహారులైయున్నారు. మఱియు నొక కాలమున ధాన్య శాకాహారములు సమృద్ధిగాదొరకని కారణము వలనను మాంసాహారులై యుండవచ్చును. ఇప్పుడు సమృద్ధిగా ధాన్య, ఫల శాకాహారాదులు దొఱకుటవలన యేల శుద్ధాహారమును భుజించి

నిర్మలజీవితము గడుపగూడదు? మఱియు ప్రాణులనువధించునప్పుడు గలి గెడు వాటియొక్క ఘోరమగు దుఃఖాక్రందనములువినినను, తల్లడిల్లెడు క్లేశమును చూచినను యెవరి మనసు కరుగదు! సుగమమార్గముండగా కంటకమార్గముగా నడచుట గొప్పతనమా! మఱియు పాశ్చాత్యులు భౌతిక యంత్రాది విజ్ఞానములో చాల హెచ్చుస్థానమునకు వెళ్ళినను ఆధ్యాత్మిక విషయములో, ప్రశాంతములో, జీవకారుణ్యములో, దయా ళుత్వములో భారతీయులకన్న యెక్కువస్థితిలోనికి పోలేదని ప్రపంచమే నిర్ణయించుచున్నది. బహుకాలమునుండి భారతీయఋషులలో కపిలుడు, పతంజలి, పాణిని, కణాదుడు కనిపెట్టినపరిశోధనయొక్కఫలితము యెటు వంటిదో యని పాశ్చాత్యులలో మ్యాక్సుముల్లరు మొదలగువారు చూచి శిరఃకంపము చేయుచున్నారు. విమానను మొదలగు దివ్యయాన ములను భారతీయులు కనిపెట్టియుండిరని శాస్త్రములలోగలదు. ఆలా గున బ్రహ్మాస్త్రాదులను గ్రహించియున్నట్లున్ను వేదమునందు కనుపడు చున్నది. అది యేదురదృష్టమో భారతీయులనుండి జారిపోయెను. కాల వేగములో కలిసిపోయెనో, సంకుచితహృదయులు గూఢముగా నుంచు టచే వారితోగూడ జీర్ణమైపోయెనో చెప్పజాలము. పాశ్చాత్యగొప్పతన మునుగురించి యిదివరలో ప్రగల్భముగ చెప్పువారొక విషయమును యెత్తి చూపుచుండిరి. భారతీయులంత ప్రజ్ఞావంతులైనచో పాశ్చా త్యులచేత యేల బానిసలుగాచేసి పాలింపబడవలయునని చెప్పుచుందురు. దైవకృపచేత యిపుడు దానియొక్క ఫలితమునుగురించి ప్రత్యేకముగా తెలుపవలసినదిలేదు. ఆలాగున యిపుడు పాశ్చాత్యులు కనిపెట్టిన విమా నాది యానములుగాని, అణ్వాస్త్రములుగాని భారతీయులుకనిపెట్టజాలరని యెవరైన జ్యోతిషము చెప్పగలరా? అయితే ఆతరుణమున భారతీయులు మహామ్మదీయులకున్ను, ఆంగ్లేయులకున్ను లోబడిపోవుటకు గొప్పకారణ మొకటిగలదు. అదేమన సోదరభావము, సంఘబలము భారతీయులలో చాలకాలముక్రిందట లోపించి పోయినదని తప్పనిసరిగా చెప్పవలసి యుండును. గాంధీగారు మొదలగు దివ్యపురుషు లవతరించి సర్వజనులకు సమానస్వాతంత్ర్యమును గలుగజేసినందుచేతనే, మానవ స్త్రీ పురుషు లందరు యేకమై కాంగ్రెసులో ప్రవేశించుటచేతనే స్వరాజ్యము మనకు లభించినదని సర్వులు అంగీకరించియే తీరవలయును.

ఆహారవిషయమై జీవహింసావిషయమై ఆంగ్లేయభాషకు ఆధిక్యమిచ్చి యింగ్లీషువారికి బానిసలై యుద్యోగులైనవారు యీలాగున వచింతురు. అదేమన జగదీశచంద్రబోసు కనిపెట్టిన వృక్షశాస్త్రములలో తరు, లత, గుల్మాదులకుకూడ ప్రాణముగలదనియు, అపుడు శాకాహారులుసహా యెట్లుహింసారహితులగుదురనియు నిరూపింతురు. అయితే ఆహారములోగల రాజస, తామస, సాత్త్వికపదార్థములను గురించి వారు పరిశోధన జేసియుండినచో అట్లు చెప్పియుండరు. ఇదియునుగాక శిల, వృక్ష, క్రిమి, పక్షి, మృగ మనుష్యాదులలోగల ప్రాణభేదములను గురించి గ్రహించియుండినను ఆలాగున చెప్పియుండరు. లత, వృక్షాదులను యెన్నియో భాగములుగా ఛేదించినను, అవి యన్నియు బ్రతుకుచుండును. జంతువులయొక్క కర,చరణ శిరస్సులను ఛేదించి ఆలాగున జేయగలరా? ఆలాగున స్థిర, చర. శిలాదులకుకూడ భేదముగలదని మన ఋషులు అనేకసంవత్సరములకుపూర్వమే తెలిపియున్నారు. శాకాదులలో ప్రాణమున్నప్పటికిని అది లేక జీవించుట అనివార్యమగుటచేత సర్వేశ్వరుడు వాటియొక్క ప్రాణస్థితి కనుపడులాగున మనకునేత్రమును సృష్టించలేదు. ఇంతమాత్రమేగాదు, మన పూర్వీకఋషులు యింకను చాల పైభాగమునకు వెళ్ళిరి. వాయువులోను, జలములోను అనేకప్రాణికోట్లు గలవనియు, ఉచ్ఛ్వాస, నిశ్వాసములచేతను, జలపానముచేతనుఅవి మరణించుచున్నవనియు, అదియు ననివార్యమగుటచే వాటెని కనుపడేలాగున దృష్టిని యీశ్వరుండివ్వలేదనియు నిర్ణయించిరి. ఈలాటి దోషములు నశించుటకొఱకే పంచయజ్ఞములను తప్పక మానవుడుచేయవలయునని విధించుటకు కారణము. మద్యమాంసాదులను భుజించువారిని మేము రాక్షసాసురులని చెప్పుటలేదు. అయితే అవి మానవులకేర్పడినవిగావనియు, రాక్షసాసురులకు యేర్పడినవనియు మనవిచేయుచున్నాము. మనుస్మృతియందు గుణత్రయమును గురించి తెలిపినది చూడుడు.

శ్లో॥ వేదాభ్యాస స్తపో జ్ఞానం శౌచ మింద్రియనిగ్రహః ।
ధర్మక్రియాఽఽత్మచింతా చ సాత్త్వికం గుణలక్షణమ్॥

తా॥ బ్రహ్మవిద్యాభ్యాసము, తపస్సు, జ్ఞానము, బాహ్యాభ్యంతరశుద్ధి, ఇంద్రియనిగ్రహము, సత్కర్మలయందుప్రీతి, బ్రహ్మచింతనము

— యివి సాత్త్వికగుణము గలవారియొక్క స్వభావమైయుండును.

శ్లో॥ ఆరంభరుచితాఽధైర్య మసత్కార్య పరిగ్రహః।
విషయోపసేవాఽజస్రం రాజసం గుణలక్షణమ్॥

తా॥ ఆరంభశూరత్వము, అధైర్యము, అసత్కార్యమందు ప్రవృత్తి, సదా విషయభోగమందాసక్తి—ఇవి రజోగుణ స్వభావముగల వారికి గలిగియుండును.

శ్లో॥ లోభః స్వప్నోఽధృతిః క్రౌర్యం నాస్తిక్యం భిన్నవృత్తితా।
యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణమ్॥

తా॥ లోభము, అతినిద్ర, అధైర్యము. క్రూరత్వము, నాస్తిక్యము, అనాచారము, పరుల యాచించి జీవించు స్వభావము, ప్రమాదము—ఇవి తామసగుణము గలవారి స్వభావము.

శ్లో॥ దేవత్వం సాత్త్వికా యాంతి మనుష్యత్వం చ రాజసాః।
తిర్యక్త్వం తామసా నిత్య మిత్యేషా త్రివిధాగతిః॥

తా॥ సత్త్వగుణము గలవారు దేవత్వమును పొందుదురు. రజోగుణముగలవారుమానవజన్మమెత్తెదరు. తమోగుణస్వభావముగలవారు తిర్యగ్జంతువులై పుట్టుదురు. ఇదేవిధముగా గీతలో భగవానుడున్ను ఉపదేశించెను.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః॥
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః॥

తా॥ సత్త్వగుణప్రధానులు స్వర్గాద్యుత్తమలోకములను పొందుచున్నారు. రజోగుణప్రధానులు మనుష్యలోకమును పొందుచున్నారు. నీచమగు తమోగుణముగలవారు మనుష్యులలో హీనజాతులలో పుట్టుట గాని లేక పశ్వాదిజన్మములనుగాని పొందుచున్నారు. గ్రంథాంతరము—

శ్లో॥ సత్యం జ్ఞానం తపో మానం ధృతిర్ధర్మం తితీక్షతా।
ఉత్సాహం నిశ్చలం ధైర్యం సాత్త్వికం గుణలక్షణమ్॥

తా॥ సత్యము, జ్ఞానము, తపస్సు, మానము, ధైర్యము, ధర్మము, సహనము, ఉత్సాహము, నిశ్చలము, ధారణాశక్తి — ఇవి సాత్త్విక గుణము గలవారికి గలిగియుండును.

శ్లో॥ గర్వం క్రోధ మహంకారం సతీసంగం ప్రలాపనం।
అప్రియం దంభమాత్సర్యం రాజసం గుణలక్షణమ్॥

తా॥ గర్వము, క్రోధము, అహంకారము, విషయవృత్తి, వ్యర్థ ప్రలాపము, అతృప్తి, డాంబికము, మాత్సర్యము — ఇవి రజోగుణము గలవారికి గలిగియుండును.

శ్లో॥ అజ్ఞానం మోహనిద్రా చ చాపల్యం బుద్ధిహీనతా ।
పాపిష్ఠం పరపీడత్వం తామసం గుణలక్షణమ్॥

తా॥ జ్ఞానము లేకుండుట, భ్రమ, అతినిద్ర, చపలస్వభావము, హీనబుద్ధి, పాపకార్యములలో ప్రీతి, పరప్రాణులపీడించుట— ఇవి తమోగుణ స్వభావము గలవారికి గలిగియుండును.

శ్లో॥ విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః।
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా సదానందరసం సమృచ్ఛతి॥

తా॥ ప్రసన్నత, ఆత్మానుభవము, మిక్కిలి శాంతము, నిత్య తృప్తి, అత్యుత్కృష్ట సంతోషము, పరబ్రహ్మనిష్ఠ — ఈ గుణములు విశుద్ధసత్త్వగుణము గలవారికి గలిగియుండును. వీడు గుణత్రయాతీతుని లక్షణముగలవాడు. ఇతడు ప్రకృతికి పరుడు, జీవన్ముక్తుడు అని గ్రహించవలెను. ఈ విషయమునే శ్రీకృష్ణభగవానుడు గీతలో తెలిపెను.

శ్లో॥ గుణానేతా నతీత్య త్రీ న్దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే॥

తా॥ జీవుడు దేహోత్పత్తికికారణములైన పైజెప్పబడిన మూడు గుణముల నతిక్రమించి (జీవించియున్నపుడే) బ్రహ్మజ్ఞానముచేత పుట్టుక, చావు, ముసలితనము మొదలగు దుఃఖములనుండి విముక్తుడై అమృతత్వమును (మోక్షమును) పొందుచున్నాడు.

శ్లో॥ వనం తు సాత్త్వికో వాసో గ్రామో రాజస ఉచ్యతే।
తామసం ద్యూతసదనం మన్నికేతం తు నిర్గుణమ్॥

తా॥ సాత్త్వికులకు వనవాస మిష్టము, రాజసులకు గ్రామవాస మిష్టము, తామసులకు జూదమాడుస్థలమిష్టము, నిర్గుణులకు నాస్థానము (పరమేశ్వరప్రాప్తి-మోక్షము) యిష్టము.

శ్లో॥ రవిశ్చంద్రో ఘనా వృక్షా నద్యో గావశ్చ సజ్జనాః।
ఏతే పరోపకారాయ భువి దేవేన నిర్మితాః॥

తా॥ సూర్యుడు, చంద్రుడు, మేఘములు, వృక్షములు,గోవులు, సజ్జనులు పరప్రాణుల యుపయోగముకొఱకు పరమేశ్వరునిచే భూలోకమున సృష్టింపబడినవి.

---

ఓమ్

# గీ తా గ తి

భగవద్గీతలో నాత్మవిషయమై, జ్ఞానవిషయమై, యోగవిషయమై చెప్పెడు ముఖ్య ముఖ్యాధ్యాయముల అంత్యమున భక్తియోగములో ననగా భగవద్భక్తిలోనిలుపుటకు కారణమేమని యాలోచింపగా భగవద్భక్తివలననే లేక భగవదనుగ్రహమువలననే జ్ఞానముగాని, యోగముగాని సిద్ధించవలసియుండునని గోచరమగుచున్నది. అదియునుగాక భక్తిమార్గములో ననగా ఉపాసనాయోగమున సర్వజనులకు ప్రవేశానుకూలము గలుగుననియు, జ్ఞానమునకువలె లేక యోగమునకువలె అంత ప్రయాసము దీనియం దుండదనియు, అంత ప్రజ్ఞగాని, విద్యగాని శరీర మనస్సులకు గొప్పదార్ఢ్యముగాని దీని కవసరము లేదనియు, వర్ణాశ్రమముల గురించిగాని, స్త్రీ పురుషులను గురించిగాని కట్టకడకు విద్యగూడ యుండవలయుననునది యవసరములేదని తోచుచున్నది. లేనిచో నట్టి యగాధార్థమును నిరూపించెడు యధ్యాయముల యంత్యమున భక్తిలోనేల నిలుపవలయునని స్ఫురించుచున్నది. చూడుడు. పదునాలుగవ యధ్యాయము గుణత్రయమును గుణత్రయాతీతమును దెలిపెడు అగాధ భావముతోగూడినది. దానిలో కట్టకడపట అ. 14, శ్లో॥ 26

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణా న్సమతీత్యై తాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥

తా॥ ఎవడచంచల భక్తియను యోగముచేత నన్ను సేవించుచున్నాడో, వాడీత్రిగుణములను బ్రయాసము లేకనే యతిక్రమించి బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమును బొందుట కర్హుడగుచున్నాడు.

ఈవ్యాసములో మచ్చునకుమాత్రము చూపడమగును. లేనిచో నిది చాలా పెరుగును. ఈ రహస్యమువలననే కర్మయోగమగు ప్రథమ షట్కమునకును, ఆఖరులోనుండు జ్ఞానషట్కమునకును మధ్య భక్తియోగమును గూర్చుటకుకారణమైనది. అనగా ఇత్తరినుండు నిష్కామ కర్మయోగమునకును, అత్తరినుండు జ్ఞానయోగమునకును మధ్య భక్తి యోగము నమర్చుటకు కారణమైనది. మొదట కర్మయోగమునకును, అంత్యమైన జ్ఞానయోగమునకును భక్తియోగము మధ్యయుండి కలుపుచున్నది. అనగా నిష్కామకర్మయోగమైనను లేక జ్ఞానమగు సన్న్యాసయోగమైనను భక్తిలేనిచోఫలమును గలుగజేయదనియు, జ్ఞానయోగికిని నిష్కామకర్మయోగికిని భక్తియోగము తప్పనిసరిగానుండవలెనని నిరూపించుచున్నది. ఒక నదియుండిన మధ్య వారధి కలిగియుండినచో, ఈతీరమును ఆతీరమును వంతెన యేలాగున కలుపుచున్నదో, ఆలాగున భక్తియోగముండిన మాత్రమే కర్మజ్ఞానయోగములు రెండును బ్రయోజనపడును. భక్తి అన్ని యోగములను దనలో కలుపుచుండును. అంతియకాదు, భక్తియోగము లేనిచో మిగత యోగములును గలువక వేరుపడి పోవును. అనగా నిష్కామకర్మయోగమో, జ్ఞానయోగమో, ధ్యానయోగమో ఇది గొప్పది, అది గొప్పది అని భేదములను గల్పించి వేరుపడిపోవుట కవకాశముండునని తలంచి భగవానుడు కర్మయోగమును, జ్ఞానయోగమును భక్తియోగముతో గలుపుటకు కారణమైనది.

ఈ ఆరవ అధ్యాయము ఆత్మసంయమయోగమునుగూర్చి చెప్పినదగుటచేత, యిది యష్టాంగయోగము ననుసరించి యుండుటవలన నిది ధ్యానయోగమును గురించినదగును. పైన చెప్పినది జ్ఞానయోగమును గురించినదనియు, ఇది ధ్యానయోగమునుగురించినదనియు ముముక్షువులు గ్రహించవలయును. ఈ ధ్యానయోగమునుగురించి చెప్పుచు కట్టకడపట శ్రీ భగవానుడేమి తెలిపెనో యది గ్రహించిన ఈ భక్తితత్త్వము యొక్క ప్రభావము గోచరము కాగలదు.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున! ॥
యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥
అ. 6, శ్లో॥ 46, 47.

తా॥ ఓ యర్జునా! ధ్యానయోగి తపస్వులకన్నను శ్రేష్ఠుడు. జ్ఞానులకంటెను అధికుడని నా యభిప్రాయము. ధ్యానయోగనిష్ఠుడు కర్మానుష్ఠానపరులకంటెను యుత్కృష్టుడు. ఆ కారణమువలన యోగివి కమ్ము. పైన చెప్పిన యోగులందరిలోను నాయందు చేర్చిన మనస్సు కలిగి శ్రద్ధగలవాడై నన్నెవడు భజించుచున్నాడో, అట్టివాడు యోగులలో నుత్తముడని నా మతము.

వి॥ "యోగినామపి సర్వేషాం" అని ప్రయోగించుటవలన భగవదర్పితచిత్తముకలిగి భజించువాడు అందరికన్న యధికుడని చెప్పుటకు కారణమైనది. దీనికి హేతువు మొదటనే తెలుపడమైనది. అనగానిప్పుడు లోకములో సంస్కృతము చదివి బ్రహ్మవిచారము చేయువా రెందరున్నారు? అరణ్యమునకు వెళ్ళి తపస్సుచేయువా రెంతమంది యున్నారు? యజ్ఞాదికర్మలు చేయువారెందరున్నారు? వారికిమాత్రమే మోక్షమయినచో తక్కిన మానవులగతి యేమగును? కావుననే భగవంతుడు భక్తికి ఆధిక్యమిచ్చుటకు కారణమయినది. భక్తి సర్వజనులకును సులభమార్గము. ఒకవేళ వర్తమానమున యోగిగాని, జ్ఞానిగాని, తపస్విగాని కనిపించినను అదియు పూర్వజన్మలో జేసిన భక్తివలన భగవదనుగ్రహము కలుగుటవలననే యాస్థితి కలిగినదని శాస్త్రము చెప్పుచున్నది. "పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః" యోగభ్రష్టుడు యోగము నభ్యసించుటకు దానుగా బ్రయత్నము చేయనివాడైనను అట్టికోటితబడిన ముందటిజన్మమందు చేయబడిన అభ్యాసవాసనావశము చేతనే లాగబడుచున్నాడు. అ. 5, శ్లో॥ 29

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి॥

తా॥ యజ్ఞములకును, తపస్సులకును అధిపతిగాను, సర్వలోకము లకు ప్రభువుగాను, సమస్త ప్రాణులకు ప్రతిఫలమునుగోరక హితమునొనర్చువాడుగను, నన్ను యెరింగి ప్రకృతిశమించిన శాంతినిపొందుచున్నాడు.

వి॥ పై చెప్పిన గుణములు గలవాడే భగవంతుడని తెలిసికొని భక్తులు భజించి పరమాత్మను బొందుచున్నారు అని చెప్పుటలో భగవద్భక్తివలననే ముక్తి గలుగునని నిరూపించడమైనది. ఈ యైదవఅధ్యాయము కర్మసన్న్యాసయోగమునుదెలుపుచున్నది. అట్టి కర్మసన్న్యాస యోగమును భగవద్భక్తివలననే, భగవదనుగ్రహమువలననే కలుగునని చెప్పుటచేత భక్తిలో కట్టకడపట నిలుపడమైనది. అ. 7, శ్లో॥ 29

శ్లో॥ జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మకం కర్మ చాఖిలమ్॥

తా॥ ఎవరు ప్రపంచమందలి సకలచరాచరములయందువ్యాపించి యుండునట్టి యాత్మను, సమస్తకర్మములను బ్రహ్మస్వరూపముగా నెరుగుచున్నారో, అట్టివారు పరబ్రహ్మమగు నన్ను ఆశ్రయించి జరామరణములనుండి ముక్తికొఱకు అనగా మోక్షముకొఱకు యత్నించుచున్నారు.

వి॥ ఈ శ్లోకమును అధ్యాయము కడపట చెప్పినందువలన భక్తియొక్క ప్రభావమును నిరూపించడమైనది. అ. 7, శ్లో॥ 30

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యేవిదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః॥

తా॥ ఈ ఏడవఅధ్యాయము విజ్ఞానయోగమని పేరుగలది. దానియందుగూడ కట్టకడపట భక్తియోగములో నిలుపుటవలన అట్టి విజ్ఞానయోగసిద్ధియు పరమేశ్వరభక్తివలననే కలుగవలసియుండునని తెలియుటకొఱకే అధ్యాయాంతమున యీలాగున తెలుపడమైనది.

ఇపుడు అక్షరపరబ్రహ్మమును గురించి (శ్రీ) భగవానుడు తెలిపిన అష్టమాధ్యాయములోనికి ప్రవేశించుచున్నాము. దానియందుగూడ అధ్యాయాంతమున నేమి తెలిపినదిచూడుడు. ఇందువలనను భగవద్భక్తి

వలననే అక్షరపరబ్రహ్మ ప్రాప్తియగు ముక్తి కలుగవలసియుండునని గ్రహించుకొనవలయును. అ. 8, శ్లో॥ 27

శ్లో॥ నైతే సృతీ పార్థ జ్ఞాన న్యోగీ ముహ్యాతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥

తా॥ ఓ యర్జునా! పై నుదహరించిన పరబ్రహ్మప్రాప్తి నెఱింగిన యోగి మోహమును బొందడు. కావున అర్జునా! సర్వకాలసర్వావస్థల లోను ధ్యానయోగము కలవాడవుగా నుండుము. అ. 8, శ్లో॥ 28

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥

తా॥ ధ్యానయోగి యగువాడు నియమపూర్వకముగా వేద వేదాంతములను జదువుటవలనను, సాంగోపాంగముగ యజ్ఞముల నాచరించుటవలనను, కాయశోషణాదులచేత కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుల చేయుటవలనను, దేశకాలపాత్రానుసారముగా దానముల సలుపుటవలనను గలిగెడు పుణ్యఫలముల నతిక్రమించుచున్నాడు. అనగా నీ ఫలమునకన్న పైభాగముననుండు స్థానమును బొందుచున్నాడు. మొదటికారణమును, అనగా సర్వకాలమును, సర్వోత్తమమును అయిన స్థానమును అనగా బ్రహ్మపదమును బొందుచున్నాడు.

వి॥ బీదలగు పరమభక్తులనుగూర్చి కరుణగలిగి భగవానుడు అక్షరపరబ్రహ్మప్రాప్తియగు ఈ అష్టమాధ్యాయమున దీని నుపదేశించడ మైనది. మేము వేదములు సంస్కృతమును జదువలేదు. యజ్ఞాది క్రతువులు చేయలేదు. ఏకాంతమున తపమొనర్చలేదు. పుణ్యకర్మములు చేయుటకు ధనములేదు. మాకెట్లు భగవత్ప్రీతి కలుగును; మోక్షము సిద్ధించునని హృదయతపము గలవారినిగూర్చి యిట్లు తెలుపడమైనది. అది యన్నిటికన్నను గొప్పది. భగవదర్పితచిత్తముగల ధ్యానయోగ మున కొక్క దమ్మిడి ఖర్చులేదు. బ్రాహ్మణుడై పుట్టనక్కఱలేదు. తన హృదయములో నుండే యాత్మస్వరూపమే బ్రహ్మాస్త్రము. అది యర చేతిలోగలవారికి తక్కిన చిన్నచిన్న అస్త్రములు లేవని విచారమెట్లు

కలుగదో, కల్పవృక్షముక్రింద కూర్చున్నవాని కితరవృక్షములు లేవని విచారమెట్లుండదో, కామధేనువుగలవాని కితరగోవులులేవని సంకల్ప మెట్లుండదో, చింతామణి చేతులోగలవాని కితరరత్నములులేవని భావ మెట్లుదయించదో, గంగాతీరముననుండువాని కితరతీర్థయాత్రలు చేయ లేదని సంకల్పమెట్లుపొడమదో ఆలాగున భగవద్ధ్యానమొక్కటి లెస్సగా జేయువాని కేకర్మయు నక్కఱలేదని భగవాను డుపదేశించెను.
అ. 9, శ్లో॥ 34

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

తా॥ నాయందు చేర్చిన మనస్సుకలవాడవును, నాయందు భక్తి కలవాడవును, నన్నారాధించెడు వాడవును కమ్ము. నాకు నమస్కరిం పుము. ఈ విధముగా మనస్సును నాయందుచేర్చి నన్నే పరమప్రాప్య ముగా నెంచినవాడవగుచు నన్నే పొందగలవు.

వి॥ 'మామేవైష్యసి' అని ప్రయోగించుటవలన పైచెప్పిన విధ ముగా వర్తించువాడు నన్నే పొందగలుగును అని చెప్పుటలో భక్తి యొక్క యాధిక్యమును నిరూపించడమైనది. ఈ యధ్యాయము రాజ విద్యయనియు, రాజగుహ్యమనియు చెప్పుటలోనే దీనియొక్క గొప్ప తనము తెలిసికొనవచ్చును. ఇదియు నధ్యాయాంతమున చెప్పినదగుటచే జ్ఞాపకముంచదగినది. అ. 10, శ్లో॥ 41

శ్లో॥ యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవాగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్॥

తా॥ ఈశ్వరసంబంధమైనదిగాను, తేజోవంతమైనదిగను, దృఢ మైన యుత్సాహముతో గూడినదిగనుండు వస్తువేదిగలదో ఆవస్తువును ఈశ్వరశక్తియొక్క అంశమువలన పుట్టినదానినిగానే నీవు తెలిసికొనుము. అనగా నదంతయు నాయొక్క స్వరూపమని గ్రహించి, వానిని లేక వారిని శరణుబొందుము. నన్నుగా భావించుము.

వి॥ పైచెప్పిన దైవగుణ మెవరియందుకలదో, వారిని నన్నుగా నెఱిగి సేవింపుము అని భగవాను డుపదేశించిన వాక్యమమోఘమహిమ

కలది. ఇచట జాతినిగాని, వర్ణమునుగాని, ఆశ్రమమునుగాని, స్త్రీయని గాని, పురుషుడనిగాని నిరూపించక దైవగుణముగలవారి నందరిని దైవ స్వరూపులుగా జూచులాగున, గౌరవించులాగున శ్రీకృష్ణభగవాను డుపదేశించెను. అ. 11, శ్లో॥ 53

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రుష్టుం దృష్టవానసి మాం యథా॥

తా॥ ఓ యర్జునా! విశ్వరూపధరుడవగు నన్ను ఇప్పుడు ప్రత్యక్ష ముగా గనులార యెట్లు చూచుచున్నావో అట్లు వేదాధ్యయనపరుల చేతను, తపస్సుచేయువారిచేతను, దానముచేయువారలచేతను, యజ్ఞాది క్రతువులను జేయువారిచేతను దర్శించుటకు శక్యుడనుగాను.

వి॥ అనగా భగవత్ప్రాప్తికి, మోక్షమునకు, వేదము వేదాధ్య యనముగాని, తపస్సుగాని, దానముగాని, యజ్ఞ యాగాదులుకాని ముఖ్యముకాదు; అనన్యభక్తి యొక్కటియే ముఖ్యమైనది. లేనిచో పై జెప్పిన వారలకే మోక్షము కలుగునుగాని తదితరులకు మోక్షము లేకపోవునని తలంచి భక్తి యొక్కటి కలిగిన వారువీరను భేదములేక సర్వజనులకును ముక్తికలుగునని యందరిపై కరుణగలిగి భగవాను డీవాక్యముపదేశించెను. అ. 11, శ్లో॥ 54.

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।
జ్ఞాతుం ద్రుష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥

తా॥ ఓ యర్జునా! ఇట్టి విశ్వరూపము ధరించిననేను అనన్యమైన భక్తిచేతనే యథార్థముగా నెరుగుటకును, దర్శించుటకును, నాలో ప్రవేశించుటకును శక్యుడ నగుచున్నాను.

వి॥ అనన్యమైనభక్తిచేగలిగెడు ప్రభావమెట్టిదో యిచ్చట నిరూ పించడమైనది. భగవత్తత్త్వము నెఱుంగుటకును, భగవంతుని దర్శించుట కును, భగవంతునియందైక్యమగుటకును భక్తియొక్కటియే చాలును. లేక భక్తియొక్కదానివలననే సాధ్యపడును. అ. 12, శ్లో॥ 7

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్॥

తా॥ ఓ యర్జునా! ఎవ్వరైతే సమస్తకర్మలను నాయందర్పించి నాయందుచేర్చిన చిత్తముకలవారగుచు యితరచింతలెవ్వియులేక నన్నే ధ్యానించుచున్నవారై యుపాసించుచున్నారో, అట్లు నాయందు చేర్చ బడిన చిత్తము గలవారలను నేను శీఘ్రముగా జననమరణ సంసార సాగరమునుండి యుద్ధరించువాడ నగుచున్నారు. అ. 12, శ్లో॥ 20

శ్లో॥ యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥

తా॥ ఎవ్వరైతే శ్రద్ధావంతులును పరమాత్మయే పరమగతియని నమ్మకము కలవారునై యిప్పుడు నేను చెప్పిన మోక్షసాధనమైన ధర్మమును యథావిధిగా నాచరించుచున్నారో, అట్టిభక్తులు నాకు మిక్కిలి ప్రియులు.

వి॥ ఈ పన్నెండవ యధ్యాయము సగుణనిర్గుణములను గురించి బోధింపబడినది. అంతేకాదు యిదిభక్తియోగమని ప్రసిద్ధినివహించినది. ఇచ్చటను పరమభక్తిలోనే నిలుపడమైనది. అ. 13. శ్లో॥ 35

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్॥

తా॥ ఇట్లెవరు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును భూతములకు సంబంధించియుండు ప్రకృతినుండి విముక్తినొందదగిన యుపాయమును జ్ఞానదృష్టిచే నెరుగుచున్నారో, వారు పరమపదమునుబొందుచున్నారు.

వి॥ క్షేత్రక్షేత్రజ్ఞులను గురించి చెప్పునప్పుడు దేహము జీవుని లేక యీశ్వరుని గురించి గ్రహించుకొన వలయును. లేక ప్రకృతి పరమేశ్వరుని గురించియనియు గ్రహించవలయును. ఈ యధ్యాయము క్షేత్రక్షేత్రజ్ఞుల గురించియు, జ్ఞానజ్ఞేయముల గూర్చియు నుపదేశించిన దగుటచే చాలగొప్పదని జ్ఞప్తిలోనుంచుకొనవలయును. అట్టి క్షేత్ర క్షేత్రజ్ఞుల సత్యము తెలిసికొనుటకు పరమేశ్వరభక్తివలననే సాధ్యపడునని తెలియుటకొఱకే ఈశ్లోకమును దెలుపుటకు కారణమైనది. అ.15, శ్లో॥19

శ్లో॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥

తా॥ ఓ యర్జునా ! ఎవ డజ్ఞానములేనివాడై నన్ను యిట్లు పై జెప్పబడినప్రకారము పురుషోత్తమునిగా నెరుంగుచున్నాడో, వాడు సమస్తము నెరింగినవాడై నన్ను సర్వవిధములచేతను భజించుచున్నాడు. అ. 15, శ్లో॥ 20

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయాఽనఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్కృతకృత్యశ్చ భారత!॥

తా॥ పాపరహితుడవగు ఓ యర్జునా ! ఇట్లతిరహస్యమైన యీ శాస్త్రము నాచే చెప్పబడినది. ఓ యర్జునా ! దీని నెరిగి జ్ఞానవంతుడవును, కృతార్థుడవును కమ్ము.

వి॥ ఈ యధ్యాయము పురుషోత్తమప్రాప్తి యోగమునుగూర్చి చెప్పినది. అట్టి భగవత్ప్రాప్తి, బ్రహ్మప్రాప్తి భగవద్భక్తివలననే కలుగ వలసియుండునని తలంచియే శ్రీకృష్ణభగవంతుడు యీ అధ్యాయాంత మున నిట్లు తెలుపడమైనది. అ. 16, శ్లో॥ 24

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥

తా॥ కాబట్టి కార్యాకార్యముల నిర్ధారణ చేయుటయందు నీకు శాస్త్రము ప్రమాణమగును. శాస్త్రమునందు చెప్పబడిన దానినెరిగి యీ ప్రపంచమునందు కర్మను జేయుటకు దగుదువు.

వి॥ కార్యాకార్యములను నిర్ణయించుటకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రము భగవత్సంకల్పము. అయితే దానియొక్క నిజానిజములు గ్రాహ్యము కావలసియుండిన భగవదనుగ్రహము కలిగియుండవలయును. భగవదనుగ్రహము కలుగవలసియుండిన భగవద్భక్తి కలుగవలయును. దైవాసురసంపద్విభాగ యోగమగు యీ యధ్యాయాంతమునను భక్తిలో నిలుపుటకు కారణమైనది. అందువలననే 'దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీమతా' అని పైన నిరూపించుటకు కారణము. దైవానుగ్రహము కలవానికి దైవధనమగు జ్ఞానము కలుగును.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నో ఇహ॥ అ.17, శ్లో॥28

తా॥ ఓ యర్జునా! శ్రద్ధలేక వేల్చబడిన యజ్ఞమును, చేయబడిన దానమును, చేయబడిన తపస్సును, చేయబడిన యితరకృత్యములును యేవికలవో అయ్యవి యసత్తని చెప్పబడుచున్నవి. అట్టి కర్మములు పరలోకసుఖము నిచ్చునవిగావు; ఇహలోక సుఖమునుగూడ యిచ్చునవి కావు.

వి॥ ఇచటను భక్తిశ్రద్ధల కాధిక్యమివ్వడమైనది. అట్టి భక్తి శ్రద్ధలులేని క్రియలన్నియు చవిటిభూమిలోపెట్టిన కృషివలెను, కళాయి లేని పాత్రలో వండిన పప్పుపులుసుచందమునను వ్యర్థములై పోవును.

అ. 2, శ్లో॥ 7

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

తా॥ కృపణత్వమువలన గలిగిన దోషముచేత గొట్టబడిన స్వభావము కలవాడను, యుక్తాయుక్త పరిజ్ఞానము లేనివాడనై నిన్నడుగుచున్నాను. ఏది శ్రేయస్కరమగునని నిశ్చయింపబడుచున్నదో దానిని నాకు జెప్పుము. నేను నీకు శిష్యుడను. నిన్ను శరణుజొచ్చిన నన్ను నియమింపుము.

వి॥ మొదటి యధ్యాయము ఉపోద్ఘాతము వంటిది. అచట యుద్ధముకొఱకు ఇరుపక్షముల కెవరెవరు వచ్చినారో వారలనుమాత్రము నిరూపించడమైనది. రెండవ అధ్యాయమునుండి ధర్మోపదేశమారంభింపబడును. కావున ప్రారంభములోనే అర్జునుండు 7-వ శ్లోకమున శ్రీకృష్ణ పరమాత్మ నీలాగున ప్రార్థించడమైనది. ఇందువలన భగవదనుగ్రహము కలిగియుండిన మాత్రమే తన యనుష్ఠానములన్నిటిలో విజయముకలుగునని స్పష్టమగుచున్నది. అనగా భగవద్భక్తి మొదటనే కలిగియుండవలయునని యిది నిరూపించుచున్నది. లేనిచో మొదటనే యీశ్లోకమును జెప్పియుండరు.

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥

తా॥ అర్జునా! ఇది బ్రహ్మసంబంధమైన నిష్ఠ. ఈ నిష్ఠనుబొంది మోహమును జెందడు. ఈ నిష్ఠయందు మరణకాలమందుండిన యెడల మోక్షమును బొందుచున్నాడు.

వి॥ వృద్ధులయిన భక్తులనుగురించి ఈ శ్లోక ముపదేశించడమైనది. మా యౌవనకాలమంతయు సంసారములో కలసిపోయెను. వార్ధక్యము వచ్చినది. మేమెట్లు తరింపగలము? అని మనోవేదన కలవారినిగురించి కరుణతో శ్రీకృష్ణుడు యీ వాక్యము నుపదేశించెను. ప్రాణము కంఠగతమైనను పరమాత్మస్మరణ, జ్ఞానము, ధ్యానముకలిగినతో తరించవచ్చును. భయపడనక్కరలేదు. ఇది గీతాధర్మప్రారంభమగు ద్వితీయాధ్యాయమున బోధించినది. ఇక గీతాంత్యమాధ్యాయమగు 18-వ అధ్యాయములో నేనుపదేశించినది చూడుడు. ఆద్యంతముల గూర్చి విచారించిన భగవద్భక్తివలననే ముక్తికలుగునని అర్థమగుచున్నది.
అ. 18 శ్లో॥ 55

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥

తా॥ అనన్యభక్తిచేత నన్నెవ్వడైనదియు, నెట్టివాడ నైనదియు యథార్థముగా నెరుంగుచున్నాడు. అట్లెరుంగుటవలన నన్ను నిజముగా దెలిసికొనినవాడై పిమ్మట నాలో ప్రవేశించుచున్నాడు.

వి॥ మోక్షసన్న్యాసయోగమున నిట్లుపదేశించుటవలన భక్తి వలననే భగవద్భక్తికలుగుటకు, ముక్తిగలుగుటకు హేతువగుచున్నదని శ్రీకృష్ణుడు వ్యక్తపరచడమైనది. దీనికన్న పరమప్రమాణ మేమికావలయును? ఇక దీనిపై విమర్శన చేయువారుండిన భగవద్వాక్యములో నమ్మకము లేనివారనియే మనము గ్రహించుకొనిన చాలును.

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

తా॥ సమస్తధర్మములను విడిచి నన్నొక్కనిమాత్రము శరణు బొందుము. నేను నిన్ను సమస్తపాపములనుండి విముక్తిని చేసెదను. దుఃఖింపకుము; మోక్షము నిచ్చెదను.

వి॥ శ్రీ వైష్ణవులు తిరుమంత్రమువలె యీ శ్లోకమును బఠించె దరు. వారికి దీనికన్న పరమప్రమాణము మఱియొకటిలేదు. శ్రీ రామానుజాచార్యులవారు యిదే శ్రీకృష్ణభగవానుల యంత్యసందేశమని సెలవిచ్చిరి. అ. 18 శ్లో॥ 78

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువానీతి ర్మతిర్మమ॥

తా॥ యోగుల కీశ్వరుండగు శ్రీ కృష్ణభగవానుడు యేపక్షమునందున్నాడో, గాండీవమును, ధనస్సును ధరించిన పార్థుడు యేపక్షమందున్నాడో ఆ పక్షమునందు సంపదయును, విజయమును, ఐశ్వర్యమును, దృఢమైన నీతియును గలవని నా యభిప్రాయము.

వి॥ ఇది యంత్యశ్లోకము. దీనిని సంజయుడు తన యాశయము నిట్టిదని కట్టకడపట తెలుపడమైనది. "యత్ర యోగీశ్వరః కృష్ణో" అని తెలుపుటవలన శ్రీకృష్ణు డేపక్షమునందుండునో అచ్చటనే విజయము కలుగునని వచించుటవలన భక్తులు, సాధువులు, సాధకులు, జ్ఞానులు మొదలగు వారందరును ఆత్మయుద్ధము చేయువారలే. అనగా ప్రకృతి గుణములగు కామక్రోధాదులతో యుద్ధముచేయువారలు. అట్టివారికి ప్రకృతిని జయించుటకు, మోక్షముకలుగుటకు భగవత్కారుణ తప్పనిసరిగ గలిగియుండవలయునని నిశ్చయించుకొనిన చాలును. అట్లుగాక తన విద్యాబలము, జ్ఞానబలము, బుద్ధిబలము, యోగబలములచే ప్రకృతిని అనగా నవిద్యను జయించవచ్చునని తలంచినచో దుర్యోధనాదుల దుర్గతియే కలుగును. ఇదియొకటి గ్రహించిన జాలును. శాంతియు, జ్ఞానమునుగలిగి మోక్షసామ్రాజ్యమునందు పట్టాభిషిక్తులు కాగలరు.

---

ఓమ్

# క్రమశిక్షణ

'న శ్రేయో నియమం వినా' నియమము వినా శ్రేయస్సు కలుగదు. క్రమశిక్షణ వుండవలయునని గొప్పవారగు శ్రీ నెహ్రూ శ్రీ రాజేంద్రప్రసాద్ శ్రీ రాధాకృష్ణ మొదలగువారేగాక సాధారణ

కార్యనిర్వహణ గలవారందరున్ను ఉపన్యాసములో బోధించుచుందురు. క్రమశిక్షణ యెట్లుకలుగును, దానికి తగినపని చేయుచున్నారాయని ఆలోచించువారరుదైరి. క్రమశిక్షణ విద్యార్థులకేగాక ప్రతిసంఘమువారికిన్ని అత్యవసరముగా వుండవలసినది. స్కూలులో వ్యాయామము, డ్రిల్లు యేలాగున క్రమబద్ధముగ తగినమాష్టరులచే నేర్పబడుచుండునో ఆలాగున క్రమశిక్షణయు డ్రిల్లు మాస్టరుగ ప్రతిస్కూలులోను నేర్పెడు పద్ధతి యేర్పడినప్పుడే క్రమశిక్షణవుండును. వ్యాయామముచే శరీరేంద్రియములకు యెట్లుబలముకల్గునో క్రమశిక్షణచే మానవునికి మనస్సునన నిర్మలత్వమున్ను, శుద్ధప్రవర్తనమున్ను ఏర్పడును. వ్యాయామము స్థూలదేహమునకు శక్తిని కలుగజేసినట్లు క్రమశిక్షణవల్ల మానసికశక్తియు, ఆత్మశుద్ధియు గలుగును. ఈ విషయమై ప్రతి పాఠశాలలోను తగినవారిని యేర్పాటుచేయునప్పుడే క్రమశిక్షణ ఏర్పడును. అట్లుచేయక క్రమశిక్షణ వుండవలయునని చెప్పుచుండిన యేమిప్రయోజనము? ఇట్టిపద్ధతి పాఠశాలలలో లేనికారణముచేతనే ఈ మధ్య కాశీ విశ్వవిద్యాలయములోను, అహమ్మదాబాదులోను, ఉస్మానియా యూనివర్సిటీలోను అట్టి విపరీత ప్రవర్తనము గలుగుటకున్ను, లోకనిందకున్ను కారణమైనది. ప్రతి పాఠశాలలోను మతబోధన వుండవలయునని ఇప్పుడిప్పుడు మనవారు తెలుసుకొనుచున్నారు. మతబోధయొక్క తత్వమున్ను క్రమశిక్షణయని మరువకూడదు. దీనిని విస్మరించి మతమును మాత్రము బోధించిన గొప్పలాభమేమియు గలుగదు. తానుచదివి అవగాహనము చేయని విద్యను యితరులకు యేలాగున చెప్పగలుగును? ఆలాగున తాను క్రమశిక్షణ గలవాడయిన మాత్రమేగదా యితరులకు క్రమశిక్షణను నేర్పగలుగును? ఇది పుస్తకముచూచి పాఠశాలలో మాష్టరులు పాఠము చెప్పునటువంటిది గాదు. మతతత్వమున్ను ఆలాటిదే. చక్కగ తాననుష్ఠించి చెప్పిన మాత్రమే విద్యార్థులు నడువగలుగుదురు. ఇది డ్రిల్లుమాష్టరు నేర్పెడు వ్యాయామము వంటిదిగాదు. తాననుష్ఠించి చెప్పవలసి యుండును. అప్పుడే చెప్పువారిపై వినేవారికి భయభక్తులు గలిగియుండును. మొట్టమొదట మానసికపరివర్తనముగలుగవలయును. దానికిమనోపరివర్తనము గలిగినవాడు వుండలయును. దీనికి సన్యాసులుగాని, వానప్రస్థులుగాని,

నైష్ఠిక బ్రహ్మచారులుగాని వుండిన మాత్రమే ప్రయోజన మేర్పడును. అట్టివారు దొరకకపోయిన గృహస్థాశ్రమమున ఉండేవారైనను మంచి సంస్కారజీవులుగా వుండవలయును. విద్యార్థులకు బ్రహ్మచర్యమును ముఖ్యముగ బోధించవలయును. గృహస్థులు దీనిని యెట్లు ఉపదేశింప గలరు? క్రమశిక్షణనేర్పెడు సన్న్యాసిమొదలయినవారికి డ్రిల్లుమాష్టర్లకు గల జీతము లేకపోయినను, వారికి తగిన దేహసంరక్షణకు యేర్పాటు చేయవలయును. ఇట్టి క్రమపద్ధతి యొకటుండిన తగిన యతీశ్వరులుగాని వానప్రస్థులుగాని నైష్ఠిక బ్రహ్మచారులుగాని దొరకకపోరు. శ్రీరామకృష్ణ మిషన్ కుసంబంధించినసన్న్యాసులువారిఅధీనములోనుండుకాలేజీలలోను కొన్ని యితర కళాశాలలలోను తమతమపేరట క్రమశిక్షణ విద్యార్థుల కిచ్చుచున్నారు. ఆర్యసమాజములోను ఆలాగున కనబడుచున్నది. అట్టి బోధకులు, విద్యావంతులున్ను, తపస్సంపన్నులున్ను వుండవలయును. లేనిచో యూనివర్ సిటిలోను, కాలేజీలలోను గల విద్యార్థులు గౌరవము చేయరు. విద్యావంతులు దొరకుదురేగాని తపస్సంపన్నులు దొరకడ మరుదయ్యెను. పూర్వకాలమున ముఖ్యముగా వానప్రస్థులు గురుకుల మేర్పరచి బోధించుటవల్ల అప్పటివారు మంచి క్రమశిక్షణ గలిగి దేహ బలమున్ను ఆత్మబలమున్ను గలవారై యుండిరి. వారు స్వారాజ్యము లను నిర్వహింప శక్తిగలవారైయుండిరి. ఇప్పుడే ఒకవిధముగ స్వారాజ్య మునునిర్వహించుచుండినను, స్వారాజ్యనిర్వహణముక్షయించిపోయినది. ధర్మమార్గములో జ్ఞానమార్గములో తన దేహేంద్రియమనస్సులను నియ మించవలసియుండిన ఆత్మశక్తి గలిగియుండవలెను. అది క్రమశిక్షణపై ఆధారపడియున్నది. పాఠశాలలలో చదువుచు వారివారి స్వగృహము లోనికి వెళ్లేవారికి యిదికొంచెము ప్రయాసముగాతోచినను విశ్వవిద్యా లయమునుండి హైస్కూలువరకు హాస్టలులో భోజనముచేసియుండు విద్యార్థులందరికిన్ని యీ క్రమశిక్షణను బోధించెడువారొక్కరు తప్పని సరిగ నుండవలయును. లేనిచో యేకాలమునకున్ను యేదేశములోను విద్యార్థులు క్రమశిక్షణగలవారుకాజాలరు. మొట్టమొదట విద్యాశబ్దము యొక్క అర్థము నేర్పువారుండవలెను. విద్యాశబ్దముయొక్క అర్థమేమన దేనివల్ల అవిద్యనశించునో అదే విద్యయగును. విద్యకు జ్ఞానమని కూడ

అర్థముగలదు. అప్పుడు దేనివల్ల అజ్ఞానమునశించునో అదే జ్ఞానమగును. అట్లయిన అజ్ఞానవిషయములోనుండు వారెట్లు జ్ఞానులగుదురు? కావుననే మొదట సన్న్యాస, వానప్రస్థ, బ్రహ్మచర్యాశ్రమములలో క్రమశిక్షణ చేయుట కర్తవ్యాలని చెప్పుటకు కారణము.

శ్లో॥ విద్యయా చ యయాఽవిద్యా ప్రభయా చ యదా తమః।
నశ్యతి బ్రహ్మవిద్యా సా తేజోరూపా చ నేతరా॥

తా॥ ఏలాగున ప్రకాశముచేత తమస్సు నశించునో ఆలాగున యే జ్ఞానముచే అనగా విద్యచేత అవిద్యరహితమగునో అదే విద్యయొక్క స్వరూపము. అది బ్రహ్మవిద్య యొక్క-దానివల్ల గలుగునేగాని తక్కిన యే విద్యచేతనున్ను గలుగజాలదు. కనుకనే శ్రీకృష్ణభగవానుడున్ను గీతలో ఈలాగున చెప్పెను. "అధ్యాత్మవిద్యా విద్యానాం" విద్యలన్నిటిలోను ఆత్మవిద్యయే విద్యయనబడును. ఏలన ఆత్మవిద్యవల్లనే అనాత్మస్వభావము తొలగును. శంకరభగవత్పాదులున్ను ఆత్మబోధయందు ఈలాగుననే వచించిరి.

"విద్యాఽవిద్యాం నిహంత్యేవ తేజస్తిమిరసంఘవత్"

తా॥ విద్యఅన్ననో ప్రకాశము అంధకారముయొక్క రాశిని అవిద్యను నశింపజేయుచున్నది.

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

తా॥ కృపణత్వమువలన కలిగిన దోషముచేత కొట్టబడిన నైజగుణముకలవాడనుగనుక యుక్తాయుక్త పరిజ్ఞానము లేనివాడనై నిన్ను అడుగుచున్నాను. ఏది శ్రేయస్కరమగునని నీచేత నిశ్చయింపబడుచున్నదో దానిని నాకు చెప్పుము. నేను నీకు శిష్యుడను. ఆకారణమువల్ల నిన్ను శరణునొందిన నన్ను శాసింపుము. కృపణత్వమనగ ప్రకృతిగుణముగలవాడనియు, అజ్ఞానియనియు తాత్పర్యము. అర్జునునివంటి మేధాసంపత్తిగలవాడు సహా శ్రీకృష్ణభగవానునివల్ల సంస్కరింపబడ

వచ్చినపుడు సామాన్య మానవులగురించిగాని, విద్యార్థులగురించిగాని వరల చెప్పవలెనా! నిమ్మచెట్టు, చీనిచెట్టు మొదలయినవానికి లేప్రాయములో అడుగునుండి పుట్టుచుండు రెమ్మల కోసివేయక పోయినను, సంరక్షణచేయకపోయినను అవి యేలాగున చక్కనివృక్షమై ఫలమును కలుగచేయజాలదో, సంస్కరింపడని మానవునియొక్కస్థితియు ఆలాగున నుండును. ఒక్క బండరాతిని శిల్పి యెంతపనిచేసిన విగ్రహము కాగలుగునో అదిన్ని గ్రహించుకొనవలయును. అప్పుడు ఆ రాయి విగ్రహారాధకులకు దేవుడయి పూజింపబడుచున్నది. సౌధమునకుగాని, దేవాలయమునకుగాని ఒకేవిధముగ నిలపెట్టియుండు రాతి స్తంభములు శిల్పి యెంత పనిచేసి అంతయుసమానముగాచేసినాడో ఆలాగున యింటికి వేసియుండు సరములుగాని, త్రావులుగాని పనివాడు ఒకేరకముగ చేయవలసివచ్చినపుడు యెంత పనిచేయవలసివచ్చునో ఆలాగున మానవులును అంత సంస్కరింపబడినపుడే వుపయోగపడుదురు. లేనిచో వట్టి బండవలెను, మ్రానువలెను ఉండుదురు. గురుగీతయందు గురునియొక్క లక్షణము ఈశ్వరుండు చెప్పినది చూడుడు.

శ్లో॥ చాతుర్యవాన్ వివేకీ చ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః।
మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే॥

తా॥ కార్యదీక్షగలవాడై, వివేకియై, అధ్యాత్మజ్ఞానసంపన్నుడై, బాహ్యాభ్యంతరశుద్ధిగలవాడై యెవని మనస్సు పవిత్రమైయుండునో వానికిమాత్రము గురుశబ్దముశోభించును. అనగా వాడే గురువగును. కావుననే మొదట క్రమశిక్షణను నేర్పుటకు సన్న్యాసులను నిరూపించుటకు కారణమైనది. మనుమహర్షి బ్రహ్మచారి ధర్మమును తెలిపినది చూడుడు.

శ్లో॥ సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్।
సన్నియమ్యేంద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః ॥

తా॥ బ్రహ్మచారి గురుకులమున వసించుచు యింద్రియములను స్వాధీనములోనిలిపి ఆముష్మికమునందలి తపోవృద్ధికై యీ నియమములను అనుష్ఠించవలయును.

శ్లో॥ అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజశ్శనైః ।
గురౌ వసన్ సంచినుయాద్బ్రహ్మాధిగమికం తపః॥

తా॥ ఈ చెప్పినక్రమమున మానవుడు మనస్సును మెల్లగా సంస్కరించుకొన్నవాడై గురుకులమున వసించుచు యిదివరకు చెప్పినవియు, యిక చెప్పబడునవియునగు నియమముల ననుసరించుచు వేదాధ్యయనము చేయవలయును.

శ్లో॥ యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగుప్తే చ సర్వదా ।
స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ ॥

తా॥ ఎవని వాక్కు అసత్యాలాపాదులచే దుష్టముకాకయు, యెవని మనస్సు రాగద్వేషాదులచే చెడకయు నిర్మలమైయుండునో అతడు వేదాంతమందు చెప్పబడిన సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వరూపమైన ఫలమును పొందును.

శ్లో॥ ఆచమ్య ప్రయతో నిత్య ముభే సంధ్యే సమాహితః ।
శుచౌ దేశే జపన్ జప్య ముపాసీత యథావిధి॥

తా॥ ఆచమనముచేసి పరిశుద్ధుడై నిత్యము వేఱువింత మానినవాడై రెండు సంధ్యాకాలములయందు పరిశుద్ధప్రదేశమున కూర్చుండి శాస్త్రప్రకారముగా గాయత్రీమంత్రమును జపించవలయును. ప్రణవమైనను, ఈశ్వరమంత్రమైనను, నారాయణమంత్రమైననుజపించవచ్చును.

శ్లో॥ ఆయుస్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహాద్యశః ।
పుణ్యం చ మత్ప్రియత్వం చ లభ్యతే బ్రహ్మచర్యయా ॥

తా॥ బ్రహ్మచర్యమహిమచే పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, బలము, పరాక్రమము, అపారప్రజ్ఞ, మహత్తైనయశస్సు, గొప్పపుణ్యము భగవత్ప్రీతి యిదంతయును సులభముగా చేకూరును. మరియు బ్రహ్మచర్యమును గురించి ఋషులు వచించినది వినుడు.

శ్లో॥ బ్రహ్మచర్యం దృఢం యస్య సాగరో గోష్పదాయతే ।
బ్రహ్మచర్య విహీనస్య గోష్పదం సాగరాయతే॥

తా॥ బ్రహ్మచర్యవ్రత దార్ఢ్యముగలవానికి సాగరము గోష్పదజలమువలెను, అట్టి బ్రహ్మచర్యవ్రతము లేనివానికి గోపాదజలము

సముద్రమువలె కనుపించును. అనగా మనోబల దుర్బలభేద మీలాగున యుండును.

శ్లో॥ బ్రహ్మచర్యవ్రతో భీమ సింహో౽పి శునకో భవేత్ ।
బ్రహ్మచర్యస్య హీనే తు శ్వా భీమస్సింహావద్భవేత్ ॥

తా॥ బ్రహ్మచర్యవ్రతునికి భయంకరమైన సింహము కుక్కవలెనె కనిపించును. బ్రహ్మచర్యవ్రతహీనునకు శునకమునహా భయంకరమైన సింహమువలె గోచరించును. ఇదిన్ని పైజెప్పిన విధముగ బుద్ధియొక్క ధైర్యాధైర్యములను నిరూపించుచున్నది; పతంజలిమహర్షియు యోగశాస్త్రమున యిట్లు వచించిరి. "బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః" దృఢమైన బ్రహ్మచర్యవ్రతముగలవానికి వీర్యలాభము గలుగును. అనగా సామర్థ్యము, బ్రహ్మవర్చస్సు, ఓజస్సు గలుగును. మరియు "తైలక్షయే యథా దీపః నిర్వాణ మధిగచ్ఛతి".

తా॥ తైలము నశించినవెంటనే దీపమారిపోవునట్లు బ్రహ్మచర్యక్షయము గలిగినచో మానవునియొక్క ప్రజ్ఞయు నశించును. పెట్రోలు క్రూడాయిలు నశించిన మోటారుకారు ఆయిల్‌యంత్రము యెట్లు ఆగిపోవునో, శుక్లమునశించిన మానవయంత్రమగు యీశరీరముయొక్క శక్తియు, మానసికశక్తియు క్షయించును. స్థూలసూక్ష్మమనెడు దేహయంత్రములను యీ బ్రహ్మచర్యతేజస్సే నడుపుచుండును. ఇక యీవిషయమై విస్తారముగా చూడదలంచువారు బ్రహ్మచర్యమను గ్రంథమును చూడుడు.

ఓమ్

## సప్తసంతానములు

శ్లో॥ తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం సురాలయం।
ఆరామకృతిసత్రాణి సప్త సంతానసంజ్ఞకాః॥

(1) తటాకము అనగా ధర్మార్థముగా చెఱువు త్రవ్వించుట, (2) ధననిక్షేపము ధర్మకార్యముకొరకు నిధి నేర్పరచుట, (3) బ్రహ్మస్థాప్యం బ్రహ్మనిష్ఠులకు ఆశ్రమములు కట్టించుట, లేక బ్రహ్మనిష్ఠులగు

బ్రాహ్మణుల కగ్రహారముల నిర్మించుట, (4) దేవాలయము కట్టించుట, (5) ధర్మార్థముగా వనము నేర్పరచుట, (6) ఉత్కృష్ట గ్రంథమును అచ్చువేయుట, (7) అన్నసత్రమును గట్టించుట ఈ ఏడున్ను సప్తసంతానము లనంబడును. వీనిలో ఏదైన ఒకటిచేసినచో ఒక్క ఉత్తమసంతానము గలిగినట్లే. ఆలాగున రెండుగాని, మూడుగాని యిక అధికముగా నిర్మించిన అన్ని ఉత్తమ సంతానములు గలిగినట్లే తలంచవలయును. సంతానము లేనివారు "అపుత్రస్య గతిర్నాస్తి" అను వాక్యము విని సంతప్తులగుదురు. సత్పుత్రుడు గల్గిన వార్థక్యదశయందు తల్లిదండ్రులను సంరక్షించి పుణ్యకర్మలచే మాతాపితరులను పుణ్యలోకమును పొందింపగలరేమోగాని, అట్టి ఉత్తమసంతానములుగలవారుప్రస్తుతము అరుదనియే చెప్పవచ్చును. పైజెప్పిన సప్తసంతానములు యిట్టి సందేహాస్పదములుకావు. తప్పనిసరిగా ఉత్తమసంతానముచే కల్గెడిఫలమును కలుగచేయును. ఒకవేళ పుత్రసంతానము లేకపోయినను తానాచరించిన పుణ్యకర్మల ఫలితముమాత్రము పుణ్యలోకమును గలుగచేయునుకదా! దీనియందు సందేహములేదు గదా! సంతానముయొక్క ప్రయోజనము యీ పుణ్యలోకప్రాప్తికొరకని కాదు. వార్థక్యదశలో సరియైన ధనము లేనిచో సంరక్షించువారు లేరనియే అర్థము. శ్రద్ధాభక్తులతో మాతాపితరుల సేవచేయుటయే శ్రాద్ధశబ్దాని కర్థమని శ్రీ దయానందసరస్వతి స్వాములవారు చెప్పిరి. మనమందరమున్ను శైశవకాలములో అశక్తి స్థితిలో నుండగా సుమారు 18 సంవత్సరములవరకు మాతాపితరులచే సంరక్షించబడినవారలము. అత్తరి తల్లిదండ్రులు యౌవనస్థితిలో శక్తివంతులై యుండిరి. మరల వార్థక్యదశలో వారలశక్తులగుదురు. అత్తరి మనము యౌవనవంతులై శక్తివంతులము కాగలము. శైశవావస్థలో యెన్ని సంవత్సరములు మాతాపితరులు మనలను సంరక్షించిరో అన్ని సంవత్సరములు వృద్ధావస్థలో జననీజనకులను మనము పోషింపవలయును. అపుడే మాతాపితరుల ఋణమును తీర్చినవార మగుదుము. మరియు బాల్యావస్థలో మనకు వారు విద్యచెప్పించినట్లు వార్థక్యదశలో వార్లకు బ్రహ్మవిద్యను అనగా జ్ఞానమును మహాత్ములచే ఉపదేశించునట్లు చేయవలయును. ఇదే నిజముగా తల్లిదండ్రులను తరింపచేయుట

యగును. ఎందుకనగా జ్ఞానమువలననే యెవ్వరైనను తరింపవలయును. అది యీ దేహముతో ఉన్నప్పుడిచటనే పొందవలయును. పరలోకములో అట్టి జ్ఞానమును పొందుట కవకాశములేదు. ఇచటచేసిన పుణ్యాపుణ్య జ్ఞానాజ్ఞాన కర్మఫలములు మాత్రమే పరలోకమందు అనుభవింపగలరు. ఇకను సప్తసంతానములనుగురించి మంచనకవి కేయూరబాహుచరిత్రమున తెలిపినది చూడుడు.

పద్యం॥ నందనుడు వనము నల్లిండ్లునిధి
సురగృహము చెఱువు మేలికృతి యనంగ
జగతి వెలయు సప్తసంతానములు
వీనఁ బుణ్యమును యశంబు బొందవచ్చు.

తా॥ (1) పుత్త్రుడు, (2) వనము, (3) అగ్రహారము, (4) నిధి, (5) దేవాలయము, (6) చెఱువు, (7) కృతి వీనివల్ల భూలోకములో కీర్తియున్ను, పరలోకములోపుణ్యలోకప్రాప్తియు కలుగును. మొదటిశ్లోకమున యీ ఒక్కొక్కపదమున కర్థము విశదీకరింపబడినది. దీనియందు సప్తసంతానములలో పుత్రునిగూడ చేర్చడమైనది. కావుననే మొదటసుతుడని ప్రారంభించడమైనది. అందువల్లసత్పుత్రునివల్ల ఏ పుణ్యలోకప్రాప్తికల్గునో, తక్కినటిరింటివల్లను అట్టిపుణ్యలోకప్రాప్తి కల్గునని గ్రహించవలయును. మరియు మైరావణచరిత్రకారుని పద్యమును శ్రీ సీతారామాచార్యులవా రిట్లు వచించిరి.

పద్యం॥ సుతుడును గుడి నిధి చెఱువును
గృతియును నల్లిండ్లు వనము క్షితిలోపల సం
తతులిందులోన నెన్నగ
గృతివలనం గలుగునంద్రు కీర్తియు గతియున్.

దీని అర్థము పైన వివరించినదే. వెల్లంకి గంగాధరమంత్రి శాసనమున యిట్లు కనపడుచున్నది.

క॥ తనపెంచినసంతానము తనసంతానంబు గృతియు దననల్లిండ్లున్
వనమును చెఱువునుగుడియును జనవినుతములైనసప్తసంతానంబుల్.

దీనియందు పైచెప్పినవాటికన్న ఒక విశేషముగలదు. అదే మన "తనపెంచినసంతానము" అనగా తాను దత్తుతీసుకొనినదిగూడా

సప్తసంతానములో చేర్చుకొనడమైనది. అనగా దత్తపుత్రుడుకూడా స్వంతపుత్రునితో సమానుడని తెలిపినారు. అట్లుగాక దత్తుదీయక పోయి నను తాను పెంచినవానిని గూడా సప్తసంతానములో చెప్పినారు. ఇక యీ విషయమై యెన్నియో పద్యములు సంస్కృతాంధ్రములలో గలవు. అన్నిటియొక్క సారము యీ పైన వ్రాసిన శ్లోకపద్యములలో గలవు. మనుస్మృతియందు తెలిపినది చూడుడు.

శ్లో॥ మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా।
స్వర్గం గచ్ఛత్యపుత్రాఽపి యథా తే బ్రహ్మచారిణః॥

తా॥ పుత్రసంతతి గలుగుటకు ముందుగా భర్త మరణించినను, అప్పటినుండి బ్రహ్మచర్యము శీలించిన నారీమణి బ్రహ్మచారులు పొందెడు ఉత్తమలోకమును పొందగలదనియు, ఆలాగున భార్యావియోగముగల పురుషునికి సంతానము లేకపోయినను బ్రహ్మచర్యవ్రతమును అప్పటినుండి శీలించిన పుణ్యలోకప్రాప్తి గల్గుననియు తెలియందగినది. ఇక స్త్రీపురుషులెవరున్ను సంతానములేదని వ్యాకులపడనక్కరలేదు. అయితే సంతానముగల్గినను గలుగకపోయినను మోక్షము మాత్రము బ్రహ్మజ్ఞానముచే కలుగవలసినదేగాని మరి దేనితోను గలుగదు. ఏలన యిప్పుడు పుడమిలో పుట్టియుండు మానవులందరు క్రొత్తగా జన్మించిన వారుకారు, సృష్టి ఆరంభమునుండియే జన్మించి జన్మించి వచ్చినవారు. అట్లైన ఇదివరలోయెన్నియోజన్మములెత్తియుండవచ్చును. ఆజన్మములో యెందరో పుత్రులు గల్గియుందురు. పుత్రసంతానమువల్ల మోక్షమని నచో యిపుడేల పుట్టుదురు? అదియునుగాక పుణ్యలోకప్రాప్తి ఆ పుణ్య ముండువరకుమాత్రమే యుండును. ఆ పుణ్యము నశించినవెంటనే మరల భూలోకములో జన్మమెత్తవలసి యుండును. ఇది సర్వశాస్త్రముల యొక్క ఏకాభిప్రాయము, కావుననే గీతయందు "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశన్తి" అని శ్రీకృష్ణవచనము. దీనికన్న మరియొక ప్రబలప్రమాణము అవసరములేదని తలంచెద. మరియు పుత్రసంతానమువల్ల మోక్షమని తలంచినచో సర్వమతములకు జగద్గురువులగువారందరున్ను బ్రహ్మచారులే, సన్న్యాసులే. శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్య ప్రభృతులున్ను, శ్రీఏసుక్రీస్తున్ను, శ్రీరామకృష్ణపరమహంస, శ్రీదయానంద

సరస్వతి, శ్రీవివేకానంద, శ్రీ నారాయణగురు, శ్రీ రమణమహర్షులు వీరందరున్ను బ్రహ్మచర్యమునుండి సన్న్యసించినవారలుగదా ! ఇకను పెక్కండ్రు మహాత్ములగు బ్రహ్మచారులున్ను, బ్రహ్మచర్యమునుండి సన్న్యసించినవారలున్ను గలరు. వివేకచూడామణియందు శ్రీ శంకరుల వారు తెలిపినది చూడుడు.

శ్లో॥ పఠంతు శాస్త్రాణి యజంతు దేవాన్
కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః।
ఆత్మైక్యబోధేన వినా విముక్తిః
న సిధ్యతి బ్రహ్మశతాంతరేపి॥

తా॥ అనేక శాస్త్రములను పఠించి, బోధించెడి శక్తిగల్గినను, ఇంద్రాదిదేవతలనుగురించి యజ్ఞములు సల్పినను, సత్కర్మానుష్ఠానములను జేసినను, దేవతలను సేవించినను వీటిచే నూర్లకొలది బ్రహ్మప్రళయములు గడచినను మోక్షమనునది అనగా బంధవిమోచనము కలుగునది కాదు. కేవల బ్రహ్మాత్మైక్యజ్ఞానముచేతనే మోక్షముకలుగుచున్నది.

శ్లో॥ ఋణమోచనకర్తారః పితుస్సన్తి సుతాదయః।
బంధమోచన కర్తా తు స్వాత్మనోఽన్యో న కశ్చన॥

తా॥ తండ్రి ఋణస్థుడైనచో కుమారులు మంచివారైన యెడల ఋణవిమోచనమును చేయవచ్చును.అయితే సంసారబంధవిమోచనకర్త తనకంటె వేరు యెవరున్ను కానరారు. అనగా తనయొక్క అజ్ఞాన విముక్తి స్వయముగా తానే చేసికోవలెను. ఇచట గురువులు సహాయము మాత్రమే చేయగలరు.

శ్లో॥ మస్తకన్యస్తభారాదే ర్దుఃఖమన్యై ర్నివార్యతే।
క్షుధాదికృతదుఃఖం తు వినాఽన్యేన న కేనచిత్॥

తా॥ నెత్తిపైగలవైదైనభారమును యితరులుయెవరైననివారింపవచ్చునుగాని, తన ఆత్మలోగల భవభారమును యెవరిచేతను నివారింప సాధ్యముకాదు. మరియు తనకుగల ఆకలి శమించుటకు స్వయముగా తానే భుజింపవలయునుగాని, యితరులు భుజించిన తనకేలాగున ఆకలి శమింపదో, ఆలాగున తనయొక్క సంసారదుఃఖశాంతికొరకు తానే బ్రహ్మజ్ఞానానుభవమును పొందవలెను.

శ్లో॥ పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా ।
ఆరోగ్యసిద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా ॥

తా॥పథ్యము, ఔషధసేవయు యెవనిచే చేయంబడునో, వారి చేతనే ఆరోగ్యసుఖమనుభవింపబడుచున్నది. ఇతరులు చేసిన పథ్యౌషధ సేవచే పొంద సాధ్యముకాదు. కనుక తనకుగల భవరోగదుఃఖమునకు తానే ధ్యానానుష్ఠానముచేసి జ్ఞానమునుపొందక, పుత్రులుచేయుదురను తండ్రియు, భర్తచేయునని భార్యయు తలంచి కాలము వ్యర్థముచేయ రాదని భావము.

శ్లో॥ అవిద్యా కామకర్మాది పాశబంధం విమోచితుం ।
కశ్శక్నుయా ద్వినాఽఽత్మానం కల్పకోటి శతైరపి ॥

తా॥ పై జెప్పినరీతిగా అజ్ఞానము, కామము, కర్మము మొదలుగా గల పాశముచే గట్టబడిన బంధము నెవ్వరుగాని విడిపింపజాలరు. అది కోటి బ్రహ్మకల్పములకైనను తనకుతానే వదలించుకోవలసినదేగాని, పుత్రులో, లేక మరియెవరో భవబంధవిమోచనము చేయగలరని తలంచి మోసపోకుడు. మరియు భగవద్గీతయందు చెప్పినది చూడుడు.

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥

తా॥ ఓ అర్జునా ! నాయొక్క విశ్వరూపమును యిప్పుడేలాగున చూచితివో అది వేదాధ్యయనములచేతగాని, కామ్యకృతతపస్సుచేత గాని, దానముచేతగాని, యజ్ఞముచేతగాని చూచుటకు శక్యముకాదు. ఇట్టిరూపమును ధరించిన నేను మదైకనిష్ఠమైన భక్తిచేతనే యథార్థముగా తెలిసికొనుటకున్ను, దర్శించుటకున్ను, నాయందు ప్రవేశించుటకున్ను, అనగా నాలో ఐక్యమొందుటకున్ను శక్యుడనగుచున్నాను.

దీనియందు "జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప" అనిప్రయోగించుటవల్ల పరమాత్మ యిట్టిస్వరూపముగలవాడని తెలుసుకొనుటకున్ను, సాక్షాత్తుగాదర్శించుటకున్ను, వేదాన్తతత్త్వముగ్రహించి

ఖ్యజ్ఞానము గల్గుటకున్ను నిరంతర తదేకనిష్ఠగల భక్తివల్లనే సాధ్యపడు ని శ్రీ భగవానుడు తెలుపడమైనది. బాహ్యమగు దేహసంబంధమైన పుత్రునిగురించి యిదివరలో తెలుపడమైనది. ఇక అంతరార్థమగుపుత్రుని గురించి గ్రహించవలసి యుంటున్నది. బాహ్యదేహసంబంధమైన శుక్ల శోణితములతో యేర్పడినసత్పుత్రుడైనచో పైనుదహరించిన దేహమును వార్ధక్యదశలో సంరక్షించకలుగును. అంతేగాని అంతరార్థమైన ఆత్మో ద్ధారణము చేయజాలడు. అది ఆత్మలోగలిగెడు జ్ఞానమను పుత్రునివలన ద్ధారణ కావలసియుండును. ఇచట జ్ఞానముగల పుత్రుడని అర్థము కాదు; జ్ఞానోదయమే పుత్రుడని గ్రహించవలయును. అది యీ దేహ సంబంధ స్త్రీపురుషులసంబంధముచే గలిగెడు పుత్రుడువలె ముక్తికాంత యందు పురుషునికిన్ని, ఆత్మారామునియందు స్త్రీకిన్ని గలిగెడు ఐక్యము వల్ల గలుగవలసియుండును. అది యోగమువల్లనేకలుగును. ఈపుత్రుడు యోగమువల్లనే యేర్పడు నట్లుండును. అది యోగముచేతను యిది సంయోగముచేతను యేర్పడుచుండును. ఇదే యోగులకున్ను భోగుల కున్ను గల తారతమ్యము. ఒకటి బాహ్యార్థము ఇంకొకటి అంతరార్థము. బాహ్యార్థము గౌణము. అంతరార్థము ముఖ్యము. బాహ్యార్థము నశ్వ రము. అంతరార్థము శాశ్వతము. దీనికి ప్రమాణము —

శ్లో॥ యస్య భార్యా ముక్తికాంతా జాతో జ్ఞానమయస్సుతః।
ఉద్ధరేత్స కులం సర్వం మాతరం పితరం ధృఢమ్॥

తా॥ ఇట్టి ఆత్మబోధమగు పుత్రులావిర్భవించిన తనవంశమును తల్లిని తండ్రిని వారి సంబంధులందరిని ఉద్ధరించును.

---

ఓమ్

# అస్పృశ్యతా నివారణము

10—2—59 లో అస్పృశ్యతానివారణ ప్రచారకులు కొందరు శ్రీ వ్యాసాశ్రమమునకు రావడమైనది. వార్లలోచాలామంది విద్యావంతులు శౌచాచారపరాయణులు. వారీలాగున ప్రశ్నించిరి. హరిజనులకు అస్పర్శ దోషము కలుగుటకు కారణమేమి? ఎప్పుడు కలిగినది? ఎవరు కలుగ

జేసిరి ? ఈ మూడు ప్రశ్నలకు సోదాహరణముగ శ్రీ మలయాళస్వాముల వారు సమాధానము చెప్పిరి. కారణము లేక కార్యముండదు. హరిజనులు కాయసౌష్టవముగలవారు. చాలమందికిన్ని సామాన్యముగా భావసత్తి కూడా గలదు. ఇప్పుడిప్పుడు చాలామంది విద్యావంతులున్ను, ఉద్యోగస్థులున్ను గలరు. వారికన్న యిక యెంతో నిమ్నస్థితిలో వుండు యేనాదులు, కోయలు, ఎరుకలు, నక్కలవారు, కప్పలవారు మొదలైన వారుంటున్నారు. వీర్లలో నక్కలను, పిల్లులను, కాకులను తినేవారుంటున్నారు. హరిజను లెవ్వరున్ను యిట్టి నీచాహారమును భుజింపరు. అట్లుండగా వారికి అస్పర్శత లేకపోవడమేమి ? హరిజనులకు అస్పర్శత కలుగుట యేమి ? కారణము మన మూహించుకొనవలయును. ఈ విషయమై శ్రీ గాంధీగారికిన్ని, శ్రీ అంబేద్కర్ గారికిన్ని జరిగిన సంభాషణ గ్రంథమును ఒక్క సమయమున నేను చూడడమైనది. ఉభయుల వాద ప్రతివాదములలో దీనియొక్క మూలకారణము నిరూపించినట్లు కనిపించ లేదు. సవర్ణులు అవర్ణులగు హరిజనులపై యింత క్రూరకృత్యము ప్రయోగించునట్లే కనబడుచున్నది. దేనికిన్ని మూలకారణము తెలుసుకొనకపోయిన, ఆ సమస్యను నిర్దోషముగా నిర్ణయించజాలరు. అయితే అస్పర్శత యెప్పుడేర్పడినది ? ఎవరు యేర్పరచిరి ? దానికి కారణమేమి? ఇప్పుడు మనము వెదకిన కనిపించుట ప్రయాసము. అయితే కారణము మాత్రము లేకపోదు. సామాన్యముగ హరిజనులు భారతదేశమున అనాదిగా వుండినవార్లనియు, తర్వాత ఆర్యులు సింధునది ప్రాంతములో ప్రవేశించి క్రమముగా సేతువరకు ఆక్రమించుకొన్నారనియు, ఆదిమ జాతుల బహిష్కరించి వార్లను బానిసలుగా చేసినారనియు చరిత్ర కారుల ఆశయము. శాస్త్రకారులు బ్రాహ్మణస్త్రీయందు శూద్రునికి పుట్టినవారిని హరిజనులుగా నిర్ణయించి సంఘమునుండి వెలివేసినవార్ని చెప్పుచుందురు. ఇది అంత సమంజసముకాదు. పై చెప్పినదే చాలా వరకున్ను న్యాయముగా తోచుచున్నది. ఇదిట్లుండనిండు. నాయొక్క వ్యక్తిగత అభిప్రాయము మీకు తెల్పెదనని శ్రీవారు శెలవిచ్చిరి. ఆర్యులకు అనగా హిందువులకు గోవు చాలా పవిత్రమైనదను భావము గలదు. హిందువులు గోవులను దేవతలవలె పూజింతురు. గోమాతయని

కలుతురు. గోహింసకులను చండాలురనియు, మహాపాపులనియు తలం తురు. ఈగోహింసాకారణముచే మహమ్మదీయులకు, హిందువులకున్ను బహుకాలమునుండి యిప్పటివరకు అనేక సంఘర్షణలు జరుగుచున్నవి. ఈ పాపము పై నుదహరించిన నక్కలవారు, కప్పలవారు మొదలైన వార్లలో లేదు. ఇందువలన హరిజనులను అస్పర్శ్యులుగా సవర్ణుల గ్రామములకు దూరముగ వెలివేయుటకు కారణముగా వుండవచ్చును. ఏ దోషమును హరిజనులపై సవర్ణులు విధించిరో అట్టి దోషమును లేకుండ చేసేలాగున హరిజనులుగూడ యత్నించవలయును. లేనిచో యీ సమస్య నిర్ణయము గాజాలదు. దీనిపై అస్పర్శ్యనివారణ సంఘము వారు ఒక ప్రశ్న వేసిరి. అదేమన — మహమ్మదీయులు, క్రైస్తవులు గోమాంసభక్షకులై యుంటున్నారుగదా? వారికి అస్పర్శ్యదోషము లేదు కదా? దీనికి శ్రీవారు యిట్లు తెలిపిరి. అది నిజము. అయితే వారు హిందూమతస్థులుకారు. వారిమతములో అట్టి గోమాంసభక్షణము దోషమని లేదు. వారు యితరదేశీయులు. భారతీయుల వైదికకర్మలగు యజ్ఞము, వేదాధ్యయనము, దైవారాధన మొదలగువానిలో వారు ప్రవేశించరు. ఇదే దానికిగుర్తు. లోకవ్యవహారములలో సమానముగా వారున్ను, హరిజనులగు మీరున్ను కలసియే వుంటున్నారు. కావున మీరు హిందువులా ? లేక మరియొక మతస్థులా? యని ముందుగా నిశ్చయము చేసుకొనవలయును. హిందూ తెగలో చేరినవారని తలంచినచో గోహింస, గోమాంసభక్షణము తప్పనిసరిగ వర్జించవలయును. ఈ దోషము మీయందుండిన ఒకవేళ కాంగ్రెస్ ప్రభుత్వ ముండువరకు యెట్లైన వుండవచ్చునుగాని యిదే యెల్లప్పుడు వుండునని యెవరు నిశ్చయించగలరు? ఇప్పుడే కేరళము కమ్యూనిస్టుప్రభుత్వమైనదికదా! బలమైన హిందూమహాసభయొకటి క్రమముగా విజృంభించుచు వచ్చుచున్నది; అదికాని లేక వైదికసంబంధ మరియొకప్రభుత్వముగాని వచ్చునప్పుడు మీకు యీసమస్య యెదుర్కొనును. అప్పుడు సధైర్యముగా నిలిచి అడుగవలసియుండిన మీలోగల యీదోషమును తప్పకిప్పుడే సరిదిద్దుకొనవలయును. అట్లైన సవర్ణులతో మాకున్ను, మీకున్ను యేమి భేదమని అడుగుటకు అర్హతగలిగియుండును. అయితే క్షత్రియులలోను,

రెడ్లలోను, కమ్మవార్లలోను చాలామందిన్నీ మాంసభక్షకులై యుంటున్నారు. క్రమముగా వారున్ను అట్టి హింసాహారము మాను కొనుచున్నారు. మీరు గాంధీగారివలె సత్యాహింసపరులై, మద్య మాంసవర్జితులై యుండవలయునని నేను చెప్పుటలేదు. పైచెప్పిన బలిష్ఠ మైన జాతులతో సమానముగా నుండవలసియుండినచో వారివలె ఆహార వ్యవహారములుగూడ మీకున్ను గలిగియుండవలయును. అప్పుడు వార్లలో ఒక్కరు లేచి యీప్రశ్న చేసిరి. మాంసాహారము హింసకాదా! వారు యెట్లు అహింసాపరులగుదురు? అని అడిగిరి. దీనికి సమాధాన ముగా శ్రీవారు యిట్లువచించిరి. ఎవరికైన హింసపాపకరమే. అయితే పై చెప్పిన ఉన్నతజాతిలో నున్నవారు కొందరు అట్లు చేయుటవలన మీకు సమత్వము అడుగుటకు అవకాశముండుటవలన అట్లు చెప్పినదే కాన మరియొకటి కాదు. సంపూర్ణముగా మద్యమాంసవర్జనము అంద రున్ను కలిగియుండవలయుననియే నాఆశయము. అయితే పై చెప్పినక్షత్రి యాదిజాతులు తినుటలేదా? యని మీరు ప్రశ్నించుదురేమో అని తలంచి యింతమాత్రము చెప్పడమైనది. మద్యపానము మహాపైశాచిక వృత్తియని దానిని నివృత్తిచేయుటకు యెన్నియో సంవత్సరములనుండి ప్రయత్నము జరుగుచుండెను. దైవానుగ్రహమువల్ల ప్రభుత్వశాసనము యేర్పడినందుచే అట్టిపాపము తొలగిపోయెను. ఆలాగున గోహత్యా శాసనముగూడా అచిరకాలములో రాబోవుచున్నది. అప్పుడు ఆ మహా పాపమున్ను భారత పుణ్యభూమినుండి తొలగిపోవును.

అయితే గోహత్యా చేయకపోయినచో మృతపశువుల చర్మము లోకమున కెంతో ఉపయోగపడునది కదా! హరిజనులలో మరియొక తెగవారైన మాదిగవార్లు చర్మసంబంధ పనిచేయకపోయిన యెట్లుజరుగ గలదని ప్రశ్నించిరి. దానికీలాటి సమాధానము చెప్పడమైనది. ఎవరెవరు చేయుచుండు వృత్తి వారు మారనక్కరలేదు. వృత్తివలనదోషములేదు. చర్మకారుల వృత్తి వారు చేయవచ్చును. అయితే గోమాంసభక్షణము తినుట యెవరికిన్ని వృత్తిగా కల్పించబడలేదు. వారివారివృత్తి వారు చేయవచ్చును. పాకీవారి వృత్తిని వారు చక్కగచేసినచో వేదవృత్తిని చక్కగా నిర్వహింపని బ్రాహ్మణులకన్న వారే యధికులు. ఆలాగున

సన్న్యాసధర్మమును సరిగా ఆచరించని యతికన్న, చక్కగా గృహస్థధర్మ మును అవలంబించెడు గార్హస్థులే శ్రేష్ఠులు. ఆలాగున ఆస్తికులని చెప్పుచు దైవవిధిచ్ఛోదితధర్మముల ననుష్ఠింపక యుండువారికన్న సత్య, ధర్మ, అహింసాదులను అనుష్ఠించెడు నాస్తికులే యుత్కృష్టులు. అట్లే ప్రకృతిగుణములకు లోబడి ప్రవర్తించెడి పురుషులకన్న ప్రకృతిగుణము లను అణచబెట్టి వర్తించెడి స్త్రీలే నిజమైన పురుషులగుదురు. ఇదే ధర్మ రహస్యము. మరియు యే మతములోచేర తలంచువారైనను ఆ మత సాంప్రదాయము ననుసరించిన సంస్కారమును తప్పనిసరిగ చేసుకొనవల యును. బ్రాహ్మణుడైనను క్రైస్తవ, మహమ్మదీయ మతములలో చేరవలసియుండిన ఆయా మతసంస్కారములను తప్పనిసరిగ చేసుకొనియే తీరవలెను. ఆలాగున ఆర్యసమాజస్థులు అన్నిజాతులను, అన్ని మతస్థు లను తమలో చేర్చుకొనెదరు. అయితే వేదానుసారముగ శుద్ధిసంస్కార మును చేసియే తమలో గలుపుదురు. చూడుడు — అంబేద్కరుగారు యీ మధ్య బౌద్ధమతములోచేరిరి. బుద్ధమతానుసారముగ సంస్కారము చేసుకొనడమైనది. "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అను బౌద్ధధర్మప్రవేశమంత్రములను మూడు సార్లుచ్ఛరింపచేసి చేర్చుకొనడమైనది. ఆలాగున వారి జనులు సవర్ణ హిందువులతో సమానస్థితిలో యుండవలసియుండిన గోహత్య గోమాంస భక్షణము తప్పక మానవలెను. ఒక ప్రదేశమున మంచి సారవంతమైన భూమివుండెను. అయితే ఒకప్రక్క మెట్టగాను, మరియొకప్రక్క పల్ల ముగా నుండెను. మెట్టస్థలములో నీరు నిలువకపోవుటచేతను, పల్లపుస్థల మున యెక్కువలోతుగా నీరు నిలుచుటచేతను, వ్యవసాయమునకు యోగ్యము కాకపోయెను. పల్లమును కొంత పూడ్చుటచేతను, మెట్ట ప్రదేశమును కొంత తగ్గించుటచేతను యిరుభాగములున్ను మంచి వ్యవ సాయమునకు యోగ్యమయ్యెను. ఆలాగున హరిజనులు గోహత్యాది పాపములను సంస్కరించుకొనుటచేతను, సవర్ణహిందువులు కులమునకు మాత్రము ఆధిక్యమివ్వక గుణమునకు ఆధిక్యతయిచ్చేలాగున చేసుకొనిన మాత్రమే భారతదేశము ఔన్నత్యమును సౌభాగ్యము నొందగలుగును. లేనిచో నుభయులకున్ను శ్రేయస్సు కలుగదు. నిమ్నస్థితిలో యుండు

వారు క్రమముగా క్రైస్తవ మహమ్మదీయ మతములలో చేరుటవలన హిందూమతము క్రమముగా తరిగిపోవుచున్నది. క్రైస్తవ మహమ్మదీయాదులు పెరుగుచున్నారు. ఇందువలన కొన్ని సంవత్సరములకు హిందువులకు గొప్ప పతనమగు అపాయమేర్పడక తప్పదు. ఆర్యసమాజకులగు శ్రద్ధానందస్వాములవారు ప్రతిసంవత్సరమున్ను హిందూమతము నుండి యెంతమంది క్రైస్తవాది మతములలో చేరిపోవుచున్నారో, అదే ప్రకారమైనచో మున్నూరు సంవత్సరములకు హిందూమతము నామరూపము లేకపోవునని నిర్ణయించిరి. ఇది వట్టిగాలిమాటలని హిందువులు తలంచవలదు. ఇప్పుడు జనాభా ఓట్ల సంఖ్యననుసరించే రాజకీయధర్మము నడచుచున్నదని హిందువులు మరువవలదు. నిమ్నజాతిలో యుండువారు క్రైస్తవాది మతములలో చేరుట అది పుణ్యమనిగాని, మోక్షమనిగాని తలంచికాదు. సవర్ణహిందువులు మానవుల కుండవలసిన హక్కులను వార్లకివ్వక పోవడముచేతను, పశువులకన్న నీచముగా చూచుటచేతను, అవమానమును భరింపజాలక పోవుటచే వారు విధిలేక తమ సోదరులగు హిందువులను విడచియు, స్వమతమగు దైవమును విడచి క్రైస్తవాది మతములలో చేరుచున్నారు. వారికినీ ఇంగ్లీషుప్రభుత్వము వచ్చినప్పటినుండి కొంతవిద్యయు లోకజ్ఞానము గల్గినందుచేత కొంతమానవధర్మమును తెలుసుకొనినందువల్ల అవమానము సహింపజాలక యితర మతములలో చేరుచున్నారు. కావున శ్రీకృష్ణభగవానులు గీతలో చెప్పినట్లు "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" గుణకర్మలకు ఆధిక్యమిచ్చునదే నిజమైన సనాతనమతమున్ను సత్యమతము అగునని ప్రజ్ఞాశాలురందరున్ను గ్రహించవలసిన విషయము. ఇక యీ విషయమై అనేక ప్రమాణములు నిరూపించ పనిలేదు. కాంగ్రెస్ ప్రభుత్వ మొచ్చినప్పటినుండి మరెంత అనుకూలము నిమ్నజాతులకు యేర్పడుటవలననే యింతవరకైననిమ్నజాతులు క్రైస్తవాది మతములలో చేరకపోవుటకున్ను చేరినవారు మరల హిందూమతములోనికి వచ్చుటకున్ను కారణమైనది.

ఈపుణ్యము గాంధీమహాత్మునివలననే భారతీయులకు ప్రాప్తించినది. లేనిచో హిందూమతము చాలవరకుక్షీణించిపోయియుండవచ్చును.

నాతో గూడ చాలామందిన్ని హిందూమతమునుండి క్రైస్తవాది మత ములలో చేరినవారిని తిరుగ హిందూమతములోచే చేరేలాగునున్నా, యిక మీాద ఆలాటి మతములలో చేరనీయక ప్రచారము చేయవలయుననియు సలహాచెప్పిరి. అయితే వారితో యీాలాగున తెల్పవలసియున్నది. నిమ్న జాతులు క్రైస్తవాది మతములలో చేరుటకు కారణమేమి? అని మీారు తెలుసుకొనిన నాతో యీావిషయమై మాట్లాడియుండరు. మీారు మత ప్రబోధము చేయనక్కరలేదు. మీావలెనే వారికిన్ని మతముతో అవకా శము కలుగచేయుడు. విద్యయు ఉద్యోగమున్ను మీావలెనే వారికిన్ని వుండేలాగున యత్నింపుడు. అప్పుడు మీారు మతప్రచారము మతో పన్యాసములు యివ్వకనే, యిదివరలో మతప్రవర్తనము గలవారంద రున్ను మీాలో పరుగెత్తుకొనివచ్చి చేరుదురు. ఇకమీాద యెవ్వరున్ను యితరమతములలోనికి వెళ్ళరు. ఇదే దీనిలో గల మర్మము, రహ స్యము. అట్లుచేయక హిందూమత ప్రాశస్త్యమునుగురించియు, క్రైస్త వాది మతములను నిందించియు చేసెడు యుపన్యాసములు, ప్రచార ములు,గగనకుసుమము మహాసుగంధముగాయున్నట్లున్ను, మృగమరీచికా జలము స్నానపానములకు యోగ్యముగా యుండునట్లున్ను, ఆరోగ్య ముగా నుండునట్లును, గంధర్వనగరము మహాసుందరముగాను, నివాస యోగ్యముగాను యుండునట్లు ప్రబోధముగలవారి పాండిత్యశక్తి యుండునని మరువకుడు. బీదలగు రోగులకు ధర్మాత్ముడగు ఒక వైద్యుడు ఉచితముగా ఔషధము యిచ్చుచు పథ్యము మాత్రము జాగ్రత్తతో చూచుకొనేలాగున చెప్పుచుండగా అంతమాత్రమైనను పథ్యము నిర్వహించని రోగి యెట్లు బాగుపడును? ఆలాగున ప్రభుత్వము వారు నిమ్నజాత్యుద్ధరణకొరకు యెన్నియోవిధములుగా సహాయము చేయుచుండగా గోహింసాదిఆహారమును మాత్రమైన విడువజాలక యుండువారు యెట్లుద్ధారణము గాగలరు? ప్రభుత్వమువారనగా మనభార తీయఉద్యోగాధికారము గలవారుగదా! ఈ పావనధర్మమునకు శ్రీ గాంధీగారుగదా మూలపురుషులు. వారి దివ్యమంత్రములు సత్యా హింసలు గదా! ఈ మహామంత్రములచేతగదా స్వారాజ్యము సంపాదింప గలిగెను. ఈ దివ్యాస్త్రములచేతగదా ఒకప్రాణికి బాధ కలుగకయు,

ఒకబొట్టు నెత్తురు భూమిలోపడకనే సూర్యాస్తమయములేని మహాప్రభుత్వముగల యింగ్లీషువారిని జయించిరి. వారి అడుగుజాడలో గదా మీరందరున్ను నడువవలసినవారుగాయుంటున్నారు. మరలయిప్పుడు గాంధీగారికిసదృశులుగాతలంచెడు గాంధీగారి ముఖ్యశిష్యుడగు వినోబాభావే గారున్ను అహింసాధర్మసత్యములను గదా బోధించుచున్నారు.

ఈ మాటలను విని ప్రచారకులు, హరిజనులు ఆహారము లేనందుచే చచ్చిన పశువుల మాంసమును తినుచున్నారనిచెప్పిరి. దానికి సమాధానముగ (శ్రీ)వారు అది సరియైన వాదముకాదని వచించిరి. ఎప్పుడో ఒక్కసారి మాత్రమే పశువుల మృతకళేబరము దొరకును. అది యేదో యొకరోజున భుజింపవచ్చును, తక్కిన రోజులలో యెట్లు జీవించుచున్నారు? అదియునుగాక మీకన్న యింకా యెక్కువదీనస్థితిలో యుండు యిదివరలో నిరూపించిన కప్పలవారు, నక్కలవారు మొదలైన వారు జీవించుట లేదా! ఇప్పుడు కార్మికులకు యేలాటి కొరతయును లేదు. మంచి కూలియును దొరకుచున్నది. సోమరులై పనులు చేయని వారికి యేదైనా అన్నమునకు కొరతయుండవచ్చునేమో గాని తక్కిన వారికి యేలాటి కొరతయును లేదు. మరియొకరు లేచి యీ క్రింది విధముగా ప్రశ్నించినారు. మాదిగవారు కుట్టిన చెప్పులను బ్రాహ్మణులుపయోగపరచుట లేదా? అప్పుడు వారికిగూడా గోహింసాపాతకము యెట్లు లేకుండా పోవును? దానికి శ్రీవారు యిది న్యాయమైన వాక్యము గాదు. చెప్పులు కుట్టుట వృత్తితో కూడినది. వృత్తికి దోషములేదని యిదివరలోనే తెల్పబడమైనది. గాంధీగారుకూడా పాదరక్షలను ధరించుచుండిరి. హింసించిన పశువుల చర్మముపయోగించుట లేదు. మృతపశువులచర్మముపయోగించుచుండిరి. కావున హింసాదోషము దానియందు లేదు. ఆలాగున మీరున్ను మృతపశువుల చర్మముచే పాదరక్షలుమాత్రము కాదు, యిక యేదైన పనులను చేసుకొనవచ్చును. దానివలన పాప మేమియును లేదు. మానవులకును జీవించుటకు అన్నమే శాస్త్రము విధించెను. కాని మాంసము విధించ లేదు. గీత చూడుడు:

"అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥"

తా॥ మానవులు అన్నమువలన జీవించుచున్నారు. అన్నము యొక్క ఉత్పత్తి వర్షమువలన అగుచున్నది. వర్షమునకు హేతువగు మేఘము యజ్ఞమువలన యేర్పడును. యజ్ఞము కర్మమువలన కలుగుచున్నది అని కదా శాస్త్రము. అనగా దైవవిధియని గ్రహించుకొనుడు. మరియు ఆరవ అధ్యాయమున తెల్పినది చూడుడు :

ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః॥

తా॥ నీయొక్క యాత్మను నీవే యుద్ధరించుకొనవలయును. ఇతరులెంత సహాయమొసర్చినను నీకు శ్రద్ధలేనిచో నిన్ను నీవుద్ధరించుకొనంజాలవు. నీవే నీయాత్మను చెడువృత్తులచే పాడుచేయకుము. నీ మనస్సు మంచిదైనచో దానికి సమానమైన మఱియొక బంధువుండఁబోడు. నీ మనస్సు చెడ్డదైనచో దానికి సమానమైన నిన్ను పాడుచేసెడు శత్రువును నుండఁబోడు. ఒహో! ఎటువంటి యుపదేశము జ్ఞాపకముంచుడు. సృష్టికాలమున భగవంతుడు ప్రాణికోట్లకు విధించిన ఆహారమును జూడుడు.

దేవానామమృతం నౄణాం ఋషీణాంచాన్నమోషధిః।
దైత్యరక్షపిశాచాదేః దత్తం మద్యామిషాది చ॥

తా॥ దేవతల కమృతమును, మానవుల కన్నమును, ఋషులకు కందపక్వఫలమూలములును, దైత్య రాక్షస భూత ప్రేత పిశాచములకు మద్యమాంసాదులనున్నూ విధించడమైనది. ఇందువలనమద్యమాంసము లెవరి యాహారములో గ్రహించుకొనవచ్చును.

ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః।
స్మృతిలాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః॥

తా॥ ఆహారశుద్ధిచే హృదయశుద్ధిగలుగుచున్నది. మనశ్శుద్ధివలన దృఢమగు ప్రజ్ఞగలుగును. దృఢమగు ప్రజ్ఞగలిగిన ఆత్మకుగల బంధములన్నియు దొలగిపోవును. అందువలన జీవన్ముక్తియును గలుగును.

(శ్రీ)వారి వాక్యములన్నియు వినిన తరువాత వారలలో కొందరు యీలాగున తెలిపిరి. మేము మీతో వాదించుటకురాలేదు. మీసందే

శమును గ్రహించి యికమీాద నేప్రకారము నడచిన మేము ధన్యులము కాగలమో దానిని యనుగ్రహించవలయునని కోరిరి. అపుడు శ్రీవారు ఈలాగున వారితో బలికిరి. నాయనలారా! సత్యాహింసలవలన గదా శ్రీగాంధీగారు స్వరాజ్యమును సంపాదించగలిగిరి. మీారు సవర్ణులతో వాదించి యుద్రేకమును గలుగజేసి సమత్వమును సంపాదించుట ప్రయాసము. వారికి దయ కలిగేలాగునున్నూ, మీావారలలో గల గోహత్య గోమాంసభక్షణము రహిత మొనర్చులాగునున్నూ బోధించుడు. అదియునుగాక కొంత శ్రమపడియైన విద్యాభ్యాసము చేసికొనే లాగునున్నూ, మద్యపాన, గోమాంసభక్షణమును నిషేధించులాగును బోధింపుడు. ప్రభుత్వమువారే హరిజనులకు విద్యావిషయమై యెంతో సహాయము చేయుచున్నారు. అన్నముపెట్టి విద్యను చెప్పుచున్నారు. ఇపుడు పెద్దవారైనవారు కొంతకష్టమును సహించి పనులనుచేయుచు తమ సంతానమును విద్యావంతులనుగ జేయులాగునున్నూ, సత్ప్రవర్తనము గలిగేలాగున జేసికొనిన కొన్నిరోజులు జరిగినచో సవర్ణులతో సమానత్వమున్నూ, విద్యచే నుద్యోగమున్నూ గలుగుననియు, అపుడు మన కష్టములన్నియు తొలగుననియు, సౌఖ్యముగ జీవించవచ్చుననియు ప్రాధేయపడి బోధింపుడు. గాంధీగారివలె ఆస్తికబుద్ధియు, దైవవిశ్వాసమున్నూ గలిగియుండునటుల ప్రాధేయపడి మనస్సుకరుగులాగున తెలుపుడు. ఇది మీాకు శ్రేయస్సును గలుగజేయును. లోకములో నెవ్వరైనను వారికి సంబంధించినవారిలో నెవరికైన నంటుజాడ్యము గలిగినచో దూరముగ పెట్టుచున్నారు. ఔషధసేవచే నారోగ్యము గలిగిన తమలో కలుపుకొనుచున్నారు. వ్యాధి యుండువరకు వారిని సామాన్యముగ స్పర్శించరు. ఇదియే అస్పృశ్యతయొక్క రహస్యము. ఆలాగున హరిజనులలో కొందరిలోగల గోమాంసభక్షణయను మహాపాపమును తొలగించిన మీారును సవర్ణులతో సమానముగ నుండగలరు. ఈవిషయమై మరియొక రహస్యమునుకూడ దెలిపెద. బ్రాహ్మణులు మొదలగు అగ్ర జాతులలో గల స్త్రీలకు రజస్వలాకాలమున వారిని అస్పర్శ్యలుగానే చూచుచున్నారు. స్నానశుద్ధియైన తర్వాత అస్పర్శ్యలుగా తలంచుటలేదు. ఇక దీనికన్న సత్యమేమిగలదు. ఈ మాటలను వినినవెంటనే

వారలలో చాలమంది లేచి ప్రసన్నులై స్వామీ! మీరు చెప్పినది నిజము. మాలో చాలమంది గోహింసాహారమును మానుటయేగాక, క్షీరమాంసమును మద్యపానమునున్నూ ఉపేక్షించగలవారము. అది విని శ్రీవారు చాల సంతసించిరి. నాయనలారా! విద్యావంతులగు మీబోటివారు మారుమూలలలో, పల్లెటూరులలో విద్యావిహీనులై యుండు మీవారికిని యీ ధర్మమును బోధించుడు. వారినిగూడ పవిత్రులనుగా జేయుటకు యత్నింపుడు. అందువలన మీరు కృతార్థులు గాగలరు అని పలికి శ్రీవారు అందరికి ప్రసాదము నిప్పించిరి.

---

ఓమ్

# కాలము

మోక్షము యెంతకాలమునకు గలుగునని ముముక్షువులు, భక్తులు, సాధకులు అడుగుచుందురు. దానికి సరియైన సమాధానమేమన ఎప్పుడు బంధములనుండి విడుదలగలుగునో, అప్పుడు మోక్షముగలుగునని చెప్పుటయేయగును. ముక్తిశబ్దమునకున్ను, మోక్షశబ్దమునకున్ను యిదే సరియైన అర్థము. "ముచ్ల్ మోక్షణే" అనుధాతువునుండి మోక్షశబ్దము యేర్పడినది. మోక్షమనగా విడుదలయని ధాత్వర్థము. దేనినుండివిడుదల యని మరియొక ప్రశ్నగలుగును. అజ్ఞానమునుండి, అవిద్యనుండి, భవపాశమునుండి, బంధనమునుండి విడుదలయని గ్రహించుకొనవలయును. మోక్షమునకున్ను యిదే యర్థము.

ఈ రెండుపదములకున్ను యిదే అర్థము. ఏలన జీవునియొక్క పూర్వజన్మసంస్కారమునసరించి సప్తజ్ఞానభూమికలలో యెంతవరకు వచ్చియున్నాడో అచ్చటినుండిమరల యీజన్మములో ప్రయాణముచేసిన చాలును. అది ఒక భూమికగాని, రెండుగాని, నాలుగుగాని, ఆరుగాని, పదిగాని, యెన్నో మనము నిర్ణయింపజాలము. ఆలాగున అష్టాంగయోగములలో పూర్వజన్మమున యెంతవరకు వచ్చియున్నాడో అదిన్నీ మనము తెలిసికొనజాలము, ఈ కారణములవల్ల యెప్పుడు బంధములనుండి విముక్తిగలుగునో అప్పుడుమోక్షముగలుగునని చెప్పుటకు హేతువైనది. కనుకనే ఉపనిషత్తు యీలాగున చెప్పుటకు కారణము.

శ్లో॥ యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః।
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥

తా॥ యెప్పుడైతే యీ సాధకునియొక్క హృదయము నాశ్రయించియుండు సంకల్పములు, వృత్తులు, వాసనలు వదలిపోవునో అప్పుడు యీమర్త్యుడు అమృతుడై ఈదేహముతో గూడియిచ్చటఉన్నప్పుడే బ్రహ్మప్రాప్తిని పొందగలుగును. కావుననే యీ ఉపనిషత్తు వాక్యములో మొదటనే "యదా" అని ప్రయోగించుటకు కారణమైనది. అన్ని శాస్త్రములున్ను ఆలాగుననే చెప్పుచున్నవి. ఒకడు ఒకకాలేజీలో చదువవలసివచ్చినచో యెప్పుడు అవిద్యాప్రాప్తియగునని, చెప్పుటకుయెట్లు సాధ్యముగాదో, అది యిదివరలో వాడు యెచ్చట యేఫారమువరకు చదివియున్నాడో దానిని అనుసరించి యెట్లుండునో బ్రహ్మవిద్యయున్ను ఆలాటిది. ఒకడు మూడవఫారమువరకు చదివి వచ్చినాడనుకొందము. ఒకడు ఆరవఫారమువరకు చదివి వచ్చెను. ఒకడు ఇంటర్ చదివివచ్చెను. ఒకడు బి. ఏ. చదివి వచ్చెను. ఇదివరలో యెంతవరకు చదివి వచ్చెనో అచ్చటనుండిచదువవలసియున్నట్లు, ఆత్మవిద్యలోను యిట్టితారతమ్యము గలదు. కావుననే "యదా" యని ప్రయోగించుటకు కారణము. పంచదశియందు తెలిపినది చూడుడు.

శ్లో॥ వాసనానేకకాలీనా దీర్ఘకాలం నిరంతరం।
సాదరం చాభ్యస్యమానే సర్వథైవ నివర్తతే॥

తా॥ ఆదరముతో గూడ యెల్లప్పుడు చాలకాలము బ్రహ్మాభ్యాసము చేయబడినదగుచుండగా, విషయవాసన చిరకాలమునుండి యున్నదైనను, అన్నివిధముల తప్పక నివర్తించును. విషయవాసనయనియు, విషయవృత్తియనియు,సంకల్పమనియు, అజ్ఞానమనియు, అవిద్యయనియు, కర్మయనియు యిటువంటి వాక్యములన్నియు ఒకేయర్థమును నిరూపించుచున్నవి. ఈవిషయమునే పతంజలిమహర్షి యోగశాస్త్రమునందు నిరూపించిరి.

సూ॥ స తు దీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః॥

తా॥ బ్రహ్మభ్యాసమన్ననో చాలకాలమువరకును యెడతెగక తపముచేతను, బ్రహ్మచర్యముచేతను, శ్రద్ధతోడను, విద్యచేతనుఅనుష్ఠింప

బడినదై దృఢస్థితిగలదిగా నగును (సిద్ధినొందును.) అనగా పూర్వజన్మ సంస్కారము కొద్దిగకలవారికి లేక యీజన్మములో ఆరంభించువారికి కొంత ఆలస్యముపట్టవచ్చును. పూర్వజన్మజ్ఞానసంస్కారము, యోగ సంస్కారము, ధ్యానసంస్కారము బలముగాగలవారికి కొలదికాలము లోనే ముక్తికలుగును. మరియు వైరాగ్యముయొక్క భేదముననుసరించి సమీపముగాను, దూరముగానుఉండును. కావుననే వైరాగ్యముగూర్చి చెప్పునప్పుడు మంద వైరాగ్యము,తీవ్ర వైరాగ్యము, తీవ్రతర వైరాగ్యము తీవ్రతమ వైరాగ్యమని చెప్పుటకు హేతువు. ఒకడు కాశీయాత్ర చేయదలంచి పాదచారియై వెళ్ళిన పదిమాసములో పన్నెండుమాసములో పట్టవచ్చును. ప్యాసింజరులో అయినచో నాలుగురోజులలోను, ఎక్స్ప్రెస్సు లేక మెయి లులో అగుచో రెండురోజులలోను, విమానములో అయినచో మూడు నాలుగు గంటలలోను యేలాగున చేరగలుగునో ఆలాగున ముముక్షువుల యొక్క వైరాగ్యము ననుసరించి హెచ్చుతక్కువ కాలముపట్టవచ్చును. కాని నిరుత్సాహముపొందక అనుష్ఠానము మాత్రము చేయుచుండవల యును. కావుననే సూత్రమందు "సత్కారాసేవితో దృఢభూమిః" అని ప్రయోగించుటకు కారణమైనది. కావుననే పతంజలిమహర్షి యీలా గున తెలుపుటకు కారణము.

సూ॥ తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబంధీ॥

తా॥ అభ్యాసపాటవముచే గలిగిన క్రొత్తసంస్కారము ప్రాత సంస్కారమును దూరీకరించును. కావున నూతనసంస్కారము ప్రాత సంస్కారమైన విషయాదిదోషములను క్రమముగా హరించునని తెలుపు టకు కారణమైనది.

శంకరాచార్యులవారున్ను "రోగానివ రసాయనం" అని ఆత్మ బోధలో తెలిపిరి. రోగముచేగలిగిన చెడురక్తమును అశుద్ధరక్తమును దివ్యౌషధసేవచేత యేలాగునశుద్ధముగజేసి ఆరోగ్యమును గలుగజేయు చుండునో, ఆలాగున అనేకజన్మములనుండి వచ్చుచుండెడు సంసార విషయ వాసనాది దోషములను శుద్ధసంస్కారములగు జ్ఞానధ్యానములు సాధకుని శుద్ధాత్మునిగా జేయును.

సూ॥ కాయేంద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః॥

తా॥ దృఢమగు తపోనుష్ఠానమువలన అశుద్ధిసంజ్ఞకమై ఆవరణ రూపమగు రాజస తామస మాలిన్యము నశించుటవలన కాయసిద్ధియు, మానసేంద్రియాదుల సిద్ధియు గలుగును. ఈవిషయమునే అమృతనాదో పనిషత్తున్ను తెలుపుచున్నది.

శ్లో॥ యథా పర్వతధాతూనాం దహ్యన్తే ధమనాన్మలాః।
తథేంద్రియకృతా దోషాః దహ్యన్తే ప్రాణధారణాత్॥

తా॥ ఏలాగున పరత్వధాతువులగు గంధకపాషాణాదుల విషము అగ్నియందు స్ఫుటముచేయుటవల్ల దోషము క్షయించి దివ్యౌషధము లగుచున్నదో ఆలాగున మానసేంద్రియముల విషయదోషములు ప్రాణాయామాది యోగములవల్ల క్షయించి శుద్ధములగుచున్నవి.

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥

తా॥ ఎప్పుడు నీయొక్క మనస్సు అజ్ఞానమనెడు కల్మషమును దాటగలదో అప్పుడుయిదివరలోశాస్త్రశ్రవణముచేసిన దానియర్థమున్ను గురువులచే వినిన యర్థమున్ను, ఇక మరియొకటి వినుటకు లేదనెడు అర్థమునున్ను గ్రహించుకొనగలవు. అనగా ప్రకృతిని దాటువరకు నిజము తెలియజాలరు. అయితే యిచ్చటగూడ "యదా" అని ప్రయోగించడమైనది. ఇంతకాలమని నిర్ణయించలేదు.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥

తా॥ ఈలోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పావనమైనదియు మరియొకటి లేదు. అట్టిజ్ఞానమును కాలక్రమముచేత యోగ సిద్ధినిపొందినవాడు తనంతటతానేపొందుచున్నాడు. ఇచటకూడ "కాలే నాత్మని విందతి" అని ప్రయోగించుటవల్ల ఫలానప్పుడని చెప్పక కాలమాసన్నమగునప్పుడు అని తెలుపడమైనది.

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్॥

తా॥ పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యముగలవాడై అనేక జన్మములయందు అభ్యసించుటవలన పొంద

దగిన యోగసిద్ధిని పొందినవాడగుచున్నాడు. అందువలన మోక్షమును పొందుచున్నాడు. ఇచట అనేకజన్మములని చెప్పుటవలన యికమీాద అనేక జన్మములని గ్రహించరాదు. ఇదివరలో అనేక జన్మములనుండి అనుష్ఠానముచేసి వచ్చినందుచేతనే యిప్పుడు జిజ్ఞాస, ముముక్షుత్వము గలుగుటకున్ను, విషయవిరక్తి గలుగుటకున్ను కారణమైనదని గ్రహించి కొనవలయును. అట్లుగానిచో యిప్పుడు గలిగియుండు ఆత్మశుద్ధిగలుగదు. అదే దానికి గురుతు. లేనిచో యింకను అనేక జన్మములని తలంచిన నిరుత్సాహము గలుగవచ్చును. బుద్ధిమాంద్యముగూడ గలుగవచ్చును. ఆత్మశుద్ధి గలిగినందుచే యిక త్వరలోనే బ్రహ్మసాక్షాత్కారము, భగవత్ప్రాప్తిగలుగును.

శ్లో॥ బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥

తా॥ ఎవడు అనేకజన్మములలో నాచరించిన పుణ్యసంస్కారము వలన యంతఃకరణము శుద్ధమై కడపట సమస్తమును వాసుదేవమయ మను జ్ఞానముగలవాడగుచు నన్ను పొందుచున్నాడో అటువంటి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు. ఇచ్చటను 'బహూనాం జన్మనామంతే'అని ప్రయోగించుటవల్ల బహుజన్మములనుండి చేసిన అనుష్ఠానము వల్లనే ప్రకృతిదోషము నశించి యిప్పుడు బ్రహ్మప్రాప్తి పొందవలెనని తలంపు గలుగుటకు కారణము. ఏలన అనేకులు పండితులు, ధనవంతులు ప్రపంచ వాసనలోనే మునిగియుండుటవల్ల ఒకరికి విషయములో విరక్తిగలిగి యుండినచో అనేక జన్మములలో చేసిన అనుష్ఠానమే కారణమని గ్రహించుకొన వలయును. ఈ వాక్యములన్నియు గీతలో శ్రీకృష్ణ భగవాను డుపదేశించినవి.

సూ॥ తీవ్రసంవేగానామాసన్నః॥

తా॥ పూర్వపుణ్యవశమున శ్రద్ధాద్యుపాయము లధికముగానుం డుటచేతను, బ్రహ్మప్రాప్తికొరకు తెగని అభిలాష ప్రబలముగా గలిగి యుండుటచేతను అట్టివారికి కైవల్యప్రాప్తి చాలదగ్గరగానే యుండునని పతంజలిమహర్షి యోగశాస్త్రములో తెలిపిరి.

శ్లో॥ కాలేన పరిపచ్యంతే కృషిగర్భాదయో యథా।
తద్వదాత్మవిచారోఽపి శనైః కాలేన పచ్యతే॥

తా॥ కృషిసల్పువానికి విత్తనములు నాటిననాడే పంట యింటికి రానేరదు. గర్భము పదిమాసములు నిండినగాని ప్రసవింపదు. అలాగున బ్రహ్మనిష్ఠ ప్రారంభించిన వెంటనే ఫలముగలుగలేదని నిరుత్సాహ పడరాదు. కాలము పరిపక్వావస్థకు వచ్చినప్పుడు మాత్రమే ఫలించును. అంతవరకు శ్రద్ధాభక్తులతో తన అనుష్ఠానము చేయుచుండ వలయునని పంచదశి. ఈవిషయమై శ్రీ శంకరభగవత్పాదులు అపరోక్షానుభూతి యందు కట్టకడపట తెలిపినది చూడుడు.

శ్లో॥ ఏభిరంగైస్సమాయుక్తో రాజయోగ ఉదాహృతః।
కించిత్పక్వకషాయాణాం హఠయోగేన సంయుతః॥
పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః।
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్॥

తా॥ దీనియందు (అపరోక్షానుభూతియందు) పైన చెప్పబడిన పదిహేను అంగములతో కూడినవారికి ఆత్మజ్ఞానము సిద్ధించును. సంపూర్ణవిషయాది దోషరహిత పరిపక్వమగు మనస్సు కలుగనివారికి యోగశాస్త్రములో చెప్పిన యమనియమాది ధ్యానధారణయోగసాధనలు చెప్పబడినవి. పరిపక్వముగల మనస్సుగలవారికి యీ యోగసిద్ధి (జ్ఞానప్రాప్తి) సులభముగా గలుగును. అట్టిస్థితి గురుదేవునియందును, దైవమునందును భక్తివిశ్వాసముగలవారందరికిన్ని సులభముగాను, త్వరలోను గలుగును. ఈ విషయమునే అనుభూతిప్రకాశమునందు చెప్పినది చూడుడు.

శ్లో॥ బహువ్యాకులచిత్తానాం విచారాత్తత్త్వధీర్నహి।
యోగో ముఖ్యస్తతస్తేషాం ధీదర్పస్తేన నశ్యతి॥

తా॥ మనస్సు నిశ్చలత్వమున్ను, నిర్మలత్వమున్ను గలుగని వారికి వేదాన్త తత్త్వవిచారముచే జ్ఞానోదయము కాదు. అట్టివారికి ధ్యానయోగము ముఖ్యమైనది. అందువల్ల బుద్ధియందుగల దోషము నశించును.

శ్లో॥ యాగజ్ఞానమనుష్ఠానాద్వినా న స్వర్గదం తథా ।
బ్రహ్మజ్ఞానమనుష్ఠానాద్వినా సర్వాప్తిదం కథమ్॥

తా॥ అశ్వమేధ, రాజసూయాది యజ్ఞముల విధులను బాగుగా తెలిసినవాడైనను, చక్కగా చెప్పుటకు సమర్థతగలవాడైనను యాగము చేయకపోయిన స్వర్గఫలమును యేలాగున పొందజాలడో ఆలాగున బ్రహ్మజ్ఞానమునుగురించి చక్కగా చెప్పుటకు శక్తిగలవాడైనను దాని యందు విధింపబడిన అనుష్ఠానముచేయనివానికి సర్వాత్మకమగు ఆత్మ జ్ఞానము కలుగదు.

శ్లో॥ అనాత్మబుద్ధిశైథిల్యం ఫలంధ్యానాద్దినేదినే।
పశ్యన్నపి న చేద్ధ్యాయేత్ కోఽపరోఽస్మాత్పశుర్వద॥

తా॥ ధ్యానమువలన దినములు గడచినకొలది అనాత్మబుద్ధి నశించెడు ఫలమును చూచుచున్నవాడైనను, ఎవడు ధ్యానముచేయడో అట్టివానికంటె పశువెవడు? అనగా ధ్యానముచేయుచు రాగా రాగా అనాత్మబుద్ధియగు అవిద్య నశించుచుండునని దీనియొక్క ముఖ్యతాత్ప ర్యము. అట్లు చేయనివాడు పశుప్రాయుడని విద్యారణ్య గురుండు పంచ దశిలో తెలిపెను.

---

ఓమ్

## రాజమండ్రి సాధుస్త్రీల మఠములో గీతాపారాయణసమయమున శ్రీ సద్గురు మలయాళస్వాములవారు పంపిన

# సందేశము

1. ఏ మంత్రమైనను అక్షరలక్షలు జపము చేయునప్పుడే అది సిద్ధియగును. భగవద్గీత 701 శ్లోకములకు అనుష్టుప్ ఛందస్సు ప్రకారము 22432 అక్షరములు గలవు. అన్ని లక్షలసార్లు పారాయణముచేసిన సిద్ధి యగును. అప్పుడు యిదివరకుండే అర్థముకాక నూతనార్థము గోచరిం చును. అది యెన్ని జన్మములకైనను సరే. అప్పుడు శ్రీకృష్ణాశయము ఉదయమగును. ఈ సత్యము తెలుసుకొనకనే కొందరు "గీతాపారాయ ణము మేము చాలాకాలమునుండి చేయుచున్నాము. అన్ని శ్లోకములు

మాకు వచ్చును. ఇక నిత్యము పారాయణమెందుకు చేయవలెను?" అని తలంతురు.

2. సామాన్యముగా, నొక గ్రామమునకు శ్రీవారు వెళ్ళునప్పుడు కొందరు పండితులు, గురువులు మలయాళస్వాములవారిలో యేమి విశేషమని జనుల నడుగుచుందురు. విశేషమేమన ? శాస్త్రములో గూఢము, గుప్తము, గోప్యము, రహస్యము అను పదములకు గూఢముగా నుంచవలసినదని యర్థము కాదనియు, గూఢముగా నుంటున్నదని యర్థమేయనియు, గూఢముగా ఉన్నవానినెట్లు బయటికి తీయవలెనో అట్టి రహస్యముల తెల్పుదురు. ఇదియే విశేషమని తెల్పినచాలును.

3. పూర్వీకఋషులు చేసిన ధ్యానము, జపము యిప్పుడుండు వారు చేసియు కొందరు ఆఫలమును పొందకపోవుటకు కారణమేమన? వారు భావయుక్తముగా చేసినారు. ఇప్పుడు చాలమందిన్ని భావయుక్తముగా చేయుటలేదు. అందువల్లనే వారు పొందిన స్థితిని వీరు పొందక పోవుటకు కారణము. అనగా ఆ పరమఋషులు అంతర్దృష్టిగలవారై యుండిరి. ఇప్పుడు చాలమందిన్ని బహిర్దృష్టిగలవారై యుంటున్నారు. ఆ మునిసత్తములు భావములోయుండిరి. వర్తమాన జనులలో చాలా మందిన్ని భాషలోనికే పోవుచున్నారు. ఓమ్

---

ఓమ్

# విశ్వాసము

మానవునికి తానుచేయు పనులయందుగాని, జపించుమంత్రముల యందుగాని, పఠించు శాస్త్రములయందుగాని, చెప్పు వాక్యములయందు గాని దృఢమైన విశ్వాసము కలిగియుండవలయును. అదిమాత్రము ఫలవంతమగును. హిందువుల గాయత్ర్యాదిమంత్రములన్నిటిలోను మహాదివ్యశక్తిగలదనియు, పాపములను నశింపచేయుమహిమగలదనియు వచింతురు. ఆలాగున శ్రీభగవద్గీతాది గ్రంథములు పారాయణము చేయుటవల్ల సర్వపాపములు దహించుననియువచింతురు. దీనికి ఎన్నియో ప్రమాణములను నిరూపింతురు. అయితే ఆప్రమాణవాక్యములలో విశ్వాసము

గలవారు చాలఅరుదుగానే ఉంటున్నారు. ఏలన పాపకార్యములు చేయు కొందరు ఉండిన వారికి వీరిమంత్రోపదేశములుచేసిన పవిత్రులుకానేరరని చెప్పుచుండిన వీరి మంత్రములకు పాపమును రహితముచేయు శక్తి లేదని గ్రహించుకొనుటలేదు. కావుననే వీరుచేయుకార్యములలో వారికి విశ్వాసములేదని చెప్పవలసియుండును. అగ్నికి శక్తిఉండిన అన్ని విధములగు కట్టెలను దహింపచేయవలసియుండునుగదా! ఔషధమునకు దివ్యశక్తి యుండిన యెటువంటి రోగములనైన బాగుపరచవలసి యుండునుగదా! అగ్నికి కట్టెలను భస్మమొనర్చు శక్తిఉండినచో అన్నిటిని దహింపవలెను గదా! ఆలాగున ఔషధమునకు శక్తిఉండిన అన్ని రోగములను బాగుపరచవలసియుండునుగదా? అట్లుకానిచో నిప్పుకు అన్నిటిని దహింపచేయు శక్తి లేదనియు, అన్ని వ్యాధులను నయమొనర్చుమహిమ ఔషధమునకు లేదనియు తప్పనిసరిగా నమ్మవలసియుండునుగదా? అయితే యీ విషయమై వారు ఒక ప్రశ్న చేయుదురు. అదేమన నిప్పులో బంకమట్టిగాని, రాళ్లుగాని, ఇనుముగాని కరుగునా? అని. ఇందువల్లనే వీరికి ప్రపంచ జ్ఞానములేదని గ్రహించుకొనవలసియుండును. వారు సామాన్య కట్టెలను కాల్చెడు నిప్పును చూచియున్నారేగాని, గొప్ప వేడిగలుగజేయు అగ్నినిగాని, ఎలక్ట్రిక్ వేడినిగాని ఎరుంగనివారని నిశ్చయించుకొనవలసియుండును. మట్టిని కరుగజేసిగదా గ్లాసు, గాజులు మొదలైనవి చేయుచున్నారు. మరియు రాతినికరుగజేసిగదా ఉక్కు మొదలగు లోహములను ఉత్పత్తి చేయుచున్నారు. ఆలాగున ఉక్కును కరుగజేసిగదా యంత్రములను, దూలములను నిర్మించుచున్నారు? ఆలాగున ఔషధంచేత కుష్ఠు మొదలగు మహావ్యాధులు నశించునా? అని వారు ప్రశ్నింతురు. వీరు సామాన్యమగు మందులను ఎరుంగుదురేగాని కుష్ఠు క్షయ మొదలగు వ్యాధులను రహితమొనర్చెడు గొప్పఔషధము నెరుంగనివారని మనము గ్రహించుకొనవలసియుండును. ఇప్పుడు క్షయ కుష్ఠు మొదలగు గొప్ప వ్యాధులను నయమొనర్చువారెందరో గలరు. దానికి తగిన దివ్యౌషధమునుగూడ కనుగొనియున్నారు. కావున పాపులను పవిత్రముచేయు దివ్యశక్తి గాయత్రీ, శ్రీరామ, శ్రీమన్నారాయణాదిమంత్రములకున్ను, శ్రీ భగవద్గీతాది గ్రంథములకున్ను గలదని వారికినమ్మకములేదు. ఉండిన

పై జెప్పినమంత్రాదులచేపాపులుగూడపవిత్రులగుదురని ఏలనమ్మకూడదు? ఈకారణమువల్లనే హిందువులనేకులుబౌద్ధమతములకు, క్రైస్తవమతములకు, మహమ్మదీయమతములకు చేరిపోవుటకు కారణము. బౌద్ధ, క్రీస్తు, మహమ్మదీయాది మతస్థులకు వారిమతముల చేరినవారి మతానుసార సంస్కారములచేతను,మతానుసారప్రార్థనలచేతను యెట్టిపాపులైనపరము పవిత్రులగుదురను నమ్మకముగలదు. ఆవిశ్వాసదార్ఢ్యమువల్లనే వారి మతముల చేరువారిని సంస్కరించి పాపవిమోచన ప్రార్థనాదుల చేయుంచుటకు కారణము. ఇది యిప్పుడు పై మతస్థులు చేయుపనులవల్లనే లోకము యెఱుంగగలదు. కనుకనే విశ్వాసము కలిగిఉండవలెనని చెప్పుటకు కారణము. పై నిరూపించిన మతములలో చేరినవారందరిని వారు సోదరీ సోదరులుగా భావించుచున్నారు. ఆచరణలోగూడ చూపుచున్నారు. పై విధముగానే ఆర్యసమాజస్థులున్ను వేదమంత్ర అగ్నిసంస్కారములచే పండితులనుగూడ పావనులుగానొనర్చి వారితో సమానముగ చేయుచున్నారు. చూచుచున్నారు. ఇదిన్నీ లోకవిదితము.

యథైధాంసి సమిద్ధోగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥ గీత. అ. 4.

తా॥ ఓ యర్జునా! ఏప్రకారము చక్కగా మండుచుండెడు అగ్ని సమిధలను భస్మము చేయుచున్నదో, ఆ ప్రకారముగానే జ్ఞానమనెడు అగ్ని సమస్త కర్మలను భస్మముచేయుచున్నది అని శ్రీకృష్ణభగవానుడు చెప్పిన వాక్యములో పై నిరూపించిన శాస్త్రములు చదువువారికి విశ్వాసము గలదా?

శ్లో॥ అపి చేదపి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

తా॥ సమస్తములైన పాపాత్ములకంటె నీవు విశేషపాపములు చేసినవాడవైనను, సమస్తమైన పాపమను సముద్రమును జ్ఞానమనెడు నావచేత లెస్సగా దాటగలవు. దీనికన్న పరమప్రమాణము యికయేమి కావలయును? మరియు అ. 9 లో చూడుడు.

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాంతి పరాంగతిమ్॥"

తా॥ ఓ యర్జునా! ఏ కారణమువలన యెవరు పాపజన్మములు గలవారగుదురో అట్టివారున్ను స్త్రీలున్ను వైశ్యులున్ను శూద్రులున్ను ఆశ్రయించి అనగా భగవద్గీతాపారాయముచేసి సర్వోత్తమమైన గతిని పొందుచున్నారు అని భగవానుడే చెప్పుచుండగా స్త్రీ శూద్రాదులకు గీతాపారాయణమున కర్హతగలదా యని మరల చెప్పవలయునా?

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥

తా॥ మిక్కిలి దురాచారము గలవాడైనను, అనన్యభావనగలవాడగుచు నన్ను భజించినయెడల అట్టివాడు నాయెడ దృఢమైననిశ్చయము గలవాడగుచున్నాడుగదా! ఆ కారణమువలన వాడే శ్రేష్ఠుడని తలంపదగియున్నాడు. దురాచారుడు అని చెప్పక "సుదురాచారః" అని ప్రయోగించుటవల్ల యెంత పాపియైనను పావనుడు కాగలడని భగవదాశయము.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి।
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥

తా॥ పై జెప్పినవాడు శీఘ్రముగా ధర్మాత్ముడు అగుచున్నాడు. శాశ్వతమైన పరమశాంతిని పొందుచున్నాడు. ఓ యర్జునా! నాయొక్క భక్తుడు నాశనము నొందడు అని ప్రతిజ్ఞచేసి చెప్పుము. 'ప్రతిజానీహి' అని తెలుపుటవల్ల పండితుల, శాస్త్రిల, మహాజనుల సభలో రెండు చేతులను పై కెత్తుకొని భగవంతుని ఆనపెట్టి చెప్పుమా! అని తెలుపుటలోగల భగవద్విశ్వాస మెటువంటిదో గ్రహించుకొనవచ్చును. మరియు గీతామాహాత్మ్యమున చెప్పినది చూడుడు.

శ్లో॥ మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్।
క్వచిత్ స్పర్శం న కుర్వంతి నలినీదళమంభసా॥

తా॥ ఎవరైతే గీతాపారాయణము చేయుదురో, వారిని కమల పత్రమునకు నీరు అంటని విధమున మహాపాపాది పాపములు కొంచమైనను అంటవు. దీనియందు 'మహాపాపాదిపాపాని' అని ప్రయోగించుట వల్ల పంచమహాపాపములేగాక ఉపపాపములుగూడ చేసినవారైనను

గీతాపారాయణచేసి దానిలోనున్నట్లు ఆచరించినవారిని పాపముఅంటదు అని చెప్పిన వాక్యములో నమ్మకము కలిగి వుండవలయును. ఇక గీతా పారాయణము చేయుటకు చదువులేనివారిని ముదుసలివారలను గురించి కరుణగలిగి భగవానుడు తెలిపినదానిని చూడుడు.

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే॥

తా॥ మహాపాపముతో కూడినవాడైనను, గీతార్థమును వినుట యందు ఆసక్తుడైనచో వైకుంఠమును పొంది అచట విష్ణువుతో గలసి ఆనందముగా వుండును. దీనియందు "గీతార్థశ్రవణాసక్తో మహాపాప యుతోఽపివా"అనిప్రయోగించుటవల్ల యెంతపాపాత్ముడైనను చదువు లేనప్పటికిన్ని గీత పారాయణముచేయు స్థలములోవుండి ఆసక్తితో శ్రవ ణము చేసినను చాలునని భగవానుడుపదేశించెను. మరియు అ. 13లో చూడుడు.

శ్లో॥ అన్యే త్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥

తా॥ గీతలో యీ శ్లోకమునకు పైనచెప్పిన రెండు శ్లోకములలో గల ధ్యాన సాంఖ్యకర్మయోగములను చేయజాలనివారలైన యితరులు జ్ఞానులగు యితరులవలన ఉపదేశమును పొంది శ్రవణముచేసి ఉపాసన చేయుటవల్ల వారుకూడ మృత్యురూపమగు సంసారసాగరమును తప్పక దాటుదురు. ఇందువల్ల గీతాపారాయణము, వేదాంతశాస్త్రముచదువు టకు శక్తిలేనివారు బ్రహ్మనిష్ఠులగువారివల్ల యేదైన ఒక అక్షరము చెప్పించుకొని ధ్యానించుటవల్లను, గీతాదిశాస్త్రములను శ్రవణము చేయుటవల్లను తరించగలరని శ్రీకృష్ణభగవానుడు విద్య లేనివారిపై యెంతో దయగలిగి యీవాక్యమును సెలవిచ్చిరి. మరియు అ. 18 లో వచించినది చూడుడు.

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః।
సోఽపి ముక్తః శుభాన్లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్॥

తా॥ ఏనరుడు శ్రద్ధాయుక్తుడును అసూయారహితుడున్ను అయి యీ గీతాశాస్త్రమును వినుచున్నాడో, అట్టివాడున్ను భవబంధ

విముక్తుడై పుణ్యకర్మములు చేయువారియొక్క అనగా పుణ్యాత్ములు పొందదగిన పుణ్యలోకములను పొందును. అనగా దైవప్రాప్తిని మోక్షమును పొందగలరని తెలుపడమైనది. ఇక మేము పెద్దవారమైనాము, చదువురాదు, మాకు మోక్షమెట్లు లభించును? అని యెవరున్ను తలంచనక్కరలేదు. కావుననే 'శ్రుణుయాత్' అని ప్రయోగించుటకు కారణమైనది. అయితే పాపులు పవిత్రులగువిషయమైమతపరివర్తనము చేయువారి విశ్వాసమును గురించి పైని నిరూపించినదానిని గురించి గ్రహించవలసిన విషయమొకటి గలదు. రోగియైనవాడు ఏకారణమువల్లరోగము సంభవించినదో అట్టికారణమును మానవలెను. అదిన్నిగాక ఔషధమునకు ఏమిపథ్యము విధించడమైనదో దానినిన్ని ఆచరణలో ఉంచవలెను. అలాగున మతపరివర్తనము చేయువారు దానికిపూర్వము యెట్టి అధర్మకార్యములు చేయుచుందురో వాటికితర్పణమువిడిచి నూతనముగాచేరిన మతములోగల సంస్కారమును, విధిని ఆచరణలో పెట్టవలెను. అప్పుడు మాత్రమే పవిత్రులు గాగలరనిగూడ జ్ఞాపకములో నుంచవలయును. ఆర్యసమాజస్థులుచేయు శుద్ధిప్రకరణమునందు యీ సత్యమును తెలుసుకొనగలరు. అట్లుచేయక దేహచిహ్నముతో కూడి మతమును మార్పు చేసినచో ప్రయోజనమేమియు గలుగదు. మతిని మార్పుచేసుకొని ఆత్మసంస్కరణము చేసుకొనవలయును. ఇదే మతపరివర్తనముయొక్క సత్యమని గ్రహించవలయును. ఈ విషయమై వివేకచూడామణియందు శ్రీ శంకరభగవత్పాదులు తెలిపినది చూడుడు.

శ్లో॥ పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా।
ఆరోగ్యసిద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా॥

తా॥ రోగవంతుడు తాను స్వయముగా ఔషధమునుసేవించుట పథ్యముండుటవల్లనే ఆరోగ్యవంతుడగుచున్నాడు. అట్లుగాక తాను ఔషధము సేవించక పథ్యము చేయకపోయినచో రోగమెట్లుకుదురును? అదిన్నిగాక ఔషధమునుమాత్రము సేవించి పథ్యముచేయక పోయినచో ఎప్పుడును రోగము కుదురదు. తనవ్యాధికి తాను ఔషధము సేవింపక మరియొకడు ఔషధసేవపథ్యములు గలిగియుండిన తన రోగమెట్లు నశించునో అనగా వారివారి భవరోగములకు తమకుతామే జ్ఞానౌషధము

సేవించి శమదమాది పథ్యము గలిగియుండవలయును. శ్రీరామనామ ప్రభావమును గురించి పరమశివుండు పార్వతీదేవికి శ్రీ సీతారామాంజనేయమున ఉపదేశించినది చూడుడు.

తే॥ రామతారక పావనరామనామ
మెంతపాపంబు నడగించు నంత యఘము
శ్వపచుడైనను జేయగా జాలడనగ
తత్ప్రభావంబు నెన్నంగ దరమె నాకు.

కం॥ ఈ రేడుజగములందున
నారీమణి విమల రామనామము చేతం
జీరబడని ఘనదుర్భర
ఘోరమహాఘంబు లేదు కోరి వెదకినన్.

తే॥ అనవరతరామనామకీర్తనపరుండు
వెనుకటి యఘంబుల దలంచి వెరువవలదు
ఘనత నేనుగు నెక్కి కుక్కలను గాంచి
భయపడగనేల మనుజుడో పంకజాక్షి.

కం॥ ఏపాపమునైన దగం బాపగలదు
రామనామభజనపరునకుం బాపము
గలదని పలుకు మహాపాతకి
యఘము నడప నది యోపదిలన్.

సీ॥ ద్విజవరేణ్యులకును విప్రోత్తములకు
యోగీశ్వరులకును యతీశ్వరులకు
భక్తివైరాగ్య సంపద్విశిష్టులకు
నేకాంతవాసులకు వేదాంతులకును
చండాలపుల్కసశ్వపచకంకకిరాత
శబరహూణాంగనాసంగతులకు
బ్రహ్మహత్యా సురాపానహేమస్తేయ
గురువధూసంగమకరవరులకు

గీ॥ సుందరీక్షత్రియోరవ్య శూద్రులకును
మరియు నానావిధానేక మానవులకు
పరమపావనమై శుభప్రదమునైన
రామనామంబు శరణంబు రాజవదన!

ఈ వాక్యములన్నిటిలోను విశ్వాసము గలిగియుండిన పాపులను పవిత్రులనుగా చేయుటకు యీ రామనామమునకు శక్తిగలదని ఏలనమ్మ కూడదు? ఇపుడు ఈక్రింద నిరూపించెడు పద్య మొక్కదానిలో నమ్మకము కలిగియుండిన చాలును.

కం॥ ఏపాపమునైన దగం
బాపగలదు రామనామభజనపరునకుం బాపము
గలదని పలుకు మహాపాతకి
యఘము నడప నది యోపదిలన్.

కావున రామనామము జపమొనర్చువాడు ఇంకను పావనుడు కాలేదని తలంచువారు యెంత అవిశ్వాసులో దీనివల్ల గ్రహించుకొనవచ్చును. ఇది వాక్యములో సులభముగా చెప్పవచ్చును. ఆచరణలో నున్నవారెందరో లోకమే తెలుసుకొనవచ్చును. అయితే నిరంతర రామనామ ధ్యానపరులై దానికితగిన ఆచరణకలిగి ఉంటున్నారా అని కొంత యోచించవలసియుండును.

---

ఓమ్

## ఆత్మానాత్మ వివేచనము

ఆత్మ అందరిలోను ఒక్కటిగా వుండినది నిజమైనచో, ఒక్కరికి జ్ఞానము గలిగిన అందరికిన్ని జ్ఞానము కలుగవలయును. ఒక్కడు అజ్ఞాని అయినచో అందరున్ను అజ్ఞానులు కావలయును. ఆలాగున ఒక్కడు సుఖియయినచో అందరున్ను సుఖస్వరూపులుగావుండవలయును. ఒక్కడు దుఃఖిఅయినచో అందరున్ను దుఃఖితులు కావలయును. ఒక్కడు మరణించినచో అందరున్ను మరణించవలయును అని కొందరుప్రశ్నింతురు. ఇది ఆత్మానాత్మవివేచనజ్ఞానము లేకపోవుటవల్ల కలుగుచున్నది. ఈలా

గున తలంచువారు దేహము, ఆత్మ ఒకటేయనిఅభిప్రాయముగలవారుగా నున్నారు. ఇది ఆత్మానాత్మవివేచనము చేయకపోయెడి దోషమేయని వారు గ్రహించుటలేదు. కొంచమైనను వేదాన్తవిచారణగాని,దైవభక్తి గాని గలిగియుండినచో యీ ప్రమాదము గలుగదు. కావుననే వేదాన్త శాస్త్రము స్వయముగా స్వబుద్ధితో విచారణచేసిన అర్థము కాదనియు, అనుభవజ్ఞులగు మహాత్ములవల్ల శ్రవణము చేయవలెననియు, శ్రవణము నకు ముందుగా శమదమాది సాధనచతుష్టయసంపత్తిగలవాడే అధికారి యనియు శాస్త్రము నిర్ణయించుటకు కారణము. అందరిలోను ఈశ్వ రుడు కలడను జ్ఞానము సామాన్యముగా అందరికిని తెలియును. ఈ సత్య మును తెలుసుకొనిన పై చెప్పిన సంశయము లెవ్వియు గలుగవు. ఇది అంగీకరించిన పక్షమున అట్టి ఈశ్వరుడే ఆత్మరూపముగా అందరిలోను వెలుగుచున్నాడను జ్ఞాన ముదయమగును. అట్టి ఆత్మజ్ఞానము జ్ఞానుల యందును, అజ్ఞానులయందును ఒక్కే విధముగానేవుంటున్నది. జ్ఞానులైన వారు దేహేంద్రియ మనోబుద్ధులకు ఆత్మ విలక్షణమని విచారణచేసి తెలిసికొనుచున్నారు. అజ్ఞానులైనవారు ఆలాగున ఆత్మానాత్మవిచా రణము చేసి తెలిసికొనకపోవుటవల్లనే సంశయములకు లోబడి శోక శాంతిని, నిరతిశయానందప్రాప్తినిపొందకపోవుటకున్ను, మరణభయమున కున్ను లోబడి సంకటపడుటకున్ను కారణమగుచున్నది. అజ్ఞానులైనవారు సహా వారికి గలుగుచుండెడు సుఖమును, దుఃఖమును, వారుచేయుచుండు పాపకృత్యములను, పుణ్యకార్యములను, వారికి కలుగుచుండు చెడు సంక ల్పమును, మంచిసంకల్పమును తెలుసుకొనుచున్నారుగదా! ఆ తెలిసి కొనెడి ఆత్మను దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియని తెలిసికొనక పోవుటవల్లను, ఒకవేళ కొందరు తెలిసికొనినను దేహేంద్రియ మనో బుద్ధులను నిగ్రహించుకొనుటకు శక్తి చాలనివారగుటచేతను, దృశ్యవిష యములలోనికి జారిపడిపోవుచున్నారు. అందువల్ల ఈశ్వరుడు లేక ఆత్మ జ్ఞానము తనలో ఉండియుగూడ లేదనియే తలంచవలయును. ఎట్లన, ఒక బీదగృహస్థుడుండెను. అనేకశ్రమలకు లోపడి కూలిపనులు చేసికొని జీవించుచుండెను. అతని గృహములో ఒక గొప్పనిధి యుండెను. అది భూమిలో కొంత లోపలికి వుండెను. దానిపైనే అతడు తిరుగుట, పండు

కొనుట మొదలగునవి చేయుచుండెను. అయితే అతడు మంచివాడు, సాధుసేవాతత్పరుడు. అందువలన ఆతనియింటికి నిధిజ్ఞానము గలిగిన ఒక సాధువువచ్చెను. ప్రేమతో, భక్తితో తనకు కలదానితో ఆమహాత్ముని సత్కరించెను. ఆ సాధుమహాశయుడు యీతడు బీదవాడని గ్రహించి భూమిక్రిందయుండు నిక్షేపమును చూపెను. ఆధనము దొరికిన పిమ్మట ఆతడు గొప్ప శ్రీమంతుడై సుఖముగాజీవింపగలిగెను. ఆలాగున మానవ హృదయాంతరాళమున జ్ఞానమనెడు గొప్పనిధిగలదు. అది అజ్ఞానముచే ఆవరింపబడియున్నది. నిధి యేలాగున మట్టితో కప్పబడి మరుగుపడి యుండెనో ఆత్మజ్ఞానము, ఈశ్వరస్వరూపము, బ్రహ్మము అందరిలోను సమానముగాఉండినను, అవిద్యచే మూయబడియుండును. నిధి స్వగృహ ములోనుండిగూడ తనకు లభించనంతవరకు లేనట్లు యేలాగున ఉండెనో ఆలాగుననే బ్రహ్మవస్తువు అందరిలో నుండియు, అనుభవమునకువచ్చే పర్యంతము లేనట్లే తలంచవలయును. ఆ కారణమువల్ల ఒక్కడు జ్ఞాని యనిగాని, అజ్ఞానియనిగాని చెప్పుటకు కారణము. కావుననే శ్రీకృష్ణ భగవానులు యీలాగున తెలుపుటకు కారణము. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" అజ్ఞానముచే ఆత్మజ్ఞానము ఆవృతమై యుంటున్నది. అందువల్ల జీవులు మోహములోబడి దుఃఖమునుపొందు చున్నారు. మరియు ఉండిగూడ కనపడకుండుటకు కారణము వేదాన్త శాస్త్రము యిట్లు తెలుపుచున్నది. "క్షీరేసర్పిరివ" క్షీరమునందు నవ నీతమువలె ఆత్మ వుంటున్నది. క్షీరములో వెన్న కనపడకుండవుండినను దానిని మథించినచో ప్రత్యక్షముగా వెన్న యెట్లు గోచరించునో, ఆలా గున ఆత్మానాత్మవిచారణచేసి సర్వేంద్రియములకు సాక్షియగుఆత్మను తెలిసికొనవలయును. ఇది ప్రత్యక్షమైనవిషయముగదా! అట్లు పరిశ్రమ చేయకపోవుటచేతనే పవిత్రులు గాకపోవుటకున్ను ఈశ్వరుని లేక పర బ్రహ్మమును పొందకపోవుటకున్ను కారణమని గ్రహించుకొనవలయును. ఈవిషయమై శ్రీశంకరభగవత్పాదులు "ఉపదేశసాహస్రి" యందు తెలిపినది చూడుడు.

శ్లో॥ బుద్ధ్యారూఢం సదా సర్వం దృశ్యతే యత్ర తత్ర వా।
మయా తస్మాత్పరం బ్రహ్మ సర్వజ్ఞ శ్చాస్మి సర్వగః॥

తా॥ ఏ అధ్యాత్మాధిభూతాధిదైవలక్షణమగు సకలప్రపంచము జాగ్రత్స్వప్నములయందైనను, ఇహపరలోకములయందైనను ప్రత్యక్షాది ప్రమాణములవలనను తెలియబడుచున్నదో అది యంతయు నాచే (ఆత్మచే, ఈశ్వరునిచే) నెప్పుడును బుద్ధి వృత్తిసహితముగనే తెలియబడుచున్నది. కావున సర్వదృశ్యవిలక్షణమగు నేను సర్వార్థప్రకాశకుడును, పరిచ్ఛేద రహితుడు నగు పరమాత్మను.

శ్లో॥ యథాత్మబుద్ధిచారాణాం సాక్షీ తద్వత్పరేష్వపి ।
నైవాపోఢుం న వాదాతుం శక్యస్తస్మాత్పరో హ్యహమ్॥

తా॥ తన బుద్ధికి గోచరములగు ఆధ్యాత్మాధిదైవ స్థూలసూక్ష్మ దేహాదులకు తాను సాక్షియైనట్లు పరదేహములయందును అహంపద లక్ష్యార్థమగు తాను సాక్షియై భాసించుటచే ఆత్మ లేడనికాని, దీనిని చూడ లేడనికాని నిరాకరించుటకుశక్యము కానందునను, జ్ఞానముచేగాని, క్రియచేగాని ప్రకాశింపచేయుటకును, పుట్టించుటకును, పరిహరించుటకును శక్యము కానందునను, గ్రాహ్య గ్రాహకాది ప్రపంచవిలక్షణము గనుక "అహ" మనగా లక్ష్యార్థమగు పరమాత్మయే యని తాత్పర్యము.

భగవద్గీతయందును యీ సత్యమునే చూడగలరు.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

తా॥ ఓ యర్జునా! మానవులు కీలుబొమ్మలనువలె, సర్వాంతర్యామియగు నారాయణుండు సకల ప్రాణులయొక్క హృదయముల యందుండి మాయచేత సకల భూతములను, వారివారి జన్మాంతరకర్మ సంస్కారము ననుసరించి త్రిప్పుచూ ఆయాకర్మలయందు ప్రవర్తింప జేయుచున్నాడు. మరియు—

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ॥

తా॥ బ్రహ్మాది స్తంభపర్యంతముగల సకలోపాధులయందును ఉపాధిభేదముచే వేరుగానున్నను, పరమార్థజ్ఞానముచేత నొక్కటియగు

ఆత్మయే నేనని తెలిసికొనుము. ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞానమేదికలదో అదే నిజమైన జ్ఞానమని నామతము.

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥

తా॥ ఓ అర్జునా! సూర్యుడొక్కడే యీసమస్తమైనప్రపంచము నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ ఒక్కడే సమస్తశరీరములను ప్రకాశింపజేయుచున్నాడు. అనగా సమస్తప్రపంచమును ప్రకాశింపచేయుచు దానికి సాక్షియై దేనితోనూ అంటబడక యున్నాడు. అందరిలోని ఆత్మ ఒక్కటియైనచో అందరున్ను ఒక్కే విధముగా ఉండవలయుననెడి ప్రశ్న యెటువంటిదన, అనేక లోహములతో, అనేకాకృతులతో, అనేకరంగులతో కూడిన పాత్రలలోగల చంద్రబింబము ఒకేవిధముగా నుండవలెననియు, దానిలోగల జలము శుక్ల, కృష్ణ, పీత, రక్త వర్ణములు గలదిగాని, కట్వ, ఆమ్ల, మధుర లవణాదిభేదములు గలదిగాగాని ఉండకూడదనియు ఏకరూపముగా ఉండవలెనని చెప్పెడువాక్యము యెంతఅర్థవంతముగా ఉంటున్నదో ఆలాగున పైప్రశ్న చేయువారియొక్క ప్రజ్ఞయు ఉండునని విజ్ఞులు గ్రహింతురుగాక! ఈవిషయమై అమృతబిందూపనిషత్తు ఉపదేశించినది చూడుడు.

శ్లో॥ ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః।
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్॥

తా॥ చంద్రుడు ఒక్కడుగా నున్నను, జలముల ఉపాధులనుబట్టి పెక్కువిధములుగా తోచురీతిని ఆత్మ, ఈశ్వరుడు ఒక్కడేయై సర్వాంతర్యామియై యున్నను ఉపాధిభేదములను ననుసరించి భిన్నభిన్నములుగా పెక్కులుగానున్నట్లు తోచును. దీనికన్న పరమసత్యము మరియేమి కావలయును! ఈ విషయమునే శ్రీ శంకరభగవత్పాదులు ఆత్మబోధయందుపదేశించిరి.

శ్లో॥ నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః।
ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్॥

తా॥ రుచియును, వర్ణమును లేని నీటియందు రుచులును, రంగులునుగల వస్తువులయొక్క కలయికజేసి రుచులును, రంగులును ఏర్పడిన

ఆ రసవర్ణంబుల యారోపణము ఆనీటికి కలిగినట్లు పరమాత్మ నానావిధంబులైన శరీరంబుల జెందుటంజేసి పేరులను, ఆశ్రమంబులను, జాతులను రూపములను చెందినట్లు ఆరోపింపబడును. ఇదంతయు అజ్ఞానముచేత నేర్పరుపబడినదగునుగాని ఇయ్యది సత్యముగాదు. అనేక విధములగు రుచులతోను, అనేక వర్ణములతోను గూడిన వస్తువులలోను జలము ఒక్కవిధముగా ఉండవలయునుగదా! అని వాదించెడి వారిస్థితి యెట్టిదో ఆలాగున అందరిలోను ఆత్మ ఒకేవిధముగా ఉండవలయునని వచించెడు వారి వాక్యముయొక్క గాంభీర్యముగూడ అట్టిదేయని గ్రహింతురుగాక!

శ్లో॥ గవామనేకవర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా।
క్షీరవత్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యథా॥

తా॥ ఆవు లనేకరంగులుగలవిగానున్నను, పాలరంగు ఒకటేఅయి యున్నట్లు, ఉపాధులు భిన్నభిన్నములుగా నున్నను ఆత్మ, ఈశ్వరుడు ఒక్కడుగానే ఉంటున్నాడు అని 'అమృతబిందూపనిషత్తు'. ఆవులలోగల పాలు అన్నిటిలోను ఒక్కవిధముగా తెలుపుగాఉండినచో గోవులన్నియు తెల్లగానే ఉండవలసియుండునని చెప్పెడు వాక్యముయొక్క సారమున్ను యీలాగుననే యుండును. గోవులలోగల తెలుపు, నలుపు, యెరుపు అను భేదములున్ను, పొట్టి, పొడవు మొదలగు రూపములున్ను ఉండుట సరియగునా ? అను ప్రశ్నవంటిదే పైప్రశ్నయని వివేకవంతులు గ్రహింతురుగాక! గీత—

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి॥

తా॥ బ్రహ్మాది స్తంభపర్యంతమగు సమస్త వస్తువులయందును, సమస్త ప్రాణులయందును సమముగానుండునట్టి పరమేశ్వరుని యెవడు సర్వము నశించినను నశింపనివానినిగా చూచుచున్నాడో వాడే చూచువాడు. సమస్త చరాచరప్రాణికోట్లలో అంతర్యామియై సమానముగా వెలుగుచుండు పరమాత్మను యెవడు చూచుచున్నాడో వాడే నేత్రముగలవాడు. అట్టి పరమాత్మను చూడనివాడు నేత్రముగలవాడైనను అంధుడే. ఈసత్యము నెరింగిన జ్ఞానదృష్టిగలవా రెందరుందురో తెలిసికొనవచ్చును. ఈ పంచభూతాత్మకమగు కన్నులు నశించిపోయెడు పంచ

భూతాత్మక వస్తువులనే చూడగలుగును. జ్ఞానదృష్టి కలిగినదా? లేదా? యని దీనివలన తెలిసికొనవచ్చును. అసత్యమైన, నశించెడు వస్తువులను సత్యమని తలంపుగల దృష్టిని అంధత్వముగా చెప్పడమైనది. సత్యమైన ఆత్మను చూచేదృష్టికి నిజమైన దృష్టియని యిచట నిరూపించడమైనది. కనుక ఆత్మను, ఈశ్వరుని చూడనివారందరున్ను గ్రుడ్డివారలకు సదృశులు.

శ్లో॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరం।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాంగతిమ్॥

తా॥ సకలప్రాణులయందును సమముగానుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగా తెలిసికొని తనచేత తన్ను చంపుకొననివాడగుచున్నాడు. అట్లు పరమాత్మను సమముగా సర్వములో తెలిసికొననివాడు తన యాత్మను తాను చంపుకొనినవానితో సమానుడు. అట్టి దైవమును సాక్షాత్కరించినవాడు మోక్షమును పొందుచున్నాడు. అనగా ఆత్మను దర్శించనివాడు ఆత్మహత్య చేసికొనినవానితో సమానుడు.

శ్లో॥ సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే।
అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్॥

తా॥ జ్ఞానమను చూపుగలవానికే సర్వవ్యాపియును, సచ్చిదానందమయుండును అయిన పరమాత్మను కనుంగొన వీలగును. గ్రుడ్డివాడు ప్రకాశమానుడై సూర్యుడు వెలుగుచున్నప్పటికిని చూడజాలని యట్లు అజ్ఞాననేత్రముగలవాడు పరమాత్మను గాంచజాలడు.

వేదాన్తడిండిమయందు శంకరులు తెలిపినది చూడుడు.

శ్లో॥ దృగ్దృశ్యౌ పదార్థౌ ద్వౌ పరస్పరవిలక్షణౌ।
దృగ్బ్రహ్మ దృశ్యం మాయా స్యాదితి వేదాన్తడిండిమః॥

తా॥ దృక్కనియు, దృశ్యమనియు రెండు పదార్థములు గలవు. ఇవి రెండును పరస్పరవ్యతిరేకస్వభావములుగలవియై యున్నవి. ఇందు దృక్కు బ్రహ్మముగాను, దృశ్యము మాయగాను ఉన్నది అని వేదాన్తభేరి మ్రోగుచున్నది.

శ్లో॥ ఆత్మానాత్మ పదార్థౌ ద్వౌ భోక్తృభోగ్యత్వలక్షణౌ।
బ్రహ్మైవాత్మా న దేహాదిః ఇతి వేదాన్తడిండిమః॥

తా॥ ఆత్మయని, అనాత్మయని రెండేవస్తువులు గలవు. ఇందు ఆత్మ భోక్త (అనుభవించునది) గాను, అనాత్మ భోగ్యము (అనుభవింపబడునది) గాను ఉన్నది. దేహము మొదలైన దేదియును ఆత్మగాదు; బ్రహ్మమే ఆత్మయని వేదాన్తభేరి మ్రోగుచున్నది.

---

ఓమ్

# సంసార సాగరోత్తారకమ్

గీతయందు శ్రీకృష్ణభగవానుడు "ఉద్ధరేదాత్మానాత్మానం" అని తెలిపియున్నాడు. అనాత్మస్వరూపమగు నీ దేహేన్ద్రియ సంఘాతము, దృశ్యమున్ను సంసారసాగర మనంబడును. దీనికే సంసారకూపమనియు నామాన్తరముగలదు. దీనియందు పడిపోవడమే, లేక చిక్కుకొనుటయే సంసారసాగరములో పడిపోవుటయనియు, సంసారములో చిక్కుకొనుట అనియు అందురు. సముద్రములో పడిపోయినవాడు ఈది యేలాగున వడ్డునుచేరుచున్నాడో, నూయిలోపడిపోయినవాడు ఏదైన సహాయము నవలంబించి పైకిచేరుచుండునో, ఆలాగున దృశ్యవృత్తిలోగాని, దేహేన్ద్రియాదిగుణములలోగాని పడిపోయినవాడు, లేక చిక్కుకొనినవాడు దానిని వదలి క్రమముగా ఆత్మయొక్క స్వరూపస్థితిలో చేరులాగున చూడవలయును. ఇది జ్ఞానమార్గము. అదేవిధముగా భక్తిమార్గములో నుండువారును పైనిరూపించిన దృశ్య దేహాది విషయములనుండి మనస్సును క్రమముగా వదలించుకొని, దైవభావములోనికి, దైవస్థితిలోనికి క్రమముగా మనస్సును, లేక ఆత్మను చేర్చవలయును. ఆత్మసంయమయోగమునందును శ్రీకృష్ణభగవాను డీలాగున యుపదేశించెను.

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం।
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్॥

తా॥ మనస్సు నిజస్వరూపమగు నాత్మనుండి దేహేన్ద్రియదృశ్యవృత్తులలో నెచ్చటెచ్చట సంచరించునో అచ్చటచ్చటనుండి క్రమముగా

నాత్మవిచారణచేతమరలించి ఆత్మస్వరూపములోనికి చేర్చులాగున చేయ వలయునని తెలుపడమైనది. మనస్సు స్వభావముగా నొకదానియందు స్థిరముగా నిలువక చలనము గలిగియుండుననియు భగవానుడే దెలిపెను. మఱియు 'ఆత్మన్యేవ వశం నయేత్' అని ప్రయోగించుటవలన ఆత్మ యందే నిలుకడచేసికొనవలయునని చెప్పెరేగాని, మఱియొకరూపమందు గాని, మూలాధారాది చక్రములయందుగాని నిలుపవలయునని చెప్పలేదు. ఇదియే బ్రహ్మనిష్ఠులచే గ్రహింపదగిన పరమరహస్యము. ఇచ్చట ఆత్మ స్వరూపమునే పరమాత్మస్వరూపమునుగా భగవంతుడే నిర్ణయించెను. కావుననే "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" సర్వ ప్రాణికోట్ల దేహమనెడు క్షేత్రమున క్షేత్రజ్ఞుడుగా వెలుగుచుండునాత్మను నన్నుగా నెఱుంగుము. ఆ భగవత్స్వరూపమే తనయొక్క ఆత్మస్వరూప ముగా నెఱుంగుటయే ఆత్మపరమాత్మ లైక్యమనియు, జీవేశ్వరు లైక్యమనియు గ్రహించుకొనవలయును. అట్టి ఆత్మభావమును మరుపు గలిగి దేహేన్ద్రియాది దృశ్యములోనికిజారిపోవడమే సంసారకూపములో, సంసారసాగరములో పడిపోవుటయగును. ఆ వృత్తులతో తాదాత్మ్య మును పొందుటయే సంసారములో చిక్కుకొని పోవుటయని గ్రహించు కొనవలయును. యమనియమాద్యష్టాంగయోగములున్ను, శుభేచ్ఛా విచారణాదిజ్ఞానమార్గమున్ను యీతత్త్వమునే యుపదేశించుచున్నవి. సౌధమునెక్కువానికి నిచ్చెన యెట్టిదో, పర్వతారోహణముచేయువానికి మెట్లు యెట్టివో యీ మార్గములున్ను అట్టివియేయగును. ఆత్మస్వరూ పుడగు తాను దృశ్యాది విషయములలోనికి జారిపడిపోయిన, మరల గమ్యస్థానము చేరుటకున్ను యోగజ్ఞానము లేర్పడినవి. యోగమున్ను, ఉపాసన (భక్తి) యున్ను యొక్కటియే యగును. జ్ఞానము మాత్రము ఆత్మస్వరూప విచారణయందు యెక్కువ బలవత్తరమైనది. అయితే నిష్కామ కర్మయోగముచే హృదయశుద్ధియు, ఉపాసనచే చిత్తైకాగ్ర తయు, ధ్యానధారణములచే నిశ్చలత్వమున్ను గలిగినమాత్రమే ఆత్మ స్వరూపవిచారణయందు మనస్సు ప్రవర్తించును. దీనిని నిషేధవాక్య ములచే వేదాంతశాస్త్రము క్రమక్రమముగా ఆత్మను ఉచ్చస్థానము లోనికి తీసికొని వెళ్లును. కావుననే,

శ్లో॥ నేతి నేతీతి నేతీతి శేషితం యత్పరం పదమ్ ।
పరిత్యక్తుమశక్యత్వా త్తదస్మీతి సుఖీభవ॥

ఇచ్చట దృగ్దృశ్యముల విచారణ యెంతయో యుపయోగపడును. (నేను అను పదము దృక్కును, నాది అనుపదము దృశ్యమును నిరూపించును.) మొట్టమొదట తన దేహమున కన్యమైన తనవస్తు వేదైన యుండినచో 'నావస్తువు' అని చెప్పుదురేగాని, 'నేను ఆ వస్తువు' అని చెప్పుటలేదు. అప్పుడావస్తువునకు విలక్షణుడుగా తానున్నట్లు స్పష్టమగుటలేదా? అప్పుడు దృశ్యము తాను కాదనియు, దృక్కే తాననియు స్పష్టమగుచుండునుగదా! ఆలాగున నా దేహము, నా వాక్పాదాదులను కర్మేంద్రియములున్ను, నాకర్ణస్పర్శాది జ్ఞానేంద్రియములు అనునప్పుడు అవి నావే కాని, నేనుకాదని స్పష్టమగుచున్నదిగదా! ఆలాగున నా మనోబుద్ధ్యాది అంతరింద్రియములు అని చెప్పునప్పుడు గూడ పైని వచించిన అర్థమే స్ఫురించుచున్నది. ఈ అర్థమును స్థిరము నరించుటకయ్యే పంచీకరణమగు సాంఖ్యశాస్త్రమేర్పడినది. ఏ ఆత్మవలన 'నాది, యిది' అను దృశ్యమును దేహమును, కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను, అంతరింద్రియములను విడచివిడచి పెళ్ళి శేషించిన యేఆత్మ మిగులుచున్నదో, యేది అన్నిటిని త్యజించునో, తనను తాను త్యజింపజాలక తానై నిలచియుండునో, అదియే అందరియొక్క ఆత్మస్వరూపముగును. అదిస్వప్రకాశమై దృశ్యము మొదలు బుద్ధివరకుగల జడములన్నిటిని ప్రకాశింప జేయుచున్నదై జ్ఞానమాత్రమై, త్రికాలాబాధ్యమై వెలుగుచుండును. దానినే తన స్వరూపముగా నెఱింగి అది తానై నిలకడగలిగియుండుటయే సంసారసాగరమునుండి, సంసార కూపమునుండి తరించుటకట్టి యుపాయము. మఱియొక శ్రుతియు ఆలాగుననే తెలుపుచున్నది.

శ్లో॥ నాహం దేహో న చ ప్రాణో నేంద్రియాణి మనో న హి।
సదా సాక్షిత్వరూపత్వా చ్ఛివ ఏవాస్మి కేవలః॥

తా॥ ఇదియు పైజెప్పినవిధముగానే నేను దేహముగాను, నేను మనస్సుగాను, ప్రాణమున్ను గాను, ఇంద్రియములున్ను గాను, యేవియు గాను. వీనినన్నిటికిని సాక్షియై దృశ్యమగువానిని ప్రకాశింపజేయునదియై కేవలము శివస్వరూపమైయుండు ఆత్మయే నేను. ఈశోద్దివాక్యములలో

సంగ్రహముగా వచించిన సారమునే కోట్లకొలది వేదాంతశాస్త్రములు వర్ణించుచున్నవి. ఆలాగున యుగయుగములనుండి కోటానుకోట్ల మహాత్ములు చెప్పుచున్నారు. అయినను యింకను అందఱికిని ఆ దివ్యత్వము అవగాహనము గాకనేయుంటున్నది. అందువల్లనే సంసారసాగరములో, సంసారకూపములో పడి జీవులు దరిజేరజాలక సంకటపడుచున్నవి. దీని కెన్నియో దృష్టాంతములను, దార్ష్టాంతరూపములను ఋషులు, మునులు, యోగీశ్వరులు, సిద్ధపురుషులు, మహనీయాత్ములు యుపదేశించుచునే వచ్చిరి. వానిలో ఒకటి రెండు సంగతులను మాత్రము సులభముగా అందఱికిని తెలియులాగున వచించెద. అరటిచెట్టుయొక్క ఊస (మోగు) కావలసినవారు ఒక్కొక్కపట్టను క్రమముగా తీసివైచి తీసివైచి రాగా రాగా, ఊసను కనుగొనునట్లు సాంఖ్యవిచారణచేత పంచకోశముల విమర్శనచేత. ఇదివరలో చెప్పిన దృశ్యము మొదలు బుద్ధిపర్యన్తముగల అనాత్మవస్తువులన్నిటిని "నేతి నేతి" అను వాక్యములచేత తొలగించినచో, సాక్షియై ద్రష్టయై జ్ఞానమయుడై యుండు తనఆత్మను పొందగలుగును. అయితే తపోజ్ఞానాదులచే ఆత్మ పరిపక్వస్థితిని పొందకపోయిన ఎంతగా విచారణజేసినను ఆత్మోపలబ్ధి రాజాలదు. మీరు నడచునప్పుడు మీ నీడను నెట్టివేసినను మిమ్ములను విడచి యేలాగున వదలి పోజాలదో, మీరెచ్చటపోయినను మీతోగూడనే వచ్చునో, తపోధ్యానాదులచే పరిపక్వముగాని హృదయముగలవారి విచారణయు ఆలాగుననే యుండును. అరటికాయ మొదలయినవి పక్వమునకు రాకముందు వానితోలును పట్టి లాగినను ఎట్లురాదో, పక్వమునకు వచ్చినప్పుడు తోలు వదలిపోయి గుజ్జునుభుజించుటకు అనుకూలముండునో, సర్పముయొక్క కుబుసమున్ను ముదిరి పరిపాకమునకు వచ్చినప్పుడేలాగున స్వయముగా వదలిపోవునో, అటుల పరిపాకమునకు రాకముందు ఆ చర్మమును వూడబెరక చూచిన అసలేరాదో, సర్పమున కెంత ప్రాణవేదనయో ఆలాగున తపోధ్యానాదులచే పరిపక్వముగాని ఆత్మల అనాత్మభావమున్ను తొలంగుట కష్టసాధ్యము. అంతియేకాదు, అపాయకరముగూడ అగును. కావుననే కొందఱు సాంఖ్యవిచారకులు తత్త్వములన్నియు తాము కాదనియు, తత్త్వములకు సాక్షియగు ఆత్మయే తామని చెప్పుచు ఇంద్రియాది

విషయములను నిగ్రహింపజాలక బన్ధములో తగులుకొని యుండుటకు కారణము.

శ్లో॥ యథా ముఞ్జాదిషీకైవ మాత్మా యుక్త్యా సముద్ధృతః।
శరీరత్రితయాద్ధీరైః పరం బ్రహ్మైవ జాయతే॥

తా॥ ఏలాగున దర్భనుండి పొరలను ఒక్కొక్కదానినిగా తొలగించి లోభాగములోనుండు ఈనెలను గ్రహించుచున్నారో, అలాగున బ్రహ్మచర్యాద్యనుష్ఠానములచే పరిశుద్ధాన్తఃకరణము గలవారు విచారణ జేసి పంచకోశముల తొలగించి సాక్షియగు ఆత్మను అనగా పరమాత్మను పొందుచున్నారు.

విశేషార్థము॥ఏలాగునయజ్ఞోపవీతధారణకాలమున మౌంజీబన్ధనము కొరకున్ను, దేవాలయములో ప్రతిష్ఠాసమయమున ప్రాణకలావాహన సమయమునందును దర్భలోపలగల యీనెలను గ్రహించి త్రాడుగా పేని ఉపయోగపరచెదరో, అలాగున ఆత్మనుగూడ గ్రహించుకొనవలయును. (ఇట్లు వేదాంతపంచదశి)

శ్రీ శంకరాచార్యులున్ను ఆత్మబోధలో నీలాగుననే తెలిపిరి.

శ్లో॥ వపుస్తుషాదిభిః కోశై ర్యుక్తం యుక్త్యవఘాతతః।
ఆత్మానమాన్తరం శుద్ధం వివిచ్యాత్తణ్డులం యథా॥

తా॥ లోకములో జనులు ధాన్యమును దంచి పొట్టు తవుడును తొలగించి బియ్యమును గ్రహించులాగున అన్నమయాది పంచకోశములతో గూడిన ఆత్మను జ్ఞాన ధ్యాన యోగాదులచే కోశములతొలగించి శుద్ధాత్మయగు తన ఆత్మ నుద్ధరించుకొనవలయును.

వి॥ సృష్టిలోగల యేధాన్యమయిననూ పొట్టుతో గూడియుండు వరకు మాత్రమే అంకురించుశక్తి గలిగియుండును. పొట్టునుతొలగించిన మరల బియ్యము మొలవజాలవు. అలాగుననే అన్నమయాది కోశరూపమగు మూలావిద్య యుండువరకు మాత్రమే జీవునకు జనన మరణములు గలుగును. అది వదలిపోయిన, పొట్టుపోయిన బియ్యము మొలకెత్తనట్లు జీవునకు సంసారదుఃఖకారణములగు జననమరణములుండవు.

శ్లో॥ యథాఽగాధనిధేర్లబ్ధౌ నోపాయః ఖననం వినా।
మల్లాభేఽపి తథా స్వాత్మ చిన్తాం ముక్త్వా న చాపరః॥

తా॥ మిక్కిలి లోతునందు పై భాగమున బండలువేసి స్థాపించబడిన సువర్ణనిధిని పొందుటయందు గడ్డపారచే త్రవ్వి రాళ్ళను తొలగించునట్టి ఉపాయముతప్ప మఱియొకటి లేదో, అలాగున బుద్ధిగుహయందుగల ఆత్మజ్ఞాననిధిని పొందుటకు వివేకబుద్ధిచే పంచకోశముల తొలగించి ఆత్మస్వరూపధ్యానముచే పరమాత్మను గ్రహించవలసినదే గాని మఱియొక ఉపాయము లేదు. గీతలోను, కర్మయోగాధ్యాయ తృతీయాన్తమున యీ తత్త్వమునే ఉపదేశించెను.

శ్లో॥ ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః॥
ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

తా॥ ఇన్ద్రియార్థములకన్న దేహము శ్రేష్ఠమైనది. దేహముకన్న కర్మేన్ద్రియములు ఉత్కృష్టములయినవి. కర్మేన్ద్రియములకన్న జ్ఞానేన్ద్రియములు పరిశుద్ధములయినవి. జ్ఞానేన్ద్రియములకన్న మనస్సుమిక్కిలి గరిష్ఠమయినది. మనసుకన్న బుద్ధి అత్యన్తోత్కృష్టమయినది. బుద్ధికన్న ఆత్మ సర్వోత్కృష్టమయినది. అట్టి ఆత్మయందు నిలకడ కలిగి మాయారూపమగు ప్రకృతిని భేదించవలయును లేక వధింపవలయును. ఇదియే బ్రహ్మనిష్ఠులచే పొందదగిన స్థానము. దానినే పరబ్రహ్మమును నెఱుంగవలయును.

ఈ తత్త్వమునే కఠోపనిషత్తునందును నిరూపించిరి.

మూ॥ ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్పరః॥
మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః।
పురుషాన్న పరం కిఞ్చి త్సా కాష్ఠా సా పరా గతిః॥

తా॥ శబ్దాదివిషయములు యింద్రియములకంటె సూక్ష్మములయినవి. మనస్సు శబ్దాదివిషయములకంటె సూక్ష్మతరమైనది. అట్టి

మనస్సుకంటె బుద్ధి సూక్ష్మతరమైనది. అట్టి బుద్ధికంటే సర్వమహత్తత్త్వము సూక్ష్మతరమయినది. దానికంటే అవ్యక్తము మహత్తరమైనది. ఆ అవ్యక్తముకంటే పురుషుడు (ఆత్మ) మహత్తరుడు. అట్టి ఆత్మకన్న మహత్తరమయినది మఱియొకటి కొంచమైనను లేదు. అదియే అంతమైనది, అదియే శ్రేష్ఠమయిన గతి.

వి॥ కాష్ఠయనగా నిష్ఠయొక్క పర్యవసానము. పరాగతి యనగా మోక్షము, బ్రహ్మప్రాప్తి. మహత్తత్త్వమునకున్ను, అవ్యక్తమునకున్ను వ్యక్తావ్యక్తములబట్టి స్వల్పభేదముమాత్రమే గలదు. వాస్తవముగానవి యొకటియే. ఈ తత్త్వమునే శ్రీ శంకరభగవత్పాదులు వేదవేదాంగ పారంగతులున్ను, యజ్ఞాదిక్రతువు లనేకములు జేసి వృద్ధుడైయుండు ఒక వేదబ్రాహ్మణునికి యొకశ్లోకమున యుపదేశించెను. దీనికి ఏకశ్లోకియను పేరుగలదు.

ఓమ్॥ కిం జ్యోతిస్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతిరాఖ్యాహి మే।
చక్షుస్తస్య నిమీలనాదిసమయే కిం ధీర్ధియో దర్శనే
కిం తత్రాహమతో భవాన్పరమకం జ్యోతిస్తదస్మి ప్రభో॥

తా॥ ప్రశ్న॥ నీకు ప్రకాశ మెద్ది? ఉత్తరము॥ పగటియందు సూర్యుడు. ప్ర॥ రాత్రియందు ప్రకాశ మెద్ది? ఉ॥ చంద్రదీపాదులు. ప్రశ్న॥ అటులే కానిమ్ము. కాని ఆ దీపసూర్యాదులను ప్రకాశింపజేయునదేది? ఉ॥ నేత్రము. ప్ర॥ నేత్రము మూసికొనినపుడు నీకు ప్రకాశమెద్ది? ఉ॥ బుద్ధి. ప్ర॥ ఆ బుద్ధిని ప్రకాశింపజేయునదేది? ఉ॥ నేనే (ఆత్మయే). కాన ఆత్మస్వరూపుడగు నీవే అన్నిటికంటెను పరమగు ప్రకాశమైయున్నావు. (శిష్యుడు) ప్రభో! ఆ పరంజ్యోతిని నేనేనైయున్నాను. (ఈ పై తాత్పర్యము గురుశిష్యుల సంవాదరూపము.)

వి॥ అయితే దీనికధికారి యెవడో కఠోపనిషత్తునని రూపింపబడినది.

మూ॥ నావిరతో దుశ్చరితాన్నా శాంతో నాసమాహితః।
నాశాన్తమానసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥

తా॥ నిషిద్ధమయిన పాపకర్మనుండి విరమింపనివాడు ఈ ఆత్మను పొందజాలడు. ఇంద్రియచాపల్యము గలవాడు యీ ఆత్మను పొంద

జాలడు. ఏకాగ్రచిత్తము లేనివాడు యీయాత్మను పొందజాలడు. మన శ్శాంతి లేనివాడున్ను యీ ఆత్మను పొందజాలడు. బ్రహ్మవిజ్ఞానముచేతనే యీ ఆత్మను పొందగలుగును. ఇదేవిధముగా శ్రీకృష్ణభగవానుడును గీత యందు ముపదేశించెను. మూడు లోకములలోను యీ ఆత్మజ్ఞానమునకు సమానమైనది పావనమైనది మఱియొకటి లేదనియు వచించెను.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥

తా॥ ఈ లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పావన మయినదియు మఱియొండు లేనే లేదు. అట్టి జ్ఞానమును కాలపరిపక్వము గలుగునప్పుడు యోగసిద్ధిని పొందినవాడు తనయందు తనంతట తానే పొందుచున్నాడు.

వి॥ 'ఆత్మని విన్దతి' అని ప్రయోగించుటచే తనలో తాను పొంద వలసినదేగాని మఱియొక లోకములోగాని, దేశములోగాని పొందుటకు సాధ్యమయినదికాదు. కఠోపనిషత్తునందెటుల తెలిపిరో, ఆదేవిషయమై యెవడర్ధ్వుడో, శ్రీకృష్ణభగవానుడున్ను అటులనే వచించెను.

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥

తా॥ అభ్యాసవైరాగ్యములచే నిగ్రహింపబడనిమనస్సుగలవాడు యోగమును పొందజాలడు మాటిమాటికిని ఎడతెగక ప్రయత్నించుచు అభ్యాసవైరాగ్యములతో గూడిన మనోనిగ్రహముచునట్టి యుపాయము వలన యోగమును పొందును.

వి॥ ఇచట ఆత్మసంయమము లేనివానికి దుస్సాధ్యమనియు, సాధనవలన మనోజయము గలవానికి సుసాధ్యమనియు శ్రీభగవాను డుప దేశించెను. బ్రహ్మప్రాప్తికి పైనిరూపించిన అర్హతానర్హతలుగలవుగాని, సన్న్యాసి, సంసారి, బ్రాహ్మణ, అబ్రాహ్మణ, స్త్రీ, పురుష అను భేదము లేవియు శ్రీకృష్ణభగవానుడు తెలుపలేదు.

ఓమ్

# మ నో ని శ్చ ల త్వ ము

మనోనిశ్చలత్వము కావలసియుండినచో మనోనిర్మలత్వము కలుగవలెను. మనోనిర్మలత్వము లేనికారణముచేతనే మనోనిశ్చలత్వము కలుగకపోవుటకు కారణము. ఈ తత్త్వము నెరింగి మనోనిర్మలత్వము చేసికొనుటకు ప్రయత్నించవలయును. మేహావ్యాధి గలవానికి అప్పు డప్పుడు శరీరములో కురుపులు పుట్టుచుండును. అట్టి పుండ్లు ఆరుటకు పైన మందుపూసినను ప్రస్తుతము యేర్పడినకురుపు ఒకవేళనయమైనను లోపల మధుమేహాదివ్యాధులుండుటవల్ల మరియొక ప్రదేశమునకురుపులు లేచును. కావున మేహశాంతి కలుగుటకు మందు తీసుకొనిన మరల శరీరములో నెచ్చుటను ప్రణము లేవదు. ఆలాగున హృదయశుద్ధి లేక ఆత్మశుద్ధి చేసుకొనుటకు యత్నము చేయక మనోనిశ్చలత్వము కలుగలేదని వ్యసనపడిన ప్రయోజనముండదు. కావున మనస్సులోగల పాపములు విషయాదిదోషములు రహితమొనర్చుటకు తగిన అనుష్ఠానములు ప్రప్రథమమున చేయవలెను. ఈవిషయమై శ్రీశంకరాచార్యులు ఆత్మబోధలో చెప్పినది చూడుడు.

శ్లో॥ ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్॥

తా॥ సర్వోత్తమమైన ఔషధమును నిత్యము సేవించుటవల్లను, దానికి తగిన పథ్యము కల్గియుండుటవలనను రోగమేలాగున క్రమముగా శమించునో, ఆలాగున తనఆత్మ బ్రహ్మస్వరూపమని నిరంతరము ధ్యానించుటవల్ల కలిగెడు సంస్కారరూపమైన తద్వాసన ఆవరణ విక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను బొత్తుగా పోగొట్టునని దృఢముగా నమ్మవలయును. దేహమునకేర్పడిన దీర్ఘవ్యాధి నశించుటకు యేలాగున యెక్కువకాలము ఔషధసేవయు తగిన పథ్యము నుండవలయునో భవరోగము యెప్పుడో యే జన్మములో యెంతకాలమునుండి యేర్పడినదో తెలియజాలము. అందువల్ల బహుకాలము బ్రహ్మచింతన చేసిన మాత్రమే ఆ దోషము నశించును. అవిద్య నశించిన మిగిలినది బ్రహ్మమే అనగా బ్రహ్మ ప్రాప్తియే. అట్టిమహోన్నతస్థితిని సామాన్యమని తలంచరాదు. రోగము

యొక్క యెక్కువ తక్కువలననుసరించి స్వల్పకాలమో, దీర్ఘకాలమో ఔషధసేవ యేలాగున చేయవలసియుండునో ఆలాగున యీ సాధకుని యొక్క విషయసంస్కారవిషయ యెక్కువ తక్కువల ననుసరించి, కొద్ది కాలమైనను బహుకాలముతోగూడిన బ్రహ్మవిచారము అనగా ఈశ్వర చింతన చేయవలయును. పతంజలి మహర్షియు యోగశాస్త్రమునం దీలాగుననే వచించెను.

సూ॥ తజ్జః సంస్కారోఽన్య సంస్కారప్రతిబన్ధీ॥

తా॥ బ్రహ్మ ధ్యాన జ్ఞానసంస్కారమువల్ల దానికి పూర్వముగా నుండు విషయదోష సంస్కారము నశించును. అనగా నూతనముగా యేర్పడిన యీ జ్ఞానసంస్కారము దానికి పూర్వముగానుండెడు అజ్ఞాన సంస్కారమును రహితమొనర్చును. ఔషధము శరీరములో యేర్పడిన రోగమును యెట్లు రహితమొనర్చునో, ఇదిన్నీ అటువంటిదే. అయితే యెంతవరకు రోగదోషము శరీరములో కనపడుచుండునో అది రహిత మగువరకు ఔషధ మెట్లు అవసరమో యిదిన్నీ అటువంటిదే. ఈ విధ మును క్రింది సూత్రముచే నిరూపించుచున్నారు.

సూ॥ స తు దీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః॥

తా॥ అభ్యాసము తపముతోడను, బ్రహ్మచర్యముతోడను, శ్రద్ధ తోడను, జపరూప విద్యతోడనుకూడి నిరంతరము దీర్ఘకాలము అను ష్ఠింపబడునేని దృఢమై బాహ్యసంస్కారములచే దిరస్కరింప బడకుండు టయేగాక యీ బాహ్యసంస్కారములను దానే తిరస్కరించును. అనగా పూర్వముండెను అవిద్యా సంస్కారముడు రహితమొనర్చును. ఈ సత్య మునే క్రిందిసూత్రము నిరూపించుచున్నది.

సూ॥ కాయేంద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః॥

తా॥ దృఢమగు తపోనుష్ఠానమువలన అశుద్ధిసంజ్ఞకమై యీవరణ రూపమగు రాజస, తామస మాలిన్యము నశించుట మూలమున కాయ సిద్ధియు, నింద్రియశుద్ధియు కలుగును. ఈవిషయమునే శ్రీ కృష్ణభగవా నుడు గీతలోను దెలుపడమైనది.

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్॥

తా॥ పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యము గలవాడై అనేకజన్మములందు అభ్యసించుటవలన పొందదగిన యోగసిద్ధిని (ఆత్మశుద్ధిని) పొందినవాడగుచున్నాడు. అటుపిమ్మట అనగా అట్టి యోగసిద్ధిని పొందినపిమ్మట సర్వోత్తమమగు మోక్షసిద్ధిని బడయుచున్నాడు.

వి॥ అనేకజన్మములని జెప్పుటవల్ల యికమీాద అనేకజన్మములని తలంచరాదు. ఆత్మ నిర్మలత్వము కలిగి, ముముక్షుత్వ మేర్పడినవారు యిదివరలో అనేకజన్మములనుండి అనుష్ఠానము చేసి వచ్చినవారగుటవలననే యిప్పటికింత నిర్మలత్వము విషయవిరక్తియు గల్గినదని గ్రహించవలయును. ఏలన విషయవిరక్తియు ఆత్మ నిర్మలత్వము లేనివా రనేకులు గలరుగదా! కావున ముముక్షుత్వము గలవారికి యేదైన వాసనగాని, సంకల్పముగాని వుండినచో అది నశించిన చాలును. మరియు గీతలోనే భగవాను డుపదేశించినది చూడుడు.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥

తా॥ ఎవడు అనేకజన్మములలో నాచరించిన పుణ్యసంస్కారము వలన యన్తఃకరణము శుద్ధమై కడపట సమస్తమును వాసుదేవమయమను (బ్రహ్మమయమను) జ్ఞానము గలవాడగుచు నన్ను పొందుచున్నాడో అటువంటి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు.

"స మహాత్మా సుదుర్లభః" అట్టి దివ్యాత్మను శ్రీకృష్ణభగవానుడు మహాత్ముడని పిలుచుచున్నాడు. అంతేగాక అట్టివాడు మహాదుర్లభుడనిగూడా అనుచున్నాడు. మరియు శ్రీకృష్ణభగవానుడు తెలిపినది చూడుడు.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥

తా॥లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పవిత్రమైన దియు మరియొకటి లేదుగదా ! అట్టిజ్ఞానము కాలను పరిపక్వముపచ్చి నప్పుడు తనయందు తనంతటనే పొందుచున్నాడు.

వి॥ "కాలేనాత్మని విందతి" అని తెలుపుటవల్ల యెప్పుడైతే అన్తఃకరణ శుద్ధమగునో అప్పుడేయని నిర్ణయించడమైనది. ఓమ్.

---

ఓమ్

# సూక్ష్మములో మోక్షము

శుకబ్రహ్మర్షి పరీక్షిన్మహారాజుగారి మోక్షముగలుగుటకు ఏడు రోజులు శ్రీమద్భాగవతమును బోధించవలసివచ్చెను. అప్పటినుండియే సప్తాహము లేర్పడుటకు కారణమని తోచుచున్నది. ఖట్వాంగమహారాజు వైకుంఠప్రాప్తికై నారాయణస్మరణ రెండు ఘడియలు చేయవలసి వచ్చెను. శ్రీకృష్ణభగవానుడు అంత యాలస్యముగూడ నవసరము లేదని, అంత్యకాలమున ప్రాణము మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, ఆజ్ఞాచక్రమువరకువచ్చి కట్టకడపటి యూపిరి వదలునప్పుడు బ్రహ్మభావనతో భగవత్స్మరణ గల్గియుండిన మోక్షము గల్గునని ద్వితీయాధ్యాయములో స్థితప్రజ్ఞుని లక్షణము చెప్పినతరువాత తెలిపి యున్నాడు. రెండవ యధ్యాయములో నేబదినాల్గవశ్లోకమున స్థితప్రజ్ఞుని లక్షణము నర్జునుడడిగినప్పుడు ఆ అధ్యాయాంతమువరకు పదునెనిమిది శ్లోకములచే తల్లక్షణము నుపదేశించడమైనది. ఈ పదునెనిమిది శ్లోకములు విరక్తులకు, తీవ్రముముక్షువులకు, బ్రహ్మనిష్ఠులకు నత్యంతావశ్యకములు. వృక్షముయొక్క సేవయెట్టిదో, మోక్షవృక్షముయొక్క అంతరంగసేవ వంటిది. లేక మానవశరీరమునకు వెన్నెముక యెటువంటిదో ముముక్షువులకు నిదియు నటువంటిదే. కావున నీ సమావేశములో చేరి యుండు నతివృద్ధులగు స్త్రీలుగాని, పురుషులుగాని పదిసంవత్సరముల లోపల చనిపోవువారెవరును లేరు. మేము వృద్ధులైనాము. మా కాలమంతయు సంసారములోనే గడచిపోయినది. గీతాపారాయణ చేయలేము. భజన చేయలేము. బ్రహ్మవిచారము అసలే చేయలేము. మాగతియేమి?

అని వృద్ధురాండ్రగు నమ్మమ్మలు కొందరడుగుచుందురు. వారికొరకు నీ వ్యాసము వ్రాయడమైనది. ఇదంతయు వారివారి భావననుసరించి గల్గుచుండును. ఈ జగత్తంతయు భావనారూపముతో నుంటున్నది. దేనిని లేక యెవరిని ఎవరెవ రేయేభావముతో తలంచుచున్నారో వారి వారికి దాని ననుసరించి ఫలము కల్గుచున్నది. ఇదే పరమసత్యము; పరమ రహస్యము. కావుననే 'యద్భావం తద్భవతి' అను రహస్యమును శాస్త్రము చెప్పుచున్నది.

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥
(గీత: 2 అ. 72 శ్లో॥)

తా॥ ఓ అర్జునా! ఇది బ్రహ్మసంబంధమైన నిష్ఠ. ఈ నిష్ఠను బొందిన మోహమును బొందడు. ఈ నిష్ఠయందు మరణకాలమందైన నున్నయెడల మోక్షమును బొందుచున్నాడు. అట్టివారు పొందెడి ప్రాప్తి సామాన్యమైనదిగాదు. కావుననే 'బ్రహ్మనిర్వాణమృచ్ఛతి' వేదాంతములో చెప్పిన, యే పరబ్రహ్మప్రాప్తిగలదో, బుద్ధదేవు డుపదేశించిన యే పరమనిర్వాణముగలదో అట్టిముక్తిగల్గునని శ్రీకృష్ణభగవానుడుపదేశించడమైనది. అయితే దీనియందు నొక కీలకప్రయోగము గలదు. అదే మన 'స్థిత్వాఽస్యామన్తకాలేఽపి' ప్రాణప్రయాణ కాలమందైన నట్టి దైవభావన బ్రహ్మభావము గల్గియుండవలయును. "అన్తకాలేఽపి" అని ప్రయోగించుటవలన కట్టకడపటి యూపిరి విడుచునప్పుడైనను చాలునని ప్రయోగించడమైనది. అయితే యీ విషయమై విమర్శకులు కొన్ని ప్రశ్నలు వేయుదురు. ఈ ముసలమ్మలు నిన్నమొన్నటివరకు సంసారములో నెల్లెట్లో యుండినవారు. అంత్యకాలమున పరమేశ్వరస్మరణ గల్గిన మోక్షముగల్గును. చిన్నతనమునుండి బ్రహ్మచర్యయోగమునాచరించినవారికే మోక్షము దుర్లభమని శాస్త్రము చెప్పియుండ యీ ముసలమ్మలకు మోక్షమెట్లు సిద్ధించును? మోక్షమంత సులభమా? అని విమర్శకుల యాశయము. వారితో నీ తీరుగ సమాధానముచెప్పెద. అదేమన, భగవద్వాక్యమును విమర్శించదలచను. భగవద్వాక్యములో నాకు నమ్మకముగలదు. భగవద్వచనమును విమర్శించుట భగవంతుని

విమర్శించినట్లే యగును. ఇది భగవద్భక్తులకును, ఆస్తికులకును సమ్మతము కాదు. అయితే "స్థిత్వాఽస్యామన్తకాలేఽపి" అను వాక్యమునందుగల నిగూఢతత్వమును జ్ఞాపకముచేసికొన్న చాలును. అది తెలిసికొనిన భగవద్వాక్యము సత్యమని యెట్టివారికైనను స్ఫురింపగలదు. అట్లుగానియెడ దైవవాక్యమందుగాని, శాస్త్రప్రమాణవాక్యమునందుగాని నమ్మకము చిక్కదు. అష్టమాధ్యాయమున, రెండవశ్లోకాంతమున "ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః" అనగా దేహప్రయాణకాలమందెట్టి భావన గల్గియుండిన పరమభక్తుడు, యోగనిష్ఠుడు, ఆత్మజ్ఞానపరుడు నిన్ను అనగా పరమాత్మను పొందగలడను ప్రశ్నకు అయిదవ శ్లోకమున చెప్పిన సమాధానము పై ప్రశ్నలకు ఆధారభూతమని గ్రహించిన చాలును.

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

తా॥ ఎవడైతే మరణకాలమునందు నన్నే స్మరించుచు, లేక ధ్యానించుచు దేహమునువిడిచి పోవుచున్నాడో వాడు నాయొక్క విష్ణుస్వరూపమును, లేక బ్రహ్మభావమును పొందుచున్నాడు. ఈవిషయమునందు కొంచమైనను సందేహములేదు. ఈలాటి భగవద్వాక్యములో నమ్మకము లేనివాడెట్లు భక్తుడు కాగలడు? ఏలాగున ఆస్తికుడు కాగలడు?

శ్లో॥ యం యం వాపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరం ।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః॥

తా॥ ఓ అర్జునా! ఎవడు మరణకాలమందు దేయేభావముకలవాడై దేహమునువిడుచుచున్నాడో, వాడెల్లప్పుడున్ను ఆయారూపముయొక్క స్మరణచేతకల్గిన సంస్కారముగలవాడైనందున ఆయా స్వరూపమునే పొందుచున్నాడు. దీనికన్న పరమప్రమాణ మేమికలదు? పైన విమర్శకులు చేసినదానికి సమాధానము వినుడు. "తేజస్తిమిరసంఘవత్" అని ఒక న్యాయముకలదు. ఒకబిలములో అనాదినుండి అంధకార నిబిడమై యుండినను వెలుతురుప్రవేశించినవెంటనే చీకటి యేలాగున లేకపోవునో ఆలాగున యీ మనుజమ్మ లిదివరలో అజ్ఞానమయములో నుండినను

భగవత్స్మృతి కల్గినవెంటనే ఆ తమస్సంతయు పటాపంచలైపోవును. ఆలాగున ఇనుము పరుసవేది సోకినవెంటనే యెట్లు సువర్ణమగుచున్నదో ఆలాగున నెంతకాలము మూఢత్వముకల్గియుండినను పరమాత్మస్మృతి గల్గినవెంటనే దివ్యమగు ఆత్మజ్ఞానముదయమగును. అట్లైన చిరకాలము నుండి వ్రతనిష్ఠకల్గి బ్రహ్మనిష్ఠాపరులైనవారికి, ఈఅమ్మమ్మకున్ను ఏమి భేదమని కొందరుతలంచవచ్చును. మోక్షవిషయములో మాత్రం భేదము లేదు. కాని జీవించియుండుదశలో మాత్రము భేదముకలదు. మొదటి నుండి బ్రహ్మవిచారణజ్ఞానముగలవాడు జీవించియున్నప్పుడే బ్రహ్మానంద సుఖము నొందగలడు. అన్త్యకాలమున స్మృతిజ్ఞానముకలవానికి జీవిత దశలో బ్రహ్మానందసుఖము లేదు. తాపత్రయముచే తప్తుడై యుండును. అంతేకాదు, ఇతరులను తరింపచేయుశక్తిన్నీ యీజీవికినుండదు. మొదటి నుండి బ్రహ్మవిద్యాభ్యాసముకలవానికి జీవించియున్నప్పుడే బ్రహ్మానందముకలదు; ఇతరుల తరింపచేసే శక్తికూడా యుండును; తాపత్రయ తప్తుడున్ను కాడు. అంతేభేదము. "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" "బ్రహ్మవిదాప్నోతి పరం" "శోకంతరతి ఆత్మవిత్" ఇత్యాది శ్రుతివాక్యములకు పైజెప్పిన వాక్యములను అంగీకరింపకపోయినచో విరోధము కలుగును.

ఇకను పృచ్ఛకులకు సమాధానము కలిగేలాగున తెలిపెద. ఒకరు ప్రయాణముకొరకు ఉదయము రైల్వేస్టేషనుకువచ్చి స్టేషన్ మాష్టరును కాశికి వెళ్లేబండి యెప్పుడువచ్చును? అని అడిగెను. స్టేషన్‌మాష్టరు పదిగంటలకు బండివచ్చునని తెలిపెను. టికెట్టుతీసుకొని అతడు హాయిగా కూర్చొనెను. పలానసమయమునకు బండివచ్చుననియు, నిస్సంశయముగా ప్రయాణముచేయవచ్చునని దలంచెను. మరియొకడు ఆ కాశీబండిలోనే ప్రయాణముచేయుటకు ఆ సమయమునకు పరుగెత్తివచ్చెను. అతడు బండి చిక్కునో? లేదో? అని దిగులుతోను, దారిలో కనపడినవారి నందరిని బండివచ్చినదా? పోయినదా? అని అడుగుచు పరుగెత్తివచ్చెను. ఉభయులున్ను ఒకేబండిలోనే, ఒకేసమయములోనే ప్రయాణముచేసి నారు. పరుగెత్తివచ్చినవానికికూడ టికెట్టు దొరికెను. మరియు తిరుపతి వేంకటేశ్వరుని దర్శనముకొరకు ఒకడుదయమునుండి దేవాలయమున కొచ్చి కూర్చున్నాడు. దేవాలయము మేనేజరుగారి నెపుడు స్వామిదర్శన

మని అడుగగా పదునొకండు గంటలకుపైన భగవంతుని దర్శనమగునని మేనేజరు చెప్పినారు. అతడు స్వామిదర్శనమగునని తలంచి దేవాలయము లన్నియుజూచుచు, భక్తులతో సంతోషముతో మాట్లాడుచు సత్కాలక్షేపము చేయుచుండెను. మరియొకడు పదునొకండుగంటలకు దూరము నుండి పరుగెత్తుకొనివచ్చెను. అతనికి స్వామిదర్శనమగునా? లేదా? అని దిగులుకల్గియుండెను. మార్గములో చూచినవారందఱితోను స్వామిదర్శనమైనదా? లేదా? అని అడుగుచు వ్యాకులముతో వచ్చెను. దేవుని దర్శన ముభయులకు నేకకాలములోనే గల్గెను. పైజెప్పినప్రకారము మొదటి నుండి ఆత్మజ్ఞానముకలవానికి ఇహములోను, పరములోను బ్రహ్మనుభూతికలదు. అట్లు కానివానికి తాపత్రయబాధ ఉండునదేగాక బ్రహ్మనందసుఖము లేదు. పరములోమాత్రము బ్రహ్మానంద ముభయులకున్ను సమానము. మరియొక కథకూడ భక్తులసంశయనివృత్తికొరకు తెలిపెద. ఒక యాత్రీకు డొక డన్నసత్రమున కుదయమే వెళ్ళి చీటితీసుకొన్నాడు. సత్రం మేనేజరు పండ్రెండు గంటలకు భోజనము పెట్టబడును అని చెప్పినందుచే నతడు భోజనము దొరకునను విశ్వాసముకల్గి స్నాన, పారాయణ కృత్యములు నిర్వహించుకొని వచ్చిన అతిథులతో వేదాన్త కాలక్షేపముచేసుకొని కడకు శాంతితో నుండెను. మరియొక యాత్రీకుడు దూరమునుండి సత్రానికి పండ్రెండుగంటలకు సమయానికి పరుగెత్తికొని వచ్చెను. భోజనము దొరకునా? లేదా? అని ఆకలిబాధతో శ్రమపడి వచ్చెను. అయితే పండ్రెండుగంటలకు భోజనసమయానికి వచ్చినందుచే ఉభయులకున్ను ఒకేసమయమున ఒకేవిధమగు మంచిభోజనము దొరికెను. తృప్తులైరి. ఇంతేభేదము. మొదటినుండి అనుష్ఠానపరుడై ఉండిన వానికిని, దేహావసానమున స్మరణ లేక ఆత్మస్మృతి కలవానికిన్ని గల తారతమ్యము. ఇక యీ విషయమై విస్తారముగా చెప్పంబూనలేదు. దైవ సృష్టిని విమర్శించెడివారిని గురించి రెండు చిన్నకథలు చెప్పెద.

ఒక గ్రామములో నిద్దరు భోజనప్రియులగు బ్రాహ్మణులుండిరి. ఇది పూర్వకాలపు చరిత్రమగుటచే ఆ కాలమున ఉపనయనము, వివాహము, శ్రాద్ధము మొదలగుకాలములో వచ్చిన అతిథులందరికిని తృప్తిగా భోజనముపెట్టెడు పుణ్యకాలము. ఈ విప్రు లిద్ద రంతగ విద్యావంతులు

కాదు. ఇరువురును పరమమిత్రులు. ఎచ్చటైన ఉపనయనము, నామ కరణము, వివాహము, శ్రాద్ధము జరుగుచుండిన ముప్పదిమైళ్ళయిన నడచిపోయేవారు. అది కన్నడ దేశము. అది యేలాటి ప్రయాణసౌకర్య ములు లేని ప్రదేశము. ఒక బ్రాహ్మణగృహములో ఉపనయనము జరుగు చున్నదనివిని ఇరువదిమైళ్ళు నడచివెళ్ళినారు. కర్ణాట దేశములో భక్ష్య ములకు 'హోళిగి' అనిపేరు. అనగా పోలిబొబ్బట్లని యీ దేశములో చెప్పెడి పిండివంట విశేషము. ఉభయులున్ను గొంతువరకు భుజించి, ఒకప్రదేశమున విశ్రాంతిగానుండి భోజనమునుగురించి మాట్లాడ నారం భించినారు. ఒకడు నేను పది హోళిగలు తింటిననియు, ఇంకొకడు పండ్రెండు హోళిగలు భుజించితిననియు మాట్లాడుచు, సృష్టికర్తనాసిక క్రింద నోరుపెట్టినాడు. ఇపుడు గొంతువరకుమాత్రమే తినుటకు వలను పడెను. శిరస్సున నోరుపెట్టియుండినచో యింకను నాలుగు హోళిగలు తినవచ్చునుగదా అని యనుచు సృష్టికర్త కేమైన వివేకజ్ఞానముకలదా! అని మాట్లాడినట్లుండును. పరమేశ్వరసృష్టిని గురించి విమర్శించు వారి యొక్క ప్రజ్ఞ యీలాగున నుండునని తలంచవలయును.

మరియొకకథ. ఒకడు కొద్దిగచదువుకొన్నవాడు. దేనినిజూచినను, ఎవరిని జూచినను విమర్శించేవాడు. ఒకరోజున ఒక గొప్ప గుమ్మడి కాయను భుజముపై మోసుకొని నాలుగుమైళ్ళ దూరములోనుండు తన బంధువులయింటికి వెళ్లుచుండెను. అది మంచి వేసవికాలము. మిట్ట మధ్యాహ్నము. దారిలో నేనీడయున్ను లేదు. మార్గమున నొక పెద్ద మఱ్ఱిచెట్టుండెను. పండ్లు పండియుండెను. కొంచెముసేపు మధ్యాహ్నఅచ్చోట విశ్రమించతలంచెను. పడుకొని తన విమర్శనాస్వభావమును వృక్షముపైకి ప్రసరింపచేసెను. ఇంత గొప్పమ్రానునకు యింత చిన్నచిన్న కాయలను సృష్టించుటయు, సన్ననితీగగలగుమ్మడిచెట్టుకు ఇంతపెద్దకాయనిర్మించుట యేమి వివేకజ్ఞానము! న్యాయముగా ఆలోచించిన యీ గుమ్మడితీగ యొక్క పరిణామము, ఈ చెట్టుయొక్క పరిణామము గణించిచూచిన కనీసము ఒక పీపాయంతకాయమైన నుండవలయునుగదా! అని తనలో తాను వితర్కించుకొని పరమేశ్వరుని సృష్టిక్రమబుద్ధిహీనతను నిందించు కొని కొంచెము నిద్రవచ్చినపుడు ఒక సుడిగాలివచ్చి కొమ్మలు కదలి

నపుడు కొన్ని పండిన మట్టిపండ్లు దేహముపై పడినపుడు వెంటనే లేచి దూరముగా వెళ్లి ఓహో! భగవత్సృష్టి యెంత గొప్పది! భగవంతుడు ఎంతటి వివేకవంతుడు! అతని యూహా మానవులబుద్ధి కతీతము. నేను తలంచినట్లు పీపాయంతకాయ నాపై బడిన నేనుపలిగి పచ్చడైయుండును గదా! అని ఆలోచించి తనఅపరాధమును క్షమించేలాగున పరమేశ్వరుని ప్రార్థనచేసినాడు. విమర్శకులందరు యీసత్యమును దెలుసుకొందురుగాక!

---

ఓమ్

# జీవుని యొక్క స్థితి

1. జీవుడు పుట్టిన ఐదుమాసములవరకు వెల్లవెలకల పండబెట్టిన ఆలాగునే యుండును.

2. తర్వాత ఆరవమాసము వచ్చునప్పుడు తన స్వశక్తి నుప యోగపరచి బోర్లపండుకొనును. తన సుఖము ననుసరించి వెల్లవెల కల గూడ పడియుండేలాగున జేయును.

3. పిమ్మట స్వయముగానే తొమ్మిదిమాసములకు తన శక్తిని వినియోగపఱచి కూర్చుండును.

4. మరల తనయొక్క ఆత్మశక్తిని వినియోగపఱచి స్వయముగ దోగాడ ప్రారంభించును.

5. సంవత్సరమునకు స్వశక్తిని ఆధారముగ జేసికొని అరుగుగాని, మఱి దేనినిగాని ఆధారము జేసికొని చిన్నగ నడచుటకు ప్రారంభించును.

6. నడచునపుడు అనేకసార్లు పడిపోవును. అయినను మరల దేనినైన అనుకూలమును జేసికొని లేచి చిన్నగ, చిన్నగ నడవ ప్రారంభించును. ఆరంభములో యెన్నిసార్లుపడిపోయినను కొంతసేపు యేడ్చుకొని మరల నడచెడు తన పనిని ఆరంభించునుగాని, పడిపోయెనని తలంచి నడవక యూరకుండుటమాత్రము లేదు. ఆలాగున క్రమముగా, బాగుగా నడచుటకు తయారగును.

7. పిమ్మట నిరాధారముగ అనగా దేనియొక్క సహాయమును గోరక లెస్సగ పరుగెత్తేలాగున యేర్పడును. జీవునియొక్క స్థితియు

ఈలాగుననే ఉండునని ముముక్షువులు, సాధకులు గ్రహించుకొనవలయును

8. పిమ్మట మంచియావనము గలుగునపుడు ధైర్యముతో గుట్టలను, కొండలను, కాలువలను నదులనుగూడ ప్రయాసములేక దాటుటకు శక్తివంతుడగును; తాను నిర్ణయించుకొనిన లక్ష్యమునుచేర గలుగును. ఇదే జ్ఞానశాస్త్రములో జెప్పిన సప్తభూమికల యొక్కయు, అష్టాంగయోగములయొక్కయు రహస్యమని గ్రహించుకొన వలయును. దీని ననుసరించియే తిరుపతి వేంకటేశ్వరులకు యేడుకొండలున్ను, శ్రీ రంగనాథస్వామి దేవాలయమునకు సప్తప్రాకారములున్ను యేర్పడినరహస్యము. సప్తజ్ఞానభూమికలనగా 1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానస, 4. సత్త్వాపత్తి, 5. అసంసక్తి, 6. పదార్థాభావన, 7. తుర్యగ. అష్టాంగయోగములు: 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4. ప్రాణాయామము. 5. ప్రత్యాహారము, 6. ధారణ, 7. ధ్యానము, 8. సమాధి.

జ్ఞానభూమికలు జ్ఞానవాసిష్ఠాదిగ్రంథములలోనుఅష్టాంగయోగము పాతంజలయోగశాస్త్రములోను విస్తారముగా గనందగును. జ్ఞానభూమికలు యేడు జెప్పటకున్ను, అష్టాంగయోగములు ఎనిమిది జెప్పటకున్ను కారణమేమని జిజ్ఞాసువులకు సంశయము కలుగవచ్చును. జ్ఞానభూమికలు తుర్యగతో యేడుజెప్పినతర్వాత తుర్యాతీతమని మఱియొక్క స్థితిఁగూడ నిరూపించడమైనది. అప్పుడు యోగశాస్త్రములో జెప్పినట్లు ఎనిమిది యేర్పడును. అష్టాంగయోగములలో సమాధియనునది ఎనిమిదింటితో పూర్తియగును. అట్టి సమాధి జీవేశ్వరునిలో ఐక్యమనియు, జీవుడు తన నిజస్వరూపమగు స్వప్రకాశజ్ఞానస్థితిలో నుండుటయనియు, అద్వైకైవల్యప్రాప్తియనియు యోగశాస్త్రమునిరూపించడమైనది. జ్ఞానశాస్త్రములో తుర్యగ అనునది వ్యష్టికి సాక్షియగు తన ఆత్మస్వరూప స్థితియనియు, అచట వ్యష్టిత్వముండుననియు, తుర్యాతీతమున సమష్టిత్వము గలుగుననియు నిర్ణయించడమైనది. అప్పుడు యోగశాస్త్రమున్ను, జ్ఞానశాస్త్రమున్ను ఒకేతత్త్వమునే దెలుపుచున్నట్లు మనకు గోచరమగును. దీనికి సంబంధించిన ప్రమాణములు జ్ఞానశాస్త్రములోను, యోగశాస్త్రము

లోను బహుళముగా చెప్పడమైనది. యోగమందు ఉపాసనపరమగు భక్తియోగము అంతర్భూతము. ఇది విజ్ఞులందరికిన్ని విదితము. దృష్టాంతముగ జెప్పినదానికి దార్ష్టాంతముగ వినుము. ఈ రహస్యమును దెలుసుకొనిన యేజీవి అనగా మానవుడు యెట్టిస్థితిలోనుంటున్నాడో గ్రహించుకొనవచ్చును; ఇతరులనుజూచి గ్రహించవచ్చును.

1. ఎంతవరకు స్వశక్తితో ప్రకృతినుండి, కర్మనుండి విముక్తి పొందవలయునని తలంపుగలుగలేదో, అనగా ఆత్మవికాసము కాలేదో అంతవరకు మాయలోనే, అజ్ఞానములోనే, కర్మబంధనములోనే పడియుండును. దానినుండి విమోచనము బొందవలయునని కొంచమైనను తలంపు గలుగదు.

2. ఈలాగున కొంతకాలముండి పుణ్యకర్మచేతను, పరమేశ్వరుని కరుణచేతను కొంచము ఆత్మశక్తి గలుగునపుడు శిశువు స్వయముగా తన శక్తిని వినియోగపరచి బోర్లపండుకొనునట్లు ప్రకృతిబంధమునుండితొలగుటకు కొంచముకొంచము దైవవిచారము జేయుటకు ఆయత్తచిత్తుడగును.

3. ఈ స్థితిలోనే కొంతకాలముండి తర్వాతశిశువు లేచికూర్చొనునట్లు అజ్ఞానమునుండి విముక్తిని బొందుటకు, కొంచము ఆలోచనజేయుటకు, కొంతసేపు కూర్చుండి ధ్యానము జేయుటకున్ను ఆరంభించును. ఈలాగున కొంతకాలము గడచిన పిమ్మట,

4. తన ఆత్మబలముచే దోగాడుటకు యత్నించునట్లు సమీపములో నుండెడు బ్రహ్మవేత్తలను వెదకుటకు యత్నించును. ఈ స్థితిలోనే కొంతకాలము గడచిపోవును.

5. మఱల కొంతకాలమునకు మహనీయులవాక్యములను ఆధారముజేసికొని జప, ధ్యాన, భజనాదులు జేయుటయు, ధ్యానాదులు అనుష్టించుటయు జేయుచుండును. ఈస్థితిలోనికి వచ్చువరకు జీవుడు శైశవావస్థలో మలమూత్రములోనేపడియుండును. తర్వాతమలమూత్రములో పడియుండక మలమూత్రములకు దూరుడైయుండు స్థితికివచ్చిన జీవుడు సంసారమాలిన్యములో నుండజాలడు.

6. నడచినపుడు మరల మరల పడిపోయినను స్వయముగాలేచి తనగమనము నారంభించునట్లు యీస్థితిగలుగునపుడు అనేకవిఘ్నములు

గలుగవచ్చును. తన నిష్ఠనుండి కొన్ని పతనములుగూడ సంభవింప వచ్చును. తన వ్రతమునుండి జారిపడుటగూడనుండవచ్చును. అయినను తన ప్రారబ్ధకర్మబలము యీలాగున నుండునని తలంచి యెన్నిసార్లు పతనము గలిగినను ప్రాయశ్చిత్తముజేసికొని పతనమునకు కారణమెరిగి అచ్చోటనుండక స్థలమునుమార్చుకొనవలయును. యత్నమమాత్రము చేయుచునే యుండవలయును.

7. శైశవావస్థపోయినతర్వాత యేసహాయమును లేకనే బాలుడు నడచునట్లు పైజెప్పినవిఘ్నములు, పతనములుతొలగినపిమ్మట స్వయము గానే నిర్విఘ్నముగ ఆత్మగమ్యామగు పరబ్రహ్మమును బొందుటకు శక్తి గలుగును. ఇప్పటికి విఘ్నములునశించినవనియు పరమేశ్వరుని కృపయు గురుకారుణ్యము లభించినవనియు నిశ్చయించుకొనవచ్చును.

8. యౌవనస్థితి ఆవిర్భవించిన పిమ్మట కొండలను, గుట్టలను, కాలువలను, నదులనుదాటిపోవునట్లు విఘ్నములన్నిటిని, కష్టములన్నిటిని, ప్రయాసములన్నిటిని, సంకల్పములన్నిటిని, సంస్కారములన్నిటిని, మనో వృత్తులన్నిటిని ప్రయాసములేకనే దాటిపోయి తన గమ్యస్థానమగు పరమే శ్వరుని లేక పరబ్రహ్మమును పొందగలుగును. కావున ముముక్షువులకు జిజ్ఞాసువులకు గలిగెడు విఘ్నములు, బాధలు సంకల్పములు, వృత్తులు కలుగునపుడు పైజెప్పిన వాక్యములను జ్ఞాపకముజేసికొని గమ్యస్థానము జేరువరకు తనసాధనలను, వేదాన్తమననాదులను చేయుచునే యుండవల యును. ఈ గమ్యస్థానము జేరువరకు ఈశ్వరానుగ్రహమున్ను, గురు కరుణయున్ను జీవులకు అత్యావసరములు.

శ్లో॥ భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

అని శ్రుతి యీలాగున దెలుపుచున్నది. మఱియు

"ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా।
మహాభయపరిత్రాణాత్ ద్విత్రాణాముపజాయతే॥"

అని శ్రీ దత్తాత్రేయవచనము.

తా॥ ఎప్పుడైతే హృదయగ్రంథులు వదలిపోవునో అప్పుడు సర్వ సంశయములును నశించును. అత్తఱి సర్వకర్మలు లీనములై పోవును.

అదెప్పుడన పరావరస్వరూపమగు పరబ్రహ్మసాక్షాత్కారము గలుగు నపుడే సిద్ధించును, హృదయగ్రంథులనగా అనాత్మలగు దేహాదులయందు ఆత్మబుద్ధి గలిగియుండడమే. అది లేక బుద్ధ్యాది దేహపర్యంతముగల అన్నిటికిన్ని తాను విలక్షణుడు, స్వప్రకాశజ్ఞానస్వరూపుడు, దైవస్వరూపుడు అని గ్రహించేది. ఇట్టి స్థితి ఈశ్వరానుగ్రహమువల్లనే జీవులకు గలుగవలయునని శ్రీదత్తాత్రేయు లుపదేశించిరి.

---

ఓమ్

# భి క్షు ల క్ష ణ ము

## (నారదపరివ్రాజకోపనిషత్)

భిక్షువనిన, సన్న్యాసియనిన, బ్రహ్మనిష్ఠుడనిన యొకేయర్థమే.

మూలం॥ అజిహ్వః షణ్ఢకః పంగురన్ధో బధిర ఏవ చ ।
ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుః షడ్భిరేతైర్న సంశయః॥

తా॥ (1) అజిహ్వుడు. (2) షణ్ఢుడు, (3) పంగువు, (4) అంధుడు, (5) బధిరుడు, (6) ముగ్ధుడు ఈ ఆరు లక్షణములు గలవాడే సన్న్యాసియగును, ముక్తుడగును; సంశయములేదు. (1) అజిహ్వుడనగా జిహ్వయుండియు జిహ్వలేనివాడు. అనగా నాలుకకు రెండు గుణములు గలవు. 1. మాట్లాడుట, 2. రుచిని తెలుసుకొనుట. వ్యర్థముగ మాట్లాడకయు, రుచులకు లోబడకయు యుండువాడు నాలుకయుండియు లేనివాడగును. (2) షణ్ఢుడు—పురుషత్వముండియుపురుషత్వము లేని నపుంసకునివంటివాడు. మంచి యౌవనముగలిగి పురుషావయవము లన్నియు బాగుగగలిగియు విషయవృత్తిలేనివాడు. ఆలాగున స్త్రీయైనచో మంచి యౌవనముగలిగి, మంచికులములో జన్మించి స్త్రీ యవయవము లన్నియు లెస్సగగలిగియు విషయవృత్తిలేనిది. అనగా నపుంసకస్థితిలో యుండుదానినిగా గ్రహించేది. (3) పంగువు – పాదములుండియు వ్యర్థముగా అచ్చటచ్చట తిరుగక ఒకేచోటులోయుండి నిరంతరము ధ్యానము చేయువాడు. (4) అంధుడు – కండ్లుండియు గ్రుడ్డివాడు. అనగా నామ రూపముల చూడక యన్నిటిలోను యంతరాత్మయై వెలుగుచుండు పర

మాత్మను చూచువాడు, లేక ప్రియాఽప్రియవస్తువులను, మనుష్యులను చూచి రాగద్వేషములను పొందనివాడు అంధుడనంబడును. (5) బధిరుడు – చెవిటివాడు. అనగా స్తుతినిన్దలను వినిగాని, ప్రియాఽప్రియ వాక్యములనువినిగాని హర్ష శోకములను పొందనివాడు బధిరుడనంబడును. (6) ముగ్ధుడు – సర్వము తెలిసినవాడై ఏమియు ఎరుంగని జడునివంటి వాడు ముగ్ధుడనంబడును. ఇట్టి యీఆరుగుణములు గలవాడు సర్వదా ముక్తుడే బ్రహ్మిష్ఠులు యిట్టి స్థితిలోనికి రావలయును. ఇక యీ యారింటియొక్క లక్షణమును ఒక్కొక్క శ్లోకముచేత వివరింపబడును.

మూ॥ ఇదమిష్టమిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతి।
హితం సత్యం మితం వక్తి తమజిహ్వాం ప్రచక్షతే॥

తా॥ అజిహ్వుడు:– ఎవడు షడ్రసోపేతాన్నముల భుజించువాడైనను ఇది ప్రియమైనది, ఇది యప్రియమైనది అను భావముతో సంలగ్నముగాడో, సకలలోకహితముగను, సత్యముగను, మితముగను నెవడు సంభాషించునో ఆతడు అజిహ్వుడనంబడును.

మూ॥ అద్య జాతాం యథా నారీం తథా షోడశవార్షికీం।
శతవర్షాం చ యో దృష్ట్వా నిర్వికారస్స షండకః॥

తా॥ షండుడు:– పదునారు సంవత్సరముల యువతిని చూచిన అప్పుడే జన్మించిన బాలికనువలెను, ఆలాగున నూరు సంవత్సరముల వయస్సుగల ముసలివలెను ఎవండు చూచుచున్నాడో యాతడే షండుడనంబడును. అనగా యౌవనస్థితిలో మంచి రూపలావణ్యముగల నారీమణిని చూచిన పసిబాలికవలెను, వృద్ధురాలివలెను ఎవడు చూచుచున్నాడో వాడే షండుడనంబడును. అనగా పసిబాలికయందును, మహా వృద్ధురాలియందును ఏలాటి వికారమున్నూ ఏపురుషునికి ఎట్లుకలుగదో ఆలాగున సౌందర్యవతియగు యీ యౌవనస్థితిలోయుండు స్త్రీని చూచినను ఎవడుముగ్ధుడుగాడో వాడు షండుడనంబడును. ఆలాగున యప్పుడే జన్మించిన పురుషశిశువునందును, మహావృద్ధునియందును యెట్టిస్త్రీకైన ఏలాగున వికారము గలుగదో, ఆలాగున రూపయౌవనసంపన్నుడగు పురుషునిచూచిన యెట్టిస్త్రీకైన వికారము గలుగదో యట్టి స్త్రీగూడా నపుంసకస్థితిలో యుండు స్త్రీయని గ్రహించవలెను.

మూ॥ భిక్షార్థమటనం యస్య విణ్మూత్రకరణాయ చ
యోజనాన్న పరం యాతి సర్వదా పంగురేవ సః॥

తా॥ పంగువు:— భిక్షాన్నముకొరకు, స్నానశౌచాదుల కొఱకు మాత్రము సంచరించువాడును, యాత్రచేయవలసియుండిన యొక యోజనమునకు దూరము నడువనివాడును పంగువనంబడును. వాడు కాళ్ళుండియు కాళ్ళులేనివాడు. తక్కిన సమయములో యొకేస్థలమున ధ్యాననిష్ఠ కలిగియుండవలయును. ఎక్కువదూరము నడచిన అలసటగలిగి సాయంసంధ్యాకాలములలో ధ్యాననిష్ఠాదులకు శక్తియుండదు. యోజన శబ్దమునకు పదిమైళ్ళదూరమనియు, ఎనిమిదిమైళ్ళ దూరమనియు యభి ప్రాయములు గలిగియున్నారు.

మూ॥ తిష్ఠతో వ్రజతో వాఽపి యస్య చక్షుర్న దూరగం।
చతుర్యుగాం భువం ముక్త్వా పరివ్రాట్ సోఽంధ ఉచ్యతే॥

తా॥ అంధుడు:— నడచుచున్నవాడైనను, నిలుచుచున్నవాడై నను ఎవనిదృష్టి నాలుగు కాడిమానులదూరముకన్న నెక్కువగా ప్రస రించదో అటువంటి పరివ్రాట్ అంధుడనంబడును. కాడిమాననగా బండికి ఎద్దుల కట్టుటకు యేర్పడిన కొయ్యయగును. దృశ్యములగు యనేకవస్తువులనుచూచే స్వభావమున్నూ, చలనస్వభావమున్నూ నేత్ర ములు కలిగియుండును. ఆలాగున గలుగనియ్యక నడచునపుడును, నిలుచునపుడును, కూర్చుండునపుడును మనస్సు నేకాగ్రతచేసుకొని ధ్యేయాకారదైవభావములో నిలకడ గలిగియుండేలాగున చేయవల యును. అతడు కన్నుండియు లేనివాడు.

మూ॥ హితాహితం మనోరామం వచశ్శోకావహంస్తు యత్।
శ్రుత్వాఽపి న శృణోతీవ బధిరస్స ప్రకీర్తితః॥

తా॥ బధిరుడు:— తనకు ప్రియమైనవియు, అప్రియమైనవియు, మనోహరమైనవియు, మనోవేదనకరమైనవియు నగు వార్తల నాకర్ణిం చియు నేలాటి హర్షశోకముల పొందక సమానస్థితిలో యుండువాడు బధిరుడని చెప్పబడును. అనగా చెవిటివానిని స్తుతించినను, నిందించినను సంతోషవార్తలు చెప్పినను, దుఃఖవార్త చెప్పినను యేలాగున నిర్వికార స్థితిగలిగి యుండునో అట్టియవస్థగలవాడే బధిరుడనంబడును.

మూ॥ సాన్నిధ్యే విషయాణాం యః సమర్థో వికలేంద్రియః।
సుప్తవద్వర్తతే నిత్యం స భిక్షుర్ముగ్ధ ఉచ్యతే॥

తా॥ ముగ్ధుడు:— విషయాభిలాషాభివర్ధకములగు వస్తుజాలములు సమీపములో నుంటున్నను, వానిని గ్రహించుసామర్థ్యము యింద్రియముల కుంటున్నను నే యింద్రియమునైనను యా విషయాదులపై పోనివ్వక దేనిని గ్రహించక సుషుప్త్యవస్థయందువలె సకలేంద్రియ వ్యాపారములు విరమించినవాడై జడునివలె యెవడుంటున్నాడో వాడే ముగ్ధుడనంబడును. గాఢనిద్రలోనుండు వాని సమీపములో పంచేంద్రియ ములకు సంబంధమైన సర్వవిధములగు విషయభోగములుండినను, దేని వలనను చలించకయుండునో, అలాగున సర్వేంద్రియములు గలిగియు వాని సుఖదుఃఖభోగములు సమీపముననుండియు చలింపక వికారమును పొందక యుండువాడు ముగ్ధుడనంబడును. వీడు జీవన్ముక్తుడు. అన్ని బంధములను తొలగినవాడు.

---

ఓమ్

# మ త ము

శ్రీవ్యాసాశ్రమములో భజనస్థలమున శ్రీబుద్ధ, శ్రీక్రీస్తు, శ్రీమహమ్మద్, శ్రీ శంకరాచార్య, శ్రీ రామానుజాచార్య, శ్రీ మధ్వాచార్య, శ్రీగాంధీ మొదలగుమతప్రవక్తలగు మహనీయులందరిపటములు పెట్టబడి యున్నవి. సాయంప్రార్థనాకాలములో అన్ని పటములకున్నూ ధూప దీపాదిపూజలు జరుగుచుండును. పై పేర్కొనిన ప్రవక్తల వర్తమాన అనుయాయులు అప్పుడప్పుడు ఆశ్రమమునకు వచ్చి నన్ను (ఈఉపాధిని) మీరు బుద్ధ, క్రీస్తు, మహమ్మద్, గురునానక్, రామమోహనరాయ్ మొదలగు ప్రవక్తలను, ద్వైత విశిష్టాద్వైతాద్వైత మతకర్తలయొక్క పటములనుబెట్టి అందరిని సమానముగా పూజించుచున్నారే ? వీరలలో యెవరి మతము మీ మతమని అడుగుచుందురు. దానికి వీరందరిమతి (మనస్సు) కావలయుండి అందరి మనస్సును (మతిని) యేది ప్రకాశింప జేయుచున్నదో యదే నామతమని ప్రశాంతముగా, ప్రసన్నముగా సమా

ధానము చెప్పుచుండు. శ్రీసోక్రటీస్, శ్రీకృష్ణచైతన్యులు, శ్రీదయా నందసరస్వతి మొదలగు ప్రవక్తల మహనీయాత్ముల పటములు గూడా భజనమందిరములో గలవు. మతశబ్దమునకు వ్యుత్పత్తి వ్యాకరణమందు యీలాగున కనబడుచున్నది. "మతమ్ = మన జ్ఞానే భావే క్తప్రత్యయః" సమ్మతౌ=అభిప్రాయే, జ్ఞానే, అర్చాయాఞ్చ. అనగా సమ్మతం, అభిప్రాయం, జ్ఞానం, అర్చనం అను నాలుగువిధములగు అర్థములు గలవు. ముఖ్యముగా మనస్సులో తనకు జనించిన భావమే మత మనం బడును. హృదయములో గలిగిన భావనయే లేక జ్ఞానమే మత మన బడును. దీనియందు యెవరికిన్ని వివాదమేమియు లేదు. అయితేకొందరు తమమతమును దైవమతమనియు, వేదమతమనియు పేర్కొనెదరు. దైవ మతమైనచో అందలిమతమున్నూ యొకటిగానేయుండవలయును. అటుల కానుపించుటలేదు. వేదమతముని చెప్పినచో యిదిన్నీ యందరిమత మున్నూ యొకటిగానే యుండవలయును. ఆలాగున కానుపించుటలేదు. ద్వైతాఽద్వైత విశిష్టాద్వైతమతకర్తలు ముగ్గురున్నూ వేదమతానుయాయులలో ముఖ్యులు వేదముయొక్క సత్యమే, సారమే తమ మత మని శంకర, రామానుజ, మధ్వాచార్యులు తెలుపుచున్నారు. అట్లైన అద్వైతమే వేదమతమని శంకరులున్నూ, విశిష్టాద్వైతమే వేదసారమని రామానుజులున్నూ, ద్వైతమే వేదసిద్ధాంతమని మధ్వాచార్యులున్నూ యెట్లు స్థిరపరచిరి? శైవ, వైష్ణవాది భేదములు గలవారనేకులు గలరు. ఒక్కొక్క మతకర్తలు మతప్రబోధము చేయునపుడు మరి యొక్కరు యత్తరిలేనందుచే మనము ఆవిషయమై యేమియునిర్ణయింప జాలము. మతకర్తలు తెలిపినదానిలో విశ్వాసముగలిగి ప్రవర్తించెడు ఆస్తికులగు మానవులే యిప్పుడు లోకములో యెచ్చోట చూచినను కనపడుచున్నారు. త్రిమతస్థులున్ను ప్రమాణములు చూపుచున్నారు. ప్రమాణమునకు కొఱతయేమియు లేదు. ఎవరెవరికే ప్రమాణములు గావలయునో అవి అసంఖ్యాకములుగనున్నవి. నాస్తికులైనవారినిగురించి మనమేమియు చెప్పంబనిలేదు. మరికొందరు ఆస్తికులైన, పై నుదహరించిన త్రిమతస్థుల మతములోను, నాస్తికులైనవారి మతములోను విశ్వాసములేనివారు కొందరు గలరు. వీరు పైజెప్పిన ఆస్తిక, నాస్తిక

మతములుగాక, ఇక యేదైనా మరియొక్క మతము గలదా? యని వెతకుచున్నారు. పైజెప్పిన అస్తిత్వ, నాస్తిత్వములో గూడా వారు విమర్శించి, విమర్శించి మనసులో నిలకడగలుగక పూగులాడుచున్నారు. వీరికి ఒక నూతనమతము యిప్పుడు కావలసియున్నది. ఆ మతమునే శ్రీకృష్ణభగవానుడు 5,000 సం॥ లకు పూర్వము గీతయందుపదేశించెను. ఇది ఆస్తికత్వ, నాస్తికత్వముల రెండింటికన్నా మూడవదగు వారికిన్నీ ఉపయోగపడును. పై జెప్పిన ఆస్తికులుగాని, నాస్తికులుగాని తమమతిలో నుదయమైన దానినే మతమని తలంచినట్లు మనము గ్రహించినచాలును. అప్పుడు సంశయములు, వివాదములు శమించును. అప్పుడు వారలమతము దైవమతమనిగాని, వేదమతమనిగాని నమ్మవలసిన పనిలేదు. పై నిరూపించిన మతకర్తలలో యెవరికి నమ్మకముకలిగియుండునో వారలు ఆయా మతముల ననుసరించి తరించవచ్చును; శాంతిని పొందవచ్చును. అయితే ఆయా మతములననుసరించి ప్రవర్తించువారు తమవల్ల యితరులకు యేదైన బాధగలుగుచుండునా యని చూచుకొనినచాలును. ఇతరులకు బాధగలిగించెడు విషయమేదైన తాననుసరించెడు మతములో యుండిన దానిని పరిత్యజించవలయును. అదే సత్యాన్వేషులయొక్క కర్తవ్యము. ఇది మేధాసంపత్తి గలవారియొక్క లక్షణమగును. సత్యాత్ముల యొక్కయు, న్యాయశీలుర యొక్కయు ధర్మమిదే. అట్లుగానిచో వీరు గూడా మతభ్రాంతిలో చిక్కుకొనినవారే యగుదురు. అపుడు మతము యొక్క లక్షణము వ్యాకరణసూత్రములో చెప్పినది సత్యమని మన హృదయమున స్ఫురించును. అనగా మతిలోకల భావముననే మతమని మనకు స్పష్టపడగలదు. ఆకాశమునుండి వర్షరూపముగా భూలోకమంతయు పడుచుండు శుభ్రమైన వర్షబిందువులు ఒక్కేవిధమైనను భూమియొక్క సారాసారముల ననుసరించి విభిన్నరుచులతో జలమేర్పడినట్లు, వారివారి మనోభావముల ననుసరించి మతముండునని మనకు స్పష్టముగా, అర్థము గాగలుగును. మతి కావలయుండి మతినిగూడా ప్రకాశింపజేయునది దైవము. అచ్చటికి మనము చేరినచో మనకు మతకర్తలలోగల భేదములన్నియు గోచరించును. నిజమైన వేదమత మిది. అది అమృతము, శివము, ఆనందము. తక్కిన భేదమేమైనయుండిన యది

మతకర్తల మనోభావమనియే మనము గ్రహించుకొన్న చాలును. మరి యొక దృష్టాంతముగూడా తెలిపెద. ఒక రేకుపై శుక్ల, కృష్ణ, రక్త, పీత వర్ణములుగల అద్దపుముక్కలను అచ్చటచ్చట అమర్చి రాత్రికాలములో వెనుకప్రక్క నొకదీపము వెలిగించి ముందుభాగమునకు వచ్చి చూచిన యనేకరంగులతో వెలుగుచున్నట్లు జూడగలము. ఈలాగున భిన్నభిన్నముగా వెలుగుటకు కారణమేమని వెనుకప్రక్కకు వెళ్ళి చూచిన ప్రకాశ మొక్కటైనను అద్దముయొక్క రంగుల ననుసరించి తెలుపుగానో, ఎఱుపుగానో, పసుపుగానో, నీలముగానో యుండునట్లు మనము గ్రహించుకొనగలము. ఇదే మతకర్తల యొక్కయు, మతముయొక్కయు సారమని మనము తెలిసికొనగలము. అప్పుడు మనకు పరమానందము గలుగును. అపుడు మతికావలయుండి వెలుగుచున్న దే సత్యస్వరూపమగు దైవము ఆత్మయని మనము తెలుసుకొనగలము. అమృతబిందూపనిషత్తు తెలిపినది చూడుడు:

ఏక ఏవ హి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః ।
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ॥

చంద్రు డొకడైనను జలముయొక్క స్వభావము ననుసరించి, పాత్రభేదము ననుసరించి యనేకచంద్రులు అనేకవిధములుగా యున్నట్లు గోచరించును. ఆలాగున ఆత్మ యన్నిటిలోను యొకటిగా యుండినను అంతఃకరణవృత్తుల ననుసరించి యనేకవిధములుగా కనబడు చుండును. అనగా చంద్రుడు చిన్నపాత్రలో చిన్నదిగాను, పెద్దపాత్రలో పెద్దదిగాను, జలము చలించుచుండిన చంద్రుడుగూడా చలించుచున్నట్లును, జలము ఎఱుపుగాని, నలుపుగాని, తెలుపుగాని యుండిన చంద్రబింబమున్నూ ఆలాగున యున్నట్లు కనబడుచుండును. ఇచట జలమును మనస్సుగాను, చంద్రుని ఆత్మగాను గ్రహించుకొనవలయును.

గవామనేకవర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా ।
క్షీరవత్పశ్యతే జ్ఞానం లిఙ్గినస్తు గవాం యథా॥

గోవులు అనేకరంగులతో, అనేక ఆకృతులతో కూడియుండినను అన్నిటిలోగల పాలు యేలాగున తెల్లగా యుంటున్నవో ఆలాగున మానవులమతులు యనేకవిధములుగా యుండినను మతికి సాక్షియై

యుండు పరమాత్మ యీశ్వరుండు ఒకేరూపముగానే యుండును. ఇదే మతికిన్నీ, మనస్సుకున్నూ, సాక్షియైయుండు ఆత్మకున్నూ అనగా యీశ్వరునకున్నూ గలతారతమ్యము. అనేకత్వములో యేకత్వము కనుగొన్నప్పుడే మనము సత్యమును జూచినవారము కాగలము. మనస్సు, బుద్ధి, చిత్తము యివన్నియున్నూ సంస్కారరూపములు, జడములు. వీనిలో మనము యెంత వెతికినను సత్యమును కనుగొనజాలము. ఈ జడములు యే సత్యముచే, చైతన్యముచే చేతనావంతమై యుంటున్నవో ఆ దైవమును ధ్యానసమాధిలో మనము కనుగొనగలము. అష్టావక్ర మునీంద్రులు యీ సత్యమునే జనకమహారాజున కుపదేశించెను.

నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా।
దృష్ట్వా నిర్వేదమాపన్నః కో న శామ్యతి మానవః॥

తా॥ మహర్షులు, సాధువులు, యోగులు యీ మొదలగు మహాత్ములు ఒకరిమతము నొకరు అంగీకరించుటలేదు. అనగా వీరలలోగూడా అభిప్రాయభేదము గలదు. అందువలన యిట్టి భిన్న భిన్న మతములను చూచి వాటియందు విసుగుజనించినవాడై స్వయముగా ఈమహాత్ముల మతములను యే పరమాత్మ ప్రకాశింపజేయుచున్నదో అట్టి యాత్మను కనుగొనదలంచి యత్నించువాడు యీ జన్మములోనే పరమశాంతిని ఆనందమును, మోక్షమును పొందగలుగును. గీతయందు ద్వితీయాధ్యాయమున యీ సత్యమునే శ్రీకృష్ణభగవానుడు తెలిపెను.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥

తా॥ ఓ అర్జునా! ఎప్పుడు నీయొక్క ఆత్మ అజ్ఞానము నెడుకల్మష మనస్సును దాటగలదో, అప్పుడు వినదగిన యర్థమున్నూ, వినినయర్థమున్నూ అవగాహనము గాగలుగును. అనగా మీ యాత్మ మనోబుద్ధ్యాదుల నెప్పు డతిక్రమించునో యప్పుడే యిదివరలో శాస్త్రముల చేతను, గురువులచేతను శ్రవణము జేసినదానియొక్క అర్థమును పొందగలవు. అపుడు దీనికన్న యిక వినవలసినది గాని పొందవలసినది గాని మరియొకటి లేదని బోధపడగలదు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ॥

తా॥ బ్రహ్మాది స్తంభపర్యంతము గల సకలోపాధుల యందు నుపాధిభేదముచే వేరుగానున్నను, పరమార్థ జ్ఞానముచేత నొక్కటే యగు ఆత్మయే నేనని తెలిసికొనుము. ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞానమేదిగలదో, అదే నిజమైన జ్ఞానమని నామతము. కావున శ్రీకృష్ణభగవానుని మతమే సర్వమతములయొక్క సారము. పై జెప్పిన గీతావాక్యముల రెండింటినిగురించి యాలోచించిన మతిని దాటిపోయిన తర్వాతనే వేదమతము, దైవమతము, ఆత్మమతము మనము దర్శింపగలము. అపుడు తక్కిన మతములన్నియు మతిని (మనస్సును), భావమును సంబంధించినదని మనము స్పష్టముగా తెలిసికొనగలము. అపుడు వ్యాకరణసూత్రము నిర్ణయించిన నిర్మలమతమును పొందగలము. ఆస్థితిలోనికి మనము వెళ్లువరకు మనము బానిసలమే, అస్వతంత్రులమే. అంతవరకు స్వరాజ్యము మనకు వచ్చినను స్వారాజ్యము యింకనూ రాలేదనియే తలంచవలయును. స్వరాజ్యము యిప్పటికి గలిగియుండే వారు గూడా పరాధీనులే, స్వతంత్రులుకారు. ఐతే యీ వాక్యమును మీరు మనస్సంబంధబుద్ధితో ఆలోచించిన భయమును పొందగలరు. ఆత్మబుద్ధితో యాలోచించిన దీనియొక్క సత్యము తెలిసికొనగలరు. అప్పుడే మీరు స్వతంత్రులున్నూ, నిర్భయులున్నూ కాగలరు. అంతవరకు భయము మిమ్ములను బాధించుచునే యుండును. అయితే మానసిక బుద్ధితో, దేహబుద్ధితో యీ సత్యమును మీరు భావించవలదు. అంతే కాదు, అది ప్రమాదమును, అపాయమునుగూడా కలుగజేయును. కావున యీ మార్గములో నడచువారు మనోబుద్ధ్యాదులకు సాక్షియగు ఆత్మయే తానని ధైర్యము కలిగి యుండవలయును. కావుననే శ్రుతి "ద్వితీయాద్వై భయం భవతి" అని యుపదేశించుటకు కారణము. కావుననే శ్రీరామచంద్రుడు, హనుమంతునికి జ్ఞానోపదేశము జేసినతరువాత యిప్పుడు నీకు కలిగిన జ్ఞానమేదియని అడిగినపుడు ఆంజనేయుడు యీ క్రిందివిధముగా జెప్పడమైనది:

దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః।
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం ఇతి మే నిశ్చితా మతిః॥

---

ఓమ్

## ఆహారశుద్ధి

ఆహారశుద్ధినిగురించి చెప్పునప్పుడు సాత్వికాహారమని చాలా మందిన్ని తెలిసికొనియున్నారు. అయితే వస్తువుమాత్రము సాత్వికముగా ఉండిన చాలదు. అది వచ్చినమార్గముగూడ సత్యముగా వుండవలయును. అంతతోను తృప్తిపొందకూడదు. యుక్తముగాను భుజించవలయును. అనగా సత్యార్జితమయిన ధనముచేత శుద్ధమైన వస్తువునుకొని భుజించునప్పుడే సాత్వికాహారమగును. అన్యాయార్జితమగు డబ్బుచే శుద్ధమగు పాలు, పండ్లు, గోధుమపిండి, చక్కెర, బియ్యము మొదలయినవి కొని భుజించినను అది సాత్వికాహారము కాజాలదు. అట్టిది పాపాహారము తామసాహారమేయగును. అలాగున ఇతరులచే కాయకష్టము చేయించి సరియైన కూలియివ్వక దానివల్ల పండించి ధాన్యముగాని, ఫలవర్గములు గాని భుజించుటయు పాపాహారములో (అనగా తామసాహారములో) చేరినదేయగును. దీనితోనూ సాత్వికాహారము పూర్తికాదు. తాను చేయవలసిన ఉద్యోగము అనగా పనిగాని సరిగాచేయక దానివల్లవచ్చెడు జీతముచే శుద్ధాహారముకొని భుజించుటయు తామసాహారమేయగును. ఇదిన్నిగాక పైజెప్పిన సత్యార్జిత ధర్మముచే శుద్ధవస్తువునుకొని భుజించినను అదిన్ని నియమముగాభుజించవలెను. అనగా నియమితకాలములో నియమప్రకారము మాత్రమే తినే స్వభావము కలిగి యుండవలెను. అదిన్ని దైవారాధనచేసిగాని, లేక దైవధ్యానముతో భుజించవలెను. మరియు పంచయజ్ఞమున విధింపబడిన అతిథిసత్కారము కలిగియుండవలెను. అప్పుడే శుద్ధమైన సాత్వికాహారమనంబడును. ఈ విషయమై గీత. అ. 2 శ్లో॥ 59 లో చెప్పినది చూడుడు.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥

దీనికి ఆహారవిషయమై శ్రీ శంకరభగవత్పాదులు చెప్పిన అర్థము చూడుడు.

విషయాః=విషయశబ్దవాచ్యాని ఇంద్రియాణి అథవా విషయా ఏవ. నిరాహారస్య=అనాహ్రియాణ విషయస్య విషయ శబ్దవాచ్యము లగు నింద్రియములు లేక యింద్రియార్థములు-విషయములను గ్రహించ నట్టివాడు నిరాహారుడనంబడును.

ఇంద్రియార్థములనగా యింద్రియముల విషయములు. ఇచట శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములని గ్రహించేది. వానికి యింద్రియ ములు కర్ణ, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణములు, స్థానములు జిహ్వేంద్రి యమునకు రసమేలాగున విషయమైయుండునో ఆలాగున కర్ణేంద్రియ మునకు శబ్దము, త్వగింద్రియమునకు స్పర్శము, నేత్రేంద్రియమునకు రూపము, రసనేంద్రియమునకు రసము, ఘ్రాణేంద్రియమునకు గంధము విషయములు. ఈ ఐదింద్రియములున్ను తత్తద్విషయములను గ్రహింపక వుండవస్థయే నిరాహారమగును. జిహ్వతో భుజించెడు ఆహార మొకటి మానుటవల్ల నిరాహారుడు కాజాలడు. పై జెప్పిన నాలుగింద్రియముల విషయములనుగూడ గ్రహింపకున్నప్పుడే నిజమైననిరాహారుడగును. ఇట్టి సంయమియే నిజమైన విరక్తుడగును. సాత్వికాహారమును గురించి హఠ యోగ ప్రదీపికయందు చెప్పినది చూడుడు.

శ్లో॥ గోధూమశాలియవయాష్టికశోభనాన్నం
క్షీరాజ్యఖండ నవనీతసితామధూని।
శుంఠీపటోలకఫలాదికపఞ్చశాకా
ముద్గాదిదివ్యముదకం చ యమీంద్రపథ్యమ్॥

తా॥ గోధుమ, బియ్యము, యవలు, శుద్ధమైన యన్నము, నెయ్యి, కలకండ, వెన్న, చెక్కెర, తేనె, శొంఠి, పొళ్ళ, పంచశాకము తిప్పతీగె, పెసలు, శుద్ధోదకమనునవి సాత్వికాహారములు. గీతయందు తెలిపినది చూడుడు.

శ్లో॥ ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్వికప్రియాః॥

ఈ శ్లోకమందు పదార్థములపేర్లు చెప్పలేదు. హఠయోగ ప్రదీపిక యందు చెప్పినదే పదార్థములని గ్రహించేది. గీత. అ. 4-వ శ్లో॥ 31లో యుక్తాహారమును గురించి చెప్పినది చూడుడు.

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనం।
నాయం లోకో౽స్త్యయజ్ఞస్య కుతో౽న్యః కురుసత్తమ॥

తా॥ ఓ అర్జునా! అతిథియజ్ఞము అనగా అతిథిసత్కారముచేసిన తరువాత భుజించిన అది అమృతసమానముగా నుండును. అందువలన శాశ్వతమైన బ్రహ్మమును పొందుచున్నారు. అట్టి అతిథియజ్ఞము చేయనివానికి ఇహలోక సుఖముగూడ ఉండదు. ఇట్లుండగ పరలోక సుఖమెక్కడిది? అ. 3. శ్లో॥ 13.

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।
తే త్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్॥

పంచయజ్ఞములలో ఏదయిన ఒక యజ్ఞము అనగ భగవదారాధన గాని, భగవద్ధ్యానముగాని చేసిన తరువాత మిగిలిన అమృతమయమగు అన్నమును భుజించెడు సత్పురుషులు సమస్తపాపములనుండి విడువబడు చున్నారు. ఎవరు తాముమాత్రము భుజించుటకై వంటచేసికొను చున్నారో, అట్టివారు పాపులు. వారు భుజించెడి అన్నము అన్నము కాదు. మరి ఏమన పాపమే. ఈ పంచయజ్ఞముల విధానము గృహస్థా శ్రమ ధర్మమను గ్రంథమందు చూడందగును.

శ్లో॥ ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః।
స్మృతిలాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః॥

తా॥ ఆహారశుద్ధివల్ల హృదయశుద్ధి, హృదయశుద్ధివల్ల ఆత్మ జ్ఞానముదయమగును. ఆత్మజ్ఞానోదయమువల్ల హృదయగ్రంథి విమోచ నము కలుగుచున్నది. హృదయగ్రంథుల విమోచనముచేత మోక్షము సిద్ధించుచున్నది. కావున ముక్తిని కోరువారు ప్రప్రథమమున శుద్ధాహా రము భుజించేలాగున చూడవలయును. ఈ విషయమై శ్రుతివాక్యమును చూడుడు.

శ్లో॥ ఆహారశుద్ధౌ చిత్తస్య విశుద్ధిర్భవతి స్వతః।
చిత్తశుద్ధౌ క్రమాత్ జ్ఞానం త్రుట్యన్తి గ్రంథయస్స్ఫుటమ్॥

దీని యర్థము పైన తెలిపినదే. మానవునికి స్థూల సూక్ష్మము లనెడి రెండు దేహములు గలవు. కారణదేహమను మరియొకటి యుంటున్నది. అది వ్యావహారికముకాదు. అవ్యవహారము. వ్యవహారములో స్థూల సూక్ష్మములు రెండుమాత్రమే గలవు. ఇప్పుడు ఆహారముచే స్థూలదేహము ఇంద్రియములు మాత్రమే శుద్ధములగును. హృదయ శుద్ధికి ఈ యాహారము కొంతమాత్రమే సహాయపడును. అది భావనా రూపము. అనగా సంకల్పరూపము. అది భావనచేతమాత్రమే పవిత్రమగును. శుద్ధాహారము దేహేంద్రియశుద్ధిని కలుగజేయునట్లు శుద్ధ భావనవల్ల సూక్ష్మదేహము పవిత్రము కావలసియుండును. అది కరుణ, శాంతము, అధ్యయనము, ప్రేమ, దైవభావము, సర్వాత్మలు తన యాత్మయు యొకటే యను సమత్వముచేతను, ఆత్మస్వరూప భావన చేతను లేక దైవోపాసనచేతను సూక్ష్మదేహము పవిత్రమగును. అప్పుడు వీధిలోపెట్టియుండు లాంత్రయొక్క అద్దమున్ను లోపలయుండుచిమ్నియు శుద్ధమైనచో దీపమేలాగున బాగుగా వెలుగుచుండునో ఆలాగున ఆత్మజ్ఞానమున్ను స్వచ్ఛముగా వెలుగుచుండును. అనగా ప్రకాశించును. అద్దము శుద్ధపడినను చిమ్ని శుద్ధముకానిచో దీపమెట్లు ప్రకాశించదో గ్లాసు నిర్మలముగా నుండినను అద్దము పొగపట్టియుండిన జ్యోతి యెట్లు వెలుగదో ఆలాగున ఆహారశుద్ధి యొకటి చాలదు. ఆత్మశుద్ధియు గలిగియుండవలయును. ఆత్మశుద్ధి గలిగిన చాలదు. ఆహారశుద్ధియు గలిగియుండవలెను. కావుననే కొందరికి శుద్ధాహారము గలిగియుండినను ఆత్మజ్ఞానము గలుగకపోవుటకున్ను, కొందరికి ఆత్మ శుద్ధమైనది జ్ఞానమైనదను విచారణచేత తెలుసుకొనినను ఆత్మజ్ఞాన మనుభవమునకు రాకపోవుటకున్ను కారణమని గ్రహించేది. కావుననే "శుద్ధిద్వయం మహాత్మ్యార్యం దేవానామపి దుర్లభం" అని శాస్త్రము చెప్పుటకు కారణము.

---

ఓమ్

# సన్న్యాసికి ప్రతిబంధములు

## 1. మే ధా తి థి

శ్లో॥ ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్యసంగ్రహః ।
దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్॥ 1

తా॥ 1. ఆసనము, 2. పాత్రలోపము, 3. సంచయము, 4. శిష్యసంగ్రహము, 5. దివాస్వాపము. 6. వృథాలాపము అను నీ యారును సన్న్యాసికి ప్రతిబంధములు. సన్న్యాసులైనను, విరక్తులైనను బ్రహ్మనిష్ఠులైనను యొకే యర్థమని గ్రహించుకొనవలయును. ఈ చెప్పిన యారుదోషములయొక్క స్వభావము నా ఋషి చేతనే వివరింపబడెను.

శ్లో॥ ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే।
వర్షాభ్యోఽన్యత్ర యత్ స్థానం ఆసనం తత్ప్రకీర్తితమ్॥ 2

తా॥ గ్రామములో యొక దినముకంటే, పట్టణములో ఐదు దినములకంటే అధికకాలము నిలవడమును, వర్షాకాలము నాలుగు మాసములలో తప్ప నితరకాలములయందొకచోట విశేషకాలము నిలచుటయును ఆసన మనబడును. అనగా ఆసనలోపమగును.

శ్లో॥ ఉక్తాలాబ్వాదిపాత్రాణాం ఏకస్యాపి న సంగ్రహః ।
భిక్షోర్భైక్ష్యభుజశ్చాపి పాత్రలోపస్స ఉచ్యతే॥ 3

తా॥ సన్న్యాసియగువాడు భిక్షాన్నము భుజించునప్పటికి శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ మొదలైన పాత్రలలో నొకదానినైన గ్రహించకపోవుట పాత్రలోపమని చెప్పబడును.

వి॥ సన్న్యాసికి, త్యాగికి సొరకాయబుఱ్ఱ, కమండలము, వెదురు పాత్ర, కఱ్ఱతో చేయబడిన పాత్రయు, మట్టిపాత్రయు శాస్త్రములో విధించబడ్డమైనది. లోహపాత్రలుకూడదు. ఏలన దానినిజూచి యెవరైన నపహరించుకొనవచ్చును. అందువలన నిషేధించబడ్డమైనది.

శ్లో॥ గృహీతస్య తు దండాదే ద్వితీయస్య పరిగ్రహః ।
కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః॥ 4

తా॥ దండకాషాయాదులను పరిగ్రహించి, అవి ఖిలమైనతర్వాత తిరిగి ధరించుటకుగాను రెండు మూడు దండములను, కాషాయవస్త్రాదులను సంపాదించి పెట్టుకొనుట సంచయమనబడును.

వి॥ పూర్వకాలము సాధువులకు, సన్న్యాసులకు మెచ్చుటజూచి వను ధర్మముల నిచ్చువారుండిరి. అప్పుడు డబ్బుతో వారికి పనిలేదు. ఎప్పుడు బస్సు, రైలు, సినిమా, కాఫీహోటలు వచ్చినవో అప్పటి నుండి డబ్బుతో సంబంధ మేర్పడినది.

శ్లో॥ శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః ।
శిష్యాణాం న తు కారుణ్యాత్ స జ్ఞేయశ్శిష్యసంగ్రహః॥ 5

తా॥ శుశ్రూష, లాభము, పూజ, కీర్తి వీటినపేక్షించిశిష్యులను చేర్చుకొనుట శిష్యసంగ్రహమనబడును. కేవలము దయచేత శిష్యులను కృతార్థులను జేయవలెననెడి యిచ్ఛచేత చేర్చుకొనుట శిష్య సంగ్రహమని జెప్పబడదు.

వి॥ సేవకొఱకున్ను, లాభముకొఱకున్ను, పూజ్యతకొఱకున్ను, కీర్తికొఱకున్ను పరిపక్వములేని శిష్యులను జేర్చుకొనుట శిష్యసంగ్రహదోషమగును. కేవలము శిష్యులపై దయగలిగి వారలను నుద్ధరించుకొను తలంపుతో చేర్చుకొనుట శిష్యసంగ్రహదోషముగ గణింపబడదు.

శ్లో॥ విద్యా దినం ప్రకాశత్వాత్ అవిద్యా రాత్రిరుచ్యతే।
విద్యాభ్యాసే ప్రమాదో యః స దివాస్వాప ఉచ్యతే॥ 6

తా॥ బ్రహ్మవిద్య ప్రకాశస్వరూపమైనందున దివా యని జెప్పబడును. అజ్ఞానము అప్రకాశమైనందున రాత్రి యనబడును. ఉపనిషద్విద్యయ నెడి పగటియందు ప్రమాదము గలిగియుండుటయే దివాస్వాపమనబడును.

వి॥ దివాస్వాపమనగా పగలు నిద్రించుటయని యర్థము. ఉపనిషద్విద్యలను చదువకయుండుట యేదికలదో, దానికి పగటినిద్రయని పేరు. అట్టి స్వభావము కలిగియుండకూడదు. ఆలాగున చేయకపోవుట దివాస్వాపమను దోషము కలుగును. ఇది యంతరార్థము. బాహ్యార్థమున పగలు నిద్రపోకూడదని గ్రహించుకొనవలయును. పగటివేళ నిద్రపోవుట

వలన రాత్రిలో నిద్ర తగ్గిపోవును. రాత్రిలో సరిగా నిద్రలేనిచో నారోగ్యమునకు భంగకరము. పగలు నిద్రపోవుటయు ఆరోగ్యమునకు భంగకరము. అదిన్నిగాక యేమియు పనిలేక సోమరితనము గలవారే పగలు నిద్రపోవుదురు. ఇది విరక్తులకు దగదు.

శ్లో॥ ఆధ్యాత్మికం కథాముక్త్వా భైక్షచర్యాం గురుస్తుతిం ।
అనుగ్రహోత్పథి ప్రశ్నే వృథాలాపస్స ఉచ్యతే॥ 7

తా॥ అధ్యాత్మవిషయమైన కథలను, దేహాధారణార్థమైన భిక్షాచరణయందు 'భిక్షాం దేహి' అను శబ్దోచ్చారణమును, పరమేశ్వర స్తవమును, గురుస్తోత్రమును, వీటినిమాత్రము సన్యాసి చేయవలయును. వీటికంటె నితరములైన లోకసమాచారముల ననుగ్రహముచేతనైనను నితరులతో సంభాషించినచో, అది వృథాలాపమని జెప్పబడును. ఇట్లు చేయుటవలన వృథాలాపమను దోషము సంభవించును.

వి॥ ఆధ్యాత్మిక జ్ఞానవిషయముతప్ప నితరులతో మాట్లాడుటవలన వృథాలాపమను దోషముకలుగును. కనుకనే మంచి బ్రహ్మనిష్ఠులదగ్గరికి యెవరైన వెళ్ళి లోకవ్యవహారములు మాట్లాడునపుడు వ్యర్థముగ మాట్లాడకూడదని జెప్పుటకుకారణము. ఈషడ్ధర్మములను బ్రహ్మనిష్ఠులు గ్రహించుకొనవలయును. యతిపాత్రల విషయమై లివ శ్లోకములో నిరూపించినదానినిగూర్చి మనుమహర్షి జెప్పినది జూడుడు—

శ్లో॥ అలాబుం దారుపాత్రం చ మృణ్మయం వైదళం తథా ।
ఏతాని యతిపాత్రాణి మనుస్స్వాయంభువోఽబ్రవీత్॥ 8

తా॥ 1. సొరకాయబుఱ్ఱ, 2. కఱ్ఱతో చేయబడిన కమండలము, 3. మట్టితో చేయబడిన కమండలము, 4. వెదురుగొట్టము ఇవి యతిపాత్రములని స్వాయంభువ మనువుజెప్పెను. టెంకాయబుఱ్ఱయు, కమండలముగూడ పై జెప్పిన వాటితో సంబంధించినవి.

వి॥ లోహసంబంధ పాత్రలుండిన యాత్ర జేయునపుడు, సత్రములో పండుకున్నపుడును, ప్రత్యేకస్థలమున ధ్యానము జేయునప్పుడును యెవ్వరైన నెత్తుకొనిపోవుదురని సంకల్పము గలుగును. ఇది యాత్ర జేసినవారికి ననుభవము.

ఓమ్

# సంస్కారం

ప్రపంచములో ఏవస్తువున్నూ సంస్కరింపక ఉపయోగపరచుట లేదు. ఎంతస్వల్పవిలువగల వస్తువైనను సంస్కరింపబడుటవలన విలువ గలుగుచున్నది. అంతేగాక సంస్కరించుటవల్ల అది మరియొకవస్తువుగా పరిణమించుటగూడగలదు. కావుననే సంస్కారము గలిగియుండవలయు ననియు, సంస్కరింపబడవలయుననియు మామూలుగా చెప్పుటకు కారణయు. ఇచట ఆత్మసంస్కారమునుగురించి, అనగా మనస్సంస్కారమును గూర్చి అని గ్రహించుకొనవలయును. మలినసంస్కారముగలజీవులు, శుద్ధ సంస్కారముచే పరిశుద్ధులగుచున్నారు. కావుననే సామాన్యవిద్యార్థులు గాని, ముముక్షువులుగాని సంస్కారమువల్ల మిక్కిలి పరిశుద్ధులగు చున్నారు. ఉత్తమ గురుకులములోను శిక్షితులైన విద్యార్థులనుచూచి ఓహో! ఎంతసంస్కారముగలవారైనారు, జన్మమేమారిపోయినదనియును, ఎంతసంస్కారముగలవారైనారు, మంచి బ్రహ్మనిష్ఠులగు ఆ గురువరేణ్యులు ఎంతగొప్పవారు అని లోకములో చెప్పుటకుకారణము. ఇచట ఆత్మసంస్కారమనగా బుద్ధిసంస్కారమనియు, మనస్సంస్కారమనియు గ్రహించుకొనవలయును. కేవలాత్మస్వరూపము శుద్ధజ్ఞానైకస్వరూపము, పరమాత్మస్వరూపము, పరబ్రహ్మస్వరూపము. దానినిసంస్కరించుకొన వలసినదిలేదు. అది నిర్వికారస్వరూపము. ప్రాకృతవస్తువునకే సంస్కారము చెల్లును. ప్రాకృతవస్తువు పరిణామముగలది. అనగా మార్పుగలది. మార్పుగలదానికి నిత్యత్వము లేదు. ఆత్మ నిత్యశుద్ధ స్వయంప్రకాశము. దానికి పరిణామము చెప్పినచో, తప్పక అట్టి ఆత్మయున్నూ నశించును. అప్పుడు దానికి నిత్యత్వము సిద్ధించదు. అయితే ఆత్మ అట్టి శుద్ధజ్ఞాన స్వరూపమైనను అంతఃకరణపరిణామము ననుసరించియే సామాన్యజనులు తెలుసుకొనగలరు. దీనికి అధ్యాసమని వేదాంతశాస్త్రములో చెప్పబడినది. ఇది ప్రతివారున్నూ అంగీకరించియేతీరవలయును. అగ్నికి ప్రకాశమే స్వరూపముగాయుండినను, ధాతువులననుసరించిగాని గ్లానులననుసరించి గాని అది శుక్ల, కృష్ణ, రక్త, పీతవర్ణములతో ప్రకాశించుచుండును. మీరెవ్వరైనను ఒక రేకుపైన శుక్ల, కృష్ణ, పీత, రక్తములగు అద్దపు ముక్కల నమర్చి రాత్రికాలమున వెనుకప్రక్క ఒక దీపమును వెలిగించి

పెట్టిచూచిన అద్దపుముక్కల ఎఱుపు, నీల, పసుపు, తెలుపు రంగులుగానే మీకు కనుపించును. వెనుకప్రక్క వెళ్ళిచూచినచో, దీపము స్వయం ప్రకాశమైయుంటున్నది. అనేకరంగుల అద్దపుముక్కల రంగుల ననుసరించియే భిన్న భిన్నములుగా ప్రకాశించుటకు కారణమని మీరు తెలుసుకొనగలరు. ఆలాగున మనోబుద్ధి, వృత్తుల, గుణములతో కూడియే ఆత్మను చూడగలరు. మనోబుద్ధి చిత్తవృత్తుల కతీతమగు స్థానములోనికి వెళ్లునపుడు ఆత్మ శుద్ధజ్ఞానస్వరూపమనియు, అమృతస్వరూపమనియు, ఆనంద స్వరూపమనియు ముముక్షువులు తెలుసుకొనగలరు. అయితే మనోబుద్ధీన్ద్రియాదివృత్తులు శుద్ధములుకానిచో యెవరునూ అచ్చోటికి వెళ్ళజాలరు. ఒక అర్కికేన్ లైటుకు మీరు నీలరంగుగల చిమ్నీని పెట్టి చూడుడు. అత్తరి దీపముగూడా నీలరంగుగానే కనుపించును. దానినితీసివేసి ఎఱుపు చిమ్నీని పెట్టి చూడుడు. దీపముగూడా ఎఱ్ఱగా కనుపించును. దానిని తీసివేసి తెల్లని చిమ్నీ పెట్టిచూచిన దీపము స్వచ్ఛముగాకనుపించునటుల ఎఱుగగలరు. ఆలాగున దీపావళిపండుగ, ఉత్సవము, వివాహకాలములలో మతాపు మొదలైనవి కాల్చుదురు. అవి కొన్ని ఎఱ్ఱగాను, కొన్ని నీలముగాను, కొన్ని తెల్లగాను మీకు కానుపించును. ఆ విభిన్నరంగులన్నియు ధాతువుల ననుసరించి యేర్పడినవేగాని మరియొకటి కాదని సత్యము నెఱుంగగలరు. కావుననే ఉపనిషత్తులలో

"అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బభూవ॥"

దీని అర్థము పైనిరూపించినదే. ఆలాగున ఆకాశమునుండి వర్షరూపముగా కురియుచుండు జలము అంతటయు ఒకేవిధముగా నుండినను భూసారము ననుసరించి కొన్నిస్థలములలో జలము ఉప్పుగాను, ఒగరుగాను, చేదుగాను, తీపిగాను, గంధకరూపముగాను, నీలముగాను, పచ్చగాను, స్వచ్ఛముగాను, సుగంధముగాను, దుర్గంధముగాను కనపడుచుండును. ఆలాగున పరిణామమును పొందుటకు కారణము ఆ యా ప్రదేశములలోగల ధాతువుల ననుసరించియే యని మీకు తెలియుట లేదా? మరలా సూర్యకిరణముచే తపనముగలుగునపుడు అన్నిటిలో గల జలాంశము ఆవిరిరూపములో పరిణామము పొందినపుడు మొదట వుండిన

మేఘజలమువలె అగునపుడు మొదటి యవస్థను పొందుచున్నది. ఆలాగున అనేకగుణములతో పరిణామము పొందిన జీవుడు మరలా ధ్యానము చేత శుద్ధమగు జ్ఞానమయమగు ఈశ్వరాకారము పొందుచుండును. ఇది యేజీవేశ్వరైక్యమనియు, ఆత్మపరమాత్మల ఏకత్వమనియు గ్రహించుకొనవలయును. అయితే సూర్యకిరణముచే తపించి వాయువుచే శుద్ధపడు వరకు జలము మేఘరూపముగా పరిణమింపజాలదు. ఆలాగున ప్రకృతి గుణము లుండువరకు జీవుడు శివత్వమును, ఆత్మ పరమాత్మను పొందజాలదని గ్రహించుకొనవలయును. ఇదే యిపుడు కొందరివేదాంతులలో గల ప్రమాదమునకు కారణము. సంస్కారము, పరిణామము అంతఃకరణ ధర్మములేకాని ఆత్మకు పరిణామముగాని సంస్కారముగాని లేదనియు, పరిణామసంస్కారగుణములకు ఆత్మసాక్షియనియు వచింతురు. అయితే మనస్సులో బుద్ధిలోగల గుణములు రహితముకానిచో గుణముల కతీతావస్థను పొందక ఎవరున్నూ ఆ పరబ్రహ్మను పొందజాలరు. అట్టి అమృతమయమగు పరబ్రహ్మస్థితి పొందినచో అదే "బ్రహ్మాస్మి" యని అనుభవ జ్ఞానము గలిగినచో, ఆరూఢస్థితికలిగినచో, పరబ్రహ్మస్థితియందు నిలకడ గలిగినచో మరల ఆ నిర్మలాత్మనుండి దైవాత్మనుండి అతనికి గలుగుచుండు భావములన్నియు దైవమయముగాను, అమృత మయముగాను, ఆనందమయముగాను వుండునని తెలుసుకొనవలయును. వేదాంతశాస్త్రములలోగల కీలకమిదియే. అనేకరంధ్రములుగల ఒక ఘటములో దీపము వెలుగుచుండిన అన్నిరంధ్రములద్వారా ఆ ప్రకాశ మేలాగున వెలువడు చుండునో ఆలాగున హృదయమందు జ్ఞానజ్యోతి వెలుగుచుండిన అతని అన్ని యింద్రియముల ద్వారా జ్ఞానమయ, అమృతమయ, ఆనందమయ స్వభావములే వెలువడుచుండును. ఆలాగున ఒకమట్టిదుత్తయందు ఒకరు తేనె తెచ్చినచో క్రింద పైన ప్రక్క రంధ్రములు చేసినచో అన్నిద్వారములద్వారా ఆ మధురమైన తేనె కారుచుండును. కాని మరియొక చేదు, ఒగరు, పులుపు, కారము రాకూడదుగదా! వచ్చినచో అది అసలు తేనె కాదనియు, కలితీగల తేనెయని యెట్లు గ్రహించుచున్నారో, ఆలాగుననే ఆత్మజ్ఞానముచే అమృతత్వము పొందిన మహాత్ముని మనోవాక్కాయములద్వారా జరుగుచుండు క్రియలన్నియు అమృతమయ, ఆనందమయముగా నుండునని గ్రహించుడు.

కావుననే శంకరాచార్యులు —

"కానోఽపాధివశాదేవ జాతినామాశ్రమాదయః।
ఆత్మన్యారోపితా స్తోయే రసవర్ణాది భేదవత్॥"

అని నుడివిరి.

(శ్రీ) దక్షిణామూర్తి స్తోత్రమును గాంచుడు.

శ్లో॥ నానాచ్ఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాది కరణద్వారా బహిఃస్పన్దతే।
జానామీతి యమేవ భాన్తమనుభాత్యే తత్సమస్తం జగత్
తస్మై (శ్రీ)గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే॥

అందువల్లనే శాస్త్రములలో 'జన్మనాజాయతేజంతు స్సంస్కారాద్ద్విజ ఉచ్యతే' జన్మించినపుడు జంతువులవలే మనుష్యులుగూడా పుట్టుచుందురు. సంస్కారముచేత ద్విజత్వము, బ్రాహ్మణత్వము, బ్రహ్మత్వము గలుగునని చెప్పుటకు కారణము. ఇదేవిధముగ 'జన్మనాజాయతేశూద్రః సంస్కారాత్ ద్విజ ఉచ్యతే' అని ప్రమాణశ్లోకము గలదు.

మరియు సంస్కారముచే ఒకవస్తువు మరియొక వస్తువుగా మారిపోవుచుండును. 'భేజేభ్రమరకీటవత్' తుమ్మెద పచ్చపురుగుల తీసుకొని గూటిలోపెట్టి ఝుంకారము అనగా ఓంకారము ఉచ్చరించి పురుగును తుమ్మెదగా మార్చుచుండును. ఇదియే సంస్కారముయొక్క నిజార్థము. అలాగున గురుదేవుడు జీవుని తత్త్వమసి మహావాక్యముచేతను, ప్రణవార్థ ప్రబోధముచేతను శివుడుగా చేయుచున్నాడు.

శ్లో॥ భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా।
పుమాం స్తద్ధి భవే చ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్॥

తా॥ నిశ్చయబుద్ధిగలవానిచేత, నేవస్తువు తీవ్రవేగముచే భావింపబడుచున్నదో, ఆ జ్ఞేయవస్తువుగా భ్రమరకీటకమువలె నగుచున్నాడు. ఈదృష్టాంతముగూడ సామాన్యము. మందబుద్ధిగలవారు గ్రహించుటకీలాటి ప్రమాణములను మహనీయులు వచింతురు. ఇచ్చట పురుగు తుమ్మెదై మారువిధమున ఆత్మవిషయములో లేదు. తన స్వరూపము తెలియకుండుటే యీ అజ్ఞానము నివర్తించుటచే జ్ఞానప్రాప్తి. మరియు

పుల్లని మామిడిచెట్టునకు మధురమైన అంటుమామిడిచెట్టునుకట్టి మధుర ఫలమును కలుగజేయుచున్నారు. ఇదే అంటుమామిడిచెట్టుయొక్క రహస్యము. ఆలాగున చెడుసంస్కారము గల జీవుడు మంచిసంస్కారముచే శుద్ధాత్ముడగుచున్నాడు. అనగా జీవుడే శివుడగుచున్నాడు. సంస్కారము యొక్క సారము సంగ్రహముగా తెలుపడమైనది. పతంజలిమహర్షియు యోగశాస్త్రమందు 'తజ్జస్సంస్కారోఽన్య సంస్కారప్రతిబంధీ' అని నిరూపించిరి. ఇక దీనికన్న పరమప్రమాణము మరి ఏమికావలయును. వశిష్ఠమహర్షియు యోగవాసిష్ఠమందు ఈలాగుననే తెలిపిరి.

శ్లో॥ యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా
అల్పం మూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహం యుతః।
యథైవ హి సువర్ణాది క్షారాదే శ్శోధితం శుభమ్
పూర్వవ న్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః॥

అపరంజి బంగారము, వెండి, రాగి, ఇత్తడి మొదలగు లోహములతో కలియునపుడు తెల్లబంగారమగుచున్నది. స్వల్పవెల గలదగుచున్నది. మరల స్ఫుటము వేయునపుడు అగ్నిద్రావకములో స్ఫుటము చేయునపుడు ఇతర లోహములగు చిలుములుపోయి శుద్ధమగుచున్నదో, అపుడు యేలాగున అపరంజి బంగారము వెలగలదగుచున్నదో, ఆలాగున శివుడే జీవుడు ప్రకృతి స్వభావమగు మూడుగుణములతో చేరునపుడు జీవత్వము ఏర్పడుచున్నది. మరలా, తపోధ్యానాదులచే ప్రకృతి గుణ రహితమగునపుడు బ్రహ్మత్వమును బొందుచున్నాడు. సంస్కారము యొక్క ప్రభావము యిటువంటిదని మరువకుడు. ఇక విజ్ఞులకు ఎక్కువ చెప్పనక్కరలేదు. దీనివల్ల సంస్కారముయొక్క ప్రభావము అందరున్నూ తెలిసికొనగలరు.

విగ్రహమును చేయుటకొఱకు నొకరాతిని దెచ్చి విగ్రహమునకు కావలసిన భాగమునుతీసి రెండవభాగమును అచ్చట పడవేసినచో, రాయి రాయిగాను, పనిచేసిన రాయి ఏలాగున దేవుడుగాను అగుచున్నదో, ఆలాగున సంస్కరింపబడిన జీవుడు శివుడుగాను, సంస్కారము లేని జీవుడు జీవుడుగాను నుండును. అయితే రాయి దేవుడు కావలసియుండిన, శిల్పి ఎంతపనిచేయవలయునో, పనిచేయుకాలములో, ఉలుల

చేత, మొలలచేత, సుత్తులచేత, ఎన్ని దెబ్బలను తినవలసియుండునో, దానియొక్క ఫలితము ప్రతిష్ఠించిన తరువాత క్షీరాభిషేకము, పంచామృతాభిషేకము, సుగంధ చందనలేపనము, పుష్పము, పీతాంబరము, కిరీటము, మొదలగు అలంకారములచేతను, ధూపదీప నైవేద్యాదుల చేతను ఆరాయి పూజను పొందుచుండునో, జీవత్వమునుండి సంస్కరింపబడిన తరువాత, శివత్వమునుండి ఆ మహాత్ముడు లోకములో దేవుని వలె పూజనీయు డగుచున్నాడు. ఈ సత్యమును మీరలు లోకములో చూచుచున్నారు గదా! విగ్రహమున కుపయోగపడక పారవైచిన రాయి ఏప్రకారము ఒట్టి రాయిగానే పడియుండునో, అలాగున సంస్కరింపబడని జీవియొక్క స్థితినిన్ని గ్రహించుడు. ఇక దీనికన్న స్థూలముగ నేమిచెప్పవలయును. మఱియు రత్నమైనను సానపెట్టనిచో ఆభరణమునకు ఉపయోగపడని విధమున, స్వర్ణమైన సువర్ణకారునిచే నిప్పులోపెట్టి కాల్చక సుత్తితో కొట్టక, అచ్చులోపెట్టి పట్టకారతో తీగగాలాగనిచో ఆభరణమున కుపయోగపడని విధమునను, ఉత్తమబ్రహ్మనిష్ఠునిచే సంస్కరింపబడని జీవులయొక్కయు, సంస్కరింపబడిన జీవులయొక్కయు, గతి ఉండునని గ్రహించుడు. ఒకానొక మహాపురుషుడు ఇప్పుడు లోకారాధ్యుడై యుండినచో వారియొక్క జీవితచరిత్రను చిన్నకాలమునుండి జరిగినది చదివినచో బాల్యకాలములో ఎంత శాస్త్రాధ్యయనముచేసిరో, గురుసేవచేసిరో, తపమొనరించిరో, వ్రతముసల్పిరో, దివ్యమంత్రజపము గావించిరో, తీర్థయాత్రచేసిరో మీకు అర్థముగాగలదు. మఱియు కొద్ది వెలయిచ్చికొనిన ఉక్కు మొదలగు లోహములచే మంచి గడియారము గాని, సూక్ష్మయంత్రముగాని, స్థూలయంత్రముగాని, చేయునప్పుడు ఏలాగున వేలకొలది రూపాయల విలువగల వగుచున్నవో సంస్కారము యొక్క రహస్య మీప్రకారమున్నదని మరువకుడు. కట్టకడపట మీరు భుజించు అన్నముగాని, ధరించు వస్త్రముగాని ఎంతసంస్కారమునొందిన తరువాత మీరుపయోగపెట్టుచున్నారో యోచించుకొనుడు. మీరు ధాన్యమునుదంచి లేక విసరి బియ్యమునుగాని, పిండినిగానిచేసి రుచికరమగు రసవస్తువులనుకలిపి నిప్పులోవేయించిన తరువాత హృద్యమగు ఆహారమును చేసికొని భుజించుచున్నారు. వడ్లైనను, గోధుమలైనను

ఇతర ధాన్యములైనను సంస్కారము నొందకపోయిన మీరు భుజింప గలరా! ఈలాగున చెప్పిన ఎట్టి మోటువానికిగూడ అర్థముగాగలదు. అలాగున ప్రతిదానిని గురించియు ఆలోచించుకొనుడు.

ఒక దూదిని అలాగున మీరు ధరించగలరా ? మిషనులోవేసి దారముచేసి మగ్గములోవేసి వస్త్రముగాచేసినప్పుడు ధరింపగలరు. ఇక విశేషముగాచేసిన శిరములో టోపీగా ధరింపగలరు. ఒక కట్టెను అనగా కొయ్యను గొడ్డలిచేత, బాడిసచేత, అంపముచేత, ఉలులచేత, తోపిడి చేత సంస్కరింపబడినప్పుడు అది పెట్టె, కుర్చీ, మేజా రూపములై ఇతర పాత్రరూపములై, పరిణామమునొందునప్పుడు ఎంతవిలువగలవై జనుల కుపయోగపడుచున్నవో—దీనినిగూడ నాలోచింపుడు. ఏవిధమైన సంస్కారమును చేయుని ఒట్టిమ్రాను అచ్చటనే పడియుండిన చెదలుతిని మట్టై పోవుటయో లేక కొంచము సంస్కారము గలిగిన గొడ్డలిచేచీల్చి కట్టె లనుగాచేసి పొయ్యిలో మొదలగు దానిలో కాలిపోవుట కుపయోగ పడును. అలాగున ఏవిధమగు సంస్కారము గలుగనివాడు కట్టకడకు చచ్చి దేహము మట్టిలో మట్టైపోవుటయు లేక చితాగ్నిలో దహించి భస్మమైపోవుటయు గలుగును. వారి ఆత్మమాత్రము ఏస్థితిని పొందు చుండెనో మనకు తెలియదు. సంస్కారముగల జీవులయినచో స్వర్గలోకము ఉపాసనామూర్తులగు బ్రహ్మావిష్ణ్వాదుల లోకముల పొందుటయో లేక బ్రహ్మజ్ఞానము గలిగి బ్రహ్మాత్మస్వరూపులై ముక్తిని పొందు చున్నారు. అమృతమయులగుచున్నారు; ఆనందస్వరూపు లగుచున్నారు నిత్యులగుచున్నారు.

---

ఓమ్

# బ్రహ్మ విద్యా ర్హత

శాస్త్రములో కులమును గురించి చాతుర్వర్ణ్యము నిర్ణయించెడిపద్ధతి ఒకటికలదు. గుణమును గురించి వర్ణమును నిశ్చయించెడి మార్గము మరియొకటి యుంటున్నది. కులమును గురించినది కర్మకాండ సంబంధము. గుణమును గురించినది జ్ఞానకాండముతో సంబంధించినది. కర్మకాండముపూర్వపక్షమనియు, జ్ఞానకాండముసిద్ధాంతమనియు, శాస్త్రజ్ఞుల నిర్ణయము. పూర్వపక్షము సిద్ధాంతముచే బాధింపబడును. అయితే ఇచట బ్రహ్మవిద్యాధికారమును గురించిమాత్రమే చెప్పబడునుగాని, సంకరవివాహ భోజనాదులగురించికాదు, అది వారివారియిష్టానుసారము చేసుకొనవచ్చును. వర్తమానయుగమున సంకరవివాహము, సంకర భోజనము మామూలుగా జరుగుచున్నవి. ఆ విషయమై యిప్పుడెవరున్ను యే నిర్ణయమున్ను చేయనక్కరలేదు. గీతాచార్యుడగు శ్రీ కృష్ణభగవానుని ఆశయము చూడుడు.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥

తా॥ మనుజుడు తనతన జాతికి విధించిన కర్మమునందు ప్రవృత్తి గలవాడై ఆత్మశుద్ధిని లేక జ్ఞానమును పొందుచున్నాడు. తనకేర్పడిన కర్మమునందు నిరతుడై ఉండువాడు యెట్లు మోక్షమును బొందుచున్నాడో, లేక ఆత్మశుద్ధిని బడయగలడో దానిని వినుము.

బ్రాహ్మణుడు పౌరోహితవృత్తిని అవలంబించినను క్షత్రియులు ధర్మముగా యుద్ధము చేసినను, వైశ్యులు న్యాయముగా వ్యాపారము చేసినను, శూద్రుడు సేవకావృత్తి నవలంబించినను, మంగలివాడు క్షౌరము చేయుచుండినను, చాకలివాడు అశుద్ధవస్త్రమును ఉతికినను, పాకీపనివాడు మలమును శుభ్రముచేయువాడైనను యీలాటి పనులన్నియు దేహసంబంధము, ప్రపంచసంబంధమునకు సంబంధించినవి. ఇది దేహధర్మమే అగును. ఆత్మధర్మము పైజెప్పిన కార్యములను జేసుకొని అనుష్ఠింపవలసియుండును. దానికి ఆత్మవిద్య అనిపేరు. పైజెప్పిన బ్రాహ్మణ క్షత్రియాదుల దేహధర్మమును వారవలంబించినను ఆత్మ

ధర్మము బ్రహ్మవిద్యాధర్మము పై జెప్పినవానికన్న విలక్షణము. అది నివృత్తిమార్గము. పై జెప్పినది ప్రవృత్తిమార్గము. నివృత్తిమార్గము అన్తఃకరణశుద్ధి, భగవద్భక్తి, ఆత్మవిచారముతో కూడినది. పైన నిరూపించిన చాకలి, మంగలి, పాకీపనిచేయువారైనను పవిత్రహృదయము గలవారైయుండిన వేదాధ్యయనముగాని, ఉపనిషత్ పఠనంగాని గీతా పారాయణంగాని బ్రహ్మవిచారముగాని ప్రణవోపాసనగాని తప్పనిసరిగా చేసుకోవచ్చును. కావుననే శ్రీకృష్ణభగవానుడు పై శ్లోకమున "స్వే స్వే కర్మణ్యభిరతః" అని ప్రయోగించుటకు కారణము. బ్రాహ్మణులలో వసిష్ఠాదులున్ను, క్షత్రియులలో విశ్వామిత్రాదులున్ను, వైశ్యులలో తులాధారులున్ను, శూద్రాదులలో సూతాదులున్ను, కిరాతాదులలో వాల్మీకాదులున్ను, అంతిమజాతులలో తిరుప్పాణిఆళ్వారు నందనారున్ను, తార్కాణము. ఆలాగున స్త్రీలలో మైత్రేయి, సులభ, చూడాల, గార్గ్యాదులున్ను దృష్టాన్తము.

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥

తా॥ యెవనివల్ల సమస్తభూతములకు సంస్కారానుగుణ్యముగా లేక వంశానుసారముగా ప్రవృత్తిగలుగుచున్నదో, యెవనివల్ల ఈసమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నదో అట్టి సర్వేశ్వరుని మనుజుడు తన గుణమునకేర్పడిన కర్మముచేత ఆరాధించి జ్ఞానమును పొందుచున్నాడు. ఈ నాలుగుజాతులకు జెప్పిన కర్మములలో పాపకార్యముగాని, హింసా కార్యముగాని, అశక్యకారణముగాని, అధర్మకార్యముగాని, యెవరికిన్ని చెప్పియుండలేదు. లోకయాత్రకొరకు ఈ బాహ్య కర్మల చేయుచు మోక్షముకొరకు భగవదారాధన బ్రహ్మవిచారము చేసుకొనవచ్చును. ఏలన వసిష్ఠులు పురోహితకర్మలుచేసియు, జనకుడు రాజ్యపాలన జేసియు, తులాధారుడు వైశ్యవృత్తి నవలంబించియు, విదురుడు, ఉద్ధవుడు, శూద్రకులములో పుట్టియు బ్రహ్మజ్ఞాన సంపన్నులైరి.

శ్లో॥ అహింసా సత్యమస్తేయ మకామ క్రోధలోభతా।
భూతప్రియహితేహా చ ధర్మోయం సార్వవర్ణికః॥

తా॥ అహింస, సత్యము, అపరిగ్రహము, కామరాహిత్యము, క్రోధరహితము, లోభము లేకుండుట, సమస్త భూతములయందు దయ మొదలగు సద్గుణము లన్ని వర్ణములవారికిన్ని, అన్ని ఆశ్రమముల వారికిన్ని, అన్ని మతస్థులకున్ను సమానముగా అనుష్ఠించవలసిన ప్రధాన ధర్మములని శ్రీ శుకులవారు ఆనతిచ్చియున్నారు.

"స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్"

తా॥ ప్రపంచధర్మము ననుసరించి, దేహసంరక్షణార్థము, తన జాతికి సంబంధించిన కర్మను అనగా వృత్తిని జేయుచుండినను పాపమును బొందడు. ఈలాగున విధింపకపోయిన ప్రపంచవ్యవహారము జరుగదు. కావున పై జెప్పినవిధముగా ప్రపంచకార్యమును చేసుకొని భగవద్భక్తి, ఆత్మవిచారణ చేసుకొనిన మోక్షమును పొందవచ్చును.

శ్లో॥ సహజం కర్మకౌన్తేయ సదోషమపి స త్యజేత్।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥

తా॥ ఓ అర్జునా! స్వభావమైన కర్మను హీనముగా తోచినను విడువంబనిలేదు. ఏలన సమస్తకర్మములున్ను, నిప్పుపొగచేతఆవరింపబడి యున్నట్లు దోషముచేత ఆవరింపబడియున్నవి. అగ్ని పొగ లేకయుండదు. పొగఅనుమాలిన్యముచే అగ్ని యేలాగున అశుద్ధముగాక యుంటున్నదో, ఆలాగున కొన్ని కర్మలు కొంతహీనముగా కూడినవైనను, ఆత్మజ్ఞానమునకు దానివల్ల దోషమేమియు గలుగదు. శుక్ల, శోణిత, కఫ, మల, మూత్రాదులతో శరీరము కూడినదైనను, దానియందుగల ఆత్మ యేలాగున శుద్ధముగా, జ్ఞానమయముగా నుంటున్నదో, బాహ్యకర్మల యొక్క స్థితియున్ను ఆలాగున యుంటున్నది. ఎట్టి బ్రహ్మజ్ఞానముగల మహాత్ముని శరీరమైనను, మలమూత్రములతో కూడినదికదా! అందువల్ల తన జ్ఞానము కేలాటి లోపమున్ను లేదుకదా? యజ్ఞాదులు, కర్మలు, పవిత్రములని తలంచినను, వానిలో సమిధలు మొదలగువానిలో సూక్ష్మక్రిములుండుటవల్ల అవిన్ని దోషముతో కూడినవే. ఆలాగున రాజ్యపరిపాలనలో దుష్టనిగ్రహము శిష్టులరక్షణము కల్గియుండుటవల్ల అదిన్ని దోషయుక్తమే. ఆలాగున వ్యాపారమునకు బండ్లు మొదలగునవి కావలసి

యుండుటచే యెద్దులు మొదలైనవానిని బాధించుటయు జరుగును. ఆలాగున వ్యవసాయము పరమపవిత్రమైనను దున్నుట, పారతో చెక్కుట వల్ల అనేక ప్రాణహింసలు జరుగుచుండును. కావున దోషములేని పని సృష్టిలో యేదిన్నీ లేదు. అయితే పంచవిధప్రాయశ్చిత్తములచే ఆ దోషము నశించుచున్నది. అదిన్నీగాక అట్టి కార్యము అనివార్యము. అది లేకుండ యెవరున్ను జీవింపజాలరు.

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥

తా॥ మిగుల నిందితములగు దురాచారము కలవాడైనను, పాప సంకల్పముమాని, ఆత్మస్వరూపుడగు నన్ను సేవించినయెడల అట్టివాడు చక్కని నమ్మకముకలవాడు గనుక శ్రేష్ఠుడనియే తలచవలెను. ఎట్లన యెట్టి మురికిగల వస్త్రమైనను చవుడు సబ్బు మొదలైనవివేసి ఉతికిన వెంటనే శుభ్రమగుటలేదా?

"రోగానివరసాయనం" గొప్పవ్యాధిగలవాడైనను దివ్యౌషధ ముచే ఆరోగ్యముగలవాడగుట లేదా?

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥

తా॥ పై జెప్పినట్టివాడు శీఘ్రముగా ధర్మాత్ముడగుచున్నాడు. శాశ్వతశాంతిని పొందుచున్నాడు. ఓ అర్జునా! నాభక్తుడు నాశము నొందడని ప్రతిజ్ఞచేసి చెప్పుము. అనగా నన్ను ఆనపెట్టి రెండుచేతులను పైకెత్తి పండితసభలో పై జెప్పినవిధముగా చెప్పుమా? అని తాత్పర్యము.

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథాశూద్రా స్తేపి యాంతి పరాంగతిమ్॥

తా॥ ఓ అర్జునా!! ఏకారణమువలన యెవరు పాపజన్మము గల వారు గలరో, అట్టివారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులును, నన్నాశ్రయించి సర్వోత్తమమైనగతిని పొందుచున్నారు. అనగా ముక్తులగుచున్నారు.

### గీ తా మా హా త్మ్య ము

శ్లో॥ మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్।
క్వచిత్స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా॥

తా॥ యెవ్వరైతే మహాపాపములు గలవారు గలరో అట్టివారు గీతాపారాయణపరులైన-చో, తామరాకున నీరు అంటనట్లు పాపములు వారిని స్పర్శింపజాలవు.

---

ఓమ్

## సంసారవృక్ష కుఠారము

ప్రశ్న॥ కుఠారమనగానేమి? ఉ॥ కుఠారమునకు (గొడ్డలియని పేరు) గం(డగొడ్డలియని గ్రహించేది. ప్ర॥ ఈ గొడ్డలి దేనికి? ఉ॥ గొడ్డలియని చెప్పినప్పుడే చెట్టులను లేక అరణ్యమును నఱుకుటకు తగిన ఆయుధమని సామాన్యులకుకూడ అర్థమగుచుండును. అయితే యిచట జననమరణ రూప దుఃఖములతో కూడిన సంసారవృక్షమును లేక అజ్ఞానారణ్యమును నఱుకుటకని గ్రహించవలయును. ప్ర॥ సంసారమనగానేమి? ఉ॥ సంసారమునకు నిస్సారమని ఒక అర్థముకలదు. 'సంసరతీతి' అనగా నిలుకడలేక యెల్లప్పుడును చలించుచున్నదని శబ్దార్థము. మరియు ముందుగ సారవంతముగ కనుపించినను, విచారణచేయుచు రాగా రాగా, నిస్సారమని యేర్పడును. అప్పుడు వేదాంతశాస్త్రములో జెప్పిన నిత్యానిత్య వస్తువివేకజ్ఞాన ముదయించును. చలనమనగా యెప్పుడును నిలుకడలేక తిరుగుచున్నదని సారము. అనగా సృష్ట్యారంభమునుండి నేటివరకున్ను అనేకజన్మములెత్తి అచ్చటచ్చటను నిలుకడలేక యీజన్మమునకు రావడమైనది. ముక్తి అను శాశ్వతమైన, స్థిరమైన స్థానము పొందువరకున్ను యిది యీలాగుననె స్థిరములేక ఒకజన్మనుండి మరియొకజన్మమునకు నడచుచునేయుండును. దానిని గురించి శంకరాచార్యులు చెప్పినది చూడుడు—

"పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్।
ఇహ సంసారే బహుదుస్తారే కృపయా పారే పాహి మురారే॥"

ఇదే దీనియొక్క స్వరూపము. ఉపదేశసాహస్రియందు శంకరులు చెప్పినది చూడుడు:-

శ్లో॥ సుషుప్త్యాఖ్యంతమోఽజ్ఞానం బీజం స్వప్న ప్రబోధయోః।
స్వాత్మబోధప్రదగ్ధం స్యాద్బీజం దగ్ధం యథాఽభవమ్॥

తా॥ సుషుప్తియను తమస్సు స్వప్నజాగ్రదవస్థలకు గారణమగును. దీనినే అజ్ఞానమందురు. స్వప్నమను అంకురమునకును, జాగ్రదవస్థయను వృక్షమునకును యీ సుషుప్త్యవస్థ బీజమగును. ఈ బీజము తత్త్వజ్ఞానమనెడి అగ్నిచే దగ్ధము కాబడి, దగ్ధబీజము మొలువని యట్లే, సంసారవృక్షమును బుట్టింపజాలదు. ఇట్టి బోధవలన ప్రత్యగాత్మ పరమాత్మయేయగును. జాగ్రదవస్థలోగల విషయము స్వప్నావస్థలో లేదు; స్వప్నావస్థలోగల విషయము సుషుప్త్యవస్థలో నుండుట లేదు. సుషుప్త్యవస్థలోగల విషయము తురీయమం దుండుట లేదు. సుషుప్తినుండి మరల స్వప్నమునకున్ను, స్వప్నమునుండి జాగ్రదవస్థకున్ను, జాగ్రదవస్థనుండి స్వప్నమునకున్ను, స్వప్నమునుండి సుషుప్తిలోనికిన్ని యీజీవుడు యెల్లప్పుడును చక్రమువలె తిరుగుచుండును. కావుననే సంసారచక్రమని పేరు కలిగినది. ఇది బద్ధజీవులయొక్క స్వభావము. నాల్గవదగు తురీయములో చేరువాడు ముక్తజీవుడగును. దానికి మార్పు లేదు. కావుననే కూటస్థుడని పేరు గలుగుటకు కారణము. ఈలాగున మూడు దేహములలో నిలుకడలేక తిరుగుచుండెడి కారణమువలన సంసారమని పేరు గలిగినది. ఈ వృక్షము ఆత్మబోధమగు గొడ్డలిచేనఱికిన యెండిపోవును. దానినుండి మరల బీజములేర్పడవు. అట్టివానికి జననమరణ దుఃఖరూపమగు సంసారముండదు. నఱికివేసిన చాలదు; జ్ఞానాగ్నిలో దహింపచేయవలెననికూడ చెప్పిరి. ఏలన బీజము దానియందుండిన మరల చెట్టు పుట్టవచ్చును.

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యాది మూడు జగత్తులను యేది ప్రకాశింప జేయుచున్నదో, ఆ ఆత్మను బ్రహ్మముగా యెరింగినవాడు సమస్త బంధములనుండి విముక్తుడగుచున్నాడు అని ఉపనిషత్తులు తెలుపుచున్నవి. ఈ సంసారవృక్షముయొక్క స్వరూపము శంకరులు "సుషు

ప్త్యాఖ్యం'' అను శ్లోకములో నిరూపించినారు. సుషుప్తిరూపమగు మూలావిద్య లేక అజ్ఞానము ఈ సంసారవృక్షమునకు బీజము లేక మూలము. బీజము వృక్షరూపముగ అంకురించునట్లు దీనికి స్వప్నము అంకురము. అంకురమునుండి వృక్షము, ఫల పల్లవ పుష్పాదు లేర్పడునట్లు జాగ్రదవస్థయగు యీ వృక్షము సర్వేంద్రియ పుష్పములతోను, పల్లవములతోను, లతలతోను, విషయమగు ఫలములతోను ప్రబలమగుచుండును. ఈ సంసారవృక్షమునే భగవద్గీతయందు 15–వ అధ్యాయములో శ్రీకృష్ణభగవానుడు తెలిపెను.

న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా॥

తా॥ ఈ అశ్వత్థవృక్షమును దృఢమైన, అసంగమైన ఆయుధము (గొడ్డలి)చే నఱికి దాని వెనుకగల పరమాత్మను చెందినవారలు మఱల సంసారమునకు వచ్చుటలేదు. అట్టి స్థానమును వెతుకవలెను (పొందవలెను). ఈశ్లోకమందు "అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా" అని ప్రయోగించుటవలన మొట్టమొదట సర్వసంగములనుండి విముక్తుడు కావలెననియు, అనగా తీవ్రవైరాగ్యము గలిగివుండవలెననియు, తరువాత మూడు దేహములకు సంబంధములేని ఆత్మజ్ఞానమనియెడు బోధగల గొడ్డలిచే మూలావిద్యను ఛేదించవలెననియు తెలుపబడినది. దృఢేన ఛిత్త్వా' అని చెప్పుటవలన దృఢమైన వైరాగ్యముగల ఉక్కుగొడ్డలిచేత గట్టిగ కొట్టవలెననియు, లేనిచో అనాదిగ వచ్చుచుండు యీ సంసార వృక్షము తెగదనియు నిరూపించబడినది. ఇందువల్ల దృఢవైరాగ్యము లేనిచో యీఅజ్ఞానరూప సంసారవృక్షమును నఱుకజాలరని గ్రహించుకొనవలెను. గొడ్డలి బాగుగ తెగనిదైనచో మరల యేలాగున నూరెదరో, ఆలాగున మందవైరాగ్యముచే యీ సంసారవృత్తులను నఱుకజాలనిచో సర్వసంగపరిత్యాగ తీవ్రవైరాగ్య మవలంబించి యీ సంసార వృత్తులను, గుణములను ఛేదించవలయును. ఈ సంసారవృక్షము బహుకాలముగ నుండినదగుటచే మంచి చేవగల చందనవృక్షమువలె నుంటున్నది. ఇది వాడిమిలేమి గొడ్డలిచే నఱికిన తెగునదికాదు. కావున బాగుగ నూరిన ఉక్కుగొడ్డలిచే గట్టిగ బలముగలవానిచే నఱుకవలసి

వుండునని శ్రీకృష్ణభగవానుడు తెలుపుటకు కారణమైనది. ఈ విష యమై శాస్త్రము చెప్పినది చూడుడు:

"అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోచ్ఛ్రితః।
బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాంతరకోటరః॥
మహాభూత విశాఖశ్చ విషయైః పత్రశాఖవాన్ ।
ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః॥
ఆజీవ్యస్సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః।
ఏతద్బ్రహ్మవనం చైవ బ్రహ్మవృక్షస్య తస్య తత్॥
ఏతచ్ఛిత్వా స భిత్వా చ జ్ఞానేన పరమాసినా।
తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నావర్తతే పునః॥"

తా॥ బ్రహ్మమనెడి వేరునుండి కలిగినట్టియు, దాని యోగ్యతచే పెరిగినట్టియు, బుద్ధియనెడి కొమ్మలు కలిగెడిచోటైన స్కంధము గలిగి నట్టియు, ఇంద్రియములనెడి బొఱియ (తొర్రలు) గలిగినట్టియు, మహా భూతములను మొద్దుగ గలిగినట్టియు, శబ్దాదివిషయములను కొమ్మలును ఆకులును గలిగినట్టియు, ధర్మాధర్మములను పుష్పములు గలిగినట్టియు, సుఖదుఃఖములను పండ్లుగలిగినట్టియు, సకలభూతములున్ను జీవించి యుండుట కాధారముగను, బ్రహ్మమునకు వాసస్థానముగ నున్నట్టియు, అనాదిగనున్నట్టి ఈ సంసార వృక్షముయొక్క సమూహామును జ్ఞాన మనెడి శస్త్రముచే నఱికి చీల్చి దేనివలన తిరిగి (సంసారమునకు) రాడో అట్టి యానందమును (బ్రహ్మను) పొందుచున్నాడు.

కావుననే పరమేశ్వర ధ్యాన శ్లోకమందు ఈశ్వరునియొక్క కర మందు 'పరశుమభయం' అని వర్ణించుటకు కారణము. పరశు అనగా గండ్రగొడ్డలి. పరమశివుడు కరమందు పరశును ధరించుటకు కారణ మేమనగా తన భక్తులకుగల అజ్ఞానమైన అరణ్యమును నఱికివేయుచుండు ననుభావమున ఆలాగున చేయడమైనది. ఈ విషయమై వివేకచూడా మణియందు శ్రీ శంకరభగవత్పాదులు తెలిపినది చూడుడు—

శ్లో॥ బీజం సంసృతిభూమిజస్య తు తమో దేహాత్మధీరంకురః
రాగః పల్లవమమ్బు కర్మ తు వపుస్స్కన్ధోఽసవశ్శాఖికాః।

అగ్రాణీన్ద్రియసంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహువిధం భోక్తాఽత్ర జీవః ఖగః॥

తా॥ సంసారమనెడు వృక్షమునకు అవ్యక్తరూపమగు నజ్ఞానమే విత్తనము, శరీరమే ఆత్మయను బుద్ధి అంకురము, అనురాగము చిగురుటాకు, కర్మతే జలము, దేహము మ్రానుు, ప్రాణములు కొమ్మలు, శ్రోత్రాదీంద్రియసమూహము కొనలు, స్రక్చందన వనితాదివిషయములు పువ్వులు, అనేకవిధప్రారబ్ధాదికర్మలచే గలిగిన అనేకవిధములుగానయిన దుఃఖము పండు, ఈ సంసారపాదపమునందు అనుభవించు వాడగు జీవుండు పక్షిగ నున్నాడు. మఱియు కఠోపనిషద్భాష్యము నందును శ్రీ శంకరులు తెలిపినది చూడుడు—

"వేదాంతనిర్ధారితపరబ్రహ్మమూలసారః। అవిద్యాకామకర్మావ్యక్తబీజప్రభవః। అపరబ్రహ్మవిజ్ఞానక్రియాశక్తిద్వయాత్మక హిరణ్యగర్భాంకురః। సర్వప్రాణి లింగభేదస్కన్ధః। తృష్ణాజలావసేకోద్భూత దర్పః। బుద్ధీంద్రియ విషయప్రవాళాంకురః। శ్రుతి స్మృతి న్యాయ విద్యోపదేశ పలాశః। యజ్ఞ దాన తప ఆద్యనేకక్రియాసుపుష్పః। సుఖదుఃఖవేదనానేకరసః। ప్రాణ్యుపజీవ్యానంతఫలః। తత్తృష్ణా సలిలావసేక ప్రరూఢ జడీకృత దృఢబద్ధమూలః। సత్యనామాదిసప్తలోక బ్రహ్మాదిభూత పక్షికృత నీడః। ప్రాణిసుఖదుఃఖోద్భూత హర్ష శోక జాత నృత్య గీతవాదిత్రక్ష్వేలితాస్ఫోటిత హసితాకృష్టరుదిత హాహా ముంచముంచేత్యాది అనేక శబ్దకృత తుములీ భూతమహారవః। వేదాంతవిహిత బ్రహ్మాత్మదర్శనాసంగ శస్త్రకృతోచ్ఛేద ఏష సంసారవృక్షోఽశ్వత్థః అశ్వత్థవత్ కామకర్మవాతేరిత నిత్యప్రచలిత స్వభావః। స్వర్గనరకతిర్యక్ప్రేతాదిభిః శాఖాభిః అవాక్ శాఖః సనాతనః అనాదిత్వాచ్చిరం ప్రవృత్తః॥"

తా॥ ఉపనిషద్భాగమున నిర్ధారణ చేయబడిన పరబ్రహ్మమే మూలముగాను సారముగాను గలదియు, అవిద్యా కామకర్మ అవ్యక్తమను బీజమునుండి పుట్టినదియు, విజ్ఞానశక్తి క్రియాశక్తి ద్వయస్వరూపమయిన అపరబ్రహ్మముయొక్క రూపుడగు హిరణ్యగర్భుడే అంకురముగా గలదియు, సకలప్రాణుల లింగశరీరమే మ్రానుగాగలదియు తృష్ణయను జలముయొక్క సేచనముచే గలిగిన దర్పముగలదియు, బుద్ధి

ఇంద్రియవిషయములు ఇవియే ఆకులుగాగలదియు, యజ్ఞము దానము తపస్సు మొదలుగాగల క్రియలే మంచిపుష్పములుగా గలదియు, సుఖ దుఃఖముల నెఱుంగుటయే రసముగాగలదియు, ప్రాణుల జీవనమే అనంత ఫలముగాగలదియు, వాని ననుభవించవలెనను ఆశారూపజలముచే తడుప బడి మిక్కిలి నాటుకొన్నదియు, స్తబ్ధమై దృఢమగు మూలముగలదియు బ్రహ్మవిష్ణ్వాదులనెడి పక్షులచే కట్టబడిన సత్యాదిలోకములను పతగూళ్లు గలదియు, ప్రాణులయొక్క సుఖదుఃఖములచే గలిగిన హర్ష శోకజన్యము లగు నృత్య గాన వాద్రిత క్రీడా ఆస్ఫోటన ఆక్రందనరోదన హాహాకారము లును, వదలువదలు అను అనేకవిధశబ్దములచే చేయఁబడిన సంకులమహార వము గలదియు, బ్రహ్మాత్మదర్శనరూప అసంగమను శస్త్రముచే ఛేదింప శక్యమగునదియునగు సంసారవృక్షము, రాగిచెట్టువలె కామ్యకర్మలను పెనుగాలిచే చలించు స్వభావముగలదియు, స్వర్గనరక ప్రేతాదిలోకములే అడ్డముగ ప్రసరించు కొమ్మలు గలదియునై అనాదియగుటచే సనాతన మని చెప్పబడుచున్నది.

---

ఓమ్

# గ్రహోచ్చాటనం

వేదాస్తశాస్త్రములో నీక్రింద వ్రాయబడు శ్లోకములు గలవు. ముముక్షువులకు, జిజ్ఞాసువులకు, సాధకులకు, నీ శ్లోకార్థమును బ్రహ్మనిష్ఠు లగు గురువులు మొట్టమొదటనే బోధింతురు.

శ్లో॥ గ్రహావిష్టోద్విజః కశ్చిచ్ఛూద్రోఽహ మితి మన్యతే ।
గ్రహనాశాత్పునః స్వీయం బ్రాహ్మణ్యంమన్యతే యథా॥ 1.

శ్లో॥ మాయావిష్టస్తతో జీవో దేహోఽహ మితిమన్యతే ।
మాయానాశాత్పునః స్వీయం రూపం బ్రహ్మాస్మిమన్యతే॥ 2

తా॥ (1) వేదపారంగతుఁడగు ఒక బ్రాహ్మణోత్తముని లంబాడి శూద్రగ్రహము ఆవేశించెను. గ్రహావేశమైనతర్వాత తన్ను శూద్రునిగా భావించెను. గ్రహవిమోచనానంతరం తన్ను బ్రాహ్మణునిగా తలంచ గలిగెను. (2) అలాగున మాయావిష్టుడగు శివుడు తన్ను జీవునిగా తలం

చును. అపుడు శివస్వరూపమగు ఆత్మ మఱపుగలిగి దేహమే తానను అనుభవము కలిగియుండును. ఆలాగున మాయతొలిగినపిమ్మట తనఆత్మ బ్రహ్మస్వరూపమని బోధము కలుగును.

వి॥ దీనిని గురించిన గాథయొకటి గలదు. మహారాష్ట్రదేశమున యాజ్ఞవల్క్యగోత్రస్థుడు, ఆపస్తంబసూత్రుడు, వేదపారంగతు డగు, రామచంద్రశర్మయను బ్రాహ్మణోత్తముడొక్కడుండెను. ఒక్కదినమున మంచి వేసవికాలమగుస మిట్టమధ్యాహ్న సమయమున గ్రామాంతరము వెళ్ళి స్వగ్రామమునకు వచ్చుచుండగా నూరిబయట శ్మశానభూమియం దొకశవమును దహన మొనర్చి దానికిసంబంధించిన జనులందరున్ను తిరిగి వెళ్ళిపోయియుండిరి. చితియందు గొప్పఅగ్ని రగులుచుండెను. దానిని చూచి పై చెప్పిన పేరుగల విప్రోత్తముడు భయము నందెను. అత్తరి ఆ శ్మశానవాటికయందుండిన మరాటి మునీశ్వరుడగు గ్రహము బ్రాహ్మణుని ఆవేశించెను. అప్పటినుండి యజ్ఞోపవీతము త్రెంపి పారవేసి పెద్దగా అఱచుచు స్వగ్రామమునకు రాగా జనులందరున్ను దగ్గరకుజేరి నీవెవడు? నీ వెవడు? అని యడుగగా ఆ విప్రోత్తముడు తాను మరాటి మునీశ్వరుడని చెప్పనారంభించెను. గుడ్డలన్నింటిని చింపి పారవేసి దగ్గరవచ్చినవారందరిపై యుమ్మివేయదొడంగెను. గ్రామస్థులందరున్ను ఈబ్రాహ్మణుని యందు ఎంతోభక్తివిశ్వాసముగలవారైయుండిరి. మనరామచంద్రయ్య శాస్త్రిలుగారిని దయ్యమావేశించి మతి చెడిపోయి, పిచ్చిపట్టెనని చెప్పసాగిరి. దయ్యము పట్టుకొనుటకు ముందుగా మీరెవరని యడిగి నచో యాజ్ఞవల్క్యగోత్రస్థుడు, ఆపస్తంబసూత్రుడు, బ్రాహ్మణుడు, రామచంద్రశర్మ యను పేరుగలవాడనని చెప్పుచుండేవాడు. అదంతయు విస్మృతిగలిగి దయ్యమావేశించినతర్వాత తాను లంబాడిమునీశ్వరుడని చెప్పదొడంగెను. వారిపై గ్రామస్థులందరికి మహా భక్తివిశ్వాసము గలిగియుండెను. అంత గొప్ప వైదికఅనుష్ఠానముగలవాడై యుండెను. తనకిద్దరు కుమారులుగూడ నుండిరి. ఆ కుమారులువచ్చి దయ్యమును నీవెవరని అడిగినపుడుగూడ లంబాడీమునీశ్వరుడను అని చెప్పదొడంగెను. మీకేమి కావలయునని యడుగగా సారాయికావలెను, కోడిమాంసము కావలెను, మేకమాంసముకావలెను, చేపలువండి కూరపెట్టవలెను అని

చెప్పెను. కొందఱు మాంత్రీకుల బిలిపించి, విభూతి మంత్రించి పెట్టు టకై దగ్గఱకు వచ్చినపుడు నవ్వుచు మహాసంతోషముతో మాంత్రీకులను దగ్గరకు రానిచ్చి, ఒరేయ్! నీవుచెప్పబోవు మంత్రమదిగదా! అది నాకు దెలియునని చెప్పుచు ముఖమున ఉమ్మివేయుట కారంభించెను. దీనినిజూచి మంత్రకాండ్రు దగ్గఱకువచ్చుటకు భయపడిరి. ఇదంతయు జూచి అతని పుత్రులుగూడ, బాగుగా వేదముజదువుకున్న వారు మంచి నైష్ఠికులు గొప్ప శ్రీమంతులుగాన వారు యీ చిల్లరమంత్రకాండ్ర వలన నీ గ్రహము తొలుగుపదికాదని తలంచి, అధర్వణవేదము, మంత్ర శాస్త్రము బాగుగ దెలిసిన గొప్ప మాంత్రికునిరప్పించగా ఆదయ్యము చూచి కొంచము భయపడి ఇదివరలోచేయు దుశ్చేష్టల జేయక అణగి యుండెను. కాని స్నానము శౌచము మొదలైన వేమియు లేదు. పై జెప్పిన మంత్రకాండ్రు నేర్చుకొన్న మంత్రములన్నింటిని యీ లంబాడీ పూర్వజన్మములలో నేర్చుకొనియుండెను. కావున దుష్టదేవతా ఉపాసకులందరున్ను చనిపోయిన తర్వాత దయ్యములై, భూతములై, పిశాచులై పోదురని భగవద్గీతాశాస్త్రములోను ఇతర శాస్త్రములలోను జెప్పుటకు కారణము.

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసాజనాః॥ గీ॥ 17-4

తా॥ సత్త్వగుణస్వభావముగలవారు దేవతల నారాధింతురు. రజోగుణస్వభావముగలవారు యక్షరాక్షసులనారాధింతురు. తమోగుణ స్వభావజనులు ప్రేతములను, భూతగణముల నారాధింతురు. మరణానంతరము అట్టివారు అదూరూపులై జన్మింతురు.

శ్లో॥ యాంతి దేవవ్రతాదేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః।
భూతానియాంతిభూతేజ్యాయాంతిమద్యాజినోఽపిమామ్॥ గీ॥ 9-25

తా॥ దేవతలను సేవించువారు ఆ దేవతాలోకములలో దేవతలుగా పుట్టుచున్నారు. పితృదేవతల నారాధించువారు, పితృదేవతాలోకములను పొందుచున్నారు. భూత ప్రేత పిశాచముల నారాధించువారు ఆ భూతప్రేత పిశాచలోకములను పొందుచున్నారు. సాక్షాత్ ఆ పర

మాత్మను ధ్యానించి యారాధించువారు పరమాత్మను, బ్రహ్మమును, ఈశ్వరుని, విష్ణువును పొందుచున్నారు.

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరం।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః॥ గీ॥ 8-6

తా॥ ఓ యర్జునా! ఎవడు మరణకాలమందు ఏ భావము గలవాడై దేహమును విడచుచున్నాడో, వాడెల్లప్పుడున్ను ఆ యా రూపముయొక్క స్మరణముచేత గలిగిన సంస్కారము గలవాడైనందున ఆ యా స్వరూపమునే (జన్మమునే) బొందుచున్నాడు.

అథర్వణశాస్త్ర పారంగతుడగు మంత్రవేత్త మాంత్రికశాస్త్రములో జెప్పినట్లు వారంరోజులు హోమములు మొదలగు క్రియలచేత ఆ దయ్యమును వశీకరించి ఒక యంత్రములో స్థాపించి శ్మశానభూమి యందుగల నొక చెట్టునకు కట్టివేసెను. గ్రహవిముక్తి గలిగినవెంటనే యా బ్రాహ్మణుడు మీరెవరని యడిగినపుడు పూర్వము తన యనుభవములో గలిగియుండు రామచంద్రశర్మయని చెప్పదొడంగెను. దయ్యము ప్రవేశించిన కాలములో తనకు గలిగిన దుష్టచేష్టల గురించి జనులు చెప్పుచున్నదానిని విని పశ్చాత్తాపపడి ప్రాయశ్చిత్తముజేసి శుద్ధిజేసికొని నూతన యజ్ఞోపవీతధారణజేసి, వైదికానుష్ఠానముల జేసికొని పవిత్రమగు బ్రాహ్మణవృత్తియందుండెను. అపుడు జనులందఱిచేతను పూజింపబడినవాడై సుఖించెను. ఆలాగున మాయ, అవిద్య, అజ్ఞానమను గ్రహముచే పట్టుబడిన జీవులుకూడ తన శివస్వరూపమును మఱచి జాతి, కులములతో గూడినవాడని భావించి, ఆ యా జాతిగుణముల ననుసరించియుండువాడు తానని తలంచి, ఆ యా జాతికి కులమునకు సంబంధించిన కార్యములజేసి బద్ధుడగుచుండును. అట్టివారికి ఆత్మవేత్తయగు, బ్రహ్మజ్ఞుడగు, మహావాక్యానుభవముగల గురుదేవుడగు మంత్రకాడు తప్పకయుండవలయును. అతడు దేహాత్మభ్రాంతిగల జిజ్ఞాసువులకు తత్త్వమసిమహావాక్యమంత్రముపదేశించి దేహజాత్యభిమానముగల ముముక్షువుకు గల అనాత్మధర్మములన్నింటిని నేతినేతీతివాక్యములచే తొలగించి, ఆత్మయగు శివత్వమగు స్వస్వరూపమునుపదేశించవలయును. అయితే గ్రహావిష్టకాలములో గలిగిన దుశ్చేష్టలన్నింటిని త్యజించి, గ్రహ

విమోచనానంతరము బ్రాహ్మణ్యధర్మమును రామచంద్రశర్మగారు ఎట్లను ష్ఠించిరో, ఆలాగున బ్రహ్మోపదేశమగుటకు ముందుగా హీనమైన జాతి, కులప్రవర్తనలుకలిగియుండిననుగురూపదేశమైనతరువాత వాటినన్నింటిని పరిత్యజించి యెవరైనను, బ్రాహ్మణ్యధర్మమును బ్రహ్మనిష్ఠుల వర్తనమును గలిగియుండేలాగున చూడవలయును. ఇదే పరమపావనమగు వేదాంతశాస్త్రము మన కుపదేశించినది. కావున గురుపుత్రులైనవారు గూడ చాలమందిన్ని అబ్రాహ్మణజాతిలో నుండువారు తమ జాతి, నీచాహారములనుగూడ మానకయుంటున్నారు. దీనివలన గ్రహించవలసిన సత్యమిది. శ్రీకృష్ణభగవానుడు గీతయందుపదేశించిన భావమిది. అర్జునునికి గలిగిన శోక, మోహ, తాపములను ఈ దివ్యోపదేశము చేతనే తొలగించి కృతకృత్యునిగా జేయడమైనది. కట్టకడపట అర్జునుండున్ను తన స్వానుభవ మీలాగుననే తెలిపెను.

శ్లో॥ నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ॥ గీత॥ 18-73

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తి! నీ యనుగ్రహమువలన నాచేత జ్ఞానము పొందబడినది. అజ్ఞానము వీడిపోయినది (నశించినది). సంశయ రహితుడనై, సుస్థిరుడనై యుంటున్నాను. నీయొక్కయాజ్ఞను పాలించెదను. "స్మృతిర్లబ్ధా" అని యర్జునుడు చెప్పుటచే స్మృతిశబ్దమునకు మఱచిపోయినది జ్ఞాపకమునకు వచ్చినదని భావము. ఇచ్చట నవిద్యా మోహముచే మఱపుగలిగియుండిన యాత్మ సాక్షాత్కార స్వరూప జ్ఞానము గలిగినదని భావము.

గీతాపారాయణముజేసిన గలిగెడు ప్రయోజన మిట్టిదని నిరూపించడమైనది. ఇట్టి స్థితి గలుగకపోయినచో గీతాపారాయణ మనుభవజ్ఞులవల్ల గ్రహించలేదనియు, తాను పొందలేదనియు గ్రహించుకొనవలెను. ఈ శ్లోకమునకుపైన కృష్ణభగవానుడు అడిగిన ప్రశ్నశ్లోకము క్రింద వ్రాయబడుచున్నది.

శ్రీభగవానువాచ;-

శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ॥ గీ॥ 18-72

తా॥ ఓ యర్జునా! నాచే జెప్పంబడిన యీ గీతాశాస్త్రము, నీచేత నిశ్చల చిత్తముతో వినబడినదా యేమి? హే ధనంజయ! అజ్ఞానముచే గలిగిన నీయొక్క మోహము సంపూర్ణముగా నశించినదా?

ఈ రెండు శ్లోకములును గీతాపారాయణము జేయువారు బాగుగ జ్ఞాపకము జేసికొనవలయును. అపుడే గీతాపఠనఫలము ఆత్మసాక్షాత్కారజ్ఞానమని గ్రహించగలుగుదురు. కావుననే శ్రీకృష్ణభగవానుడు "త్వయైకాగ్రేణచేతసా" అని ప్రయోగించుటకు కారణమైనది. అనగా ఏకాగ్రచిత్తముతో విన్నావా? అని అడుగుటకు కారణము. లేనిచో ధృతరాష్ట్రుడు వినినట్లే యగును. 18 అధ్యాయములున్ను సంజయుడు ధృతరాష్ట్రమహారాజునకు జెప్పెను. కాని ధృతరాష్ట్రునియొక్క మనస్సు తనపుత్రులు యుద్ధములో నేలాగున యుంటున్నారో, అదే భావము గలిగియుండుట వలన సంజయుడు జెప్పిన ఒకవాక్యమునైనను తెలిసికొనజాలకపోయెను. కావున గీతాపారాయణము చేయువారున్ను గీతార్థమును శ్రవణము చేయువారున్ను, అదేప్రకార మాత్మధ్యానము చేయువారును యీసత్యమును బాగుగ తెలిసికొనవలెను. ధృతరాష్ట్రుని దేహముమాత్రము ఇంద్రప్రస్థములో నుండెనుగాని మనస్సుమాత్రము కురుక్షేత్ర యుద్ధరంగమందే యుండెను. అది తూర్పుదిక్కునలక్ష్యముంచి విడవవలసిన బాణము పశ్చిమదిక్కునకు వదలినట్లుండెను. ఆ బాణము లక్ష్యమునుభేదింపక యెట్లుండునో, అట్లేఏకాగ్రచిత్తముతో తదేకనిష్ఠతో శాస్త్రవాక్యమందును, గురువాక్యమందును, విశ్వాసములేక వినెడు గీతావాక్యముగాని, వేదాంతవాక్యముగాని, ఫలమును గలుగజేయజాలదు. మఱియు కుంభవృష్టియందు పాత్రయొక్క ముఖము బోర్లించి పెట్టుకొనిన ఒక్కబొట్టునీరైన దానిలో బడజాలదో, పాత్రమునుయొక్క ముఖము తెఱచి పైకిపెట్టినచో నేలాగున శుద్ధవర్ష జలము పాత్రనిండునో, ఆలాగున, తదేకనిష్ఠతో శ్రవణముచేయువారియొక్క ప్రయోజనమున్ను, యేకాగ్రతచిత్తములేకవినువారి చిత్తమున్ను ఉండునని మఱువకుడు.

---

ఓమ్

# శ్రీ భ గ వ ద్గీ త

ఉపనిషత్తులయొక్క సారమే భగవద్గీతయని పండితులందఱు యెఱింగియేయున్నారు. వేదములయొక్క సారమే ఉపనిషత్తులని విజ్ఞులందఱు తెలిసికొనిన విషయమే. అట్లైన వేదోపనిషత్తులుండగా మరల గీతను శ్రీకృష్ణభగవానుడేల ఉపదేశింపవలయుననుశంక యొకటి గలుగవచ్చును. దీనికి మహనీయులందఱును, పండితులందఱును, బ్రహ్మవేత్తలందఱును, పరమభక్తులందఱును, జిజ్ఞాసువులందఱును సమాధానమును గనుగొనియేయున్నారు. తెలుపుచునేయున్నారు. అదేమనగా వేదము అనంతము. ఉపనిషత్తులు ననేకములుగనున్నవి. వీనియొక్క అర్థమును సామాన్యప్రజ్ఞగల మానవులు తెలిసికొనజాలరని తలంచి సర్వజ్ఞుడు, వేదపురుషుడును అగు శ్రీకృష్ణభగవానుడు సారమును గ్రహించి అర్జునుని నిమిత్తముగాజేసికొని ఆబాలవృద్ధులున్ను ఈ గీతాసారామృతమును పానమునుజేసి అందఱును తరించవలయునని తలంపుచేతనే యీ గీతాశాస్త్రమును ప్రపంచమున కుపదేశించెను. మఱియు వేదము, ఉపనిషత్తులు అధ్యయనము చేయవలసియుండిన ఉదాత్త, అనుదాత్త, స్వరితములను స్వరములను తెలిసికొనియుండవలయును. దానిని యిప్పుడు గూడ వేదమును చదివిన కొందఱు పండితులు మాత్రమే యెఱిఁగియున్నారు. సామాన్యపండితులును వర్తమానకాలమున హ్రస్వ, దీర్ఘ ప్లుతములగు స్వరములను తెలిసికొని గీతాపారాయణమును చేయువారు గూడ అరుదైపోయిరి. ఈ దురవస్థ రానున్నదని భగవంతుడు తెలిసికొనియే స్వరములు లేకనే గీతాశాస్త్రమును అనుగ్రహించెను. అందువల్లనే సంస్కృతమును బాగుగ తెలియనివారుగూడ అధ్యయనముచేసి తరించులాగున పరమపావనమగు,అమృతస్వరూపమగు శ్రీగీతాశాస్త్రమునను గ్రహించెను. దీనిని పారాయణము చేయుటకు బ్రాహ్మణ, అబ్రాహ్మణ, స్త్రీ, పురుష, బాలవృద్ధులందఱును అర్హులే. భౌతికసంబంధరోగముల మనుష్యులందఱును, ఏలాగున ఔషధసేవనమున కర్హులైయుంటున్నారో, ఆలాగున భవరోగముగల ప్రతిమానవుడును గీతాపారాయణమునుచేసికొని గీతామృతమగు దివ్యరసాయనమును పానముచేసి భవరోగ విముక్తులు గావచ్చును. గీతాప్రభావమును గురించి విజ్ఞు

లనేకులు అనేకవిధములుగ అర్థమును వ్రాసియున్నారు. అది ఆయాభాషలలో పద్యరూపముగను, పాటలుగాను, వచనరూపముగను, ప్రశ్నోత్తరవిధమునను, హరికథాకీర్తిగను, బుఱ్ఱకథగాను వుండు విషయ మందఱికిని తెలిసినదే. వేఱు యే గ్రంథమునకును ఇంత వ్యాఖ్యానములు లేవు. ఇందులకు ప్రమాణములు.

శ్లో॥ ఆయుర్వేదేన నిర్ణీతం ఔషధం సర్వరోగిణాం।
జ్ఞానం తథైవ నిర్ణీతం సర్వేషాం భవరోగిణామ్॥

ఈ ప్రమాణము ననుసరించి ఆయుర్వేదఔషధము సర్వజనులకేలాగున యేర్పడియున్నదో, ఆలాగున అజ్ఞానమను భవరోగగ్రస్తులకు జ్ఞానమను దివ్యౌషధము యేర్పడియున్నది. దీనికంటె పరమప్రమాణమేమి కావలయును? ఆబాలవృద్ధ, బ్రాహ్మణాబ్రాహ్మణ, స్త్రీ, పురుష, భేదములేక ఆయుర్వేదఔషధ మేర్పడియున్నదిగదా. మఱియు కర్మ, భక్తి, యోగ, జ్ఞానము లనెడు నాలుగు మార్గములు గీతయందు ఉపదేశింపబడినవి. ఇవి మానవులయొక్క హృదయసంస్కారము ననుసరించియు, శక్తిననుసరించియు నేర్పడియున్నవి. తక్కినశాస్త్రము లావిధముగ లేవు. ఆ శాస్త్రము ననుసరించిన అధికారికి మాత్రమే ప్రవేశము ఏర్పడియున్నది. అదియే గీతాశాస్త్రముయొక్క విశాలభావము. కావున నెవరికి వారి వారి స్వభావము ననుసరించి కర్మోపాసనా, యోగ జ్ఞానములలో దేనియందు అభిరుచి గలుగునో, సాధ్యపడునో ఆయా మార్గముల ననుసరించి తరించవచ్చును.

శ్లో॥ స్వల్పమప్యస్యధర్మస్య త్రాయతే మహతో భయాత్।

ఈ గీతాశాస్త్రము కొంచమైనను నిత్యము పారాయణముచేయువారు గొప్పదగు నీ సంసారసాగరమును ప్రయాసములేక దాటగలరు. అని గీతాచార్యుడు ద్వితీయాధ్యాయమున ఉపదేశించెను. విషదోషముచే ప్రాణాపాయస్థితిలో నుండువానికి అమృతముయొక్క కణమువల్ల విషము నసించి యెట్లు జీవింపగలుగునో, ఆలాగున సంసారవిషయదోషముచే ప్రాణాపాయస్థితిలో నుండువానిని ఈ గీతాశాస్త్రపఠనము అమృతునిగా జేయగలుగును. మఱియు సూతసంహితయందు ఇట్లుపదేశించిరి.

శ్లో॥ అత్యల్పోఽపి యథా దీపః సుమహా న్నాశయేత్తమః।
జ్ఞానాభ్యాసస్తథాఽల్పోఽపి మహాత్పాపం వ్యపోహతి॥

తా॥ ఏలాగున చిన్నదీపము గృహాంతరాళములోగల గొప్పచీకటిని రహితమొనరించునో, ఆలాగున ఈజ్ఞానాభ్యాసము కొంచమైనను శీలించినవారి పాపములన్నిటిని రహితమొనరించును.

ఒక అగ్నికణము ఘోరారణ్యములో అనేక సంవత్సరములనుండి పడియుండు కట్టెలనన్నిటిని ఎట్లు దగ్ధముచేయునో ఆలాగున అనేకజన్మములనుండి వచ్చుచుండెడు కర్మములనన్నిటి నిట్లు యీజ్ఞానాగ్ని భస్మమొనరించును. ఇట్టి ప్రభావము యీ జ్ఞానమునకు గలదు. అట్లుండియు దీనిని అనుష్టించి జనులు తరించకయుంటున్నారు. మఱియు గీత నాల్గవ అధ్యాయమున తెలిపినది చూడుడు.

శ్లో॥ అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

తా॥ సముద్రమంత పాపము చేసినవాడైనను, గీతాపారాయణమను పడవను ఎక్కినచో ప్రయాసములేక సంసారసాగరమును దాటగలుగును. సముద్రమునుదాటుటకు సముద్రమంత విస్తీర్ణమయిన ఓడ అక్కఱలేదు, చిన్ననావచేత దాటవచ్చును. కనుక పారావారమగు సముద్రమంత పాపముల చేసినవాడైనను గీతాపారాయణము చేయుచు గీతార్థమును స్మరించుచు గీతలో చెప్పిన విధమున ఆచరించుచుండిన తరించవచ్చును. ఇది భగవద్వాక్యము. సందేహము పడకుడు. విశ్వాసమే మిమ్ముల రక్షించును.

---

ఓమ్

## "సంసారసాగర తరణోపాయము"

మనస్సు దృశ్యాకారమై పరిణమించుటయే సంసారసాగరములో బడిపోవుట యనియు, నాలాగున చిత్తము దృశ్యాకారమై పరిణామమును జెందకుండునట్లు జేయుటయే సంసారసాగరమును తరించుటయని విజ్ఞులయొక్క మతము. అట్టి దృశ్యవృత్తులతో మనస్సును పరిణమించక

జూచుటయేదియో అదియే నిజమగు అన్తరంగసాధనయు, ప్రజ్ఞానబలము నగును. అయితే యిది నిర్మలబుద్ధియు, చిత్తైకాగ్రతయు, బ్రహ్మ విచారణయు గలవారికి మాత్రమే సాధ్యమగును. చిత్తైకాగ్రతయు, చిత్తనిర్మలత్వమున్ను గలుగుటకయ్యే జపధ్యానాదులు నేర్పడినవి. వేదాంతపంచదశియందు దెలిపినది చూడుడు.

శ్లో॥ మూషాసిక్తం యథా తామ్రం తన్నిభం జాయతే తథా।
రూపాదీన్ వ్యాప్నువచ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువమ్॥

తా॥ విగ్రహాదులను పోతపోయుటకొఱకు కరగబడిన రాగి, మూసయందు పోయబడినదగుచు నామూసయొక్క ఆకారముగల దెట్లగుచున్నదో, అటువలెనే ఘటాది విషయముల నెఱుంగు చిత్తంబును, ఆ యా ఘటాది విషయముయొక్క ఆకారముగలదిగ నవశ్యమగుచున్నదని గ్రహించవలయును. కరగిన కంచునకు ప్రత్యేకరూపము లేదు. శిల్పియేర్పరచిన మూసననుసరించి, శ్రీరామ, ఆంజనేయ, శ్రీవిష్ణు, గరుడ, శివ, నందికేశ్వరాదులగు ననేక విగ్రహములు భిన్నభిన్న రూపములుగ నేర్పడుచున్నవి. కావుననే వేదాంతశాస్త్రములలో, ఈశ్వరసృష్టియనియు జీవసృష్టియనియు నిరుభేదములు నిరూపింపబడియున్నవి. ఈశ్వరసృష్టి యేకముగను, జీవసృష్టి అనేకముగను నుండును. కావున ననేకత్వములో నేకత్వమును గనుగొనుటయే ముక్తియనియును, నేకత్వములో ననేకత్వమును గాంచుటయే బంధమనియు శాస్త్రనిర్ణయము. ఒకే మృత్పిండముచే కుమ్మరి యనేకవిధ పాత్రలను, ఒకేసువర్ణముచే స్వర్ణకారు డనేక భూషణములను, ఒకేలోహముచే (ఇనుముచే) అనేక యంత్రముల నాయుధములను ఇంజనీయరులు నిర్మించునట్లు, ఏకమగు నద్వితీయమగు నాత్మయం దనేకత్వములను జీవుడు సృష్టించుకొనుచున్నాడు. ఇదంతయు జీవుని సంకల్పములు. ఇట్టి సంకల్ప రూపమగు ప్రపంచాకారములను మనస్సును పొందనీయక జేయుటకయ్యే సాధకుని యొక్కయు ముముక్షువుయొక్కయు ధ్యానబలిమి యుండవలయును. కావుననే గీతయందు—

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥

తా॥ ఆత్మసంయమనము లేనివానిచే నీయోగము పొంద శక్యముకాదు. మాటిమాటికిని నెడతెగక ప్రయత్నించుచు, సంయమన మొనర్చునట్టి యుపాయమువలన యోగమును బొందగలుగును.

విశేషార్థము॥ "అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః" సంయమనశక్తి లేనివానికి నీయోగము "దుష్ప్రాప" మని చెప్పిరే గాని, మఱియొకవిధముగ చెప్పలేదు. అందువల్ల మనస్సంయమశక్తి గలవారికి సంప్రాప్యమని యర్థమగుచున్నది. మఱియు మనస్సంయమన శక్తి లేనివారికిగూడ, అప్రాప్యమని చెప్పక దుష్ప్రాప్యమని భగవానుడు తెలుపుటవలన, ప్రయాసపడి మనోనియమము శీలించువారికి ప్రాప్తము గాగల్గును. ఆకారణముచేతనే, రెండవపాదములో "వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః" అని ప్రయోగించుటకు కారణము. యత్నశీలుడగు నభ్యాసికి మనస్సంయమన మనెడు ఉపాయము చేత నీయోగమును, నీజ్ఞానమును పొందుటకు సాధ్యమగునని భగవానుడుపదేశించెను. ఒకసారిఒకపరీక్షలో తప్పిపోయినవాడుతదేకనిష్ఠతో జదివి మరుసంవత్సర మెటుల యుత్తీర్ణుడగుచున్నాడో లేక మఱియొక సంవత్సరముగాని, రెండవసంవత్సరముగాని తీవ్రమగు కృషిసల్పి యుత్తీర్ణుడగుచున్నాడో, బ్రహ్మవిద్యయొక్క స్థితియు నీలాగుండునని ముముక్షువులు గ్రహించుకొనవలయును.

శ్లో॥ వ్యంజకో వా యథాలోకో వ్యంగ్యస్యాకారతామియాత్ ।
సర్వార్థవ్యఞ్జకత్వాద్ధీ రర్థాకారా ప్రదృశ్యతే॥

తా॥ ప్రకాశమగు నెండ మొదలగునది ప్రకాశింపబడెడి ఘటాదులయొక్క ఆకారమును బొందుచున్నది. అట్లే బుద్ధియు సకల పదార్థములయొక్క ప్రకాశమగుటవల్ల, విషయములయొక్క ఆకారము గలదై కనబడుచున్నది.

విశేషార్థము॥ అగ్నియొక్క స్వరూపము ప్రకాశము. అయితే గ్లాసులోపల వెలుగు నగ్ని ప్రకాశరూపమయినను, చిమ్నియొక్క రంగు ననుసరించి వెలుంగుటను గాంచుచున్నారముగదా! శుక్ల, రక్త, పీత, నీలాది వర్ణములుగల చిమ్నిలో వెలుగుచుండు దీపముగూడ చిమ్నినను సరించియే మనకు కనబడుచున్నది. నిజముగ విచారించినచో నగ్నియం

దట్టి దోషములు లేవు. భేదములన్నియు చిద్బింబ లవే అని ఎట్లు గ్రహించు కొనుచున్నామో, ఆలాగున ఆత్మ శుద్ధజ్ఞానైక స్వరూపము. భేదములన్నియు త్రిగుణములకు సంబంధించినవే అని గ్రహించి గుణములకు లోను గాక, ప్రజ్ఞావిశేషముచే శుద్ధజ్ఞానైకస్వరూప నిర్గుణాత్మయందు నిలకడ గలుగులాగున చేసికొనవలయును. మఱియు, కొన్ని భవనముల ద్వారబంధముసందలి కిటికీలకు తెలుపు, ఎఱుపు, పసుపు, నీలములగు నద్దముల నమర్చియుందురు. ఒక్కొక రంగుగల యద్దములపై ఎండ తగులునప్పుడు గృహాన్తరాళములో గల వస్తువులన్నియు ఆ అద్దపు రంగులు గలవివలె గానుపించుచుండును. నిజముగ నెండయం దెట్టి భేదము లేదో, ఆలాగున బుద్ధియొక్క అనగా మనస్సుయొక్క సంకల్పమువల్ల అన్ని వస్తువులు నాలాగుననే గోచరించును. ఈప్రకారము మనస్సంకల్పములకు లోబడిన వారికందఱికిని సంకల్పానుసారముగ సంతతము స్ఫురించును. ఇదియే బంధము. సంకల్పసాక్షియగు నాత్మలోనికి సంయమనశక్తిచే ప్రకాశించి నిలకడగలుగ జేసికొనినచో, నీపరిణామము గలుగదు. అప్పు డాత్మవస్తువు స్వప్రకాశములో, నిర్వికారములో, శివత్వములో, అమృతత్వములో, నిలిచి యుండును.

శ్లో॥ అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ।
ఏకస్తథాసర్వభూతాన్తరాత్మా రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ॥

తా॥ ఒకటేయగు నగ్ని వస్తువులలో ప్రవేశించి ఆయా పదార్థ రూపములకు ననురూపములగు ఆకారముల నెట్లుబడయుచున్నదో, అట్లే సర్వభూతాన్తరాత్మయగు పరమాత్మయొక్కడేయయినను ఆయా ఉపాధులనుబట్టి వివిధరూపములుగ నగును. వానికి బాహ్యరూపమున గూడ వర్తించుచున్నాడు అని కఠోపనిషత్తు. మఱియు ఒక రేకుపై శుక్ల, రక్త, పీత, కృష్ణాదివర్ణములుగల అద్దపుముక్కల నమర్చి వెనుకప్రక్క, ఒకదీపమునుబెట్టి రాత్రికాలములో చూచినచో, దీప మొకటియేయయినను, అనేకములగు రంగులతో అద్దములద్వారా ప్రకాశము కనపడునట్లు మూడుగుణములకుసాక్షియగు, నాత్మస్వభావముగా జ్ఞానస్వరూపమయినను, త్రిగుణములచే అనేకరూపములుగ గనపడును. కావున నేఆత్మసంయమనశక్తిగలవారు, గుణములు మాయకల్పితములని తలంచి సాక్షియగు

నాత్మలోనిలకడగలిగి పరమశాంతిని పొందుచున్నారు. అట్టిశక్తిలేనివారు త్రిగుణములతోగూడి, సంసారసాగరములోపడి క్లేశములనుపొందుదురు. మఱియు, నగ్నికి ప్రకాశమే స్వతస్సిద్ధమయినను, బాణాసంచికను కాల్చునప్పుడు మతాబుపుల్లలను వెలిగించినప్పుడు శుక్ల, రక్త, పీత, కృష్ణాది వర్ణములతో వెలుగుటనుచూచుచున్నాముగదా. ఇదియగ్నిస్వభావమూ లేక ధాతువులగు మందులయొక్క స్వభావమూ తెలిసికొనిన, ఈ సత్యము నెఱుగగలరు. కావుననే గీతయందు 14-వ అధ్యాయములో త్రిగుణముల స్వభావమును వర్ణించి, యట్టి గుణములనుండి విముక్తిని పొందుమార్గమును కడపట నుపదేశించిరి.

శ్లో॥ గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్।
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥

తా॥జీవుడు దేహోత్పత్తికికారణభూతములయినసత్త్వరజస్తమో గుణముల నతిక్రమించి, అనగా దేహమును విడనాడక మునుపే బ్రహ్మజ్ఞానముచేత త్రిగుణముల నణచి పుట్టుక, చావు, ముసలితనము, వ్యాధి, దుఃఖములు మొదలగువానిని జెందక జీవన్ముక్తుడగుచున్నాడు. అనగా భగవత్ప్రాప్తిని పొందుచున్నాడు. ఇకవినుడు. నూలు తెల్లగానున్నను, ఎఱుపు, పసుపు మొదలగు రంగులతో గూడినప్పుడు, సూత్రములయొక్క శుక్లవర్ణము మరుగుపడి రక్త, పీత, కృష్ణాదిరంగుల నెట్లుపొందుచున్నదో, అట్లు ఆత్మ నిత్య శుద్ధ జ్ఞానప్రకాశముగలదై యున్నప్పటికిని మానవ కల్పిత గుణములతో దృశ్యములతో జేరునప్పుడు తన నిజస్వభావము మరుగుపడి గుణములనాకారము జెందుచున్నాడు. దూదియొక్కటియే ఈశ్వరసృష్టి యనియు రంగులు జీవసృష్టియనియు గ్రహించవలెను. కావున మనోకల్పితములగు భావనులకు లోబడి నిజస్వరూపమగు నాత్మను మరచి జీవులు దుఃఖమును పొందుచున్నారు. ఇకను నాలింపుడు. మనోకల్పితముయొక్క గొప్పతనమును.

శ్లో॥ భార్యాస్నుషాననాన్దా చ యాతామాతే త్యనేకధా।
ప్రతియోగిధియా యోషిత్ భిద్యతేనస్వరూపతః॥

తా॥ లోకమందొక స్త్రీ, మగడు, మామ మొదలగు ఆయా యపేక్షారూపమయిన భేదబుద్ధిచేత భార్యయనియు, కోడలనియు,

ఆడుబిడ్డయనియు, తోడికోడలనియు, తల్లియనియు, నిట్లు అనేకవిధము లుగా భేదింపబడుచున్న దేగాని స్వరూపమువల్ల భేదింపబడలేను. ఇచ్చట ఈశ్వరసృష్టియొక్కయు దేవసృష్టియొక్కయు భేదము నిరూపింపబడెను. నారీమణి యొక్కటియే ఈశ్వరసృష్టి. వారియందు, భర్తకు తనకు సేవకురాలగు భార్యయనుబుద్ధియు, కుమారునికి పూజ్యురాలగు మాత యొక్క బుద్ధియు, ద్వేషబుద్ధిగల సవతికి విరోధబుద్ధియు, పుణ్యాత్ములకు పావనబుద్ధియు నెట్లుగలుగుచుండునో ఇది యేజీవసృష్టియని గ్రహించుకొన వలయును. ఈశ్వరసృష్టియగు నా నారీమణి యొక్కటియే యయినను వారివారి సంకల్పానుసారముగా అనేకు లెట్లుకల్పించుకొనిరో ఇదియే జీవ సృష్టికల్పితముయొక్క ప్రభావమని తెలియవలెను. ఇక ప్రజ్ఞావంతులకు, విశేషముగా చెప్పపనిలేదు. ఈశాస్త్రానుభవము అనేక ప్రపంచ సంకల్ప ములలోనికి జారనీయక సంకల్పసాక్షియగు శుద్ధజ్ఞానైక స్వరూపస్థితిలో నిలకడ గలుగజేసికొనడమే సంసారసాగరమును తరించు ఉపాయమని గ్రహించేది. ఓమ్

సీతారామాంజనేయమున చెప్పినది చూడుడు.

మనంబె స్థూలసూక్ష్మము ల్పమాత్రృమానమేయముల్  
మనంబె కామరోగరోష మత్సరాది వృత్తులున్  
మనంబె సర్వధర్మముల్ మనంబె బంధమోక్షముల్  
మనంబె దృశ్యమంతయుం గ్రమంబుచే నెఱింగినన్.

తే॥ సర్వసంసారమును మానసమున నొదవు  
సర్వసంసారమును మానసమున నుండు  
సర్వసంసారమును మానసమున నడగు  
సర్వసంసారమును మానసంబెయగును.

మ॥ మనసు సుషుప్తియందెనసి ప్రసగ్గిననేమియు దోపకుండు న  
మ్మనమటు మేలుకొన్నను సమస్తజగంబులు గల్గితోచు నీ  
ఘనతరబంధమోక్షమయ కారణకార్యములెల్ల దానయై  
యనిశములో వెలిందిరుగు నారయ నెమ్మన మట్లుగావునన్.

ఓమ్

# శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి గ్రంథములు.



| | | రూ. న.పై |
|---|---|---|
| 1 | శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరం | 3-00 |
| 2 | స్వబోధసుధాకరము | 1-50 |
| 3 | ఓంకారము (ప్రణవోపాసన) | 3-00 |
| 4 | ప్రశ్నోత్తరమాణిక్యమాల | 2-00 |
| 5 | స్తోత్ర సంహిత | 0-50 |
| 6 | శ్రీ ధర్మసేతువు | 4-00 |
| 7 | శ్రీ వేంకటేశాది పూజా పంచరత్నమాల | 0-75 |
| 8 | ధ్యానామృతము | 0-50 |
| 9 | శ్రీ భగవద్గీత | 6-00 |
| 10 | శ్రీ భగవద్గీత మూలము, తాత్పర్యముగలది | 2-00 |
| 11 | బాలయోగిని | 4-50 |
| 12 | లోకోద్ధారకము | 4-00 |
| 13 | ఈశ్వరకృప | 6-00 |
| 14 | బ్రహ్మవిద్య | 0-75 |
| 15 | స్త్రీలకు బ్రహ్మచర్య, సన్న్యాసములకు అధికారము కలదా? | 1-12 |
| 16 | యజ్ఞమున పశుహింస సజ్జన సమ్మతమా? | 0-50 |
| 17 | శ్రీ పాతంజలియోగదర్శనము | 5-00 |
| 18 | మాయను మాయముచేయుట | 0-75 |
| 19 | ఓంకారసత్రయాగము | 2-00 |
| 20 | గుణత్రయము-గుణత్రయాతీతము | 0-75 |

| | | | రూ. న.పై |
|---|---|---|---|
| 21 | గురుభక్తిప్రభావము | | 1-25 |
| 22 | గృహస్థాశ్రమధర్మము ( దివ్యజననము ) | | 2-00 |
| 23 | నిర్వాణనిలయము | | 2-00 |
| 24 | మహామంత్రాతీతప్రభావము | | 0-75 |
| 25 | ధర్మోపన్యాసము | 1వ భాగము | 3-00 |
| | ,, | 2వ భాగము | 3-00 |
| | ,, | 3వ భాగము | 3-00 |
| 26 | శ్రీ నారదభక్తిసూత్రములు | | 2-00 |
| 27 | బ్రహ్మచర్యము | | 1-25 |
| 28 | కర్మసిద్ధాంతము | | 1-00 |
| 29 | నిర్విఘ్న యోగసిద్ధి | | 1-00 |
| 30 | శ్రీ మలయాళయతీంద్రగీత | | 3-00 |
| 31 | కఠోపనిషత్తు | | 1-00 |
| 32 | ముండకోపనిషత్తు | | 0-62 |
| 33 | మాండూక్యోపనిషత్తు | | 0-62 |
| 34 | వైరాగ్యబోధోపరతులు | | 0-37 |
| 35 | ప్రారబ్ధకర్మ | | 0-50 |
| 36 | జీవన్ముక్తి | | 0-37 |
| 37 | శ్రీ భగవద్గీతా ప్రభావము | | 0-50 |
| 38 | గురుధ్యానము | | 0-19 |
| 39 | ఉపదేశామృతము | 1వ భాగము | 0 50 |
| | ,, | 2వ భాగము | 1-00 |
| | ,, | 3వ భాగము | 1-50 |
| | ,, | 4వ భాగము | 1-50 |

# ఇతర గ్రంథములు.

| | రూ.న.పై |
|---|---|
| 1 శ్రీ యోగవాసిష్ఠము 4 వాల్యూములు | 50-00 |
| 2 బృహదారణ్యకోపనిషత్తు | 8-00 |
| 3 నారదపరివ్రాజకోపనిషత్తు | 1-25 |
| 4 ఆత్మపురాణము 1వ భాగము | 5-00 |
| ,, 2వ భాగము | 3-00 |
| 5 అనుభూతి ప్రకాశము | 6-00 |
| 6 శివయోగ ప్రదీపిక | 1-00 |
| 7 శ్రీ వేదాంతబాలబోధము | 2-25 |
| 8 ఓంకార ప్రభావము | 0-75 |
| 9 అవధూతోపదేశము | 0-25 |
| 10 బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి | 0-25 |
| 11 శ్రీ మలయాళసద్గురు స్మరణామృతము | 0-37 |
| 12 ఆత్మారామతత్త్వామృతము | 0-37 |
| 13 అనుష్ఠానవేదాంతము | 0-75 |
| 14 గృహస్థాశ్రమతత్త్వము | 0-37 |
| 15 దుఃఖనివారణోపాయము | 0-25 |
| 16 ధర్మపదము (శ్రీ బుద్ధగీత) | 1-00 |
| 17 శ్రీ గరుడపురాణసారము | 0-37 |
| 18 శివపంచాక్షరీభాష్యము | 0-31 |
| 19 ప్రశ్నోత్తరమణిరత్నమాల | 0-12 |
| 20 శ్రీ మహాభగవద్గీత | 14-00 |
| 21 వృత్తిరత్నావళి | 0-75 |
| 22 మోక్షసారము | 0-19 |
| 23 పరమార్థ జడ్జిమెంటు | 2-00 |

| | రూ.న.పై |
|---|---|
| 24 శ్రీ మలయాళస్వాములవారి ఉపదేశరత్నములు | 0-37 |
| 25 గీతార్థసారము | 0-19 |
| 26 పరమార్థవినోదములు | 0-75 |
| 27 వైరాగ్యసారసంగ్రహము | 1-00 |
| 28 వేదాంత డిండిమ | 0-62 |
| 29 శ్రీ మహర్షి మలయాళ యతీన్ద్ర శతకము | 0-25 |
| 30 శ్రీరామ శరణాగతి | 0-25 |
| 31 శ్రీ బుద్ధచరిత్రము | 5-00 |
| 32 శాండిల్యభక్తిసూత్రములు | 0-50 |
| 33 దశశాంతులు | 0-25 |
| 34 శ్రీ సద్గురు పాదుకాష్టకము | 0-12 |
| 35 దాసబోధ | 8-00 |
| 36 ప్రేమసంస్తు ప్రార్థనాగీతములు | 0-50 |
| 37 శుకరహస్యోపనిషత్తు | 0-31 |
| 38 మహావాక్యవిచారణ | 0-25 |
| 39 విచారచంద్రోదయసారము | 0-25 |
| 40 నారాయణోపనిషత్తు | 0-09 |
| 41 వివేకచూడామణి | 6-00 |
| 42 గురుగీత | 4-00 |
| 43 అష్టావక్రగీత | 3-00 |
| 44 మదాలసా చరిత్రము | 2-00 |
| 45 పాతంజలియోగసుధాకరము | 1-50 |
| 46 శ్రీ వేదాంతహృదయము | 2-00 |

వలయువారు:—

మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము (పోస్టు)

చిత్తూరుజిల్లా అని వ్రాయవలయును